# చైతన్య చరితావళి

## ద్వితీయ ఖండము

హిందీ మూలము

శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి మహోదయులు

ఆంధ్రానువాదకులు

శ్రీ కుందుర్తి వెంకటనరసార్య మహోదయులు



ప్రకాశకులు

సాధన గ్రంథమండలి, తెనాలి.



వెల రు. 15-00

# మండలి మాట

ఉద్దామ దామనక దామ గణాభిరామ
మారామ రామ మవిరామ గృహీత నామ।
కారుణ్యధామ కనకోజ్వల గౌరధామ
చైతన్య నామ పరమం కలయామ ధామ॥

ఆప్తకాముడు, పూర్ణకాముడు, పరమనిష్కాముడు నగు పరమేశ్వరుడు పరమస్వతంత్రుడు. అయినను భక్తపరాధీనత్వము పరమేశ్వర సహజలక్షణము. 'బ్రహ్మణో ద్వేరూపే' యనుచు శ్రుతి బ్రహ్మయొక్క సగుణనిర్గుణరూపములను ప్రతిపాదించినది. పరమేశ్వర సగుణరూపము నామరూప మనోహరము. భగవానునికి భక్తుని యందుగల ప్రేమయనన్యము, అసదృశము. అందువలననే భగవత్ప్రేమామృతప్లావితుడయిన ఒక భక్తశిఖామణి భగవత్ప్రేమ నీరీతిగస్తుతించుచున్నాడు.

అహోచిత్ర మహోచిత్రం వందే తత్ప్రేమబంధనం।
యద్బద్ధం ముక్తిదం ముక్తం బ్రహ్మక్రీడామృగీకృతమ్॥

భగవత్ప్రేమబద్ధుడైన పరమభక్తునికి సర్వప్రాణిముక్తిదాత, స్వయం నిత్య, శుద్ధ, బుద్ధ ముక్తబ్రహ్మ క్రీడామృగ (ఆటబొమ్మ) మగును. కావుననే భక్తులు ఐశ్వర్యగుణనామ సంకీర్తనము తన్మయీభావముతో చేయుచు సాకారబ్రహ్మతో క్రీడింతురు. కావుననే భక్తుడు భగవత్స్పర్శన, దర్శనాదులకై మహోత్కంఠతో అన్వేషించుచుండును.

అజాత పక్షా ఇవ మాతరం ఖగాః
స్తన్యం యథా వత్సతరా క్షుధార్తాః।
ప్రియం ప్రియేవ వ్యుషితం వ్యుషితేవ
మనోఽరవిందాక్ష దిదృక్షతే త్వామ్॥

అనుచు భక్తుడు భగవద్దర్శనాభిలాషియై భగవత్సంకీర్త
చేయుచు జీవనయాపనము చేయుచుండును. తాదృశభ
ప్రేమసంకీర్తనముచేసి పరమేశ్వర సాయుజ్యమును పొ
భక్తవర్యులలో శ్రీచైతన్యుడు మూర్ధన్యస్థానీయుడు.

భగవంతుడు నిర్గుణుడు, నామరూపరహితుడయ్యు
యొక్క దృష్టిభేదమువలన, తద్బ్రహ్మతత్త్వము భిన్న
గన్పట్టును. నిర్గుణపరబ్రహ్మదర్శనము విద్వత్ప్రతీతియని
సగుణదర్శనము అవిద్వత్ప్రతీతియనియు అభియుక్తమత
గన్పట్టుచున్నది.

అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితం
పరమభావ మజానంతో మమభూత మహేశ్వరమ్॥

అనుచుగీత పలుకుచున్నది.

అయినను, చిద్విజ్ఞానవేత్తలైన విజ్ఞులు భక్తివ
నాశ్రయించి భాగవతశరీరమును తావద్రూపముననే భజ
రనుచు శ్రీకృష్ణపరమాత్మ

"భక్త్యా మామభిజానంతి యావాన్ యశ్చాస్మి తత్త్వ
అనుచు గీతలో ప్రతిపాదించియున్నారు.

వదంతి తత్త్వవిదస్తత్త్వం యద్జ్ఞాన మద్వయం।
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే॥

యనుచు భాగవతము పరబ్రహ్మతత్త్వము వివిధనామములతో నభిహితమగుచుండునని చెప్పుచున్నది

ఏవం విధముగ బ్రహ్మ, పరమాత్మ, భగవత్సంజ్ఞలతో వెలుగొందు శుద్ధతత్త్వమే శ్రీకృష్ణచైతన్యమహాప్రభువనుచు భక్తవర్యుల సునిశ్చితమతి.

యదద్వైతం బ్రహ్మోపనిషది తదప్యస్య తనుభా
య ఆత్మాంతర్యామీ పురుష ఇతి సోఽస్యాంశవిభవః।
షడైశ్వర్యైః పూర్ణోయ ఇహ భగవాన్ సస్వయమయం
న చైతన్యాత్కృష్ణా జ్జగతి పరతత్త్వ పరమిహ॥

అనుచు ఉపనిషత్ప్రతిపాద్య బ్రహ్మ శ్రీకృష్ణచైతన్యశోభయే సర్వాంతర్యామియగు పరమాత్మ తదంగవిభవమే, షడ్గుణైశ్వర్య సంపన్నుడైన భగవానుడు స్వయముగా తానే, ఈవిధముగ శ్రీకృష్ణచైతన్య భిన్నతత్త్వమేదియు లేదనుట పైవచనము యొక్క భావము.

పరమతత్త్వమును గురించి 'యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ' యనుచు శ్రుతి బ్రహ్మ అనిర్వచనీయమని యుద్ఘోషించినది. తాదృశతత్త్వానుభూతి భక్తిసంప్లుత హృదయమునకే కలుగును. అసదృశమైన తాదృశభగవత్ప్రాప్తిని పొందిన భక్తశిరోమణి శ్రీచైతన్యప్రభువు.

పరమతత్త్వము సచ్చిదానందస్వరూపము. భోక్తృ, భోగ్యములు రెండును తానే యగును. సచ్చిదంశము భోక్తృరూపమున, సదానందాంశము భోగ్యరూపము. ఈ విధముగ ద్విధావిభక్తమై లోకవ్యవహారము జరుగునట్లు భాసించును. "సవై నరేమే, తస్మా దేకాకీనరమతే, సద్వితీయమైచ్ఛత్। సహైతావానాస।" అను శ్రుతి యిందుకు ప్రమాణము.

కృష్ణచైతన్యతత్త్వము శ్రీరాధికాకృష్ణరూపమున అభివ్యక్తమై శ్రీకృష్ణచైతన్యప్రభువునకు ఆరాధనీయమై సంకీర్తనీయమైనది శ్రీకృష్ణప్రేమయొక్క ఆహ్లాదినీశక్తియే రాధిక. అనాదిగ శక్తిశక్తిమంతులకభేదమున్నను, భక్తజనోద్ధరణకై ఉపాధిభేదముతో అనాదిగ విలసిల్లుచున్నారు. రాధికాతనుద్యుతితో సుదీప్తమైన శ్రీకృష్ణస్వరూపమును శ్రీకృష్ణచైతన్యప్రభువు పరమ ఆశ్రయణీయముగా భావించి సంకీర్తించి తరించిన మహాభక్తుడు.

భగవంతునిశక్తి అమేయము. కావుననే భక్తపరాధీనుడై తదిచ్ఛానుకూలముగ భేదాభేదరూపమున దర్శనమిచ్చుచుండును. శక్తిభిన్నుడై దర్శనమొసంగువేళ కోమలశ్యామలాంగుడై దర్శనమిచ్చును, శక్తిసహితుడై దర్శనమిచ్చునప్పుడు గౌరవర్ణాంచితసుందరుడై దర్శనమొసగును. కలియుగమునందు యుగళరూపముననే శ్రీకృష్ణచైతన్యము ఆరాధనీయము. కావున కలియుగమున శ్రీకృష్ణభగవానుని గౌరవర్ణమే ధ్యేయము, ఉపాసనీయము. తద్గుణగానసంకీర్తనమే తత్త్వోపాసనము. శ్రీపరమాత్మ సంకీర్తనైకమతియగు శ్రీకృష్ణచైతన్యప్రభుచరిత్రము లోకారాధ్యము.

అట్టిపావన భక్తశిఖామణి చరిత్రమును ఆంధ్రదేశమునకు పరిచితము చేయుటధన్యతగాభావించి మాసాధన గ్రంథ మండలి సంకల్పించినది. ఈచరిత్రమును హిందీభాషలో శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్తబ్రహ్మచారిగారు రచించియున్నారు. మహాశ్రద్ధాసక్తులతో తెలుగుసేత చేసినవారు, శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు. వీరు 'శ్రీరామశరణ్' నామాంచితులు. ఈమహోదయులిరువురికి ధన్యవాదములర్పించుచున్నాను. ఈ చరితావళిలో ఇది రెండవభాగము. ఇదేరీతిగమిగిలినభాగములనుగూడప్రచురింతునని తెలుపుటకు సంతసించుచున్నాను.

ఆర్థికసహాయములేకున్న ఇట్టిమహాప్రయత్నము కార్యరూపము నొందుట దుర్లభము. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఉదారముగ ఆర్థికసహాయము నొసగి ఎంతో సహాకరించుచున్నారు. వారికి శతశః కృతజ్ఞతల నందజేయుచున్నాను.

భక్తులు శ్రీ వెల్లంకి గోపాలకృష్ణగారు నల్లజర్ల, ఒకరీము కాగిత మిచ్చిరి. శ్రీకృష్ణపరమాత్మ వీరి కుటుంబమునకు సకలైశ్వర్యములు ధర్మబుద్ధియు నిచ్చుగాక!

ఇంత సుందరముగ ముద్రించిన విజయ ఆర్టు ప్రెస్, తెనాలి, ప్రొప్రైటరు శ్రీ టి. కోటిరెడ్డిగారికి తత్కార్యకర్తలకు అభినందనలు చెప్పుచున్నాను.

దుందుభి
మార్గశిరము
తెనాలి

ఇట్లు
బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకులు, సాధన గ్రంథ మండలి.

## "జయంతి జగన్మంగళం హరేర్నామ"

సంసారసింధుతరణే హృదయం యది స్యాత్
సంకీర్తనామృతరసే రమణే మనశ్చేత।
ప్రేమాంబుధౌ విహరణే యది చిత్త వృత్తి
చైతన్యచంద్ర చరణే శరణం ప్రయాతు॥

వందే శ్రీకృష్ణ చైతన్య నిత్యానందౌ సహోదితౌ।
గౌడోదయే పుష్పవంతౌ చిత్రౌ శందౌ తమోనుదౌ॥

వందే స్వైరాద్భుతేఽహం తం చైతన్యం యత్ప్రసాదతః।
యవనాః సుమనాయంతే కృష్ణనామప్రజల్పకాః॥

హరే హరయే నమః కృష్ణ యాదవాయ నమః।
గోపాల గోవింద రామ శ్రీ మధుసూదన॥

ఈశ్వరారాధనం ధర్మం ఈశ్వరారాధనం ధనం।
ఈశ్వరారాధనం జ్ఞానం ఈశ్వరారాధనం పరమ్॥




అనువాదకులు        లేఖకులు

# విషయ సూచిక

## 3వ భాగము





# చైతన్య చరితావళి

## ద్వితీయ భాగము

## ప్రథమ కృపాకిరణము

శ్లో॥ నిశమ్య కర్మాణి గుణానతుల్యా
వీర్యాణి లీలాతనుభిః కృతాని ।
యదాతి హర్షోత్పులకాశ్రు గద్గదం
ప్రోత్కంఠ ఉద్గాయతి రౌతి నృత్యతి ॥

(శ్రీమద్భాగవతము ౭-౭-౩౪)

(భక్తులకు వశీభూతుఁడై వారికిసుఖము కలిగించుటకుఁగా వివిధములగు నలౌకిక లీలలొనర్చిన శ్రీహరియొక్క యద్వితీయ, యద్భుత వీర్యపరాక్రమములను వినఁగానే ప్రేమ భక్తునకు శరీరమందొకొక్కప్పు డత్యంత హర్ష కారణమున రోమాంచమగును. ఒకొక్కప్పుడు కన్నులనుండి యశ్రు ధారలు ప్రవహించును. ఒకొక్కప్పుడు గద్గద కంఠముచే నతఁడు గానముచేయఁ బ్రారంభించును. ఒకొక్కప్పు డేడ్చును, ఒకొక్కప్పుడున్మాదునిరీతి ప్రేమలో నిమగ్నుఁడై నృత్యము చేయఁ బ్రారంభించును.)

హృదయములో సరళతా సరసతా సామ్రాజ్యము స్థాపిత మైనప్పుడు నలువైపులనుండి సద్గుణములు వచ్చి వానిలోఁ దమ నివాసస్థానమేర్పఱచుకొనును. ఆ సమయమున మానవు

నకు ఆకు కదలి చప్పుడైన ప్రియతముని పదముల చప్పుడను భ్రమను జెందును. అతఁడు పిచ్చివానివలె నులికిపడి నల్దిశలఁ జూడ మొదలిడును. ఒక వేళ ఆయన సమక్షమున నెవఁడైనఁ దన ప్రియుని బిరుదావళులను గూర్చి వర్ణించెనా వాని యానందమును గూర్చి చెప్పవలసినదేమున్నది ఆసమయమున నతఁడు నిజముగఁ వెఱ్ఱివాఁడైపోయి యా వర్ణించినవాని కాళ్ళమీఁదఁబడి దొర్లి గింతలు పెట్టును. చాతక పక్షి నోటి నుండి 'పీఊ, పీఊ' అను కర్ణరసాయన శబ్దమును వినఁగాఁ దన ప్రాణప్రియుఁడు స్మృతికి రాఁగా విరహిణికి వలె నధీరుఁడై నయనాశ్రువులను బ్రవహింపజేయును. ఏమైననగుగాక ప్రియతముని పుణ్య స్మృతిలోని మాదకత యట్లే యుండును.

మహాప్రభువు తన ప్రియశిష్యులతో మార్గమున ప్రేమాలాపములు కావించుకొనుచుఁ దన యింటివైపునకు వచ్చుచుండగా దారిలో శ్రీ రత్నగర్భాచార్యులవారి యిల్లు తటస్థపడెను. ఈతఁడు మహాప్రభువునకు సజాతీయ బ్రాహ్మణుఁడు. ఇతఁడును సిల్హాట్ నివాసియే. ప్రభువు దారిని బోవుట గాంచి యితండు ప్రభువును మిక్కిలి యాదరముతో నాహ్వానించి తనయింటిలోఁ గూర్చుండ బెట్టెను. రత్నగర్భ మహాశయుఁడు చాలకోమల ప్రకృతి గల పురుషుఁడు. ఈతని హృదయములో కావలసినంత భావుకత యున్నది. సరళతామూర్తి. శాస్త్రాధ్యయనమునం దీతని కనుపమానురాగము. ప్రభువు కూర్చుండఁగానే శాస్త్రచర్చ ప్రారంభమయ్యెను.

రత్నగర్భ మహాశయుఁడు ప్రసంగ వశమున నొక భాగవత శ్లోకమును జదివెను. ఆ శ్లోకము యమునానదీ తీరమున యజ్ఞపత్నులు భగవంతునకు జల్దులు గైకొని యాయన దగ్గఱకు వచ్చిన సందర్భములోనిది. శ్లోకములో భగవానుని యాస్వరూపమే వర్ణింపఁబడినది.

విషయమిది. ఒక రోజున గోపకులందఱితోను బలరామునితోను భగవంతుఁడు వనములోనికి నావులఁ గాయఁ బోయెను. ఆదినమున గోపకులు మూర్ఖపు పని కావించిరి. ప్రతిదినము గోవులను గొనిపోవుచోటునకు వాటిని దీసికొనిపోక వేఱొక వైపున కాదినము కొనిపోయిరి. అక్కడ అతి మనోహరమగు పచ్చగడ్డియున్నది ఆవులు గడ్డిని మిక్కిలి ప్రేమతోఁదిని నిర్మల యమునానదీతోయములను బానము కావించెను. ఆవుల కడుపు మాత్రము నిండినది; కాని గోపాలకులు నేఁడింకను అన్నము మూఁటలు రాలేదే యని వ్రజము వైపునకు తదేక దృష్టితోఁ జూచుచుండిరి. చల్దులెట్లు రాఁగలవు? గోపీజనము ప్రతిదినము వేఱొకవైపునకు చల్దిమూటలు గొనిపోయెడు వారాయెను. నేఁడును వారాదిక్కునకు పోయి అచ్చట నా గోపకుల నెంత వెదకినను గనఁబడక పోవుటచే వారు చల్ది మూఁటలను తిరిగి యింటికి గొని పోయిరి. ఇక్కడ గోపాలకులందఱు ఆఁకలితోఁగొట్టుకొనుచుండిరి. గోపకులు వారిలో వారాలోచించుకొని యిట్లను కొనిరి. 'యీ విషయమును కృష్ణ బలరాములతో జెప్పవలెను.

వారేదో విధముగ నేర్పాటు కావింతురు అనుకొనిరి. ఇట్లు నిశ్చయించి భగవంతుని సమీపమునకుఁబోయి యిట్లనిరి:— 'కనుడా! నీవు అఘాసుర, బకాసుర, శకటాసురాది రాక్షసులను నిమిషములోఁ జంపితివి. శిశుమారణము గావించు పూతనా శరీరము నుండియు క్షణములో నీవు ప్రాణములను గ్రహించితివి. కాని, అన్నా! యీ విధవ ఆఁకలిని చంపలేక పోతివి. ఈ రాక్షసి మాకు చాల బాధకలిగించుచున్నది. నీవు మమ్ము నవసరముపడినప్పుడెల్లా రక్షించుచుంటివి. మా సంకటములను దూరము చేసితివి. నేఁడు నీవీ దుఃఖము నుండియు రక్షింపుము. మాకు తినుట కెక్కడనుండియైన నేదైన తెచ్చి పెట్టుము.

గోపకుల యొక్క యీ వచనములను విని శ్రీకృష్ణుడు నలువైపులఁ గలయఁజూచెను గాని తినుట కేమియుఁ గనఁబడ లేదు. ఆవనములో నొక్క పెలగ చెట్టైనను లేదు. అందువలన భగవానుడు కొంచెము చింతించెను. చాల దూరము దృష్టి యుంచి చూచునప్పటికి యమునానది యొడ్డున కొందఱు వేదజ్ఞులగు బ్రాహ్మణులు యజ్ఞము చేయుటను గాంచెను. వారిని గాంచి భగవానుఁడు గోపాలకులతో నిట్లనెను:— మీరొక పనిచేయుఁడు. యమునాతీరమున యజ్ఞము చేయుచున్న బ్రాహ్మణుల వద్దకు పోయి. 'మేము శ్రీకృష్ణ బలరాములు పంపఁగా వచ్చితిమి. మాకందఱకు చాల యాఁకలి వేయుచున్నది. దయయుంచి మాకుఁదినుట కేదైన నిం' డని

యడుగుడు. వారు మీ యాఁకలి చెందితిరని యేదోయొకటి తినుటకిచ్చెదరు. దారిలోనే తినిరావద్దు. ఇక్కడికి తీసికొని రావలెను. అందఱము పంచుకొని తిందము.

ఇట్లు భగవంతుఁడు చెప్పినమీఁదట గోపబాలకులా బ్రాహ్మణుల దగ్గఱకు పోయిరి. దూరముననుండియే యజ్ఞము చేయు బ్రాహ్మణులకు సాష్టాంగ ప్రణామములు కావించి యజ్ఞమండపమున కావలనే తమ కఱ్ఱల సహాయముతో నిలుచుండి దీనముగా నిట్లనిరి – "ఓ ధర్మజ్ఞులగు బ్రాహ్మణోత్తములారా! మేము శ్రీకృష్ణ బలరాములు పంపఁగా మీవద్దకు వచ్చితిమి. ఇప్పుడందఱకు పెద్ద ఆఁకలి వేయుచున్నది. కావున దయయుంచి మీవద్ద నేమైనఁ దినుటకు పదార్థముండిన దయ చేయుఁడు. దాని వలన శ్రీకృష్ణ బలరాములును, మేమును ఆఁకలి తీర్చుకొనఁగలము" గోపకుల యీ ప్రార్థనను విని యా బ్రాహ్మణు లుదాసీనులైరి. వారు గోపకుల వాక్యములను లక్ష్యపెట్టనేలేదు. వీరు చాల సార్లు బ్రతిమలాడుగా వారు వెనుకముందాడుచు నిట్లనిరి – మీరు నిజముగ మూర్ఖులవలె నున్నారు. అరే, మీకు మేము దేవతా నైవేద్యమునుండి యెట్లు తీసి యీయఁగలము? పో పొండు, ఇక్కడ తినుట కేమియునులేదు పొండు' బ్రాహ్మణుల యీప్రత్యుత్తరమును విని గోపకులందఱును దుఃఖ భావముచే భగవంతుని దగ్గఱకు వచ్చి చాల చింతతో నిట్లనిరి:– 'అన్నా కృష్ణా! నీవెటువంటి నిర్దయ బ్రాహ్మణుల దగ్గరకు పంపితివి? వారిచ్చుట

పెట్టుట యట్లుంచుడు మాతో బ్రేమ పూర్వకముగఁ బలుక నైనలేదు. వారు మమ్ములను ధిక్కరించి యజ్ఞమంటపము నుండి వెడలఁగొట్టిరి.'

భగవానుఁడీ గోపకుల వాక్యములను విని యిట్లనెను:- 'ఆ కర్మఠ బ్రాహ్మణులకు మనదుఃఖమేమి తెలియును? స్వర్గ సుఖ లోభులగువారికి ఇతరుల దుఃఖముల లెక్కయేమికలదు? ఈసారి మీరు వారి భార్యల వద్దకు బొండు. వారి హృదయములు కోమలములు. వారి శరీరము లచ్చట నున్నవి కాని వారి యంతః కరణము లిచ్చట నావద్దనే యున్నవి. వారు మీకేదో యిచ్చి తీరెదరు. మీరందఱును మా అన్నదమ్ముల యిద్దరి పేరు చెప్పవలెను. ఈ మాటను విని బ్రతిమలాడుచు గోపకు లిట్లనిరి:- 'అన్నా కృష్ణా! నీవేవి చెప్పిన దానిని మేము సమస్త కార్యములు చేయఁగలము కాని మేము స్త్రీ లున్నచోటునకుబోము. నీవు మమ్ములను స్త్రీలదగ్గఱకు పొమ్మని చెప్పవలదు.

భగవంతుడు నవ్వుచు నిట్లనెను:- 'అరే, నన్నెఱిఁగిన వారంతఃపురములోనే యున్నారు. నాపేరు చెప్పిన వారు సమస్తము సమకూర్పఁగలరు. మీరు పోవుటయే తడవు.

భగవానునికి బ్రాహ్మణ పత్నులకు మొఱక యిప్పటిది కాదు. అనాది. అసలు విషయమేమనఁగా మధురానగరము లోని తోటమాలినులు బృందావనమునకుఁ బ్రతిదినము పూలు

కోయ వచ్చుచుందురు. వారు బ్రాహ్మణగృహములకు పూలమ్మ బోయినపుడు శ్రీకృష్ణబలరాముల యద్భుత రూప లావణ్య వర్ణనము కావించెదువారు. ఇట్లు వినఁగా వినఁగా వీరిద్దరిమీఁద వారికనురాగ ముత్పన్నమయ్యెను. వారెల్లప్పుడు వీరి దర్శనమునకై తహతహలాడుచుందురు. వారి యుత్సాహ మత్యధికమయ్యెను. భగవానుడు వారి యభిలాషను నెఱ వేర్చుట కీలీలను బన్నెను.

భగవంతుఁ డనేకసార్లు బలవంతము చేయఁగా జింతా మనస్కులై గోపకులు బ్రాహ్మణ పత్నుల దగ్గఱకు వచ్చి, యట్లే దీనతతో 'ఓ బ్రాహ్మణపత్నులారా! ఇక్కడకు చాల దగ్గఱలోనే శ్రీకృష్ణబలరాములు కూర్చున్నారు. వారిద్ద రాఁకలి చెంది యున్నారు. మీవద్ద నేమైన తినుబండారము లుండిన వారికిచ్చిరం'డనిరి. బ్రాహ్మణపత్ని లీమాటలు వినఁగానే వారు ప్రేమచే నధీనులైరి. శ్రీరామకృష్ణు లాఁకలి చెంది యున్నారనునప్పటికి వారి యధీరతకు మేఱ లేకుండెను. ఎవరి దర్శనేచ్ఛ చిరకాలమునుండి యుండెనో, యేమనోహర మూర్తుల దర్శనము కొఱకు నేత్రము లాతురత చెందు చున్నవో, ఆ కృష్ణబలరాములే యాఁకలి చెంది భోజనము నకై ప్రతీక్షించుచున్నారను మాటను వినఁగానే వారికి సుఖ మిశ్రిత దుఃఖముగ నుండెను. వారు త్వరత్వరగా వివిధములగు పక్వాన్నములను పళ్ళెరములలోఁ బెట్టుకొని శ్రీకృష్ణ సన్ని ధానమునకు బయలుదేర సిద్ధమైరి. వారి భర్తలు పోరాదనిరి.

కాని వారిమాట నెవరును వినక ప్రేమోన్మత్తులై వేగముగ శ్రీకృష్ణ సన్నిధానమునకుఁ బోవఁ బ్రయత్నించుచుండిరి,

ఆ సమయమున భగవానుఁడు బాగుగనలంకరించుకొని శృంగారముగ నిలుచుండి యెవరైన వచ్చుచున్నారా లేదా యని యానైపునకే చూచుచుండెను. వ్యాసభగవానుఁడు మిక్కిలి సౌందర్యముగ భగవానుని యీ మధుర గోపవేష మును సజీవముగ చిత్రించెను. భగవంతుని కా సమయమున వేషమెట్లున్నదో చూడుఁడు- 'ఆయన శరీరము నవనీల మేఘ సమానముగ శ్యామవర్ణము కలిగియుండెను. దాని మీఁద నాతఁడు పీతాంబరమును ధరించెను. కంఠమున వనమాల శోభించుచుండెను. శిరస్సున మనోహరమగు శిఖిపింఛ ముకుటము శోభించుచుండెను. శరీరమంతటను శైలఖటికలు, గైరికధాతువులు, చందనము, యమునారజము మొదలగున వన్నియు కలిపి వివిధములగు ధాతువులచే రంగువేయఁబడినది. అక్కడక్కడ గైరిక రేఖలు గీయఁబడినవి. ఒక్కొక్కచోట యమునా రజము పూయఁబడినది. అక్కడక్కడ శైల ఖటికల గంధముచే చుక్కలు పెట్టఁబడినవి. ఈ విధముగ శరీరమంతయు నలంకరింపఁబడినది. చెవులలో వివిధములగు కోమల కోమల పత్రములు కదలుచుండెను. ఇట్లొక నటుని వేషమును ధరించి యొక మిత్రుని భుజముపైఁ జేయి యుంచెను. ఆతని నవనీల కుంతల జాలములు వంకరలు తిరిగి కపోలములపై వ్రేలాడు చుండెను. మందహాసముచేయుచు

నావైపునకే చూచుచుండెను.' భగవంతుని యిట్టి మనోహర వేషమును గాంచి సహృదయుఁడగు వాఁడెవ్వఁడు నిలువఁ ద్రొక్కుకొనఁగలఁడు! ఆచార్య రత్నగర్భుని కంఠము మిక్కిలి కోమలము, మృదుమధురకంఠస్వరముకలది. ఆతఁడు మిక్కిలి మధురస్వరయుక్తముగఁ బ్రేమమున గద్గదికుఁడై యీ శ్లోకమును జదువ నారంభించెను.

శ్లో॥ శ్యామం హిరణ్య పరిధిం వనమాల్య బర్హ
ధాతుప్రవాల నటవేషమను వ్రతాంసే ।
విన్యస్త హస్తమితరేణ ధునానమబ్జం
కర్ణోత్పలాలక కపోల ముఖాబ్జహాసమ్ ॥
(శ్రీ మద్భాగవతము. ౧౦-౨౩-౨౨)

ఈ శ్లోకము వినునప్పటికి మహాప్రభువు ప్రేమోన్మత్తుఁడయ్యెను. కూర్చుండిన చోటనుండి వేగముగ నెగిరిపడి యా సమయముననే మూర్ఛితుఁడై క్రిందపడెను. ఆయనకు శరీర స్పృహగాని, స్థానస్పృహగాని లేదు. ఆతఁడు స్పృహ తప్పి పడియుండి వేగముగ దీర్ఘశ్వాసలను గైకొనుచుండెను. కొంచెము సేపటికే 'ఆచార్యా! నాహృదయములోఁ బ్రేమ సంచారమును గావించుము. కర్ణములం దమృతమును నింపుము. మఱల నొకసారి నాకాశ్లోకమును వినిపించుము, నాహృదయము శీతలము చెందుచున్నది. ఆహా- 'శ్యామం హిరణ్య పరిధిం' ఎట్లెట్లు. ఆఁ ఆఁ మఱల వినిపించుము. ఆచార్యుఁడా స్వరముతోనే మఱల శ్లోకమును జదువ మొదలిడెను-

'శ్యామం హిరణ్య పరిధిం వనమాల్య బర్హ
ధాతుప్రవాలనటవేషమనువ్రతాంసే ।
విన్యస్త హస్తమితరేణ ధునానమబ్జం
కర్ణోత్పలాలక కపోల ముఖాబ్జహాసమ్ ॥

(శ్రీ మద్భాగవతము. ౧౦-౨౩-౨౨)

రెండవసారి శ్లోకము వినఁబడఁగానే మహాప్రభువు బిగ్గఱగా వెక్కి వెక్కి యేడ్వసాగెను. ఈ రోదనమును విని యిరుగు పొరుగు వారు చాలమంది యచ్చట గుమిగూడిరి. అందఱును ప్రభుని యీదశను గాంచి చకితులైరి. నేఁటివఱ కెవరును ఇట్టి ప్రేమావేగము నెవరిలోను జూడలేదు ప్రభువు వారి కమలపత్రాక్షుల నుండి శ్రావణ భాద్రపదమాసముల లోని వర్షము వలె శీతలాశ్రుకణములు క్రింద పడుచుండెను. అతఁడు ప్రేమ విహ్వలుఁడై 'ప్రియుఁడవగు కృష్ణా! ఎక్కడున్నావు? నన్నేందులకు హృదయముతోఁ గౌగిలించుకొనవు. ఆహా, ఆ బ్రాహ్మణ పత్నులు ధన్యులు. ఏలనన నిట్టి నటనాగరవేషమున వారికి దర్శన మిచ్చుచున్నావఁ' డని పలుకుచుఁ బ్రభువు ప్రేమావేశమును బొంది రత్నగర్భుని గట్టిగ నాలింగనము కావించుకొనెను. ప్రభువువారి యాలింగనము వలననే రత్నగర్భుఁడు ఉన్మత్తుఁడయ్యెను. ఇప్పటి వఱకు, ఒక వెఱ్ఱిని జూచియే ప్రజలాశ్చర్య చకితులగుచుండిరి. ఇప్పుడు ఒకరికిద్దరు వెఱ్ఱివాండ్రైరి. రత్నగర్భుఁ డొకొక్కప్పుడు బిగ్గఱగ నవ్వును, ఒకొక్కప్పుడేడ్చును, ఒకొక్కప్పుడు ప్రభుపాద

పద్మములమీఁదపడి ప్రేమభిక్ష నడుగును. ఒక్కొక్కప్పుడేడ్చియేడ్చి మఱల నా శ్లోకమును బఠించును. అతఁడు శ్లోకమును వినుటతోడనే మాటిమాటికి మూర్ఛితుఁడై క్రిందపడిపోవుచుండెను. రత్నగర్భునకుఁ గొంచెమైన స్పృహలేదు. అతఁడొడలు తెలియక శ్లోకమును బఠించుచు మధ్యమధ్య బిగ్గఱగ నేడ్వ మొదలిడెను. ఎటులో యొకటుల గదాధర పండితుఁడు పట్టుకొని రత్నగర్భునీ శ్లోకమును జదివి శాంత పఱచెను. అప్పుడు ప్రభువునకుఁ గొంచెము బాహ్యజ్ఞానము కలిగెను. కొంచెము స్పృహకలిగిన తర్వాత నందఱునుగలిసి గంగాస్నానము చేయఁబోయిరి. తర్వాత నందఱును ప్రేమలోఁ దృప్తులై తమతమ యిండ్లకు వెడలిరి. ఈ ప్రకారము ప్రభువు వారి సర్వ ప్రథమ కృపాకిరణమున కధికారి రత్నగర్భాచార్యుఁడయ్యెను. అతనినే సర్వప్రథమ ప్రభువువారి యసీమ అనుకంపమున కధికారియని తెలిసికొనవలెను.



# భక్త భావము

శ్లో॥ తృణాదపి సునీచేన తరోరపి సహిష్ణునా,
అమానినా మానదేన కీర్తనీయః సదా హరిః ॥

(శ్రీకృష్ణ చైతన్య శిక్షాష్టకము)

(తనను తృణము కంటె నీచముగ నెంచుకొనవలెను. ఫలవృక్షముకంటె నధిక సహనశీలత కలిగి యుండవలెను. తానమానియై యితరులను సర్వదా గౌరవించవలెను. ఇట్టివాడే కీర్తనమున కధికారియగును. వీనిచే శ్రీకృష్ణుడు జీవులచే నెల్లప్పుడు కీర్తింపఁబడువాఁడు)

భక్తగణము దాస్య, సఖ్య, వాత్సల్య, శాంత, మధుర భావములను నీయైదింటిచేఁ దమ యిష్టదేవునుపాసింతురు. ఉపాసనలో నీయైదు భావములే ముఖ్యముగ నెన్నఁబడుచున్నవి; కాని యీయైదింటిలో నైనను దాస్యభావమే సర్వశ్రేష్ఠమును సర్వప్రధానముగ నెన్నఁబడుచున్నది. ఏమైన ననఁడు దాస్యభావమే యీయైదుభావములకు ముఖ్యప్రాణము. దాస్యభావము వినా సఖ్య, వాత్సల్య, శాంత, మధుర భావములుండఁజాలవు. ఏభావమైనఁ గానిందు దాస్యభావము దానిలో నవ్యక్తరూపమున తప్పక యుండితీరును. దాస్యభావములేక ప్రేమ లేనే లేదు. దాసుఁడు కాఁజాలని వాఁడు స్వామి యెన్నటికిని గాఁజాలఁడు. తాను స్వయమున నేదైన ఉపాసనగాని, వందనముకాని చేయనివాఁడు ఉపాస్యుఁడుకాని వందనీయుఁడుకాని కాఁజాలఁడు. అఖిలబ్రహ్మాండ

కోటి నాయకుఁడగు శ్రీహరియే స్వయముగ తననోట 'క్రీతోఽహం తేన చార్జున' ఓ అర్జునా! భక్తులు నన్ను కొన్నారు. నేను వారికి క్రీతదాసుఁడను. ఏలననఁగా నతఁడు చరాచర ప్రాణులకు స్వామి యగుటచే స్వామిత్వ భావమును ప్రదర్శించుట కతఁడు భక్తులకును, బ్రాహ్మణులకును, దాసుఁడై, వారి పాదరజమును దన శిరస్సునఁ జల్లుకొనుటకు సర్వదా వారి వెంట వెంటఁ దిరుగుచుండును.

మహాప్రభు విప్పుడు భావావేశములోనికి వచ్చి భక్త భావములను బ్రకటింప మొదలిడెను. భక్తులితరులందఱితోడను, భగవద్భక్తులతోడను నెట్లు వర్తించవలయునో, వానిలో భాగవత పురుషుల యెడల నెట్టి దీనత్వము, యెట్టిన మ్రత యుండవలయునో వీటిని నేర్పుటకు గాను స్వయముగఁ దా నాచరించి లోకులకుఁజూపఁ బ్రారంభించెను. ఏలననఁగా నతఁడు భక్తిభావప్రదర్శకుఁడగు భక్తశిరోమణి. ఆయన కార్యము లన్నియు లోకమర్యాదా స్థాపన నిమిత్తమై యుండెను. అతఁడు మర్యాదోల్లంఘన మెన్నడును జేయకుండుటయే యాతని జీవితములోఁగల నొక గొప్ప విశేషము !

అధ్యాపకాంతమయ్యెను. బాహ్యశాస్త్రములు చదువుటగాని, చెప్పుటగాని లేదు. ఇప్పుడతఁడు వెనుకటి చాంచల్యుఁడు కాని, వాద వివాదోన్మాదకారికాని కాఁడు. ఇప్పుడతనిలో ప్రాపంచికలుకూడ సమస్త కార్యములను మఱచు నంతటి వేఱొక నిష్ఠ యుత్పన్నమయ్యెను. దానివలనఁ దనను

దాను గూడ మఱచిపోయినాఁడు. ఈతని భావము లలౌకికములు, ప్రసంగములు, గూఢములు, చరిత్ర రహస్యమయము, సర్వదా స్వార్థమందే సంలిప్తులగు ప్రాపంచిక మానవు లీతని భావముల నెట్లు గ్రహింపఁగలుగుదురు. ఇప్పు డతఁడు ప్రతి దినమును గంగాస్నానము కొఱకు పోవుచుండెను. దారిలో బ్రాహ్మణుఁడు, వైష్ణవుఁడు, వయోవృద్ధులలో నెవఁడైనఁ దటస్థపడెనా వెంటనే నమ్రతా పూర్వకముగఁ బ్రణామము కావించి వాని యాశీర్వాదమును గ్రహించును.

గంగాతీరమును జేరిన తర్వాత ప్రతి వైష్ణవుని పద ధూళిని తన తలపైఁ దాల్చును. వారికి వందనము చేయుచు భావావేశము జెంది యొక్కొక్కప్పుడు ప్రదక్షిణము కూడ చేయుచుండును. భక్తగణము లితని కనేకములగు నాశీర్వాదముల నిచ్చుచుండును. ఒకొక్కప్పుఁడు 'భగవంతుఁడు నీకు ననన్యభగవద్భక్తిఁ బ్రాప్తించుఁగాక' యనియు,ఒకొక్కప్పుఁడు 'నీవు ప్రభువునకుఁ బరమ ప్రియుడగుదువు గాక' యనియు, నొకొక్కప్పుఁడు 'శ్రీకృష్ణుఁడు నీమనోవాంఛల నన్నిటిని బూర్ణము కావించుఁగాక' యనియు నాశీర్వదించుచుందురు. అందఱ యాశీర్వాదములను విని యందఱ చరణములపైఁబడి దొర్లి వెక్కి-వెక్కి యేడ్వఁ బ్రారంభించును. ఏడ్చుచు 'మీ బోటి వైష్ణవుల యాశీర్వాదములే యాధారము. నాబోటి యీ దీనహీన దరిద్రునిపై మీరందఱును కృపయుంచుఁడు. భాగవతులు మిక్కిలి కోమల స్వభావులుగ నుందురు. వారి

హృదయములు కరుణారసముచే నిండి యుండును. వారు పరపీడను గాంచి సర్వదా అనుతాపము చెందుచుందురు. నాయీ దుఃఖమును దూరము కావింపుఁడు. నన్ను శ్రీకృష్ణునితోఁ గలుపుఁడు. నా మనోరథమును దీర్చుఁడు. నా సత్సంకల్పమును సఫలము కావింపుఁడు. ఇదియే మీ వైష్ణవులందఱకు నా ప్రార్థన' యని ప్రార్థించును.

ఘట్టము మీఁద నాసీనులైన వైష్ణవులకు ప్రభువు ఏది లభించిన నాసేవ చేయును, ఒక్కొక్కనికి గంధము తీసి యిచ్చును. వేఱొకనికి తడివస్త్రము నుదికి యిచ్చును. ఒక్కొక్కనికి బిందెతో నీరు తెచ్చి యింటి వఱకుఁ గొనిపోవును. ఒక్కొక్కని తలపై నూనె, ఆమలక రసము వేసి రుద్దును. అన్నిటికంటె భక్తులను సేవించుటలో నానందమనుభవించును. వృద్ధవైష్ణవు లితనికి వివిధములగు నుపదేశములఁ గావించుచుందురు. ఒక్కొక్కఁడు 'నిరంతరము శ్రీకృష్ణకీర్తనము చేయుటే యేకమాత్రసారము. నీవు శ్రీకృష్ణా యనియే యనవలయును శ్రీకృష్ణుని మనోహర నామములను స్మరింపవలయును. శ్రీకృష్ణ కథలను తప్ప వేఱు ప్రాపంచిక విషయములను వినరాదు. జీవనమంతయు శ్రీకృష్ణమయము కావలెను. తినునప్పుడు కృష్ణయనియు, త్రాగినను గృష్ణయే, నడిచినను, లేచినను కూర్చుండినను, నవ్వినను, నేడ్చినను నీవిధముగ కృష్ణ కృష్ణ యని పలుకుచుండవలయును. శ్రీకృష్ణ నామామృతము తప్ప యింద్రియముల కేవిధమగు నన్యాహార

మవసరములేదు. దీనిని త్రావుచుఁ ద్రావుచునుండు వారు సర్వదా ఆప్తులై యుందు'రని చెప్పెను.

వృద్ధ వైష్ణవుల సదుపదేశముల నీతఁడు శ్రద్ధతో విని, వారికి వందనము కావించి, వారి పదధూళిని శిరస్సున ధరించి, అంజనమును జేసి కన్నులకుఁ బెట్టుకొనును. ఇతని యీ భక్తిని గాంచి వైష్ణవులు 'నిమాయి పండితుఁడు పిచ్చివాఁడైనాఁడని యెవరందురు. ఈతఁడు శ్రీకృష్ణప్రేమోన్మత్తుఁడైనాఁడు, ఇతనిది ప్రేమోన్మాదము. ఆహా! ఇట్టి సుపుత్రుని గన్న యితని తల్లి ధన్యురాలు.' అని యిట్లు వైష్ణవ గణము యితనిఁ గూర్చి పరస్పరము ప్రశంస చేసికొను చుందురు.

ఇచ్చట మహాప్రభుని యిట్టి స్థితిని గాంచి శచీమాత లోలోన మిక్కిలి చింతించుచుండెడిది. ఆమె దీనయై భగవంతునితో 'ప్రభూ! ఈవిధవ లేకమాత్రాశయమైన వానిని నీ కృపాపాత్రునిగఁ జేసికొనుము. నాథా! ఈ యఱువదా ఱేండ్ల ముసలి యనాథ, దీనహీన యగు దీని స్థితిని గాంచుము. భర్తయూ పరలోకవాసుఁడైనాఁడు. జ్యేష్ఠ పుత్రుఁ డందమా దుఃఖసముద్రములో ముంచి యెక్కడికో పోయినాఁడు. నా కిప్పుడు వెనుక ముందింకెవ్వరును లేరు. వీఁడొక్కఁడే యాధారము. ఈ గ్రుడ్డి ముసలి కీనిమాయియే యూతకఱ్ఱ ఈ యూతకఱ్ఱ సహాయముననే యీ ప్రపంచమునఁదిరుగ గలను. హే అశరణశరణా! వీనిని రోగవిముక్తునిఁ గావించి, చక్కని యారోగ్యమును బ్రసాదింపుము' అని ప్రార్థించుచుండును.

అమాయకురాలగు తల్లి యందఱ సమక్షమునఁ దన దుఃఖ వృత్తాంతమును జెప్పుకొని యేడ్చును. ఈవిధముగ నేడ్చుచు నిమాయి కేమైనదో తెలియదు. ఒక్కొక్కప్పు డేడ్చుచుండును. ఒక్కొక్కప్పుడు నవ్వును. ఒక్కొక్కప్పుడు గానము చేయును. మఱొకప్పుడు నృత్యము కావించును. ఒక్కొక్కప్పు డేడ్చియేడ్చి మూర్ఛితుఁడై క్రిందపడిపోవును. ఒక్కొక్కప్పుడు వేగముగఁ బరులిడును. ఒక్కొయెడఁ జెట్లపై నెక్కుదు' ననుకొనును.

స్త్రీ లనేక విధముల పలుకుచుందురు. ఒకరు "అమ్మ గారు! నీవుకూడ అమాయకురాలవు. ఈ విషయమున నడుగున దేమి కలదు ; అది పురాణవాయురోగము, సమయము చూచుకొని బయట పడినది. మంచి వైద్యునివద్ద పరీక్ష చేయించి మందిప్పించుఁ" డనును,

ఇంకొక తె "వాయురోగము చాల భయంకరమైనది. నీవు నిమాయి కాళ్ళు చేతులు రెండు కట్టివేసి వానినొక కొట్టులో బంధించియుంచి, ఆహారము పచ్చి లేఁత కొబ్బరి నీళ్ళొసంగుము. దీని వలన మెల్లమెల్లఁగా వాయురోగము పోవును" అనును, 'శివాతైలమును శిరస్సున మర్దన చేయించుఁడు నయమగును. భగవంతుఁడు మేలుచేయును; ఆయనయే మనకందఱ కేకమాత్ర శరణము.' అని సలహా నిచ్చును.

పాపము శచీమాత యందఱి వాక్యములను విని చింతా క్రాంతయై మెదలకూరకుండును. ఒక్కగాని ఒక్క కొడుకును చేతులు కాళ్ళు కట్టి కొట్టులోఁబడవేయుట కామెకు ధైర్యము లేదు. పాపమామెకొక చెంప పుత్రుని విషయమున దుఃఖము, మఱియొక చెంప విష్ణుప్రియను గూర్చిన దుఃఖము. పతియొక్క యీ స్థితిని గాంచి విష్ణుప్రియ యెల్లప్పుడును జింతాక్రాంతయై యుండును. ఆమె కాహారపానీయములు సహించుట లేదు. ఉదాసీన భావముతో నెల్లప్పుడును పతి విషయమునే చింతించు చుండును. శచీమాత బ్రదిమలాడినచో పతియొక్క యుచ్ఛిష్టాన్నమునుండి ఒకటి రెండు ముద్దలు తిననఁదినును లేకున్న నట్లే కూర్చుండును. ఈ కారణమున శచీమాత యొక్క దుఃఖము ద్విగుణీత మయ్యెను. ఆమె వయస్సు అఱువదాఱు సంవత్సరములు. వృద్ధావస్థ యగుటచే నింతటి దుఃఖమామె సహించలేకుండెను. కాని నీలాంబర చక్రవర్తికి కూఁతురౌను, జగన్నాథ మిశ్రవంటి పండితునికి ధర్మపత్నియు. విశ్వరూప, విశ్వంభరుల వంటి మహాపురుషులకు తల్లియు నగు శచీమాత కిట్టి దుఃఖములు స్వాభావికములై సహనము గావించుటలో మిన్నయయ్యెను. సామాన్య స్త్రీ లిట్టి భరింపరాని దుఃఖములను సహింపఁజాలరు.

మహాప్రభుని నూతనావస్థను గూర్చిన చర్చ నవద్వీప మంతటను జెలరేగెను. ఎన్నినోళ్ళుండినవో అన్నిరకములుగఁ జెప్పుకొనసాగిరి. నోటి కేమి వచ్చిన నట్లు మాట్లాడుచుండిరి.

చాలమంది 'ఇట్టి పిచ్చి మే మెచ్చటను జూడలే'దందురు. ఇంకఁగొందఱు 'ఇట్టి పిచ్చి నిజముగ మే మెచ్చటను జూడలేదు. అసలు విషయమేమై యుండును? చేష్టలు చూచినఁ బిచ్చి వాండ్ర చేష్టలవలెలేవు. ముఖమున కాంతి యంతకంతకు దివ్యమై పోవుచున్నది. ఆతని దర్శన మాత్రముననే హృద యము తరంగాయత మగుచుండును. అంతఃకరణ ముప్పొంగు చుండును. ఆతని యాకృతిలో నేమి మాయయున్నదో తెలియదు. పిచ్చివాండ్రకు కూడ యిట్టి స్థితి యుండునా?' అనుచుందురు. కొందఱీ మాటలను ఖండించుచు 'ఏమైన ననుఁడు. ఇది మస్తిష్క-వికారమే. ఏరకముదైనఁగానిండు, ఇది వాతవ్యాధితప్ప వేఱుకాదు' అనుచుందురు.

శ్రీవాసపండితుఁడు ప్రభువు వారి తండ్రికి పరమ మిత్రుఁడనియు, నాయన ధర్మపత్ని మాలతీదేవితో శచీ మాతకు సఖీభావము కలదనియు, వీరిద్దరు ప్రభువును బుత్రుని వలెఁ బ్రేమించుచుండెడు వారనియు నేనిది వఱకే చెప్పి యున్నాను. నిమాయిపండితుని వంటి తెలివి గలవాఁడు, పండి తుఁడు, భగవద్భక్తి యెడల నుదాసీనుఁడుగ నున్నాఁడని శ్రీవాస పండితునకు హృదయములో దుఃఖముండెడిది. నిమాయి పండితుఁడు వైష్ణవుఁడగు నెడల వైష్ణవ మతమును తెప్ప నావలియొడ్డు చేరఁగలడనియు, నప్పుడిప్పటివలె వైష్ణవు లకు దుర్గతి యుండఁజాలదనియు ననుకొను చుండెడువాఁడు. ప్రభువు విషయములో లోకులనేకములుగ ననుకొనుటను గాంచి

శ్రీవాసుని మనస్సులోఁ బరమ కుతూహల ముద్భవించెను. ఆతఁడానంద దుఃఖముల మధ్యపడి వివిధములగు విషయముల నాలోచించు చుండెను. ఒక్కొక్కప్పు డాయన 'వాయురోగ ముపొంగి యుండవచ్చును. ఈ శరీరము లెక్కయేమిటి? శాస్త్రములలో దీనిని నిత్యముగాను, ఆగమాపాయిగను జెప్పఁబడినది. ఇది రోగమందిరము' అని యాలోచించు చుండును, మఱల 'లోకుల వలన నేను విన్న లక్షణములను బట్టి, అట్టి లక్షణములే భగవద్భక్తులలోఁగూడ నుండును. నా హృదయాంతరమందేదో యవ్యక్త సుఖానుభవము కలుగు చున్నది. ఏదైనఁ గానిండు. పోయి అతని స్థితిని గాంచి రావలెను' అని యాలోచించి ప్రభుని స్థితిని జూచుటకు తన యింటినుండి బయలుదేరెను.

మహాప్రభువా సమయమున శ్రీతులసీ వృక్షమున జలముపోసి ప్రదక్షిణము చేయుచుండెను. పితృతుల్యుఁడును బూజనీయుఁడు నగు శ్రీవాస పండితుని గాంచి ప్రభువాతని వైపునకుఁ బరులిడి. ప్రేమతో నాయనను గౌఁగిలించుకొనెను. శ్రీవాసుఁడు ప్రభుని యంగముల నన్నిటిని స్పర్శించెను. ప్రభుని యంగములను స్పర్శించునప్పటికి స్పర్శమాత్రము చేతనే ఆతని శరీరములో విద్యుత్ప్రవాహమువలెఁ బ్రవహించెను. ఆయన శరీరమంతయు రోమాంచమయ్యెను. ఆయన ప్రేమమగ్నుఁడై తదేక దృష్టితో ప్రభుని మనోహర ముఖ మునే చూడసాగెను. ప్రభు వాయన నాదరముతో లోనికిఁ

గొనిపోయి కూర్చుండఁబెట్టి, ఆయన వడిలోఁ దన శిరస్సు నుంచి యతఁడు వెక్కి వెక్కి యేడ్వనారంభించెను. శచీమాతయు శ్రీవాస పండితుని గాంచి యక్కడకు వచ్చి యేడ్చుచు ప్రభుని వ్యాధివృత్తాంతమును జెప్పసాగెను. పుత్రస్నేహ కారణమున నామెకు దుఃఖముప్పొంగెను. ఆమె సరిగా మాటలాడఁజాలకుండెను. ఎట్టులో యొకట్టుల శ్రీవాస పండితునకు దల్లి సమస్త వృత్తాంతమును జెప్పివేసెను.

సమస్త వృత్తాంతమును విని భావావేశమున శ్రీవాస పండితుఁడు 'ఇతనికి వాయురోగమను వారికే వాయురోగమేమో! శివ సనకాది యోగులాకాంక్షించు స్థితి యిది యని వారికేమి తెలియును? శచీదేవి! భగవద్భక్తుని గన్న నీ వదృష్టవంతురాలవు. ఇవి యన్నియుఁ బూర్ణభక్తికి చిహ్నము' లనెను.

శ్రీవాసపండితుని యీ మాటలు వినఁగానే తల్లికి కొంచెము సంతోషమయ్యెను. అధీర భావముతో ప్రభువు శ్రీవాస పండితునితో నిట్లనెను. నేఁడు మీ దర్శనముచే నాకు పరమ శాంతి లభించెను. అందఱును నాకు వాయురోగ మనియే చెప్పుచుండిరి. నేనుకూడ దీనిని వాయురోగమను కొను చుంటిని. నా కారణమున విష్ణుప్రియకు, తల్లికి గలుగు దుఃఖమువలన నాహృదయము బ్రద్దలగు చున్నది. నేఁడు మీరిచ్చుటకు వచ్చి, నాకీప్రకార మాశ్వాసము గావించకుండి

నట్లైన నేను నిజముగనే గంగలో మునిఁగి ప్రాణపరిత్యాగము కావించుకొనెడువాఁడనే. లోకులు నా విషయములో ననేక విధములుగ ననుకొనుచున్నారు.'

శ్రీవాస పండితుఁ డిట్లనెను — నీ మూలమున ప్రపంచోద్ధరణ కలుగు నని నాహృదయము మాటిమాటికిని జెప్పుచున్నది, నీవు భక్తుల కేకమాత్రాశ్రయుఁడవు, ఆరాధ్యుఁడవయ్యెదవు. నీ యీ యద్వితీయ, యలౌకిక మాదకతను గాంచినచో నఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడును, అనాది పురుషుఁడు నగు శ్రీహరి భూమియం దవతరించి అవిద్యను, అవిచారమును నాశము కావించి భగవన్నామమును ప్రచారము కావించునని తోఁచుచున్నది బహుశః ప్రభువీ శరీరము ద్వారముననే యట్టి శుభకార్యమును జేయించు ననియుఁ దోఁచుచున్నది.'

ప్రభువు ధీరుఁడై యిట్లనెను :- నేను మీకు పుత్ర సమానుఁడను. వైష్ణవ చరణములందు నాకనురక్తి కలుగు నట్లాశీర్వదింపుఁడు. శ్రీకృష్ణ కీర్తనము తప్ప వేఱొక దాని యందు నాకనురాగము కలుగరాదనియే నా యభిలాష. సర్వదా ప్రభుప్రేమలో వికలుఁడనై యేడ్చుటయే నాహృదయ పూర్వకమగు కోరిక.'

'ఇట్టి పిచ్చి, కొంచెమో గొప్పయో నాకును బుట్టు నట్లు నీవే యాశీర్వదింపుము. నేనుకూడ నీవలె ప్రేమో

న్మత్తుఁడనై, లోకబాహ్యుఁడనై యున్మత్తుని వలె నృత్యము చేయవలెను' అని శ్రీవాసపండితుఁడనెను.

ఈ విధముగఁ జాలసేపటి వఱకీ మహాపురుషు లిద్దరును విశుద్ధాంతఃకరణములతో మాట్లాడుకొనిరి. చివరకు శ్రీవాస పండితుఁడు ప్రభుని యాజ్ఞనుగొని యింటికి వెడలిపోయెను.



# అద్వైతాచార్యుఁడు; ఆయన సందేహము

శ్లో॥ అర్చయిత్వాతు గోవిందం తదీయాన్నార్చయేత్తు యః ।
న స భాగవతో జ్ఞేయః కేవలం దాంభికః స్మృతః ॥
(తస్మాత్సర్వప్రయత్నేన వైష్ణవాన్పూజయేత్సదా)
విష్ణుపురాణము.

(భగవంతుఁడగు గోవిందుని బూజించి భగవద్భక్తులగు వైష్ణవులను బూజించనివాఁడు నిజమైన భక్తుఁడు కాఁడు. వానిని దాంభికునిగాఁ దెలియవలెను. భగవంతుఁడు భక్తుని బూజించిననే యత్యంత సంతుష్టుఁడగును. కావున సర్వ ప్రయత్నమున వైష్ణవులను బూజించవలయును.)

భగవంతుఁడు ప్రతి ప్రాణియొక్క హృదయములో విరాజమానుఁడై యున్నాఁడు. సమాన రూపమునఁ బ్రపంచములోఁ బ్రతి యణు పరమాణువు నందును వ్యాప్తమై యున్నాడు. కాని పాత్రభేదమున వారికుపలబ్ధి భిన్నభిన్నముగ నుండును. చంద్రకిరణములు సమస్త వస్తువులపై నేకరూపమునఁబడును. రాయి, మట్టి, కుండ, వస్త్రము పీటిమీఁద కూడ నాకిరణములే పడును. అద్దము, చంద్రకాంతమణి మీఁదకూడ ఆ కిరణముల ప్రభావమే పడును. అచ్చట తమోగుణాధిక్యతచే నవ్యక్త రూపముగ నుండును. కాని స్వచ్ఛము నిర్మలము నగు చంద్రకాంతమణిపై నాయన కృపాకిరణము కొంచెము పడినను దానికి విచిత్ర దశ కలుగును.

ఆలోకసుఖకరుఁడగు నిశానాథ భగవానుని కృపా కిరణము పడఁగానే యీచంద్రకాంత శిలాహృదయము కఱఁగి ద్రవీభూతమును జెంది ప్రవహింప సాగును. ఈకారణమున చంద్రదేవుఁడు దానియెడల నధికాధిక ప్రీతిఁజెందును. ఈ కారణమున నది చంద్రకాంతమణి యను పేరుపొందెను. దానికిని చంద్రునకును నిత్యశాశ్వత సంబంధమేర్పడినది. దానికిని నిశానాథునకును భిన్నత్వము లేదు. నిశానాథుని గుణములు దానిలో సమావేశమగును. ఈ విధముగ భక్తుల హృదయములో భగవత్కృపా కిరణములు పడఁగానే నతఁడును కఱుగ సాగును చంద్రకాంతమణి చంద్రకిరణములు లేకున్ననైన నుండును గాని, యతఁడు కృపా కిరణము పడఁగానే కఱఁగి కఱఁగి ప్రభుప్రేమ పీయూషార్ణవములోఁ గలిసి తదాకారమును జెందును. ఇదియే భక్తులలోఁగల విశేషత. అందుకనియే గోస్వామి తులసీదాసింతవఱకు చెప్పినాఁడు—

మోరే మన ప్రభు అస విశ్వాసా
రామ తేఁ అధిక రామ కర దాసా ॥

నావిశ్వాసమున రామునికంటె రామునిదాసుఁడే గొప్పవాఁడు.

భగవద్భక్తుల మహిమ యెట్టిదనఁగా భక్తులను గ్రహించుటకైనను ప్రభుకృప కావలయును. భగవత్కృప లేనివాఁడు భక్తుల మహిమ నెట్లు తెలిసికొనఁగలఁడు ? ఎవని హృదయములో నారసరాజు యొక్క రసామృతమొక బిందు

వైనను ప్రవేశింపలేదో, ఎవనిలో దానిని గ్రహించుటకు కించిన్మాత్రమైనను శక్తి లేదో, వాఁడు రసికతా మర్మము నెట్లు గ్రహింపఁగలఁడు ? అందువలననే రసిక శిరోమణి భగవద్రసికుఁడిట్లు చెప్పినాఁడు—

'భగవత రసిక' రసికకీ బాతేఁ
రసిక బినా కోట సముఝి సకే నా ॥

'రసికుఁడు కానిది యెవఁడును రసిక విషయములను దెలిసికొనఁజాలఁడు'

మహాప్రభువుయొక్క నవానురాగ చర్చ నదియాలో సమస్త స్థానములందు వివిధరీతులచే జరుగుచుండెడిది. ఆ సమయమున వైష్ణవులందఱును నద్వైతాచార్యుని వద్ద సమావేశమగు చుందురు. అద్వైతాచార్యుని స్థానము వైష్ణవుల సమావేశస్థలమని చెప్పవచ్చును. అక్కడ గొప్ప గొప్ప పేరుగల వైష్ణవులను పహాలువానులు సమావేశమై భక్తితత్త్వమను యుద్ధము నభ్యసించుచుందురు. ప్రభుప్రాప్తికి వివిధములగు పేచీలనుగాని సాధుసదనమున నాలోచనా ప్రత్యాలోచనలు జరుగుచుండును. ఎల్లప్పుడును కదాచారమను ప్రబల శత్రువు దేనిద్వారా క్రిందపడునా యని విచారణ చేయుచుందురు. వైష్ణవులు తమతమ బలవిచారము కావించుకొని, తమ యీ దుర్దశకు కన్నీరు కార్చుచుందురు. మహాప్రభుని నూతన భావవిషయమునను నిచ్చట వాదవివాదములు జరుగుచుండెడిది. వైష్ణవులలోఁ జాలమంది నిమాయి పండితునకు

భక్త్యావేశమేననియు, నితని హృదయములోఁ బ్రేమపూర్ణ రూపమునఁ బ్రకాశించుచున్నదనియు, నతని చేష్టలన్నియు నలౌకికములు ఆతనిముఖ తేజమును గాంచి ప్రభు ప్రేమోన్మాదములోఁ దీవ్రోన్మాదము కలిగినదిగఁ దోఁచుండినదనియు చెల్పిరి. కాని కొందఱు భక్తులు దీనికి వ్యతిరేకముగ నుండిరి. నిమాయి పండితుఁడేమి, ఒక్కసారిగ నిట్లు మాఱిపోవుట యేమి యనియే వారివాదన. నిన్నమొన్నటివఱకతఁడు దేవీ దేవతలను, భక్తులగు వైష్ణవుల నెగతాళిచేయుచుండినవాఁడు ఇంత వేగముగ నతనిలో నిట్టి పరివర్తనము కలుగుట అసంభవమే యగును. తప్పక అతనికి యీపురాణ వాయురోగము తిరుగఁబెట్టియుండవచ్చును. ఆతని చేష్టలన్నియుఁ బిచ్చివాని చేష్టలవలెనే యున్నవి.

ఆ వాక్యములన్నిటిని విని శ్రీమాన్ అద్వైతాచార్యులు అందఱను సంబోధించుచు గాంభీర్యముగా నిట్లనెను:- సోదరులారా ! మీరు నిమాయి పండితుని విషయములోఁ జర్చించుకొనుచుంటిరే, యదే విషయములో నాయొక్క నిజమైన యనుభవమును గూడ వినుఁడు. భగవంతుఁ డవతరించుటకు నేను నిత్యము గంగా స్నానము చేయుటయు, దులసితో శ్రీకృష్ణ పూజనము కావించుటయు మీకందఱకును విదితమే. గౌతమీయ తంత్రములోని యీ వాక్యమందు నాకు సంపూర్ణ విశ్వాసమున్నది—

శ్లో॥ తులసీ దళ మాత్రేణ జలస్య చులుకేన వా।
విక్రీణీతే స్వమాత్మానం భక్తేభ్యో భక్తవత్సలః ॥

అనగా భగవంతుఁడెంత దయాళుఁడో తెలియునా? భక్తిపూర్వకముగ నొక పుడిసెఁడు జలమును, ఒకతులసీ దళమున భగవంతున కర్పించిన దానికి సంతోషించి భక్తవత్సలుఁడగు భగవంతుఁడు తనయాత్మను వారికర్పించును. ఈ వాక్యముపై విశ్వాసముంచియే నేను మిమ్ములను మాటి మాటి కాశ్వాసించుచున్నాను. నిన్న శ్రీమద్భగవద్గీతలోని యొక శ్లోకము యొక్క అర్థము నా మనస్సునకు రాలేదు. ఈ చింతతోడనే రాత్రి నేను భోజనము చేయకయే నిద్రపోయితిని. నేను స్వప్నమందేమి చూచితినో తెలియునా? ఒక గౌరవర్ణముగల తేజస్వి యగు మహాపురుషుఁడు నా సమీపమునకు వచ్చి నాతో నిట్లనెను:- అద్వైతా! త్వరగా లెమ్ము. నీకు సందేహము కలిగిన శ్లోకమున కర్థమిది. ఇప్పుడు నీమనోవాంఛ ఫలించినది. ఏ కోరికతో నీవు నిరంతరము గంగాజలముతోడను తులసీదళముతోడను నాపూజనము కావించితివో ఆ నీకోరిక సఫలమైనది. నేనిప్పుడు శీఘ్రముగనే బయట పడుదును. ఇప్పుడింక నీవు భక్తులను చాలకాలము ఆశ్వాసింపఁబనిలేదు. ఇప్పుడింక నేను కొలది దినములలోనే నామసంకీర్తనము నారంభింతును. దాని యొక్క ఘనఘోర తుములధ్వనిచే దిశవిదిశలు ప్రతిధ్వనింపఁగలవు. ఈ సంగతిని జెప్పి, ఆ మహాపురుషుఁడు తన అసలు స్వరూపమును జూపించెను. అతఁ డెవరో కాదు.

శచీనందనుఁడగు విశ్వంభరుఁడే యీ మాటలు నాతో చెప్పినది. ఇతని యన్న విశ్వరూపుఁడు నా పాఠశాలలోఁ జదువుచుఁడినప్పుడు ఇతఁడు వానిని బిలుచుటకొఱకు నాదగ్గఱకు అప్పుడప్పుడు వచ్చుచుండెడువాఁడు, ఇతనినిఁ జూచు నప్పటికే నామనస్సు హఠాత్తుగ నితని వైపున కాకర్షింపఁబడు చుండెడిది. నామనోవాంఛ యితనిద్వారా పూర్తియగునని నేననుకొనుచుండెడువాఁడను. నేఁడు స్వప్నమందు వానిని గాంచుటచే నాకీ విషయము స్పష్టమైనది' అని ఇట్లు చెప్పుచుండఁగా వృద్ధాచార్యునకు గద్గదికమయ్యెను. ఆయన వెక్కి వెక్కి బాలుని వలె రోదనము చేయ మొదలిడెను. భగవంతుని భక్తవత్సలతను స్మరించి యాయన వెక్కి వెక్కి యేడ్చుచుండెను. ఈయన యొక్క యీ స్థితిని గాంచి యితర వైష్ణవుల కన్నుల నుండియు నశ్రువులు వెడలెను. అందఱ హృదయములు ప్రేమతో నిండిపోయెను. వైష్ణవులందఱు రాఁబోవు యుత్కర్షను స్మరించి యానంద సాగరములో మునుఁక లిడుచుండిరి. ఈ విధముగ ననేక విషయములు చర్చించుకొనిన మీఁదట వైష్ణవు లందఱుఁ దమ తమ గృహములకు వెడలిరి.

ఇచ్చట మహాప్రభుని స్థితి యింకను విచిత్రముగ నుండెను. ఆతనికిప్పుడు శ్రీకృష్ణ కథా ప్రసంగము, వైష్ణవుల సత్సంగము తప్ప యితర విషయములు రుచికరములుగఁ దోఁచుటలేదు. ఆతఁడు సర్వదా గదాధరాది భక్తులతో

భగవచ్చర్చను చేయుచుండును. ఒక దినమున, ప్రభువు గదాధర పండితునితో 'గదాధరుఁడా! అద్వైతాచార్యులు పరమభాగవత వైష్ణవులు. వారే నవద్వీపములోని భక్తివైష్ణవులలో శిరోమణియు నాశ్రయ దాతయును నేఁడు వారి దగ్గఱకు పోయి వారి పాద రజముచేఁ బావనుఁడఁగాఁ గోరుచున్నాను.

ప్రభువు యొక్క యీకోరికను దెలిసికొని గదాధరుఁడాయనను వెంటఁగొని యద్వైతాచార్యుని యింటికిఁ జేరెను. ఆ సమయమున డెబ్బది సంవత్సరముల వయస్సుగల వృద్ధాచార్యులవారు చాల శ్రద్ధా భక్తులతో తులసీపూజనము చేయుచుండెను. ఆచార్యుని శిరస్సుపైని వెంట్రుక లన్నియు నెఱసినవి. వారి తేజోమయ ముఖమండలమున నొక యపూర్వ శోభ వ్యక్తమగుచుండెను. ముడుతలు పడిన ముఖమునుండి వారు శుద్ధముగ గంభీరస్వరముతో స్తోత్రపాఠము కావించుచుండెను. నోటినుండి భగవత్స్తుతి సంబంధమైన మధుర శ్లోకము వెలువడుచుండెను. నేత్రముల నుండి యశ్రుధార ప్రవహించుచుండెను. ఆ పరమ భాగవత వృద్ధ వైష్ణవుని యిట్టి యపూర్వభక్తి భావమును గాంచి ప్రభువు ప్రేమలో గద్గదికుఁడయ్యెను. ఆతనికి భావావేశములో శరీరస్పృహ కొంచెమైనను లేకుండెను. ఆతఁడు మూర్ఛితుఁడై నేలమీఁద స్పృహతప్పి పడిపోయెను.

తన యిష్టదైవము తనముందు మూర్ఛితుఁడై పడియుండుటను గాంచినంతనే యద్వైతాచార్యునకు ఆనందమునకు

మేలు లేకుండెను. ముందుంచఁబడిన పూజా పళ్ళెరమును గైకొని యాయన ప్రభుని కోమల పదపద్మములను అక్షత, ధూప, దీప, నైవేద్య, పత్రపుష్పాదులచే విధ్యుక్తముగఁ బూజించెను. ఇంత గొప్ప జ్ఞానియు, వృద్ధమహాపురుషుఁడునగు అద్వైతాచార్యుఁడొక బాలకుని పాదములను బూజించుటను గాంచి యాశ్చర్య చకితుఁడై గదాధరుఁడు 'ఆచార్యా ! మీరేమి యిట్లనర్థము కావించుచున్నారు ! ఇంత గొప్ప జ్ఞానియు, గౌరవనీయుఁడును, వయోవృద్ధుఁడవగు పండితుఁడ వయ్యు మీరొక పిల్లవాని పాదములను బూజించి వానికి పాపమును నెత్తిన వేయుచున్నారు' అనెను.

గదాధరుని యీమాటలను విని అద్వైతాచార్యులు నవ్వుచు నిట్లనెను:- గదాధరా ! నీవు కొలఁది దినములలోనే యీ బాలకుని మహాత్మ్యమును దెలిసికొనఁగలవు. వైష్ణవు లందఱు నీతని పాదపూజ కావించి కృతకృత్యులయ్యెదరు. నీవిప్పు డీపనిని చూచి యాశ్చర్యపడుచున్నావు. కాలాంతరమున నీయీభ్రమ దానంతట నదియే తొలఁగును

ఇంతలోనే ప్రభువునకు గొంచెముగ బాహ్యజ్ఞానము కలిగెను. చైతన్యము కలిగిన తర్వాత నతఁడాచార్యుల చరణములను బట్టుకొని యేడ్చుచు నిట్లనెను:- ప్రభూ ! ఇప్పుడు నన్నుద్ధరింపుఁడు. నేను నాజీవితములోఁ జాలకాలము వ్యర్థ బకవాదములలో నాశము కావించితిని. ఇప్పుడు నాకు భవదీయ చరణ శరణ మిమ్ము. నాకిప్పుడు కొంచెము ప్రేమ తత్త్వమును

దెలుపుఁడు. నేను మీ శరణమునకు వచ్చితిని. మీరే నన్ను రక్షించగలరు.'

ప్రభువు యొక్క యిట్టి దైన్యయుక్త ప్రార్థనను విని స్తంభీభూతుఁడై ఇట్లనెను:- 'ప్రభూ! ఇప్పుడు నాదగ్గఱ మీ విషయము దాఁచవలదు. ఇన్నాళ్ళనుండి దాగియున్నారు. ఇంకెంతకాలము దాఁగఁదలఁచితిరి? ఇప్పుడు మీరు బయట పడవలసిన సమయము వచ్చినది.'

ప్రభువు దీనతతో నిట్లనెను:- 'మీరే నాకు తల్లి, తండ్రి, గురువు. మీ యనుగ్రహమెప్పుడు కలిగిన నాకు శ్రీకృష్ణప్రేమ ప్రాప్తించును. నేను వైష్ణవులకు నిజమైన సేవకుఁడ నగునట్లాశీర్వదింపుఁడు.'

ఈ విధముగ చాలసేఁపటి వఱకు పరస్పర మిరువురు దైన్యతాయుక్త వచనములను సాగించిరి. చివరకు ప్రభువు గదాధరునితోఁ దన యింటికి వెడలిపోయెను. 'ఈతఁడు నన్ను మోసము చేయఁదలఁచుచున్నాఁడు. నిజముగ నాస్వప్నము సత్యమైనట్లైన, రాత్రి కనఁబడిన మహాపురుషుఁ డితఁడే యైనచో సంకీర్తన సమయములో నన్ను స్వయముగఁ దనవద్దకు బిలుచును నేనిప్పుడు నవద్వీపములో నుండుట మంచిది కాదు.' అని అద్వైతాచార్యుఁ డాలోచించి ఆయన నవద్వీపమును వదలి శాంతిపురములోని తన యింటికిబోయి నివసించు చుండెను;

# శ్రీవాసునింట సంకీర్తనారంభము

శ్లో॥ చేతోదర్పణమార్జనం భవమహా దావాగ్ని నిర్వాపణం
శ్రేయః కైరవచంద్రికా వితరణం విద్యావధూజీవనమ్ ।
ఆనందాంబుధి వర్ధనం ప్రతిపదం పూర్ణామృతా స్వాదనం
సర్వాత్మస్నపనం పరం విజయతే శ్రీకృష్ణ సంకీర్తనమ్ ॥

పద్యావళీ అం. ౧౦-౧

(చిత్తమను నద్దమును మార్జనము చేయునదియు, సంసారమను మహాదావాగ్నిని శమింపఁజేయునదియు, జీవుల యొక్క మంగళములను కైరవ చంద్రికను వితరణము గావించునదియు, విద్యయను స్త్రీకి జీవనమైనదియు, ఆనందమను సాగరము నుప్పొంగఁజేయునదియు, ప్రతిపదమునఁ బూర్ణామృతము నాస్వాదింపఁజేయునదియు, సమస్త విధముల శీతలస్వరూపమైనదియు నగు శ్రీకృష్ణ సంకీర్తనమునకు విశేషముగ జయము కలుగుఁగాక.)

ప్రపంచమంతయు నొక యజ్ఞాత యాకర్షణమున కధీనమై సమస్త వ్యవహారములు చేయుచున్నది అగ్ని యందఱకును వేడిగాఁదోఁచును జలమందఱకు శీతలముగ నుండును. శీతోష్ణములు కలిగినప్పుడు వాటియొక్క సుఖదుఃఖానుభవములు జీవమాత్రునకుఁ గలుగును. అయితే స్థితిభేదముచే దాని యనుభవములో న్యూనాధిక్యతలుగలవు. ఏదోయొక విధముగ నందఱు ననుభవింతురు.

చైతన్య. 2—5

ఈ జీవున కాది యుత్పత్తి స్థానము ఆనందము. ఆనంద పుత్రుఁడగుటచే నితఁడు సర్వదా ఆనందమునే వెదుకుకొను చుండును. 'నే నెల్లప్పుడును ఆనందమునే బొందుదు' నను కోర్కెయే యీతనికి స్వాభావికమైనది; అట్లే కావలెను కూడా. కారణము జనకుని గుణము జన్యమునకుఁ దప్పక వచ్చును. అందువలననే ఆనందమువలనే పుట్టుటచేత నితఁ డానందములోనే యుండఁగోరును. చివర కానందములోనే కలిసిపోవును, జలబిందువు సముద్రమునుండి విడివడి, విడివడిన తర్వాత నది యనేక స్థానములలో భ్రమణము చేసి వచ్చి నప్పటికిని చివర కంతటను దిరిగి తిరిగి అది సముద్రమునకే రావలెను. సముద్రము తప్పితే దానికి వేఱుగతి లేనేలేదు. ఆవిరియై యది మేఘములఁజేరును. మేఘములనుండి వర్ష రూపమున నేలపైఁ గురియును. నేలమీఁద పాఱి యది చెఱువులోఁజేరును. చెఱువునుండి చిన్ననదిలోనికిఁ బోవును. అక్కడనుండి మఱల పెద్దనదిలోనికి పోవును. ఈవిధముగ నది మహానదీప్రవాహమునఁబడి సముద్రమునకుఁ జేరును. ఒకొక్కప్పుడు క్షుద్రజలాశయ సంసర్గము దానియందు దుర్గంధముగఁ దోఁచును కాని చాతుర్మాస్యలలో వచ్చు గొప్ప వరదచే నా దుర్గంధము శుభ్రమై యది గొప్ప వేగముతోఁ దన నిర్దిష్ట స్థానమునకుఁ జేరును.

మననము చేయువారలకు మనస్సొకరీతిగ నేయుండును. సర్వత్ర దాని గతి యొక్కటిగానే యుండును. శరీరమందంత

టను చిత్తవృత్తులు ఒక నిర్ధారిత నియమములోనే కార్యము లొనర్చుచుండును. జీవుని ముఖ్యలక్ష్యము తన ప్రియతముని దగ్గఱకు జేరుటే. వానికి తన ప్రియుని దగ్గఱకు చేరినఁ దప్ప శాంతిలేదు. తర్వాత నక్కడకు చేరి యక్కే యగుట, ఆ స్వరూపములోనే తాను కలియుట, ఇది వారివారి భావములను బట్టి యుండును, ఏమైనఁగానిండు, దగ్గఱకు జేరితీరవలయును. యోగము చేసి తీరవలయును. యోగము లేక శాంతియే మృగ్యము. చిత్తవృత్తి నిరోధమైనప్పుడే యోగమనఁబడును. చిత్తమతి చంచలమైనది. ఏకాంతములో నిది యధికాధి కోపద్రవము కావించును. దానిని నిరోధించుట కొక సరళో పాయము పూర్వజన్మ శుభ సంస్కారములచే సాధన కావించి గాని లేక భగవత్కృపచేఁ గాని కొంచెమో గొప్పయో చిత్తవృత్తి నిరోధము కావించిన వారి చిత్తముతోఁబాటు తన చిత్తమును గలుపుటయే. కారణమేమన సజాతీయ వస్తువు తన సజాతీయవస్తువు వైపునకు శీఘ్రముగ నాకర్షింపఁబడును. అందులకే సత్సంగమునకు సంకీర్తనమున కింత యెక్కువ మహిమ చెప్పఁబడినది. ఒకే యుద్దేశ్యముచే నేకమనస్కులు ఏకచిత్తము కలవారై యేసాధన చేసినను వేఱువేఱుగ సాధన చేసిన దానికంటె దానిమహిమ వేయిరెట్లధికమగును. విశేషముగ సమస్త ఖాద్యపదార్థములచే దూషితమైన యీఘోర కలియుగములో, భావదోషముచే గిరి శిఖరములు, ఏకాంత స్థానములు మొదలగు సమస్త స్థలములలోని వాయుమండలము దూషితమైన యీ ఘోర సమయమున సత్పురుష సమూహ

ములో నుండి నిరంతరము ప్రేమతో శ్రీకృష్ణ సంకీర్తనము చేయుటయే సర్వశ్రేష్ఠ సాధనము. స్మృతులలోను 'సంఘే శక్తిః కలౌ స్మృతా' కలియుగములో సమస్త సాధనలు సంఘశక్తిచేతనే ఫలీభూతములగు ననియు 'కలౌ కేశవ కీర్తనాత్' అనఁగాఁ గేశవ కీర్తనమే సర్వశ్రేష్ఠ సాధన మనియుఁ జెప్పఁబడినది. కావున నీవిషయములను బట్టి కలికాలములో నందఱేక చిత్తమున నేకమనస్సున నేకాంతస్థానములో నిరంతరము కేశవ కీర్తనము చేయునెడల ప్రతి సాధకునకు తమతమ సాధనలో పరస్పరము మిక్కిలి సహాయము లభింపఁగలదని సిద్ధాంత మగుచున్నది. ఇదంతయు తెలిసికొనియే సంకీర్తనావతారమగు శ్రీ చైతన్యదేవుఁడు సంకీర్తన పద్ధతిని ప్రచారముచేసెను. ఆయన యింతటి భావావేశమునకు వచ్చియు వనములకుఁ బరువెత్తలేదు. ఇల్లు వాఁకిలి, చుట్టాలుపక్కాలను అందఱను వదలిన యాప్రేమోన్మాదావస్థలో నతఁడు జనములోనే యుండి శ్రీకృష్ణ కీర్తనము చేయుచుఁ దన యాచరణముచే లోకశిక్షణ కావించుచు జగదుద్ధారమునందే సంలగ్నుఁడై యుండెను. ఇదియే యన్యమహాపురుషులకంటె నితనిలోనున్న విశేషత.

మహాప్రభుని స్థితి యిప్పుడిప్పుడు కొంచెము గంభీరమగుచుండెను. ఇప్పుడతఁడు ఒకొక్కప్పుడు స్వభావములోనికి వచ్చి భక్తులతోఁ బరస్పరము సంభాషణమును జేయుచుండెడు వాఁడు. చాల దినములనుండి ఆశతోఁ గనిపెట్టుకొనియున్న

భక్తులు ప్రభువువారి దగ్గఱకువచ్చి అందఱము కలిసి ప్రతి దినము సంకీర్తనము చేయుదమని సలహానిచ్చిరి. ప్రభువు నందఱ యభిప్రాయమును సహర్షముగ నొప్పుకొని భక్తాగ్రగణ్యుఁడగు శ్రీవాసు నింట సంకీర్తనచేయ నాలోచించెను. రాత్రి సమయమున అక్కడక్కడ నున్న భగవద్భక్తు లచ్చటకు వచ్చి సమావేశమైరి; ప్రభు వందఱకంటె ముందు సంకీర్తన నారంభించెను. అందఱు ప్రభువు ననుకరించిరి. సంకీర్తనము చేయుచుఁ బ్రభువు భావావేశమున తాండవ నృత్యము చేయ సాగెను. కొంచెమైనను శరీరస్పృహ లేకుండెను. ఒక విధమైన మహాభావములో మగ్నతను జెంది యాతని శరీర మలాత చక్రమువలె నిరంతరము తిరుగుచుండెను. ఎవ్వనికిని ఆతని పదములు కనఁబడుటలేదు. ఆతఁడు తిరుగుచున్నట్లు లేనేలేదు. నృత్యము చేయఁగాఁ జేయఁగా నతని కొక విధమైన యున్మాదకారి యగు మూర్ఛవచ్చి, నేలమీఁద పడిపోయెను. భక్తులాయనను మిక్కిలి యత్నముతో లేవదీసిరి. కొంచెము సేపటి కాతఁడేడ్చుచు నేడ్చుచు భక్తులతోఁ గొంచెము చెప్పుట కారంభించెను. 'సోదరులారా! నేనేమి చేయుదును. నా మనస్సిప్పుడు నా స్వాధీనములో లేదు. నేను చెప్పఁదలఁచి నది చెప్పలేక పోవుచున్నాను. ఎన్నో దినములనుండి నేను మీకొకమాట చెప్పఁదలఁచు చుంటిని కాని దాని నింతవఱకు చెప్పలేక పోతిని, నేఁడు నేను మీతో దానిని చెప్పెదను. మీరు సావధానముగ శ్రవణము చేయుఁడు.

ప్రభువిట్లు చెప్పఁగానే భక్తులందఱు స్థిరభావముతో మెదలక కూర్చుండి తదేక దృష్టులతో నుత్సుకతతో ప్రభువు వారి ముఖచంద్రమువైపు చూడసాగిరి. ప్రభువు సాహసము చేసి గంభీరతతో నిట్లుచెప్ప నారంభించెను. 'మీరందఱు నాకుఁ బరమాత్మీయులు. మీముందు గోప్యమే ముండును ? కాఁబట్టి యందఱకుఁ జెప్పఁదగని విషయమును నేను మీ ముందు చెప్పుచున్నాను. నేను గయనుండి తిరిగిరాఁగానే నాటశాలా గ్రామములో నొక శ్యామవర్ణముగల పరమ సుందర బాలకుఁడు నా దగ్గఱకు వచ్చెను. అతని అరుణారుణ కోమల చరణారవిందములకు సుందర నూపురములున్నవి. కాలి వ్రేళ్ళు మిక్కిలి యందమైనవి. క్రమక్రమముగా బెద్దవి చిన్న విగా నుండెను. నడుమునకుఁ బీతాంబరము కట్టఁబడి యున్నది. ఉదరము త్రివళీయుక్తమై యున్నది. నాభిగుంద్రముగాను లోతుగా నుండెను. వక్షఃస్థల మున్నతమై మాంసముతో నుండెను. గొంతుకలో నొక్కయెముకైనఁ గనఁబడుట లేదు. గళమందు వనమాల గురివింద పూసల పేరుండెను. కర్ణము లందు కుండలములు మెఱయుచుండెను. అతఁడు తన సుందర పద్మ పత్రాక్షులచే కోఱ చూపులతో నన్నుఁజూచు చుండెను. అతని సుందర కపోలములపై నవనీలాలకములు ఉంగరముల వలె వ్రేలాడు చుండెను అతఁడు మందహాస వదనారవిందుఁడై మురళీగానము చేయుచుండెను. ఆ మనోహర మురళీగానము వినునప్పటికి నా మనస్సు నా స్వాధీనములో లేదు. నేను

స్పృహ తప్పితిని. ఇంతలోనే యీ బాలకుఁ డెచ్చటికి పోయి నాఁడో తెలియదు.' అని పలుకుచుఁ బ్రభువు స్పృహ తప్పెను. ఆతని కన్నులనుండి యశ్రుధారలు ప్రవహించుచుండెను. శరీరము మీఁద రోమములు నిక్కపొడిచెను. ఆతఁడు మూర్ఛిత దశలోనే యీ క్రింది శ్లోకమును జదువ నారంభించెను.

శ్లో॥ అమూన్య ధన్యాని దినాంతరాణి
హరే ! త్వదాలోకన మంతరేణ ।
అనాథ బంధో ! కరుణైక సింధో !
హా హన్త ! హా హన్త ! ! కథం నయామి॥

కృష్ణకర్ణామృతము.

తా॥ ఓ కరుణా సింధో ! అనాథబంధో ! హరే ! నీ దర్శనము నకు వంచితుఁడనై, ఓ నాథా ! వ్రజ నాథా ! వ్యర్థముగ నీదినముల నెట్లు గడుపుదును ?

ప్రభువీ శ్లోకమును గద్గద కంఠముతో మాటిమాటికి చదివి మఱల స్పృహ తప్పెను. కొంచెము స్పృహ వచ్చిన తర్వాత మఱల దీనినే పఠింప మొదలిడెను. ఎటులో యొకటుల భక్తులు ప్రభువు శ్లోకము చదువుటను వారించిరి. కొంచెము సేపటికే యతఁడు ప్రకృతిస్థుఁడయ్యెను. ఈ విధముగా నాయన యిట్టి స్థితిని గాంచి యచ్చటనున్న భక్తులందఱు కళ్ళనీరు కార్చుచుండిరి. ఈ విధముగ నతఁడు రాత్రియంతయు సంకీర్తన తోడను సత్సంగము తోడను గడిపెను.

ఈ ప్రకారము శ్రీవాస పండితుని యింట నిత్యము సంకీర్తనానందము కలుగుచుండెడిది. రాత్రులందు ముఖ్య ముఖ్య భక్తులు సమావేశమైనప్పుడు ఇంటి తలుపులు వేసి కీర్తన నారంభించెడువారు. కీర్తనములో ఖోలు, కరతాళము, మృదంగము, మండీరాది వాద్యములన్నియు స్వరతాళలయాను సారముగ వాయింపఁబడు చుండెడివి. ప్రభువు భక్తులందఱ మధ్య నిలుచుండి నృత్యము చేసెడువాఁడు. ఇప్పు డితని నృత్యము మిక్కిలి మధురముగ నుండినది. భక్తులందఱు నానందావేశమునఁ దమ్ముఁదాము మఱచి ప్రభువుతోఁబాటు నృత్యము చేయసాగిరి. ప్రభు శరీరమందు స్తంభ, స్వేద, రోమాంచ, స్వరభంగ, కంప, వైవర్ణ్య, ప్రళయాది సమస్త సాత్త్విక భావములుద్భవించెను. భక్తులీతని యద్భుత భావములను గాంచి ముగ్ధులై భావావేశమును జెంది మిక్కిలి తీవ్రముగా సంకీర్తన చేయుచుందురు. అందఱు సహృదయులు. అందఱ చిత్తములు ప్రభువుతోఁ జేరుటకు సర్వదా తహ తహ లాడుచుండెను. ఒక్కని మనస్సులోనైనను మాన సమ్మాన కాంక్షగాని, బూటక ప్రదర్శనముగాని లేదు. అందఱ హృదయములు శుద్ధములు. ఇట్టి స్థితిలో నానంద మును గూర్చి చెప్పవలసిన దేమున్నది? వారందఱు నానంద స్వరూపులు. భక్తులు పరస్పర మొకరొకరు వందనములు చేసుకొందురు. కొందఱు విహ్వలులై ప్రభుచరణములను బట్టుకొందురు. చాలమంది పరస్పరము చరణములను బట్టుకొని

రోదనము చేయుదురు. ఈ విధముగ నందబుయొక్క ప్రేమ మయ కృత్యముల వలన శ్రీవాస పండితుని యిల్లు ప్రేమ పయోధి యయ్యెను. ఆ ప్రేమార్ణవములోఁ బ్రవేశించిన తోడనే ప్రతి ప్రాణియుఁ బ్రేమలో నున్మత్తుఁడై స్వతః నృత్యము చేయ మొదలిడును. అచ్చట ప్రభు సంసర్గమునఁ జేరఁగానే ప్రాపంచిక విషయము లన్నియు నొక్కసారిగ మఱచి పోవుదురు. భక్తుల హృదయము స్వయముగ తహతహలాడు చుండెడిది.

గదాధరుఁ డీతనికి పరమాంతరంగుఁడు. ఈతఁ డెల్లప్పుడును ప్రభుసేవలోనే యుండును. ఒక దినమున నీతఁడు భోజనానంతరము ముఖశుద్ధి నిమిత్తమై ప్రభువునకు తమల పాకులు చుట్టి యిచ్చుచుండెను. ప్రభువు ప్రేమావేశముచే నధీర బాలకుని వలె 'గదాధరా! అన్నా, నీవే చెప్పుము. నాకృష్ణుఁడు నన్ను వదలి యెక్కడికి పోయినాఁడో? అన్నా, నే నాయన లేకపోయిన జీవించలేను. నీవు నిజముగాఁ జెప్పుము ఆయన యెక్కడున్నాఁడో. ఆయన యెక్కడైన నుండనిండు. అక్కడికి పోయి వెదుకుదును. ఆతనిఁ జిక్కించుకొని గాఁగి లించుకొని బిగ్గఱగ కడుపార నేడ్తును. ఆతఁ డెక్కడికి పోయి నాఁడో నీవే చెప్పుము' అని యడుగ మొదలిడెను.

గదాధరుఁడు మాట మఱపించుట కిట్లనెను:— మీరు వ్యర్థముగ నధీరులగు చున్నారు. బాగున్నది, మీ కృష్ణుఁ

డెన్నఁడైన మిమ్ములను వదలి యింకొకచోటుకు పోఁగలఁడా! ఆయన నిరంతరము మీా హృదయమున విరాజిల్లు చుండును'

ఇదివిని యాతఁడత్లే యధీర మనస్కుఁడై యిట్లడిగెను:- 'నా ప్రియమైన కృష్ణుఁ డిప్పుడును నా హృదయములోఁ గూర్చుండినాఁడా ?

గదాధరుఁడు కొంచెము సేఁపాగి యిట్లనెను :- 'ఎందుకు కూర్చుండలేదు ? ఇప్పుడాయన మీాహృదయములోనే విరాజిల్లుచున్నాఁడు; సర్వదా యుండఁగలఁడు.'

ఇది వినఁగానే మిక్కిలి యానందోల్లాసమును జెందుచుఁ బ్రభువు తన పెద్దపెద్ద గోళ్ళతో హృదయమును జీల్చ నారంభించెను. ఆతఁడు 'నేను నా హృదయమును జీల్చి నాకృష్ణుని దర్శింతును. ఆతఁడు నాదగ్గఱనే దాగియుండియు దర్శనమైన నీయకున్నాఁడు. ఈ హృదయమును జీల్చివైతును'అని పలుక మొదలిడెను. ఇట్లొనర్చుట చూచి గదాధరునకు మిక్కిలి దుఃఖము కలిగి యాతఁడనేకములగు ననునయ వినయములు కావించి యీాతని నీకార్యము నుండి మఱలించెను. అప్పు డాతఁడు చాలసేఁపటికి స్మృతిలోనికి వచ్చెను.

ఒక దినమున రాత్రి యందు ప్రభువు శయ్యపై శయనించియుండెను. గదాధరుఁడతని చరణ సేవలో సంలగ్నుఁడై యుండెను. చరణసేవ చేయుచుఁజేయుచు గదాధరుఁడు తన మస్తకమును ప్రభు పాదపద్మములందుంచి గద్గద కంఠముతో

నిట్లనెను. ప్రభూ! ఈ యధమునకే పాపపరిణామస్వరూపము చేత శ్రీకృష్ణ ప్రేమ ప్రాప్తి కలుగలేదు? నీవు దీన వత్సలుఁడవు. నాకు సాధనా బలములేదు. శుభకర్మకూడ నేను చేయఁజాలకుంటిని. తీర్థయాత్రాది పుణ్యకార్యములను నేను చేయలేదు. నాకు శ్రీచరణము లొక్కటే యాధారము. నాపైఁ గృప యెప్పుడు కలుగును? ప్రభూ! ఎంతవఱకు నే నీ విధమైన ప్రేమవిహీన శుష్క జీవనము గడుపుచుందును.

ఆతని యీ విధమగు కాతర వాణిని విని ప్రభువు ప్రసన్నుఁడై, యాతని నాశ్వాసించుచు నిట్లనెను:- గదాధరా! నీవధీరుఁడవు కావలదు. నీవు శ్రీకృష్ణున కత్యంత ప్రియుఁడవు. దీనుఁడే భగవంతున కత్యంత ప్రియుఁడు. దీనహీనుఁడు కానిది ప్రభుప్రాప్తి కలుగనే కలుగదు తాను చేసిన పుణ్య కర్మలపై నభిమానము కలవాఁడును, ఉగ్రసాధనములం దాధారపడిన వాఁడును ప్రభువుయొక్క మహామహిమమగు కృపకధికారి యెన్నఁడును కాఁజాలఁడు. ప్రభువ కించన ప్రియుఁడు. నిష్కించనుఁడైననే యాతని కృప లభించును. నీ భావము పూర్తిగా నిష్కించన భక్తునికివలె నున్నది. నీవు నిజహృదయముతో నిష్కించనుఁడవైనప్పుడు నీకు శ్రీకృష్ణప్రేమ ప్రాప్తిలో నాలస్యము జరుగదు. రేపు గంగాస్నానమైన తర్వాత నీకు ప్రభువువారి పూర్ణకృప అనుభవమునకు వచ్చును.'

ప్రభుని యీవాక్యములు వినఁగానే గదాధరుని యానందమునకు మేఱ లేకుండెను. ఆతఁడు రాత్రియంతయుఁ

ప్రేమమగ్నుఁడై యానందాశ్రులు రాల్చుచుండెను ఎప్పుడు ప్రాతఃకాలమగునా యెప్పుడు నాకు ప్రేమప్రాప్తి కలుగునా యని యాతఁడొక్కొక్క గడియ లెక్కించుచుండెను. ప్రతీక్షలో నతనిస్థితి పిచ్చివానివలె నైనది. ఆతఁడొక్కొక్కప్పుడు లేచికూర్చుండును. ఒక్కొక్కప్పుడు నృత్యము చేయ మొదలిడును. ఒక్కొక్కప్పుడు మఱల పరుండును. ఒక్కొక్కప్పుడు తనలో తాను కొంచెమాలోచించి బిగ్గఱగా నవ్వసాగును. ప్రభువతని స్థితిఁగాంచి చాల యానందపడెను. ప్రాతఃకాలము స్నానము చేయుట తోడనే యతఁడానందమున మునిఁగి నృత్యము చేయసాగెను. ఆతఁడు ప్రేమాసవము ను ద్రావి యున్మత్తుఁడై నట్లుండెను. ఆతని కామధుమయ మనోజ్ఞ మదిరా పానము వలనఁ బూర్తిగా మత్తెక్కి నట్లుండెను. ఆతఁడు ప్రేమములో నిమగ్నుఁడై తదేక దృష్టులతో ప్రభువు వైపు చూచుచు నాయన పాదపద్మములకుఁ బ్రణామము కావించి కృతజ్ఞతను బ్రకటించుచు నిట్లనెను:- 'ప్రభూ! మీరీ యధమ పాపికిని కూడ ప్రేమ ప్రదానము కావించి నీపతిత పావన పుణ్యధామమును యథార్థముగఁ బరిచయము కావించుకొంటిరి. మీకృప జీవులపై సర్వదా యవ్యాజముగ నుండును. నాబోటి సాధనా హీనునిఁ గూడ దుస్సాధ్యమైన ప్రేమ పరిధి వఱకుఁ జేర్చితిరి. మీకు సర్వసామర్థ్యమున్నది. మీరు సర్వము చేయఁగలుగుదురు.'

ప్రభు వాతని యిట్టి స్థితిని గాంచి యధీరతతో

నిట్లనెను - 'గదాధరా! కృపాళుండైన శ్రీకృష్ణుండు నీపైం గృపచేసినాండు. ఇప్పుడు నీవాయనను నాకొఱకు ప్రార్థించవలెను.'

గదాధరుం డత్యంత దీనభావముతో నిట్లనెను:- 'ప్రభూ! మీరే దీనికి కారణమని నేను భావించుచున్నాను. ఈప్రేమ మీదయాఫలమని భావించుచున్నాను. మీరు తప్పితే వేఱే కృష్ణుండున్నాండని నేననుకొనను' అని పలుకుచు గదాధరుండు ప్రేమవిహ్వలుండై రోదనము చేయసాగెను

శుక్లాంబర బ్రహ్మచారియును గదాధరుని యీస్థితిని గాంచెను. అతని యంతఃకరణములో నుత్కట ప్రేమ ప్రాప్తేచ్ఛ యుత్పన్నమయ్యెను. అతండును గదాధరునివలెం దన్నుందాను మఱచి ప్రేమోన్మత్తుండు కావలెనని కోరుకొనుచుండెను. అతని హృదయమును ప్రేమాసవపానము చేయం గోరుచుండెను. మఱునాండాతండు భిక్షాచర్య కావించి వచ్చుచుండెను. దారిలో గంగకు పోవుచున్న ప్రభువు తటస్థపడెను. ప్రభువును జూడంగానే యావయోవృద్ధ బ్రహ్మచారి యాతని పాదములను బట్టుకొనెను. ప్రభువు సంకోచమును బ్రకటించుచు నిట్లనెను:- 'నేను నీపుత్రునివంటి వాండను. మీరు బాల్యమునుండియు నన్ను తండ్రివలె లాలనపాలన కావించి, యెత్తుకొని ప్రేమ పూర్వకముగం దిండి పెట్టితిరి. మీరిట్టి యనర్థమును గావించితిరేల? నాపైం బాపము నేల రుద్దెదరు?'

ప్రభుని యీ వాక్యములను విని కాతర భావముతో బ్రహ్మచారి యిట్లనెను:- 'ప్రభూ! ఇప్పుడు మమ్మ్మెలను మోసగింపవలదు. ఈ వ్యర్థుఁడు జీవితమును గడప గడప ముసలితనము దాఁపురమయ్యెను. ఈ శరీరము ననేకములగు కష్టములు పెట్టి కాశీ, కాంచీ, అవంతికా మొదలగు సమస్త పవిత్ర పురములను, పుణ్యతీర్థములను కాలినడకను యాత్ర చేసితిని. ఇంటింట మధుకరమును దెచ్చుకొని నా జీవితమును గడపితిని. ఇప్పుడు నాకు శ్రీకృష్ణప్రేమ కధికారిగాఁ జేయువలెను. ఇప్పుడేదో విధముగ ప్రభుప్రేమ ప్రాప్తించవలెను. ఇదియే పూజ్య పాదపద్మములకు వినీత ప్రార్థన.'

బ్రహ్మచారి వాక్యములను విని ప్రభువు కొంచెమైనను బలుకలేదు. బ్రహ్మచారి వైపు కాంచి మంద మంద భావముతో నిలుచుండి చిఱునవ్వు నవ్వుచుండెను. బ్రహ్మచారి ప్రభువువారి చిఱునవ్వు యొక్క అర్థమును గ్రహించెను. అతఁ డధీరుఁడై తనకుతానే యిట్లనెను:- 'ప్రభూ! నేను తీర్థయాత్రా వృత్తాంతమును చెప్పి నాయర్హతను సిద్ధము చేసికొనుటలేదు. నేను దీనభావముతో నిన్నొక్కనినే శరణువేఁడి ప్రేమయాచన చేయుచుంటిని. నాకు శ్రీకృష్ణప్రేమ ప్రదానము కావింపుఁడు.'

భావావేశములో ప్రభువు ముఖమునుండి 'పొమ్మ్మ, ఇచ్చితి నిచ్చితి'నను వాక్యములు వెలువడెను.

ఇది వినఁగానే బ్రహ్మచారి యంతయును మఱచి ప్రేమావేశములో నిండిపోయి పిచ్చివానివలె నృత్యము చేయ మొదలిడెను. ఆతఁడే నృత్యము చేయుచుఁజేయుచు నున్మత్తుని రీతి నోటఁబ్రలాపించుచున్నట్లుండెను. ప్రభు వాతని యీ విచిత్రదశను గాంచి ప్రేమచే గద్గదికుఁడై యాతని జోలెలో నుండి ధాన్యముతోఁ గలిసిన భిక్షా బియ్యమును గ్రహించి నమలఁదొడఁగెను. అది శ్రీకృష్ణుఁడు కుచేలుని యెడఁ బ్రేమ ప్రకటించుచు నతని యింటిలోని యటుకులను దినునట్లుండెను. ఇద్దరియొక్క యీ ప్రేమమయ వ్యవహారమును గాంచి దర్శకు లందఱును చకితులై మాటిమాటికిని ప్రభువుయొక్క ప్రేమ ప్రశంసచేయసాగిరి. శుక్లాంబర బ్రహ్మచారియును తాను కృతకృత్యుఁడైనట్లు భావించుకొని ప్రేమలో మునిఁగి తన కుటీరమునకు వెడలిపోయెను.

ఈ విధముగా భక్తుల హృదయములో ప్రభువునెడ నధికాధిక సమానభావము పెరుగ మొదలిడెను. ప్రభువును భక్తుల యెడల వెనుకటి వలె నధికాధిక ప్రేమను బ్రదర్శించుచుండెను. శ్రీవాసపండితుని యింటిలో సంకీర్తనారంభమైనది. మాఘమాసములో; కాని రెండు మూఁడు నెలల లోనే యీచర్చ నాల్గువైపులను వ్యాపించెను. చాలమంది దర్శనార్థులు సంకీర్తనను దర్శించవలెనను నుత్సాహముతో రాత్రులందు శ్రీవాస పండితుని యింటికి వచ్చుచుండిరి. కాని సంకీర్తన సమయమున నింటి తలుపులు వేయబడు

చూడెడివి. ఆ కారణమున నన్నిరకములవారు లోనికిఁ జోవ వీలులేకుండెను. చాలమంది నిరాశులై తిరిగిపోవలసివచ్చెడిది. సంకీర్తనలోనికి ప్రత్యేకపు భక్తులే లోపలికి పోవలెను ఆ సమయమున సంకీర్తనములో నిదే నియమము నిర్ధారింపఁ బడినది.



# ధీరభావము

శ్లో॥ నిందంతు నీతి నిపుణా యది వా స్తువంతు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేచ్ఛమ్ ।
అద్యైవ వా మరణమస్తు యుగాంతరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః ॥
భర్తృహరి. ౪ నీ. ౮౪.

(నీతి నిపుణులు నిందింతురుగాక, లేక స్తోత్రము చేయుదురుగాక! లక్ష్మి వచ్చుగాక లేక యథేష్టముగఁ బోవుఁగాక! నేఁడే మరణ మాసన్నమగుఁగాక యుగాంతము వఱకు జీవించుఁగాక! ధీరపురుషులు వీటిని వేనిని లెక్కచేయక వారు దేనిని ధర్మమని తలఁచి యేపనిని గ్రహింతురో యాన్యాయపథమునుండి యెంతటి విపత్తు వచ్చినప్పటికిని చలింపరు.)

నియమబంధ మందఱకు కటువుగ నుండును. జీవులందఱు నియమ బంధనమును వదలి స్వాధీనులు కాఁగోరుదురు. దీనికి కారణమేమనఁగా జీవులయొక్క యుత్పత్తి యానందము లేక ప్రేమ వలన నైనది; ప్రేమలో నేవిధమైన నియమము లేదు. జీవులకుఁ బ్రేమ పీయూష పిపాసయే యుండును. అందఱు నీ పరమప్రియమగు నమృతాభావమున నధీరులై తహతహలాడుచున్నట్లుండి సమస్త బంధనములను ఛిన్నభిన్నము కావించి దాని సమీపమునకుఁ బోఁగోరుదురు, కాని నియమ పాలనము కావించక దాని దగ్గఱకు చేరుట అసంభవము.

చైతన్య. 2—7

ప్రేమకు నాల్గు దిక్కులను నియమ పరిఖ త్రవ్వబడియున్నది. దానిని దాఁటక యెవఁడును ప్రేమ పీయూషము దగ్గఱకు చేరఁజాలఁడు. ప్రేమ నియమాతీతమైన దనుట నిజమే. దాని దగ్గఱ నియమము లేదు కాని యది నియమములేక ప్రాప్తించదు.

ఒక్కసారి యేదో విధముగ ప్రేమకు దూరమై కాని, లేక అది తనకు వేఱుగ నున్నదని గాని భావించినచో నియమ సహాయము లేనిది దానినిఁ బొందఁజాలఁడు. ప్రేమను బొందుటకు నియమ మొక్కటియే సాధనము. ప్రేమము పేరట నియమోల్లంఘనము కావించి విషయలోలుపతకు వశీభూతులై తమ యింద్రియములను దమతమ ప్రియ భోగములచేఁ దృప్తి చెందించువారు దంభులు. ప్రేమము పేరిట యింద్రియవాసనా సంతృప్తి చేయుటయే వారి చరమ లక్ష్యము. ప్రేమ కల్పతరువు. దానె నెవఁడే భావముతో నపాసించునో వానికా వస్తువు ప్రాప్తించును. ప్రేమము పేరిట మంచిమంచి పదార్థములను గోరిన వారి కవియే లభించును. ప్రేమము పేరిట సుందరవిషయ భోగములను గోరువారికి విషయభోగములు లభించును కాని ప్రేమము పేరిట ప్రేమనే కోరువారు వారి యెదుట త్రిలోకరాజ్యము వచ్చినప్పటికిని ప్రేమకొఱకు దానిని కాలితో తన్నివేయుదురు.

'స్వర్గము సుఖముల సంగతి యేల ? మోక్షమునుగూడ తిరస్కరింతు'మని చాలమంది చెప్పుట వింటిని, ఇవి యూరక

నవలసినదే కాని కష్టముల నితాయిని చూడఁగానే నోట నీరూర వారు స్వర్గసుఖముల నెట్లు తిరస్కరింపఁగలరు ? ఆ యజ్ఞానులు స్వర్గసుఖముల నేమి యెఱుఁగుదురు? చిరకాలము నియమ పాలనము చేయనివాని చిత్తము వాని వశమున నుండునా, వాఁడెన్నటికైనా ప్రేమి యగునా యను యూహ త్రికాలమందును చేయఁజాలము.

నియమ పాలనము చేయుట అందఱకు విసుగుదలయే, కాని ధీరులైనవారును, ప్రభుకృపాప్రసారము కలవారును మనస్సును జయించి, యిచ్ఛా విరుద్ధముగ నియమ పాలనము చేయువారును, నెమ్మది నెమ్మదిగా నియమ పాలనముచే వాని యందు దృఢత్వము, తత్పరత, నమ్రత, దీనత, సహన శీలత మొదలగు సద్వృత్తులలవడును. నియమములందు విసుగు చెంది వాటిని ఛిన్నాభిన్నము చేయఁదలఁచు వారికి మొదట నియమముల యెడల ద్వేషముత్పన్నమగును. ద్వేషము వలన నా నియమములకు విరుద్ధముగఁ బ్రచారముచేయ కోరిక జనించును ద్వేషబుద్ధి వలన నెవనికైన విరుద్ధముగఁ బ్రచారము కావించిన క్రోధముత్పన్నమగును. క్రోధము వలన వానికి విరుద్ధముగఁ బ్రచారము చేయుటలో నీచాతినీచ ఘృణితో పాయముల నుపయోగించుటకును వెఱవనంతటి యధికాధికా శక్తి దానిమీఁద గలుగును. ఆ దుష్కార్యముల వలననే వాని సర్వస్వము నాశమగును.

మహాప్రభువు వారి కీర్తనము తలుపులు మూఁత

వేయఁబడి యింటిలో జరుగుచుండెడిది. అనధికారులచేరికచే భావములలో సాంసారికతా సమావేశము కలుగకుండుటకై భక్తులందఱీ నియమమును బెట్టుకొనిరి. అందఱ హృదయములలో సంకీర్తనను జూడవలెనను నుత్సాహముత్పన్నమైనది. వారందఱకీ నియమ మప్రియముగ నుండెను. వారికి ప్రభువు వారి యీ నియమము వలన లోన మండుచుండెను. శ్రద్ధావంతులగువారు తమ మనస్సులోని మంటను అణఁగఁ ద్రొక్కుకొని ధైర్యముతోఁ బ్రతీక్ష చేసి కీర్తనాంతమున వారు కీర్తనలోఁ బ్రవేశమిప్పించుటకు నమ్రతా పూర్వకముగఁ బ్రార్థించిరి. వారి నధికారులుగ భావించి మఱుసటి దినమునుండి వారికి ప్రవేశమున కనుమతి లభించెడిది. వారానియమ ప్రభావముచే జీవితములో నుత్తరోత్తరోన్నతిని జెందుచు సద్వృత్తులు వృద్ధికాఁగా ప్రభు పాదపద్మములను జేరుకొనిరి. కాని యీ నియమకారణమున నామంట నాపుకొనఁ జాలనివారికి సంకీర్తన యెడల ద్వేష ముత్పన్నమయ్యెను. ద్వేష కారణమున వారు వైష్ణవులకు శత్రువులైరి. వారు సంకీర్తనకు విరుద్ధ ప్రచారము చేయ మొదలిడిరి. సంకీర్తనను భంగపఱుచుటకు వారు వివిధములగు చెడ్డ యుపాయములను బన్నసాగిరి. వారి క్రూరకర్మలద్వారా సంకీర్తన భంగముకాక పోవుటయేకాక విరోధకారణమున నది యధికాధిక వృద్ధిని జెందినది; కాని యీ దుష్టస్వభావులగువారు స్వయముగ నధోగతి కధికారులైరి. వారు శుభనియమముల యెడల

నసహిష్ణుతా భావమును ప్రదర్శించి తమకుందామే గోతిలోఁ బడిరి. ఈ విరోధుల కారణముననే సంకీర్తన దేశవ్యాపి తమైనది. ఈ విధముగ నీదుష్టుల విరోధముచేఁ గూడ మహాపురుషుల సత్కార్యములందు మిక్కిలి సహాయత లభించుచుండును. కాఁబట్టి సత్పురుషుల శుభకార్యములను దుష్టప్రకృతిగలవారెంతటి విరోధభావమును జూపినను, వారు భయపడరు సరిగదా యీ విరోధ కారణమున నింకను ద్విగుణితోత్సాహముతో నా కార్యమందుఁ బ్రవృత్తులగుదురు.

సంకీర్తన విరోధులు సంకీర్తనను భంగముచేయుటకు నానావిధములగు నుపాయములు చేసిరి. లోకులలో వారి యెడల దుర్భావము నుత్పన్నము కావించిరి. లోకులను సంకీర్తనకు విరుద్ధముగఁ బ్రేరేపించిరి. వారి ననేక విధముల నిందించిరి, కాని వారన్ని కార్యములందు నసఫలులైరి.

ఈ విధముగ మహాప్రభువు తన ప్రేమి భక్తులతోపాటు శ్రీకృష్ణ సంకీర్తనలో సర్వదా సంలగ్నులగు చుండిరి, కాని కొందఱు బహిర్ముఖవృత్తిగలవారలు సంకీర్తనకు విరోధులైరి. రాత్రియంతయు సంకీర్తన జరుగుచుండెడిది. భక్తగణము బిగ్గఱగా 'హరిబోల్' 'హరిబోల్' యను ధ్వనిని చేయుచుండిరి. ఇరుగు పొరుగు వారికి నిద్రాసుఖమునకు భంగము కలుగుటచే వివిధములగు భావములను కీర్తనకు విరుద్ధముగ వ్యాపింపఁజేయుచుండిరి. 'వీరందఱు పిచ్చివాండ్రైనారు. అందుకనియే రాత్రియంతయు నఱచుచుందురు. ఏమి చెప్పుదును.

వీరివలన నిద్రకూడ లేకుండ బోయినది.' అని యొకఁడును, అందఱొక్కచోటకు చేరినారు. జ్ఞాన, యోగ, జపతపాదులకు బుద్ధి యుండవలయును. పరిశ్రమ చేయవలెను. దీనికి చేసే దేమియులేదు, అఱచుటయే. అందువలననే అన్నిరకముల వారు చేరి అఱచుచుందు'రని కొందఱు ననుచుందురు.

ఇంతలోనే మఱియొకఁ డిట్లనెను :- 'దీని కంతకు మూలము శ్రీవాస వామనుఁడు. భిక్షము బాగుగా దొఱకు చున్నది. అడుగుకొని తినును. బాగుగా మత్తెక్కినది. నాలుగు రూకలు దగ్గఱ చేరినవి. ఆవేడివలన నూరక యఱచు చుండును. వీనికి తోడు పది పదిహేనుమంది బటాచోరులను పనికిమాలిన వారిని చేర్చుకొన్నాఁడు. వీరివలన ముందు ముందు మనకు నాశము కలుగును.'

ఇంతలోనే మఱియొకఁ డిట్లనెను:- 'రాజుగారిని రెండు నావలు కీర్తన చేయువారినందఱను బంధించి తీసికొని పోవుటకు వచ్చుచున్నారఁట. దానికి తోడుగా నొక కొంత సైన్యము కూడ వచ్చునట. ఆ సైన్యము శ్రీవాసుని యింటినిఁ బగులఁ గొట్టి గంగలోఁ బారవేయుదురఁట. కీర్తన చేయువారిని బట్టు కొనిపోవుదురని నేనీనాఁడే విన్నాను.'

ఇది విని భయభీతహృదయులై కొందఱు 'అన్నా, దీనిలో మనదోష మేమియులేదు. మనము కీర్తనకు పోవుట లేదని స్పష్టముగ చెప్పుదుము. ఫలాని ఫలాని వారు తలుపులు

వేసికొని లోపల నేమి చేయుచున్నారో మాకు తెలియ' దని పలుకసాగిరి.

'సేన వచ్చుటకు ముందే కాజీ దగ్గఱకుపోయి కీర్తనాభియోగమును జేసి, మాకీ వేదవిరుద్ధ అశాస్త్రీయకార్యమందు బొత్తుగా సమ్మతి లేదని తెలియఁజేసి వత్తము. వీరు స్త్రీలను గూడ వెంటతీసికొనిపోయి యేమి చేయుచున్నారో తెలియదు! వీరందఱు వామమార్గ పద్ధతిని పంచమకారోపాసన (మద్యము, మాంసము, మత్స్యము, మైథునము, మంత్రము) చేయుచున్నట్లు తోఁచుచున్నది. పైకి అందఱకు వినఁబడునట్లు బిగ్గఱగ శ్రీకృష్ణ కీర్తన చేయుచున్నారు. లోపల మాంసము, మదిరా, మత్స్యము, మైథునము మొదలగు వామమార్గసాధనలను ప్రయోగించుచున్నారు. ముందుగనే కాజీకి చెప్పుట మంచిదిగఁ దోఁచుచున్నది.' అని కొందఱభిప్రాయపడిరి. ఇది యందఱకు నచ్చినది. కొందఱు నవద్వీపములోని కాజీదగ్గఱకు పోయి సంకీర్తనను గుఱించి యభియోగమునను గావించిరి. అంతయు విని కాజీ యిట్లనెను:- 'మీరీ విషయమై చింతపడకుఁడు. నేనీ కీర్తనమును బందు కావించెదను.' ఈ ప్రత్యుత్తరమును విని యభియోగమును దెచ్చినవారు సంతోషముగ వారివారి గృహములకు బోయిరి.

ఇట నిప్పుడు సంకీర్తన విషయమున నానావిధములగు వదంతులు బయలు దేరెను. ఒక్కొక్కఁ డిట్లనుచుండెను:- 'వీరు బిగ్గఱబిగ్గఱగా నఱచుటచే భగవంతునకును గోపము

వచ్చినది. దీనికి పరిణామముగ దేశమునందు దుర్భిక్షము కలుగఁగలదు.' ఒకొక్కఁడు వానిమాటను న్రమతా పూర్వకముగ ఖండన చేయుచు నిట్లనుచుండెను:- 'భగవంతునకును గోపము వచ్చిన దనుట సరియైన మాటకాదు. అతఁడు ఘటఘట వ్యాపియగు నంతర్యామి. అందఱ భావములు తెలియఁగలఁడు. అన్నియు సహింపఁగలఁడు; కాని వీరు నెమ్మదినెమ్మదిగ నామస్మరణము చేసిన దీనివలనఁ బుణ్యము రాదా యేమి ? తెల్లవారులు 'హాహా హూహూ' అని అఱచినచో నేమి లాభము ?'.

ఆ సమయముననే వేఱొకఁడు తనలోని మంటనాపుకొనుటకు ద్వేషబుద్ధితో ఇఁక రెండు మూఁడు దినములలో వీరికి వారి భక్తి, సంకీర్తనములలోని రుచి తెలియఁగలదు. ఇది శ్రీవాసునకు క్షేమము కాదు.' అనిరి.

ఈ విషయము లన్నియు శ్రీవాస పండితుఁడు కూడ వినును. ప్రతిదినము వినుచుండుటచే వాని మనస్సులో కూడ కొంచెము కొంచెము భయముత్పన్నము కాసాగెను. వారు 'గౌడ దేశపురాజు హిందువు కాదు. హిందూధర్మమునకు యవనుఁడు విరోధి. వాఁడిట్లు చేసినచో నం దాశ్చర్యమేమియు లేదు. మన హిందూసోదరులే చాలమంది సంకీర్తనకు విరుద్ధముగ కాజీ దగ్గఱకు వెళ్ళి మొఱపెట్టుకొని వచ్చిరి. ఇట్టి స్థితిలో మనల నందఱ వివిధములగు కష్టములు పెట్టవచ్చు' ననుకొను చుండిరి.

ప్రజల నోట యిట్టి మాటలు విని కొందఱనూయకపు భక్తులు కొందఱు మిక్కిలి భయపడిరి. వారు శ్రీవాస పండితుని దగ్గఱకు వచ్చి యిప్పుడేమి చేయవలెనని పరస్పర మాలోచింప మొదలిడిరి. కొందఱు భయభీతులై యిదియే నిజమగుచో మనము దేశత్యాగము కావించి వెళ్ళవలెననియు ననుకొనుచుండిరి. ఈ మాటలన్నియు విని శ్రీవాస పండితుఁడు 'సోదరులారా, ఎట్లు జరుగనున్నది అట్లు జరుగఁగలదు ? శ్రీ నృసింహ భగవంతుఁడు మనకు మేలే చేయఁగలఁడు. మనము శ్రీకృష్ణకీర్తనమే చేయుదుము. చూతము వచ్చిన కష్టమును సహింతము' అనెను. శ్రీవాస పండితుఁ డీవిధముగ నోదార్చెను గాని వారి మనములలో భయమట్లే యుండెను. అయినప్పటికిని యాతఁడు తన మనోగత భావములను ప్రభు సమ్ముఖమునఁ బ్రకటించలేదు. ప్రభు వందఱ భావములను గ్రహింపఁగలఁడు. ఈ యవన రాజు వలనఁ గొందఱు భయభీతులైనట్లు అతఁడందఱ భావములను గ్రహించెను. అందు వలన నితఁడు వారిని నిర్భయులఁ గావించవలయును.

ఒక దినమునఁ బ్రభువు తన శరీరమంతటను సుగంధిత చందనమును బూసికొని, యుంగరములవలె నుండు నల్లని సుందర యతిసీలాకములందు సుగంధతైలమును రాచుకొనెను. ఖరీదు గల శెల్లని, యులిపిరి వస్త్రమును ధరించి, వెంట నిద్దరు ముగ్గురను భక్తులను గొని గంగాతీరము వైపునకు పోవు చుండెను ! ఆతని యరుణాధరము తాంబూల చర్వణముచే

నత్యధికాయణమయ్యెను. నేత్రములనుండి ప్రసన్నతా ప్రకాశము వచ్చుచుండెను. ముఖకమలము శరత్పూర్ణిమా చంద్రబింబము వలె వికసించియుండెను. అతఁడు మందహాసముచే భక్తుల యానందమును బెంచుచు గంగాఘట్టముపై నటునిటు పచారు చేయుచుండెను. సాత్త్విక ప్రకృతి గల భగవద్భక్తులు ప్రభువు వారి యద్భుత రూపలావణ్యమును గాంచి లోలోనఁ బ. ము ప్రసన్నులగు చుండిరి; కాని బహిర్ముఖవృత్తి గల నిందక పురుషులు పరస్పరము వివిధములగు నాలోచనా ప్రత్యాలోచనలు చేయ మొదలిడిరి. 'ఈ నిమాయి పండితుఁడు కూడ యొక విలక్షణవ్యక్తిగాఁ దోఁచుచున్నాఁడు. ఇతనికిఁ గొంచెమైన భయము లేదు. ఇతని శరీరమంతయు విష మే. రేపు పట్టుకొనుటకు సేనవచ్చును. మునుముందుగా నిమాయి పండితునే బంధించి నావనెక్కింతురు. ఇదంతయు వినియు నతఁడు రాజపుత్రుని వలె శృంగారించుకొని నవ్వుచుఁ దిరుగు చున్నాఁడు. వీని వైఖరిలో సిగ్గుకూడ తోఁచదు. చాల విచిత్ర పురుషుఁడు!' అని పరస్పరమనుకొను చుండిరి.

'ఓయీ, అన్నియు' వట్టి మాటలే. సేనయురాదు; నావయురాదు. అన్నియు శుద్ధ అబద్ధము' లని కొందఱను చుండిరి.

ఇంకొకఁడు దీనిని దీవ్రముగ ఖండించుచు నిట్లనెను:— 'బలేబాగున్నదండీ! మీారబద్ధ మనుకొను చున్నారు. నిన్న కాజీ సాహెబు స్వయముగఁ జెప్పినాఁడు. 'ముంజేతి కంకణాముున కద్దమేల? రేపు మీారు ప్రత్యక్షముగఁ జూడఁగలరు.'

ఈ విధముగ వివిధములుగ తమతమ యూహాలను ప్రకటింప మొదలిడిరి. మహాప్రభువు భక్తులతో నానందముగ విహరించు చుండెను. ఇంతలోనే ప్రభువువారికి పూర్వపు పరిచిత పండితుఁడు గంగలో సంధ్యవార్చుచుఁ గలిసెను. ప్రభువును జూచి యితఁడు ప్రణామము కావించెను. తర్వాత పరస్పరము సంభాషణసాగెను. మాటలలో పండితుఁ డిట్లనెను:- 'సోదరా! విన్నావా? నిన్నుఁ బట్టుకొనుటకు రాజుగారి దగ్గఱనుండి సేనవచ్చుచున్నదఁట. పట్టణమందంతటను దీనిని గూర్చి యిట్లుడికి నల్లుకుచున్నది. ఇదియే నిజమగుచో నీవు కొన్ని దినముల వఱకు నవద్వీపమును వదలి యింకొక చోటునకు పొమ్ము. రాజు విరోధము మంచిది కాదు. అదియును గాక రాజు మనకు మతవిరోధియును. నాయుద్దేశ్యము మాత్రము నీవీ సమయమున పాఱిపోవుటయే మంచిదని, తర్వాత నీయిష్టము.'

ప్రభువు ఉపేక్షా భావముతో నిట్లనెను :- 'అయ్యా, ఏమి జరుగ నున్నదో అది జరుగనిండు. ఇప్పుడు గౌడదేశము వదలి యెక్కడికి పోవుదును? మఱియొక చోటునకుబోయిన బాదుషా నన్నుఁబట్టుకొని తీసికొనిరాలేఁడా? దీనికంటె నిక్కడే మంచివారున్నారు. ఏ దుఃఖము కలిగినను సహించి తీరెదము. శుభకర్మలకీ సమయమునఁ బరీక్ష దుఃఖములే ధర్మమునకు గీటురాయి. దినితో శ్రేష్ఠులెందఱో తేలఁగలరు.' ఇదివిని పండితుఁ డూరకుండెను. ప్రభువు శ్రీవాసపండితుని యింటి వైపునకు జోయెను.



# శ్రీ నృసింహావేశము

శ్లో॥ కిం కిం సింహస్తతః కిం నరసదృశ
వపుర్దేవ చిత్రం గృహీతో
నైతాదృక్ క్వాపి జీవోఽద్భుతముపనయ
మే దేవ సంప్రాప్త ఏషః ।
చాసం చాపం న చాపీత్య హాహాహాహాహో
కర్కశత్వం నఖానాం
ఇత్థం దైత్యేంద్ర వక్షః ఖరనఖముఖరైర్జ
ఘ్నివాన్ యః స నోఽవ్యాత్ ॥

సు. ర. భాం. ౨౦-౨౫.

(హిరణ్యకశిపుఁడు తన సేవకునితో 'ఏమది? ఏమది?' అని అడిగెను. సేవకులు 'ప్రభూ! సింహ' మనిరి. అంత నతఁడు 'సింహమైన కానిండు' అనెను. అంత సేవకులు 'ప్రభూ! దాని శరీరము మనుష్యుని శరీరమువలె నున్నది. ఇదియే మహాదాశ్చర్య' మనిరి. అంత హిరణ్యకశిపుఁడు 'ఇట్టి యద్భుత జీవము నెన్నడును చూడలేదు. మంచిది, దానిని నాదగ్గఱకు తీసికొనిరండ' నెను. త్వరగా సేవకులు 'ప్రభూ! చూడుఁడు. అది రానే వచ్చినది' అనిరి. హిరణ్యకశిపుఁడు ధనుస్సు నడుగుచు 'ధనుస్సు, ధనుస్సు' అనెను. నౌకరుల బుద్ధి భ్రష్టము కాఁగా నిట్లనిరి:- 'దానిదగ్గఱ ధనుస్సు లేదు, ఓహో! ఓహో! దానికి కర్కశ నఖములు కలవు' వీరిట్లు చెప్పుచుండఁగనే

నృసింహ భగవానుఁడు తన తీక్ష్ణ నఖములచే దైత్యేంద్రుఁడైన హిరణ్యకశిపుని వక్షఃస్థలమును జీల్చివైచెను. అట్టి నృసింహ భగవానుఁడు మమ్ముల రక్షించుఁగాక !)

శ్రీవాస పండితుఁడు నృసింహోపాసకుఁడు ఆతఁడు తన పూజా గృహములోఁ గూర్చుండి భక్తిభావముతో నృసింహ భగవానుని విధ్యుక్తముగఁ బూజించుచుండెను. ఇంతలో యతనికి తనయింటి వాఁకిలి దగ్గఱ గొప్పధ్వని వినిపించెను. ఆధ్వని వాఁకిలిని గట్టిగఁ దట్టుచున్నట్లుండెను. శ్రీవాసుని ధ్యానము భంగమయ్యెను. వాఁకిలి నింత గట్టిగ తట్టుచున్న వారెవరా యని యతఁడు భయపడెను. 'ఎవరువా' రని ఆతఁడడిగెను. 'నీ వెవరిని గూర్చి పూజించుచున్నావో, యింతవఱకు నీకెవరిన ప్రత్యక్షముగ నున్నాఁడని పూజించుచున్నావో వానిని ప్రత్యక్షముగఁ గాంచుము' అని బయటనుండి శబ్దము వినఁబడెను. ఇది విని శ్రీవాస పండితుఁడు కొంచెము సంకోచపడుచు, భయముతో వాఁకిలిని దెఱచెను. ఇంతలోనే యద్భుత రూపలావణ్యయుక్తుఁడగు శచీనందనుఁడగు శ్రీవిశ్వంభరుఁడు నిర్భయభావముతో పూజా గృహమునను వెడలుచుండుటను గాంచెను. ఆతఁడు పోయి పూజాసింహాసనముపై గూర్చుండెను. సాక్షాత్తు విష్ణుమూర్తి విశ్వంభరుని రూపమున నాల్గు చేతులలో శంఖ, చక్ర, గదా, పద్మములు శోభించుచున్నట్లు ప్రత్యక్షమైనట్లు శ్రీవాస పండితునకుఁ దోఁచెను. కంఠమందు వైజయంతీమాల శోభించు

చుండెను. ఒక గొప్ప మత్త సింహమువలె మాటిమాటికి హుంకరించుచుండెను. శ్రీవాసుఁడు ప్రభుని యిట్టి భయంకర రూపమును గాంచి భయభీతుఁడై నట్లుండెను.

భగవంతుని సింహాసనముపైఁ గూర్చుండియే ప్రభువు ఘోరగంభీర స్వరమున సింహమువలె గర్జించుచు నిట్లనెను:— 'శ్రీవాసా ఇంత వఱకు నీవు నన్ను గుర్తించలేదు. అద్వైతాచార్యుఁడు నన్నుఁ బరీక్ష చేయుటకై శాంతిపురమునకు వెళ్ళిపోయెను. నీవేవిధమైన భయమును బడవలదు. నేనొక్కొక్క దుష్టుని వినాశము కావింతును, భక్తులకు కష్టము కలిగించు దుష్టుఁడెవఁడును నాముందు తప్పించుకొని పోలేఁడు. నీవు గాబరాపడవలదు. శాంత చిత్తముతో నన్ను స్తుతించుము.' ప్రభువీ ప్రకారమాశ్వాసించిన తర్వాత శ్రీవాస పండితుఁడు కొంచెము సేపు తర్వాతఁ బ్రేమ విహ్వలుఁడై గద్గద కంఠముతో స్తుతి చేయ మొదలిడెను—

శ్లో॥ నౌమీడ్య తేఽభ్ర వపుషే తడిదంబరాయ
గుంజావతంస పరిపిచ్ఛల సన్ముఖాయ ।
వన్యస్రజే కవలవేత్ర విషాణవేణు
లక్ష్మశ్రియే మృదుపదే పశుపాంగజాయ ॥

శ్రీమద్భా ౧౦-౧౪-౧.

(భక్తభయహారియగు భగవంతుఁడా! నీవు ప్రసన్నుఁడవగుము. నేను నీస్తుతి చేయుచున్నాను. నీ మేఘశ్యామల

శరీరమందు మెఱపుతీఁగవలె మెఱయుచున్న పీతాంబరము శోభాయమానముగనున్నది. గురువింద పేరుల చేతను, మయూర ముకుటము చేతను నీ శ్రీముఖము దేదీప్యమానముగ నున్నది. కంఠములో వనమాల విరాజిల్లు చున్నది. ఒక చేతిలో పెరుగు అన్నపుముద్ద గ్రహించుటచేతను, నితర స్థలములలో కఱ్ఱ, మురళీవీటిచే నీశోభ యత్యంతము పెరిగినది. నీ చరణయుగ ళము లత్యంత కోమలములు నందుని నీవు తండ్రిగాఁ బిలిచె దవు. ఇట్టి నీకొఱకు కేవలము నీప్రాప్తి కొఱకు ప్రణామము చేయుచున్నాను.

ఈ శ్లోకమును జదివిన తర్వాత నతఁడు దీనభావముతో 'విశ్వంభరునకు జయము కలుగుఁగాక! విశ్వరూపాగ్రజునకు జయము కలుగుఁగాక! శచీనందనునకు జయమగుఁగాక! జగన్నాథ ప్రియునకు జయమగుఁగాక! గౌరసుందరునకు జయమగుఁగాక! మదనమోహనునకు జయమగుఁగాక! నృసింహరూపధారియగు భగవానునకు జయమగుఁగాక! భక్తభయహారియగు భగవానునకు జయమగుఁగాక! భక్త భయభంజన ప్రభువునకు జయమగుఁగాక!'

'ఇన్ని దినముల నుండి నేనజ్ఞానాంధకారముతో నిటు నటుఁ తిరుగుచున్నాను. నేఁడు గురురూపమున ప్రభువగు నీదర్శనమైనది. నేఁడు నీ స్వస్వరూపమును బ్రకటము కావించి నాబోటి పామరుని పరమ పావనము కావించితిరి. నీవే

బ్రహ్మవు, నీవే విష్ణుఁడవు, నీవే శివుఁడవు, సృష్టికాది కారణము నీవే. నీకుజయమగుఁగాక !'

శ్రీవాసుఁ డీ విధముగ స్తోత్రము చేసినమీఁదట ప్రభు విట్లనెను:- 'నీవు నీ సమస్త పరివారముతో నా పూజచేసి మనోవాంఛిత వరదానము నడుగుము.' ప్రభు నాజ్ఞను శిరసావహించి శ్రీవాసపండితుఁడు తన యింటిలోని సమస్త స్త్రీలను, బాలబాలికలను, దాసదాసీజనమును కూర్చి, యందఱును గలిసి యుల్లాసముతో ప్రభువు పూజచేయుట కుద్యుక్తులైరి. ఈతఁడు తన స్నేహితుఁడగు పండిత జగన్నాథ మిశ్రుని చిన్న కుమారుఁడనియు, నతఁడు తనవడిలో నాడింపఁబడినాఁడనియు, తనను సర్వదా తండ్రివలె గౌరవించు వాఁడనియు పితృతుల్యుఁడగు శ్రీవాసపండితుఁడు బొత్తుగ మఱచెను. ఆ సమయమున సాక్షాత్తు నృసింహ భగవానుఁడే ప్రకటమైనట్లు పూర్ణ భావము కలిగెను. అందువలన విష్ణు పూజకని తెచ్చిన సామగ్రినంతను ప్రభుపూజలో వినియోగించెను. శ్రీవాసుని యింటిలోని స్త్రీలు తమ స్వహస్తములతోఁ బ్రభువువారి మెడయందు పూలమాల లలంకరించిరి. ఆతని శిరస్సున పూలుంచి సాష్టాంగ ప్రణామము కావించిరి. ప్రభువును వారి శిరస్సునఁ బాదముంచి 'మీకందఱకు నాయందు భక్తి కలుగుఁగాక !' యని యాశీర్వదించెను. ఈ విధముగ నందఱు భక్తి భావముతోఁ బ్రభువును బూజించిరి.

తర్వాత బిగ్గఱగ హుంకారము కావించుచుఁ బ్రభువు గంభీరస్వరమున నిట్లనెను:– 'శ్రీవాసా! నీవు చింతిల్లవలదు. నీ వనన్య భావముతో మదీయ స్మరణ కీర్తనములను జేయు చున్నావు. ఇంక భయపడనేల? మనకు విరుద్ధముగఁ జేయ బాదుషా కేమి శక్తి కలదు? వైష్ణవులను బంధించుటకు నావ వచ్చునెడల నందఱకంటె మొట్టమొదట నేనే నావనెక్కి— కీర్తన నాపుటకేల యాజ్ఞ యిచ్చితివని యడిగెదను. ఒకవేళ కాజీ మాటల వలన నిట్లు నీవు చేసియున్నయెడల, నతని నిక్కడకు బిలిపించుఁడు. ఆతని శాస్త్రవిశ్వాసానుసారముగ ప్రార్థన చేసి యందఱచే 'అల్లాహ్' లేక 'ఖుదా' యనిపించు మనుఁడు. లేదా మేము హిందూయవనపశు పక్షులచేఁగూడ కృష్ణకృష్ణ యనిపింతుము. ఈ విధముగ నన్ని జీవులచే నోట శ్రీకృష్ణ కీర్తనము కావించి సంకీర్తన మహాత్మ్యమును బ్రకాశింపఁజేయుదుము. చివరకు యవనులచేఁగూడ కృష్ణ యని పింతుము. ఇంత నచ్చ చెప్పినను ఆతఁడు వినకున్న నతనిని సంహరింతును. నీ వేమియు చింతింపవలదు. నిర్భయముగ నుండుము. ఇదంతయు నెట్లు జరుగునో నీ కిప్పుడే చెప్పుదును.' ఇట్లు పలికి ప్రభువు శ్రీవాస పండితుని యన్న కూఁతురును తన దగ్గఱకు బిలిచెను. ఆమె పేరు నారాయణి. ఆమె వయస్సు దగ్గఱ దగ్గఱగ నాల్గు సంవత్సరము లుండును. ప్రభు వామెను తన దగ్గఱకు పిలిచి యిట్లనెను:–'అమ్మాయీ!

నారాయణీ! నీవు శ్రీకృష్ణప్రేమలో నున్మత్తురాలవై రోదనము కావింపుము' ఇది విను నప్పటికా నాల్గు వర్షముల బాలిక శ్రీకృష్ణప్రేమలో మూర్ఛితయై క్రిందపడి, బిగ్గఱగ 'హా కృష్ణ! హా కృష్ణ!!' యని పలికి రోదనము చేయ మొదలిడెను. ఆమె యీ రోదనమును విని స్త్రీ పురుషు లందఱు నాశ్చర్య సాగరములో మునుఁకలు వైచిరి; అందఱ కండ్లనుండి యశ్రువులు ప్రవహించెను.

ప్రభువు నవ్వుచు నవ్వుచు నిట్లనెను:- 'ఈ విధముగ నేను అందఱచే శ్రీకృష్ణ కీర్తనము జేయింతును.' ఈవిధముగ శ్రీవాసు నాశ్వాసించి ప్రభువు మూర్ఛితుఁడై నేలపై పడి, చాల సేఁపటికి స్పృహాలోనికి వచ్చెను. స్పృహాలోనికి వచ్చిన తర్వాత నతఁడాశ్చర్యముతో నిటునటుఁ జూచుచు నిట్లనెను:- 'పండితవర్యా! నేనిచ్చటికి కెట్లు వచ్చితిని? నేనేమియుఁ జాపల్యమును జూపలేదుగదా! మీరు నా పితృసమానులు. నా యపరాధముల నన్నిటిని మీ రెప్పుడును క్షమించుచునే యున్నారు. నావలన నేమైన చాపల్యము కలిగిన క్షమించుఁడు. నేనిక్కడ కెట్లు వచ్చితినో, నేనేమేమి పలికితినో నాకేమియుఁ దెలియదు.'

ప్రభు వీరీతిగా సమాయకపు పలుకులు పలుకుట విని శ్రీవాస పండితుఁడు వినీత భావముతో నిట్లనెను:- 'ప్రభూ! నన్ను చిరకాలము నుండియు భ్రమ పెట్టితిరి. ఇంక భ్రమ

పెట్ట వలదు. ఇప్పుడిఁక నన్ను మోసగింప వలదు. ఇప్పుడు నాకు మీ సత్స్వరూపము తెలియవచ్చినది. నాకు మీ చరణములందిట్టే యనురాగమే కలుగునట్లాశీర్వదింపుఁడు' శ్రీవాసుఁ డిట్లనఁగాఁ బ్రభువు లోలోనఁ బ్రసన్నుఁడై కొంచెము లజ్జించుచు స్వగృహమునకుఁ బోయెను.



# శ్రీ వారాహావేశము

శ్లో॥ నమస్తస్మై వరాహాయ హేలయోద్ధరతే మహీమ్ ।
ఖురమధ్యగతో యస్య మేరుః ఖరఖురాయతే ॥

సు. రా: భా౦. ౧౯-౨౩.

(పాతాళమునఁబడిపోయిన భూమిని నూరక నుద్ధరించిన వాఁడును, తనయొక్క గిట్టలదెబ్బలచే మేరుపర్వతమును గూడ ఖుర ఖుర శబ్దమగునట్లు చేసిన యావరాహమూర్తికి నమస్కారము చేయుచున్నాను.)

ఒక యన్య శరీరమునుండి మఱియొక శరీరమునకు కొంత కాలము ఆవేశము కలుగుటకు 'ఆవేశము' అనిపేరు. సాధారణముగ లోకములో స్త్రీ పురుషులపై భూత, ప్రేత, పిశాచ, యక్ష, రాక్షస, దేవదానవాది యావేశములు వచ్చుచుండుటను గాంచుచునే యున్నాము. ఎవరెట్టివారో వారికట్టి యావేశములే వచ్చుచుండును. దేవతావేశములు సాత్త్వికులకు కలుగును. యక్షరాక్షసుల ఆవేశము రాజసప్రకృతి శరీరములందు వ్యక్తమగును. ఘోరతామస ప్రకృతి గలవారి శరీరములందు భూతపిశాచావేశములు ఆవేశమగును. అందఱి శరీరములో నావేశము రావలెనను నియమము లేదు, ఒక్కొక్కప్పుడు కొందఱి శరీరముల యందు మాత్రమే ఆవేశము వచ్చుట కనఁబడుచున్నది. అది యెందుకు వచ్చునో, యెట్లు వచ్చునో దీనికొక నిశ్చిత నియమము లేదు. దేవుఁడుగాని

దానవుఁడుగాని భూతపిశాచాదులు గాని యే శరీరము వాటి కనుకూలముగ నుండునో దానిలోఁ బ్రవేశించి యది తన భావములను వ్యక్తము కావించును.

ఇదిగాక భగవంతునికి కలావతారము, అంశావతారము మొదలగు అవతారములలో నావేశావతారము కూడ నొకటి యున్నది. ఏదో ఒక మహాత్కార్యము కొఱకు ఏదో యొక శరీరమున భగవంతుఁడావేశించి, యాకార్యము పూర్తి కాఁగానే వెంటనే యా యావేశము పోవును. భగవంతుఁడు 'కర్తుమకర్తుమన్యథాకర్తుమ్' అన్నియుఁ జేయుటకు సమర్థుఁడు. ఆయన యిచ్ఛా మాత్రము చేతనే గొప్పగొప్ప దుష్టుల సంహారము కాఁగలదు. కాని భక్తుల ప్రేమ కధీనుఁడై యాయన తన యసీమ కృపామహాత్త్వమును బ్రకటించుటకును, తన లీలలను బ్రకటించుటకును వివిధములగు నవతారముల నభినయించును. వాస్తవముగ నతఁడు నామరూపగుణ రహితుఁడు.

పూర్వము పరశురాముని యందు దుష్టక్షత్రియుల యత్యాచారములచేఁ బీడితమైన భూమిని రక్షించుటకు భగవంతుఁడావేశముచెంది, పృథివి దుష్టక్షత్రియ రహితమైన తర్వాత మఱల నదృశ్యముకాఁగా తర్వాత నాయన శుద్ధ ఋషియై నేఁటివఱకు మహేంద్రపర్వతము మీఁద తపస్సు చేయుచున్నాఁడు గదా! ఈవిధముగ నావేశావతారమేదో ఒక విశేషకార్యమును సాధించుటకు వచ్చును. అది చాల

దినముల నలఱకుండను. ద్రౌపది యొక్క చీరల నొలుచు నప్పు డతఁడు చీరావతారమును ధరించి మానము కాపాడి క్షణములో నదృశ్యమై పోయెను.

ఈ విధముగ నిప్పుడును ప్రభు శరీరమందు వివిధములగు నవతారముల యావేశము కలుగుచుండెను. ఏ యావేశము చెందినపుడా యాయవతారముల గుణముల ననుసరించి వర్తించు చుండును. ఆ యావేశము పూర్తి కాఁగానే యాతఁడొక యమానియగు భక్తునిరీతి మిక్కిలి దీనతాభావమును జెందును. భక్తుల పదరజమును తన శిరస్సున ధరించి, యధీరుఁడై యందఱను 'నాకు శ్రీకృష్ణ ప్రేమప్రాప్తి యెప్పుడు కలుగును? నాకు మీరందఱు శ్రీకృష్ణ ప్రాప్త్యుపాయమును దెలుపుఁడు. నేను నా ప్రియమైన శ్రీకృష్ణు నెట్లు పొందుదును?' అని యడుగును. ఈ రీతిగా నితని జీవనములో రెండు భిన్న భిన్న భావములు తోచుచుండెను. భావావేశములో భగవద్భావము, సాధారణముగ భక్త భావము. ఈతని కంతరంగ భక్తులైన వారు సర్వకాలసర్వావస్థలం దీతని యందు భగవద్భావము నుంచుచుండిరి. ఈతఁడెంత దీనత్వమును బ్రకటించినను వారి భావములో మార్పువచ్చుటలేదు. కాని సాధారణు లిది యేమి యను సందేహములో పడి పోవుచుందురు. 'ఈతఁడు సాక్షాత్తుగ శ్రీకృష్ణుఁ'డని యొకఁడును, 'ఏదో దేవీ దేవతా వేశము వచ్చుచున్నట్లున్న'దని వేఱొకఁడును బలుక సాగిరి. కొందఱీతనికి దాంత్రిక సిదులు కలవనుచుండిరి, ప్రభు శరీర

మున కొన్ని శ్రీకృష్ణలీలలును యుదయించినట్లు భక్తులు గాంచిరి. ఒక్కొక్కప్పుడీతఁడక్రూర లీలలు చేయును. ఒక్కొక్కప్పుడీతఁడు గోపికా విరహమున రోదనము చేయ నారంభించును.

మురారి గుప్త వరాహ భగవానుని యుపాసకుఁడు. ఒక దినమున మురారిగుప్త వరాహ భగవానుని గూర్చి స్తోత్రము చేయుచుండెను. ప్రభువు దూరము నుండియే స్తోత్ర పాఠమును విని వరాహము వలె బిగ్గఱగ గర్జనము చేసి 'శూకరము – శూకరము' అని పలుకుచు మురారిగుప్త యింటివైపునకు బోయెను. ఆ సమయమున నీతని ప్రకృతిలో వరాహావతారగుణములన్నిటిని మురారిగుప్త కాంచెను. ప్రభువు రెండు చేతులను నేలపై నిడి చేతులు కాళ్ళతో వరాహమువలె నడువ మొదలిడెను. దారిలో నొక పెద్ద యిత్తడిది జలముతో నిండిన కలశముండెను. ప్రభువు దానిని తన దంతములతో నెత్తి వేఱొకవైపునకు విసరి పారవైచి, యతఁడు సరిగా గుప్తమహాశయుని పూజాగృహమునకు పోయెను. అక్కడికి పోయి యాతఁడాసనముపైఁ గూర్చుండి మురారి గుప్తతో 'మురారీ! నీవు నన్ను స్తుతించుము' అని పలికెను.

మురారి చేతులు జోడించుకొని అతి దీనభావముతో నిట్లు పలికెను – 'ప్రభూ! నీ మహిమము వేదాతీతము. వేద శాస్త్రములు నీ మహిమమును బూర్ణముగ నెఱుఁగఁజాలవు.

శ్రుతులు నిన్ను 'నేతి' 'నేతి' (ఇదికాదు, ఇదికాదు) అని చెప్పినవి. నీవంతర్యామివి. సహస్రముఖములతో, ద్విసహస్ర జిహ్వలతో నాదిశేషుండు నిరంతర మహర్నిశలు నీగుణము లను ప్రళయము వఱకు స్తుతించినను నీగుణముల నన్నిటిని స్తుతించలేడు. అట్టియెడ నజ్ఞుండనగు నేను నీస్తుతి నెట్లు చేయఁగలను?

ప్రభువప్డు గంభీర స్వరముతో 'మురారీ! నీవు భయ పడవలసిన పనిలేదు. నా సంకీర్తనకు విఘ్నము కలిగించు దుష్టుని వాఁడెవఁడైనఁ గానింక సంహరించెదను. నీవు నిర్భ యుఁడ వగుము. నామ సంకీర్తనద్వారా నేను జగదుద్ధార కార్యము నొనర్చెదను.' అని పలుకుచుఁ బ్రభువు చేతన రహితుఁడై మూర్ఛితుఁడై క్రిందపడెను కొంచెము సేపటికి ప్రభువు ప్రకృతిస్థుఁడై మురారితో మఱల నప్డే యధీరపు పలుకులు పలుకుచుండెను మురారి గుప్త కీతని ప్రభావ మిదివఱకే తెలియును. అందువలన నతని భావములో నేవిధ మైన పరివర్తనము గలుగలేదు. ప్రభు లీవిధముగ మురారిని తన దర్శనముచేఁ గృతార్థుని కావించి యింటికి వెడలిపోయెను. ఈ విధముగ భక్తుల ననేక భావములచేతను లీలలచేతను ఆనందింపఁజేయుచుఁ బ్రభువు సర్వదా అందఱ నానందితులను, సుఖులను గావించుచు శ్రీకృష్ణ కీర్తనములో సంలగ్నులఁ గావించుచుండెను.

ఒక దినమున సంకీర్తన చేయుచు చేయుచుఁ బ్రభువు మధ్యలో నిట్లనెను:- 'నదియా ఇప్పుడొక మహాపురుషుఁడు రాఁబోవుచున్నాఁడు. ఆతని వలన నవద్వీపములో నింటింటను మూలమూలలను శ్రీకృష్ణ సంకీర్తనము ప్రచార మగును.' ప్రభువు నోట నీమాటను విని భక్తులందఱానందమును బొందిరి. వారానందోత్సాహమున నుద్రేకముగ నృత్యము చేయఁ బ్రారంభించిరి. ప్రభువేది చెప్పిన నది సత్యమగు నను దృఢవిశ్వాసము భక్తులందఱకును గలదు.

ఈ విషయము జరిగిన నాలుగైదు దినములైన తర్వాత నొక దినమున సంకీర్తనానంతరమునఁ బ్రభువు భక్తులతో 'నా అగ్రజుఁడును, నా పరమ సఖుఁడును, నా బంధువును, నా సర్వస్వమగు నామహాపురుషుఁడు అవధూత వేషమున నవద్వీపమునకు వచ్చినాఁడు. మీరందఱిప్పుడే పోయి యాయనను వెదుకుటకు బయలు దేరుఁడు.' అనెను. ప్రభువు వారి యాజ్ఞను శిరసావహించి భక్తగణ మా యవధూత మహాపురుషుని వెదుకుటకు బయలుదేరిరి. ఈ నిమాయి యొక్క సర్వస్వము, అవధూత వేషములో నున్న యే మహాపురుషుఁడో నని పాఠకుల కుత్సాహముండవచ్చును. అసలు ఈ యవధూత నిత్యానందుఁడే. ఈతఁడే గౌరభక్తులతో 'నిమాయి సోదరుఁడు నితాయి' అను పేర పిలువఁబడెడువాఁడు. పాఠకుల కీతని పరిచయము రాఁబోవు అధ్యాయములో లభింపఁగలదు.



# ని హా యి అ న్న ని తా యి

శ్లో॥ పుణ్యతీర్థే కృతం యేన తపః క్వాప్యతిదుష్కరమ్ ।
తస్య పుత్రో భవేద్వశ్యః సమృద్ధో ధార్మికః సుధీః ॥

సు. ర. భాం. ౯౪-౬.

(పుణ్యతీర్థములో నుండి ఘోరదుష్కర తపస్సు చేసిన వానికిని, యింద్రియములను వశము కావించుకొనినవాఁడు మాత్రమే సమృద్ధశాలియు, ధార్మికుఁడును, విద్వాంసుఁడు నగు పుత్రుఁ డుత్పన్నమగును. తప స్సేజన్మలోఁ జేసినప్పటికిని పూర్వజన్మ సుకృతము లేనిది గుణియు, ధార్మికుఁడు నగు పుత్రుఁడు పుట్టఁడు.)

విధి విధానము చాల విచిత్రమైనది. ఒక్కొక్కప్పుడి కేతల్లి గర్భమునఁబుట్టిన అన్నదమ్ములే పరస్పరము శత్రు భావముతో వర్తించుట చూచుచునే యున్నాము. వాలి సుగ్రీవులు, రావణ విభీషణులు, కర్ణార్జునులు మొదలగు వారు సహోదరులే, కాని వీరు పరస్పరము మృత్యుకారణులైరి. దీనికి విపరీతముగ విభిన్న తల్లిదండ్రుల కుత్పన్నమై సాధారణముగా నన్నదమ్ములే యుండలేనంత యధిక ప్రేమతో నుందురు. దీనిని బట్టి పూర్వజన్మ సంస్కారములచేఁ బ్రతి జీవి యాబద్ధుఁ మగునని తోఁచుచున్నది. ఎవని కెవనితో నెన్ని జన్మలనుండి సంబంధముండునో, వారిద్దరి జన్మ మొకే పరివారములో నొక్కే దేశములో కలుగునుగాక లేక విభిన్నజాతి కులములలో, వేఱు

వేఱు గ్రామములో నగుఁగాక వానికి వానితో నన్ని జన్మముల వఱకు సంబంధముండి తీరును. సంబంధము పూర్వమువలె జరుగుచునే యుండును. మహాప్రభు గౌరాంగ దేవుని జన్మము గౌడ దేశములో సుప్రసిద్ధి వహించిన నదియా యను పేరుగల నగరములో కలిగెను. ఇతని తండ్రి సిల్హాట్ నివాసియైన మిశ్ర బ్రాహ్మణుఁడు. తల్లి నవద్వీపములో సుప్రసిద్ధ పండితుఁడగు నీలాంబర చక్రవర్తిగారి కుమార్తె. వీరిద్దరన్నదమ్ములు. పెద్దవాఁడు విశ్వరూపుఁ డితని నైదువత్సరముల వానిని వదలి వెడలిపోయెను. ఇతఁడు తల్లిదండ్రుల ఏకైక పుత్రుఁడు. ఇతని నందఱికంటెఁ జిన్నవాఁడనుఁడు, పెద్దవాఁడనుఁడు కాని యితని తల్లి కీతఁడు తప్ప యితర సంతానము జీవితులై లేరు.

శ్రీ నిత్యానందుని జన్మము రాఢ దేశములోనై నది. ఇతని తల్లిదండ్రులు రాఢీశ్రేణికి చెందిన బ్రాహ్మణులు. ఈ తఁడు సోదరులందఱిలోఁ బెద్దవాఁడు కాని యితని తమ్ము లెందమందియో, వారి పేర్లేమియో, మనకు తెలియదు. ఈతఁడు గౌరాంగుని యన్నయను పేరుతోఁ బ్రసిద్ధుఁడయ్యెను. గౌరభక్తుల సంకీర్తన సమయములో గౌరాంగుని పేరుకంటె ముందు నిత్యానందుని పేరే వచ్చును,

'భజో నితాయీ గౌర రాధే శ్యామ్ ।
జపో హరే కృష్ణ హరే రామ్ ॥

ఈ విధముగా నీయిద్దరి పాంచభౌతిక శరీరము లేక స్థానీయ రజోవీర్యములచే నుత్పన్నము కాకున్నను వీరి యాత్మ

యొకే తత్త్వముచే నేర్పడినది. వీరి శరీరములు వేఱు వేఱు దేశీయములైనప్పటికిని వీరి యంతఃకరణ మొక్కటిగానే యుండెడిది. అందువలననే 'నితాయి, నిమాయి' లిద్దఱు భిన్నులైనప్పటికిని యభిన్నులుగనే యెన్నఁబడు చుండిరి.

నిత్యానంద ప్రభువువారి జన్మము వీరభూమి జిల్లాలోఁ జేరిన 'ఏకచాకా' అను పేరుగల చిన్న గ్రామములోనయ్యెను. వీరి గ్రామమునకు సమీపముననే మోడేశ్వరుఁ (మయూరేశ్వరుఁ) డను పేరుగల యొక మిక్కిలి ప్రసిద్ధ శివలింగముండెడిది, నేఁడచ్చట మయూరేశ్వరమని పేరుగల యొక గ్రామము కూడ కలదు. అది వీరభూమికొక థానాయైయున్నది. నిత్యానంద ప్రభువు తండ్రి పేరు హాడాయీ ఓఝూ, తల్లి పేరు పద్మావతీదేవి. ఓఝూ దంపతులు విష్ణుభక్తులు. పరమ భాగవతులు. సద్వైష్ణవులు కానిది వారియింటిలో నిత్యానందుని వంటి మహాపురుషుఁ డెట్లు జన్మింపఁగలఁడు? ఆ కాలమున సాంప్రదాయికసంకుచితత్వమిప్పుడున్నంత ప్రబలముగ లేదు. సాధారణముగ నన్ని సాంప్రదాయములలోని వైష్ణవులు, స్మార్తమతానుసారముగనే తమ్ము వైష్ణవులుగఁ దలఁచు చుండిరి. ఉపాస్యదైవము మాత్రము విష్ణువే. విష్ణుపూజకు ప్రాధాన్యమిచ్చుచు నప్పుడప్పుడు భక్తిభావముతో నన్యదేవతలను గూడ పూజించు చుందురు. శ్రీవైష్ణవ సాంప్రదాయులమని జెప్పుకొనుచు నేఁడు శివపూజన మన్నను త్రిపుండ్రము, బిల్వపత్రము, రుద్రాక్ష మొదలగునవి యన్నను ద్వేషించు

వారు పూర్వకాలమున వారి సాంప్రదాయములో చాలమంది శివోపాసకులగు నాచార్యుల వృత్తాంతము లభించుచున్నవి. కానిండు. హాడాయి పండితుఁడు వైష్ణవుఁడయ్యుఁ బ్రతిదినము మోడేశ్వరమునకు బోయి మిక్కిలి భక్తి భావముతో శివ పూజ చేయుచుండెడువాఁడు. శివలింగము నందు సమస్త దేవతలను భావించి పూజింప వచ్చును.

హాడాయీ పండితుని వంశములో సర్వదా పురోహిత వృత్తి యుండెడిది. అందువలన నితఁడును గొంచెముగఁ బురోహితము చేయుచుండెను. ఇంటిలోఁ గట్టు గడ్డకు కొదువ లేదుకాని యితని యిల్లు సంతానము లేక శూన్యముగ నుండు టచే ఓఝూ దంపతుల కిదియే భారమైన దుఃఖముగ నుండెను. ఒక దినమునఁ బద్మావతీదేవి స్వప్నములోఁ బ్రత్యక్షమై యొకానొక మహాపురుషుఁడు 'దేవీ! సమస్త దేశమంతటను శ్రీకృష్ణ సంకీర్తన ప్రచారముచేయునట్టి యొకానొక మహా పురుషుఁడు నీ గర్భమున జన్మించును. ఆతఁడు జగన్మాన్య మహాపురుషుఁడుగ నెన్నఁబడును.' అని చెప్పినట్లుండెను. సాధారణముగ సాత్త్వికప్రకృతిగల పురుషులకు శుద్ధ భావ ముతో శయనించిన రాత్ర్యంతము ననఁగా తెల్లవారుజామున వచ్చు స్వప్నము నిజమగు చుండుటను గాంచుచున్నాము. భాగ్యవతి యగు పద్మావతీదేవి యొక్క స్వప్నమును నిజ మయ్యెను. యథా సమయమునకు ఆమెకు విక్రమశకము ౧౩౯౫ సంవత్సరమున మాఘ శుక్లమునందు పద్మావతీదేవి

గర్భమునుండి యొకానొక పుత్రరత్న ముత్పన్నమయ్యెను పుత్రు నకు నిత్యానందుఁడని పేరుపెట్టిరి. తర్వాతఁ దర్వాత నీయనయే నిత్యానంద ప్రభువనియు, 'నితాయి' యనియుఁ బిలువఁబడి గౌరభక్తులలో బలరామ సమానుఁడుగఁ బూజింపఁబడుచుఁ బ్రసిద్ధుఁడయ్యెను.

బాలకుఁడగు నిత్యానందుఁడు చూచుట కందముగ నుండెను. ఈతని శరీరము లావణ్యమయముగ నుండెను. వైఖరిలోఁగాంతి ప్రకటమగుచుండెను, గౌరవర్ణుఁడు. కన్నులు విశాలములు, స్వచ్ఛములు, సుందరములు, ఈతని బుద్ధి బాల్యకాలము నుండియే మిక్కిలి తీక్ష్ణముగ నుండెడిది. అయిదవయేట యీతని కక్షరాభ్యాసము చేయించిరి. అక్షరాభ్యాసము కాఁగానే యితఁడు మిక్కిలి శ్రద్ధతో నధ్యయనము చేయ మొదలిడెను. అల్పకాలములోనే యీతనికి సంస్కృత సాహిత్యము, వ్యాకరణములందు మంచి జ్ఞానము కలిగెను. ఈతఁడు పాఠశాల సమయములోఁ జదువఁబోవును, మిగిలిన సమయమున బాగుగా నాటలాడఁబోవును. ఈతని యాట యితర బాలకుల యాటవలె నుండెడిదికాదు. ఈతఁడు బాలురను గైకొని పసితనమునందే శ్రీకృష్ణ లీలాభినయము చేయుచుండెడువాఁడు. ఒక బాలకుని గృష్ణుని జేయును. కొందఱను గొల్లపిల్లలఁజేయును, తానుమాత్రము బలరాముఁడగును. ఒకొక్కప్పుడు గోవులను మేఁపఁబోవు లీలను జేయును. ఒకొక్కప్పుడు పులిన భోజనము యొక్క అభి

నయమును గావించును. ఒకొక్కప్పుడు మధురాగమన లీల బాలకులచేఁ జేయించును. ఈతనికి లీలల నెవరు నేర్పిరో, యితనికి వీని శిక్షణ నెవరిచ్చిరో యెవ్వరికిని తెలియదు. ఈతఁ డన్నిటిని శాస్త్రీయ లీలలే చేయుచుండును.

ఒకొక్కప్పు డాతఁడు బాలకులతో రామాయణ లీలలు చేయించుచుండును. ఒకని రామునిఁగాను, వేఱొకని భరతునిఁగాను, ఇంకొకని శత్రుఘ్నునిఁగాఁ జేసి తాను స్వయముగ లక్ష్మణుఁడగును. మిగిలిన పిల్లలను సేవకులగను, ఋక్ష వానరములుగను జేసి భిన్నభిన్న స్థానములలోని లీలలను జేయును. ఒకొక్కప్పుడు వనగమనాభి నయమును, నింకొ కప్పుడు చిత్రకూటములోని భావమును, మఱొకప్పుడు సీతా హరణాభినయమును జేయును. ఒక దినమున నతఁడు లక్ష్మణ మూర్ఛాలీలను జేయుచుండెను. ఆతఁడు స్వయముగ లక్ష్మణుఁడై మేఘనాదుని శక్తిచే స్పృహతప్పి పడియుండెను. ఒక బాలుని హనుమానుని జేసి సంజీవిని దెచ్చుటకు పంపెను. ఆపిల్లవాఁడు పిల్లవాఁడగుటచే నితఁడు చెప్పినది మఱచి పోయెను. ఈతఁడు చాలసేఁపటి వఱకు స్పృహతప్పి పడి యుండెను. నిజముగా నితనినాడి చాల నెమ్మదిగఁ గొట్టుకొను చున్నదని యందఱు చూచిరి. ఎంత లేపినను లేవకుండెను. ఈ కబురు పిల్లలుపోయి తండ్రికి చెప్పిరి. తండ్రి యిదివిని పరు గెత్తుకొనివచ్చెను. అంతట ఆయన కూడ లేపెను కాని లేవ లేదు. అంతఁ దండ్రికి మిక్కిలి దుఃఖము కలిగెను. ఇతని

వెంబడి రామరూపముతో నున్న బాలుఁ డేడ్చుచుండెను. ఆతనికి జ్ఞాపకమునకు వచ్చి హనుమంతుని వేషము వేసినవానిని బిలిచెను. హనుమంతుఁడు సంజీవని దెచ్చి యితనికి వాసన చూపింపఁగానే మూర్ఛ తెలిసెను ఈ విధముగ నితఁడు బాల్యకాలమునుండియు వివిధములగు శాస్త్రీయ లీలలు చేయుచుండెను.

చదువులో నితఁడు తన తోడివారిలో సర్వశ్రేష్ఠుఁడుగ నెన్నఁబడుచుండువాఁడు. ఇతని బుద్ధి యత్యంత తీక్ష్ణమైనది. చూడఁగా సాధారణముగఁ దండ్రికి పెద్దకుమారుని యందును, తల్లికి అందఱికంటెఁ జిన్న కుమారుని యందును ప్రేమ యుండును. అందులో నితఁడు గుణములలోను, రూపములోను అద్వితీయుఁడగుటచే హాడాయీ ఓఝా ఇతనిని ప్రాణములకంటె మిన్నగఁ జూచుకొనుచుండెనువారు. ఆయన యెచ్చటికి కావలసిన నచ్చటికి యితనిని దీసికొని పోయెడు వాఁడు. ఈతఁడు లేకుండ ఆయనకు రాకపోకలుగాని, తిండి తిప్పలుగాని రుచించవు తల్లియు నితని మనోహర ముఖకమలమును గాంచి సర్వదా ఆనంద సాగరములో మునుఁకలు వేయుచుండెడిది, ఈ విధముగ నితఁడు పండ్రెండు పదుమూఁడేండ్ల వాఁడయ్యెను.

హాడాయి పండితుఁడు గొప్ప సాధు భక్తుఁడు. సాధారణముగా నెల్లప్పు డెవరో యొకరు సాధు సంతపురుషు లితని యింట నుందురు. ఈతఁడును యథాశక్తి తిండి యున్నంత

వలెను శ్రద్ధా పూర్వకముగా నాగత సాధువులకు సత్కారము చేయుచుండెడువాఁడు, ఒక దినమున నొక సన్న్యాసి హాడాయి పండితున కతిథి యయ్యెను. పండితుఁడు శ్రద్ధాపూర్వకముగ నాతని కాతిథ్య మిచ్చెను. పద్మావతీ దేవియు శుద్ధముగాఁ దన చేతులతో పప్పు, అన్నము, పకోడీ, కూరలు తయారు చేసెను. పండితుఁడు భక్తి భావముతో సన్న్యాసికి భోజనము పెట్టెను. ఈతని భక్తి భావమును గాంచి సన్న్యాసి మహాత్ముఁడు మిక్కిలి ప్రసన్నుఁడై యింక రెండు మూఁడు దినములు పండితుని యింట నిలిచెను. పండితుఁడును వారికి యథాశక్తి సేవాశుశ్రూషలు చేయుచుండెను. సన్న్యాసి చూచుటకు మంచిరూపము గలవాఁడు. ఆయన ముఖము నుండి యొకవిధమైన జ్యోతి యెల్లప్పుడును బయలు దేరుచుండును; ఆయన యాకృతి, గంభీరతా, సచ్చరిత్రత్త పవిత్రత, తేజస్వితా, భగవద్భక్తి భావము ప్రకటమగుచుండెడిది. హాడాయి పండితునకు సన్న్యాసి యెడల మక్కిలి శ్రద్ధయేర్పడెను. ఈ యల్పవయస్కుఁడగు సన్న్యాసి యొక్క ప్రభావముచే హాడాయి పండితుఁడు అత్యధిక ప్రభావాన్వితుఁడయ్యెను. ఒక దినమున నేకాంతములో సన్న్యాసి హాడాయి పండితునితో 'పండితప్రవరా! నేనొక భిక్ష యడిగెదను ఇచ్చెదరా?' యనెను.

దీనత్వమును బ్రకటించుచు హాడాయి పండితుఁ డిట్లనెను:– 'ప్రభూ! ఈదీనహీన దరిద్రుని యొద్ద యేమియుండును? అటు

యిటు నేదిలభించునో దానితోనే నిర్వాహము జరుగుచుండును. మీరు చూచుచునే యున్నారుగదా, నాయింటిలో మీకు భిక్షయిచ్చునంతటి వస్తువేది కలదు? ఉన్నంతలో మీకీయ రాని దేమియులేదు. మీరీ నా శరీరము నడిగినను యిచ్చుటకు సంసిద్ధుండనే.'

సన్యాసి కొంచెము గంభీరముగ నిట్లనెను:- 'అయ్యా! నీవద్ద సర్వము ఉన్నది. నేను నిన్నడుగం దలంచిన వస్తువది పార్థివ సంబంధమైన ధనముకాదు, అది అత్యధిక మూల్య వంతమైన వస్తువు. నీవు దానినిచ్చుటకు నిరాకరింతువు, అది నీకత్యంత ప్రియమైనది.'

హడాయి పండితుం డిటనెను:- 'భగవాన్! ప్రాణి మాత్రునకు తన ప్రాణమే అత్యధిక ప్రియమైనదని నేను విన్నాను. మీరు నా ప్రాణమును భిక్షగాంగోరినను ఇచ్చుటకు సంసిద్ధుండను.'

సన్న్యాసి కొంచెముసేంపాగి యిట్లనెను - 'నేను నీ శరీరములోని ప్రాణములను గోరను, బయట ప్రాణములను యాచింతును. నీవు నీప్రాణములకంటెం బ్రియమైన జ్యేష్ఠ పుత్రుని నాకిమ్ము. నేనన్ని తీర్థయాత్రలు చేయంగోరుచున్నాను. అందులకు నాకొక తోడు అవసరము. ఈ నీ పుత్రుండు యోగ్యుండు. అభివృద్ధికి రాంగలవాండు. ఇతనికిని గల్యాణము కలుగును, నా పబ్బము తీరును.'

సన్న్యాసి యొక్క యీమాటను విని హడాయి పండితుడు శూన్యుడయ్యెను. సన్న్యాసి యిట్టి విలక్షణ వస్తువు నడుగునను యూహ ఆతనికి స్వప్నమందైనను లేదు. ఏపుత్రుని దండ్రి తన ప్రాణముల కంటెను నధికముగఁ బ్రేమించుచుండెనో, ఎవఁడు లేక అతని జీవనమే యసంభవమో అట్టి పుత్రుని నెవఁడైన శాశ్వతముగ యాచించిన నాతండ్రి కెంతటి దుఃఖము కలుగునో అది సహృదయుఁడును బ్రేమ కలవాఁడు నగు తండ్రికే తెలియును. ఇతరులకు అనుమానము దశరథ మహారాజును విశ్వామిత్రుని వంటి క్రోధియు, తేజస్వియునగు బ్రహ్మర్షి కొన్నిదినములపాటు శ్రీరామచంద్రుని యాచించెను. ధర్మమందాస్థ కలిగిన మహారాజుకు మహర్షికి యిచ్ఛాపూర్తి కావింపకున్న తన రాజ్యమునకును, బరివారమునకును క్షేమము లేదని తెలియును. అమిత తేజస్వియు, బ్రహ్మర్షియు నగు నాతని తపః ప్రభావముల గుఱించియు బాగుగఁ దెలియును. విశ్వామిత్రునితో నుండిన శ్రీరామచంద్రుని కెట్టి యనిష్టమును గలుగదనియుఁ దెలియును. ఆయినను పుత్ర వాత్సల్యకారణమున నతఁడు విశ్వామిత్రుని కోర్కెను జెల్లించుట కొప్పుకొనక, అత్యంత దీనతతో మమతాయుక్తమైన వాక్యములతో నిట్లనెను—

'దేహ ప్రాణ తేఁ ప్రియ కఛునాహీఁ
సోఊ ముని దేఉఁ నిమిష ఏక మాహీఁ
సబ సుత ప్రియ ప్రానకీ నాయీ
రామ దేత నహిఁ బనయి గుసాఈ ॥'

'దేహప్రాణములకంటెఁ బ్రియమైన వస్తువేదియు వేదు. ఓ మునీ! దానిని నిమిషములో నీయఁగలను. నాకొడుకు లందఱు నా ప్రాణముకంటెఁ బ్రియులు. రాముని వనమునకు నేను బంపఁజాలను,'

అంత వసిష్ఠుఁడు చెప్పఁగా నతనికి మోహమునశించి మహర్షియొక్క కోరికప్రకారము శ్రీరామచంద్రుని ఆయన వెంట వనమునకుఁ బంపుట కొప్పుకొనెను.

ఇక్కడ హాడాయి పండితున కాతని ధర్మనిష్ఠయే తెలియఁజెప్పెను. 'పుత్రు నిచ్చుటలోను దుఃఖము ననుభవించవలెను. ఈయక పోవుటలోన నకల్యాణమే సన్న్యాసి శాపమిచ్చి నాసర్వస్వము నాశము చేయఁగలఁడు. కావున నేమైనఁ గానిండు. ఇతనికి పుత్రునిచ్చి తీరవలెను.' అని యాతఁ డనుకొనెను. ఇట్లాలోచించి యాతఁడు పద్మావతీదేవియొద్దకుఁబోయి, వృత్తాంతమంతయుఁ జెప్పెను. నిత్యానందుని వంటి మహాపురుషుని తల్లియైన యదృష్టవంతురాలు తన ధర్మమునుండి యెట్లు విచలిత కాఁగలదు? పుత్రమోహ కారణమున నామె యెట్లు తన ధర్మమును తప్పఁగలదు? అంతయును విని యామె దృఢముగా నిట్లనెను:- 'నేను మీ యధీనురాలను. మీ యిష్టమే నాయిష్టము. పుత్ర వియోగ దుఃఖము భరింపరానిది, కాని పతివ్రతలకు పతియొక్క అజ్ఞోల్లంఘన దుఃఖము దానికంటె మిక్కిలి భరింపరానిది. కావున మీ యిష్టము వచ్చినట్లు చేయుఁడు. ధర్మలోపము కాని కార్యమును జేయుఁడు. నాకు సర్వ సమ్మతము.'

భార్యయొక్క యంగీకారమును గైకొని తనప్రాణముల కంటెఁ బ్రియమైన కుమారుని యేడ్చుచుయేడ్చుచు సన్న్యాసి చేతులలో సమర్పించెను ధర్మనిష్ఠుఁడగు నిత్యానందుఁడును దీనికేమియు నడ్డుపలుకలేదు. ఆతఁడు ప్రసన్నతా పూర్వకముగ సన్న్యాసివెంటఁ బోయెను. ఆతఁడు వెనుదిరిగి మరల తన తల్లి దండ్రులను, కుటుంబములోని వారిని జూడనైనఁ జూడలేదు.

సన్న్యాసితోఁగూడ నిత్యానందుఁడు భారతవర్షము లోని సాధారణముగ సమస్త ముఖ్యముఖ్య తీర్థములందును యాత్రకావించెను. వారు గయ. కాశీ, ప్రయాగ, మధురా, ద్వారక, బదరీనాథము, కేదారనాథము, గంగోత్తరి, యమునో త్తరి, రంగనాథము, సేతుబంధ రామేశ్వరము, జగన్నాథపురీ మొదలగు పుణ్యతీర్థములకుఁ బోయిరి. ఈ తీర్థయాత్రా భ్రమణమునందు ఈతనికి శ్రీమన్మాధవేంద్ర పురీ దర్శన మయ్యెను. ఆయనద్వారా శ్రీకృష్ణభక్తి ప్రాప్తించి ఈతఁడు ప్రేమ విహ్వలుఁడయ్యెను. వారివద్ద శెలవు తీసికొని ఈతఁడు వ్రజమునకు వచ్చెను. ఈతని వెంటనున్న సన్న్యాసి యెచ్చట నిలిచిపోయినది సరియైన జాడ తెలియదు.

వ్రజమునకు వచ్చిన తర్వాత: నవద్వీపములో గౌరచం ద్రుఁడుదయించి తన సుశీతల కిరణములచే రెండుపక్షము లందును నిరంతరము మోహజ్వాలలచే కుమిలి పోవుచున్న సాంసారిక ప్రాణులకు తన శ్రీకృష్ణ సంకీర్తన మను నమృత ముచే శీతలమును బ్రసాదించుచున్నాఁడని వినెను. ఈతని

మనస్సు స్వతః శ్రీగౌరచంద్రుని జూడఁబోవ నువ్విళ్లూరు చుండెను. ఇంక నితఁ డధిక కాలము వ్రజములో నుండఁజాలక పోయెను, ప్రయాగ, కాశీ మీఁదుగా సరిగా నవద్వీపమునకుఁ జేరుకొనెను.

నవద్వీపమునకుఁ బోయి అవధూతయగు నిత్యానందుఁడు సరిగా మహాప్రభువు దగ్గఱకు పోలేదు. ఆతఁడు పండిత నందనాచార్యుని యింటికిఁబోయి బసచేసెను. నిత్యానందుఁడు నవద్వీపమునకు వచ్చుచున్నాఁడని యిచ్చట ప్రభువు తన దివ్యదృష్టిద్వారా ముందుగానే చూచెను. అందువలన నితనిని వెదుకుటకు భక్తులను బంపించెను.

# స్నేహాకర్షణము

శ్లో॥ దర్శనే స్పర్శనే వాపి శ్రవణే భాషణేఽపి వా
యత్ర ద్రవత్యంతరంగం స స్నేహ ఇతి కథ్యతే ॥

సు. రా: ఖాం. ౬౨-౧౧.

(చూచుటచేతను, శరీరమును దాఁకుటచేతను, గుణములను వినుటచేతను, సంభాషించుటచేతను నెచ్చట అంతరంగము ఉల్లాసమున ద్రవించుటకు ప్రారంభించునో అది స్నేహమని చెప్పఁబడుచున్నది)

నిజముగా స్నేహములో నెంత గొప్ప యాకర్షణ మున్నది! ఆకాశమున చంద్రభగవానుని చంద్రమండలము గలదు. క్రింద భూమిమీఁద సరిత్పతియైన సాగరుఁడున్నాఁడు. శర్వరీనాథుఁ డేదినమున తన సంపూర్ణకళలతో నాకాశమం దుదయమగునో, ఆదినము భూమిమీఁద ప్రేమ పయోనిధి యుప్పొంగసాగును. పద్మము భువన భాస్కరుని కెంతో దూరములో నున్నది. అది యాయన ఆకాశములో నుద యించుట తోడనే వికసించును. ఇంతవఱకు సూర్యవిరహ శోకమున సంకుచితమైన వాటి ముకుర మనము ఆయన కిరణ స్పర్శ చేతనే ఆనందముచే వికసితమై శోభించును. మేఘ మెచ్చటనో గర్జించుచున్నది, కాని భూమిమీఁదఁ దిరుగు చుండు మయూరము ఇచ్చట నుండియే యా సుమధుర ధ్వనిని విని, యానందమున నున్మత్తమై కేకలేయుచు నాడ ప్రారం

భించును. ప్రేమలో నింతటి యధికాకర్షణ లేకున్నట్లైనచో నిజముగానే నీ ప్రపంచముయొక్క అస్తిత్వమే అసంభవ మగును. ప్రపంచ స్థితియే ఒక్క ప్రేమమీఁద నాధారపడి యున్నది. ప్రేమయే ఈశ్వరుఁడు ఈశ్వరుఁడే ప్రేమ. (God is love and Love is God) ప్రేమయే ప్రాణుల ననేక విధములుగ నాడించుచున్నది. హృదయముయొక్క విశ్రామ స్థానము ప్రేమయే. స్వచ్ఛ హృదయములో నెప్పుడు ప్రేమ యొక్క సత్యస్వరూపము ప్రకటమగునో అప్పుడే హృదయములో శాంతి కలుగును, హృదయములో ప్రేమ ప్రాకట్యము కాఁగానే యే విషయమైనను నజ్ఞేయమైనది యుండఁజాలదు. భూత భవిష్యత్తులు రెండును ప్రత్యక్షముగఁ దోఁచును. అంతేకాదు చరాచరములలో నెక్కడైనను ప్రేమ దృష్టి గోచరమగుచుండి అక్కడకే హృదయము దానంతట అదియే పరుగెత్తుకొని పోవును. ఆహా, ఎవఁడు ప్రేమ పీయూష పానము గావించెనో, ప్రేమాసవమును పానముచేసి వెఱ్ఱివాఁడయ్యెనో అట్టి ప్రేమ స్వరూపుల పాదపద్మముల కడకు చేరిన మీఁదట హృదయమం దెంతటి యధికశాంతి యుత్పన్నమగునో దానిని ప్రభుప్రేమ ప్రసాదమును పూర్తిగాఁ బొందిన యా ప్రేమ భక్తులే యనుభవించగలరు.

నిత్యానంద ప్రభువు ప్రేమాకర్షణము చేతనే ఆకర్షితుఁడై నవద్వీపమునకు వచ్చెను. ఈ విషయము ప్రభుహృదయమునకు తీగెలేని తంతిద్వారా ముందుగనే అందెను. ఆతఁడా

దినముననే భక్తులను నవద్వీపమందు అవధూతయగు నిత్యా నందుని వెదుకఁ బంపెను. వెంటనే నిత్యానందుని వెదకి తెచ్చుటకు నవద్వీపము చిన్న గ్రామము కాదు. అదియునుగాక నిత్యానందుని మెఱిఁగిన వారెవ్వరును లేరు చూచి పట్టుకొని వచ్చుటకు. శ్రీవాస పండితుఁడు, హరిదాసు దినమంతయు నా నవీన మహాపురుషుని వెదుకు చుండిరి, కాని వారికి జాడ చిక్కలేదు, చివరకు నిరాశను జెంది వారు ప్రభువువారి దగ్గఱకు తిరిగివచ్చి యిట్లు చెప్పిరి:- 'ప్రభూ! మేము మీ యాజ్ఞాను సారముగ నవద్వీపములో నిల్లిల్లు తిరిగి యామహాపురుషుని వెదకితిమి. అన్ని రకముల మనుష్యుల యిండ్లకు బోయి చూచితిమి కాని మాకు ఆయన జాడ తెలియలేదు. ఇప్పుడు మీయాజ్ఞ ప్రకారము వర్తింతుము, ఎక్కడికి చెప్పిన, నక్కడికి పోయెదము'

వీరి నోటినుండి యీ మాటలు విని ప్రభువు కొంచెము చిరునవ్వు నవ్వి, అన్నివైపులఁ జూచుచు నిట్లనెను:- 'ఆమహా పురుషుఁ డిక్కడికి తప్పక వచ్చినట్లును, జనమును మా యింటి జాడ యడుగుచున్నట్లును నాకు రాత్రి స్వప్నము వచ్చినది. మంచిది ఒకపని చేయుఁడు, మనమందఱమును గలిసి ఆయనను వెదుకఁ బోవుదము. ఇట్లు పలికి ప్రభువా సమయమున లేచి బయలుదేరెను. ఆయన వెనుక గదాధరుఁడును, శ్రీవాసాది భక్త గణమును బయలుదేరెను; ప్రభువులేచి సరిగా పండిత

నందనాచార్యుని యింటివైపునకు బోయెను. ఆచార్యుని యింటికి పోఁగానే అచ్చట నొక దివ్యకాంతియుక్తుఁడగు మహాపురుషుఁడు తన యొక్క యమిత తేజస్సుచే గృహమునంతను ఆలోకమయము కావించి పద్మాసనము మీఁదఁ గూర్చుండి యుండుటను భక్తులందఱును గాంచిరి ఆతని ముఖమండలము యొక్క తేజోమయ కిరణములలో గ్రీష్మప్రభాకర కిరణముల వలె తీక్ష్ణ ప్రచండత లేదు, కాని శరశ్చంద్ర కిరణముల వలె శీతలత, శాంతత, మనోహరత సమ్మిళితమై యుండెను. గౌరాంగుఁడు భక్తులతోసహా యా మహాపురుషుని చరణ వందనము కావించి, యొకప్రక్క మెదలక కూర్చుండిరి. ఒకరితో నొకరెవ్వరును మాటలాడుకొనుటలేదు నిత్యానంద ప్రభువు అనిమేషదృష్టిచే గౌరాంగుని ముఖచంద్రునివైపు చూచుచుండెను. ఆతని కనురెప్పలు పడుట ఒక్కసారిగా నిలిచిపోయినట్లు భక్తులు కనిపెట్టిరి. అందఱును స్థిరభావమున మంత్రముగ్ధులవలె నిత్యానంద ప్రభువువైపునకు జూచుచుండిరి. ప్రభువు తన మనస్సులో నిట్లనుకొనెను. 'భక్తులకు నిత్యానందుని మహిమ చూపించవలెను. శ్రవణమాత్రము చేతనే శరీరమున సాత్త్వికభావములు ద్దీపనమగునట్టిదైన నొక ప్రేమప్రసంగ మతనికి వినిపించవలెను. ఈతనికి భావోదయము కలుగుటచేతనే భక్తులీతని మనోగత భావములను దెలిసికొనఁ గలుగునట్లు చేయవలయును.' ఇట్లాలోచించి ప్రభువు శ్రీవాస పండితు నేదైన స్తుతిశ్లోకమును జదువుమని మెల్లఁగా సంకే

తము కావించెను. ప్రభువుయొక్క మనోగత భావమును దెలిసికొని శ్రీవాసుఁ డీ శ్లోకమును జదువ నారంభించెను.

శ్లో॥ బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీంచ మాలామ్ ।
రంధ్రాన్వేణోరధరసుధయా పూరయన్గోపబృందై
ర్బృందారణ్యం స్వపద రమణం ప్రావిశద్గీతకీర్తిః ॥

(శ్రీమద్భాగవతము ౧౦-౨౧-౫.)

శ్రీ మద్భాగవతముయొక్క దశమ స్కంధముయొక్క యీ శ్లోకమం దెంత మాధుర్యమున్నదో సంస్కృత సాహిత్యానురాగులగు సహృదయ రసిక భక్తులు మాత్రమే యనుభవింపఁగలరు. ఈభావమును శబ్దములతో వ్యక్తము జేయఁ జాలరు. వ్రజమండలములోని భక్తగణ మీశ్లోకము శ్రీ మద్భాగవత ప్రచారమునకు మూలకారణముగఁ జెప్పుదురు. విషయమేమనఁగా శ్రీశుక భగవానుఁడు బాల్యకాలము నుండియే విరక్తుఁడై యుండెను. అతఁడు తన తండ్రియగు వ్యాసభగవానుని దగ్గఱకు రాక ఘోరారణ్యములందు మాత్రమే అవధూత వేషముతోఁ జరించుచుండెను. వ్యాసదేవుఁడా సమయములోనే శ్రీమద్భాగవతరచన చేసెను. శుకదేవుఁడు దీనిని జదువవలెనని యాతని యాశకాని యాతఁడు గోదోహనావధికంటె నెక్కువకాల మొక్కచోట నిలిచెడువాఁడే కాఁడు. అట్టియెడ పదునెనిమిదివేల శ్లోకములు గల శ్రీ

మద్భాగవతము నెట్లు చదువఁగలఁడు? అందువలన వ్యాసుని కోరిక మనస్సులోనే నిలిచిపోయెను.

వ్యాసదేవుని శిష్యు లా ఘోరవనములో సమిధలు, దర్భ, పుష్పములు, ఫలములు తెచ్చుటకు వెడలు చుండెడు వారు. ఒక దినమున నాకీకారణ్యములో నొక వ్యాఘ్రము కనఁబడెను. ఆవ్యాఘ్రమును గని వీరు భయపడి వచ్చి 'గురు దేవా! ఇఁక మేము ఘోరవనమునకుఁ బోఁజాలము. ఇవ్వేళ మాకు పెద్దపులి కనఁబడినది. దానిని జూచి మేమందఱము భయభీతులమైతిమి? అని వ్యాసదేవునితో మొఱపెట్టుకొనిరి.

శిష్యుల ముఖమున నీ విషయమును విని వ్యాసభగవానుఁడు కొంచెముగ నవ్వి, కొంచె మాలోచించి 'వ్యాఘ్రము వలన భయమేమిటి? ఏ హింసక జంతువును మీదగ్గఱకు రాకుండునట్లు గొప్ప మహిమగల యొక మంత్రము మీకు చెప్పెద' నని చెప్పెను. శిష్యులు గురువాక్యమందు విశ్వాస ముంచి మఱునాఁడు స్నానసంధ్యాదులు కావించుకొని చేతులు జోడించి వారు గురుసమీపమునకు వచ్చి హింసక జంతు నివారక మంత్రజిజ్ఞాస చేసిరి. వ్యాసభగవానుఁ డీ 'బర్హాపీడం నటవరవపుః' అను శ్లోకమును జెప్పెను. శిష్యులు శ్రద్ధా భక్తులతో దీనిని కంఠస్థము కావించిరి. అందఱును గలిసి అడవికి బోయి నప్పు డీశ్లోకము నందఱేక స్వరమునఁ బఠించు చుండిరి వారి సుమధుర గానముచే నీరవ నిర్జరారణ్యము ప్రతిధ్వనించు చుండెడిది. చాలకాలమువఱకు దానియం దీ

శ్లోకముయొక్క ప్రతిధ్వని వినఁబడు చుండెడిది. ఒక దినమున నవధూత శిరోమణి శ్రీ శుకదేవుఁడు తిరుగుచుఁ దిరుగుచు నచ్చటికి వచ్చెను. ఆతఁ డీ శ్లోకమును విని ముగ్ధుఁడయ్యెను. శిష్యులను 'మీరీ శ్లోకము నెక్కడ నేర్చుకొంటిరి ?' అని అడిగెను శిష్యులు నమ్రతాపూర్వకముగ 'మా కులపతి వ్యాస భగవానుఁడే మాకీమంత్రోపదేశమును గావించెను. దీని ప్రభావముచే హింసక మృగములు దగ్గఱకు రాఁజాలవు' అనిరి. శుకదేవ భగవానుఁ డీ శ్లోకము మధ్య గుప్తముగా నిండి యున్న యనంత, యమరరసమును బానముచేసి వెఱ్ఱివానివలె నయ్యెను. ఆతఁడు తన యవధూతాచరణములను మఱచి పరుగెత్తుకొని వ్యాసభగవానుని సమీపమునకుఁ జేరి యా శ్లోకమును జెప్పుఁడని ప్రార్థించెను. తనవిరక్త పరమహంసపుత్రుని యీ విధముగు ప్రేమోన్మత్తుఁడగుటను గాంచగనే తండ్రి యానందమునకు మేఱలేదు. ఆతఁడు శుకదేవుని యేకాంతమునకుఁగొనిపోయి మెల్లఁగా నిట్లనెను:- 'నాయనా! నేనిట్టిదే పదునెనిమిదివేల శ్లోకముల పరమహంస సంహితను నిర్మించితిని, నీవు దానినధ్యయనము చేయుము.'

ఈతఁడు బ్రదిమలాడుచు నిట్లనెను:- 'వద్దు తండ్రీ ! నాకీఒక్క శ్లోకమును జెప్పుడు చాలును, వ్యాసభగవానుఁడా శ్లోకమునే చెప్పఁగా నతఁడప్పుడే దానిని కంఠస్థము కావించెను. ఇప్పు డతఁడు తిరుగుచు నా శ్లోకమునే సర్వదా చదువు చుండెను. ఒక్కసారి కొంచెముగ రుచి చూచినప్పటికిని

మరల దానిని వదలజాలనంతటి యద్భుతమగు ప్రేమాసవము శ్రీకృష్ణప్రేమ. మానవుఁడు దానిని వదలఁదలఁచినను అది స్వయముగ వానిని పట్టుకొని తీరును. శుకదేవునకును ఆ మధుమయ మనోజ్ఞ మదిరాసక్తి కలిగెను, అంతట నతఁడు తన యవధూత నియమములను వదలి శ్రీమద్భాగవత పఠనములో సంలగ్నుఁడై తండ్రిద్వారా దానిని సాంగోపాంగముగాఁజదివి, యక్కడనుండి లేచెను. అప్పుడే వ్యాసభగవానుఁ డిట్లు చెప్పెను—

శ్లో॥ ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే
కుర్వంత్యహైతుకీం భక్తి మిత్థం భూత గుణోహరిః ॥
(శ్రీమద్భాగవతము.)

హృదయగ్రంథి విడినవారును సర్వసంశయ విచ్ఛేదము మూలమట్టముగ నైనవారును, కర్మ లన్నియు నాశనమైన వారును, అగు నిట్టి ఆత్మారాములునైన మునులును ఆగుణములలో నహైతుకభక్తి చేయుదురు. భగవద్గుణములలోఁ గల విశేషత యిదియే. ఏమైనఁగానిండు. ఆతఁడు రసరాజు కాఁడా ? 'ప్రేమ సింధువులో మునిఁగిన వాఁడెవఁడును నేఁటి వఱకెగురుట. జూడలేదు.'

ఇంతటి గొప్ప మహత్వమే శ్లోకములోకలదో దాని భావమును గూడ వినుఁడు. ఆవులను మేపుటకు నాచిన్న గోపాలుఁడు బృందావనము వైపునకుఁ బోవుచుండెను, వెంట పూర్వ గోపబాలకులే కలరు, తెలియదు, నేఁడేలకో వారికేమి తోఁచి

నదో వారు శ్రీకృష్ణుని కమనీయ కీర్తిని నిరంతరము వర్ణించుచు వెడలుచుండిరి. అందఱును దమ కోమల కంఠములచే శ్రీకృష్ణయశోగానమును జేయుచుండిరి. ఇచ్చట ఈతండు తన మురళీ గానములో మునింగి యుండెను. ఈతనికీ దీన ప్రపంచము గుర్తే లేదు. ఆహా! ఆ సమయమున నీతని కాంతి యెంత సుందరముగ నున్నది—

'సంపూర్ణ శరీర రచన యొక నటునకువలె నతి మనోహరముగాను, చిత్తాకర్షకముగా నుండెను. శిరస్సున నెమిలి పింఛము విరాజిల్లు చున్నది. చెవులలో పెద్ద పెద్ద గన్నేరు పుష్పములు పెట్టుకొని యున్నాఁడు, బంగారు వికారమగు సుందర పీత వస్త్రము శరీరము మీఁద విరాజిల్లు చున్నది. కంఠములో వైజయంతీమాల యున్నది. కొంచెముగఁ గను బొమ్మలను బైకెత్తి, వంకరయై మురళీ రంధ్రములను దన యధరామృతముచేఁ బూర్ణముగఁ జేయుటలోఁ దత్పరుఁడై యుండెను. ఆ ఛిద్రములనుండి విశ్వవిమోహినీధ్వని వినఁబడుచుండెను. వెంటనంటి గోపకులు యశోదానందనుని యశోగానమును గావించుచు వెడలుచుండిరి. ఈవిధముగ మురళీ మనోహరుఁడు తన పద రజముచే బృందావన భూమిని పావనము చేయుచు వ్రజములోఁ బ్రవేశించుచున్నాఁడు.'

జగదున్మాదము కలిగించు నీభావమును విని అవధూత శిరోమణి యగు శుకదేవుఁడు ప్రేమోన్మత్తుఁడైనపుడు, ఇఁక మన సహృదయుడును, అవధూత యగు నిత్యానందుఁడు తన

ప్రకృతిలో నెట్లుండఁ గలఁడు? శ్రీవాసపండితుని ముఖము నుండి యీ శ్లోకమును వినుటతోడనే ఆయన మూర్ఛితుఁడై భూమిమీఁద పడెను. ఈతఁడు మూర్ఛితుఁడు కాఁగానే ప్రభువు శ్రీవాసుని మరల శ్లోకమును జదువుమనెను. శ్రీవాసుఁడు రెండవసారి శ్లోకము చదువఁగానే నిత్యానంద ప్రభువు బిగ్గఱగ హుంకారము చేయ మొదలిడెను, ఆతని నేత్రద్వయమునుండి అవిరళము అశ్రువులు రాలుచుండెను. శరీరము లోని రోమము లన్నియు నిక్కబొడిచెను. స్వేదముచే శరీరము తడిసిపోయెను. ఆతఁడు ప్రేమలో నున్మాదునివలె నృత్యము చేయసాగెను. ప్రభువు నిత్యానందుని కౌఁగిలించుకొనెను. ఇద్దఱు మహాపురుషులును బరస్పరము ఒకరి నొకరు ఆలింగనము చేసికొనసాగిరి. నిత్యానందుఁడు ప్రేమలో స్పృహతప్పి నట్లుండెను. ఆతని పాదము లెక్కడో ఒక్కయెడ పడియుండెను. బిగ్గఱగ 'హా కృష్ణ! హా కృష్ణ!' యని యతఁడు రోదనము చేయుచుండెను. రోదనము చేయుచు మధ్య మధ్య బిగ్గఱగ హుంకారము చేయును. ఈతని హుంకారమును విని యచ్చట కూర్చుండిన భక్తులును గడగడ వణఁకసాగిరి అందఱును కొయ్య బొమ్మలవలె, స్థిరభావముతో మెదలక నిలువఁబడి యుండిరి. ఇంతలోనే స్పృహతప్పి నితాయి తన సోదరుఁడగు నిమాయి వడిలో పడెను. ప్రభువు నిత్యానందుని శిరస్సునఁ దన కోమల కరకమలములను నిమిరెను. ఆ స్పర్శచేతనే నిత్యానందునకు బరమా

నందముగ నుండెను. ఆతఁడు కొంచెముగఁ బ్రకృతిస్థుఁ డయ్యెను. నిత్యానంద ప్రభువు ప్రకృతిస్థుఁడగుటను గాంచి ప్రభువు దీనభావముతో నిట్లనెను - 'శ్రీపాదా! నేఁడు మే మందఱము మీపద ధూళిని శిరస్సున ధరించి కృతకృత్యుల మైతిమి. మీరు మీ దర్శనముచే మమ్ముల నదృష్టవంతులఁ గావించితిరి. ప్రభూ! మీబోటి యవధూతల దర్శనము మాబోటి సంసారుల కెట్లు కలుగఁగలదు! మేము గృహ రూపమగు కూపములోని మండూకములము. దీని వదలి యెచ్చటికిని బోఁజాలము. మీబోటి మహాపురుషులు మా మీఁద నహైతుక కృపయుంచి స్వయముగ నింటిలో నుండఁ గానే మాకు దర్శనమీయ వచ్చిపోవుచుందురు. ఇంతకంటె మాకేమి సౌభాగ్యము కలుగఁగలదు?'

ప్రభువు యొక్క యీ ప్రేమమయ వాక్కులను విని అధీరతతో నితాయి యిట్లనెను:- 'నేను శ్రీకృష్ణ దర్శనము కొఱకు దేశవిదేశములకు యాత్రకావించితిని. సమస్త ముఖ్య ముఖ్య పుణ్యస్థానములకును, తీర్థములకును వెడలితిని. గొప్ప గొప్ప దేవాలయము లన్నిటిని గాంచితిని. శ్రేష్ఠములు, సాత్త్వి కములని చెప్పఁబడు దేవస్థానములను దర్శించితిని, కాని అచ్చట కేవలము స్థానముల దర్శనమే యైనది. ఆ స్థానముల లోని సింహాసనములను నేను ఖాళీగాఁ దెలిసికొంటిని. ఈ స్థాన ముల నుండి భగవానుఁ డెచ్చటికి వెడలెనని నేను భక్తుల నడిగితిని. నాయీ ప్రశ్నను విని చాలమంది చకితులైరి.

చాలమంది మొదలకుండిరి, ఇంక జాలమంది నన్నుఁ బిచ్చివాఁడనుకొనిరి. నేను చాల వెదుకఁగాఁ వెదుకఁగా నొక భక్తుఁడు భగవానుఁడు నవద్వీపములోఁ బ్రకటమై శ్రీకృష్ణ సంకీర్తన ప్రచారము చేయుచున్నాఁడు, నీవాయన శరణమునకుఁ బొయిననే నీకు శాంతి ప్రాప్తించఁగలదని చెప్పెను. అందువలననే నేను నవద్వీపమునకు వచ్చితిని. దయాళుఁడగు శ్రీకృష్ణుఁడు కృపచే స్వయముగనే నాకు ధర్శనమిచ్చెను. ఇప్పుడతఁడు నన్ను తన శరణములోనికి గైకొనునో లేదో అది ఆయనకే తెలియవలెను.' ఇట్లు పలికి మరల నిత్యానందప్రభువు గౌరాంగుని వడిలో దొర్లుచు తన సర్వస్వము గౌరాంగున కర్పణము చేసినాఁడా యనునట్లు పడెను.

ప్రభువు మెల్ల మెల్లఁగా ఆయనను లేవఁదీసి నమ్రతా పూర్వకముగ నిట్లనెను:- 'మీరు స్వయముగ నీశ్వరులు. మీ శరీరమందీశ్వర చిహ్నము లన్నియుఁ బ్రకటమగుచున్నవి. నన్ను మఱపించుటకు నన్నిట్టి స్తోత్రము చేయుచున్నారు. ఈ గుణములన్నియు మీయందే యున్నవి. నేను సాధారణ జీవిని. మీ కృపా యాచకుఁడను.'

ఈ మాటలను భక్తులు మంత్రముగ్ధులవలె మొదలకుండ దగ్గఱనే కూర్చుండి యాశ్చర్యముతో వినుచుండిరి. మురారి గుప్త మెల్లఁగా శ్రీవాసునితో నిట్లనెను:- 'ఈ యిద్దరి మాటలవలన వీరిలో నెవరుగొప్పో, ఎవరు తక్కువో మనము తెలిసికొనఁ జాలము.' మెల్ల మెల్లఁగా శ్రీవాసపండితుఁడు

'ఒకానొకఁడు శివుని నీ తండ్రి యెవఁడని యడిగినాఁడఁట,' అంత శివుఁడు 'విష్ణు భగవానుఁ'డని ప్రత్యుత్తర మిచ్చెనట, అతఁడే పోయి విష్ణు భగవానుని 'మీతండ్రి యెవఁ' డని యడిగెను. నవ్వుచు విష్ణువు 'దేవాధి దేవుఁడగు మహాదేవుఁడే నాతండ్రి' యనెనఁట. ఇదే విధముగా వీరి లీల వీరే తెలిసికొనవలయును, మఱియొక రెవరు తెలిసికొనఁగలరు ?' అనెను.

నందనాచార్యుఁ డీ లీలలు నన్నిటిని యాశ్చర్యముతోఁ జూచుచుండెను. ఆయన గృహము ప్రేమసాగరమై ప్రేమ తరంగము లూగులాడు చుండెను. కరుణాక్రందనము, రోదన హృదయమును గరిగించు ధ్వనులచే నతని యిల్లు ప్రతిధ్వనించుచుండెను. మహాపురుషు లిద్దరు మొదలకడ పశ్యంతీ భాషలో నేమి మాటలాడు కొనుచుండిరో, దీని మర్మమును వారే తెలిసికొనఁగలరు. వైఖరీ వాణితో మాటలాడుకొను నన్యసాధారణ మానవులకవి బుద్ధి కతీత విషయములు.



# వ్యాస పూజ

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ
భజామ్యహమ్
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥
గీతా. ౪-౧౧.

(ఓ యర్జునా! ఏ భక్తుఁడు నన్నే భావముతో భజించునో, నేనును వాని నాభావముతోడనే భజింతును. వాఁడే మార్గముననైనఁగానిండు చివరకు అంతట తిరిగి తిరిగి నా దగ్గఱకే వచ్చును. ఏలననఁగా ప్రాణులందఱకును ప్రాప్తిస్థానము నేనొక్కఁడనే.)

ప్రేమపథ మెంత వ్యాపకమైనది. దానిలో సందేహము, కపటము, వంచన, కృత్రిమము వీనికి స్థానమే లేదు. ప్రేమలో పాత్రాపాత్ర భేదభావము లేదు. దానియందు జాతి, వర్ణ, కుల, గోత్ర, సజీవ నిర్జీవ విచారములు లేవు. అందువలననే సాధారణముగా మానవుల ముఖమునుండి 'ప్రేమ గ్రుడ్డిది' అని వినఁబడుచుండును. ఇట్లను వారు స్వయముగ భ్రమలో నున్నారు. ప్రేమ గ్రుడ్డిది కాదు. యథార్థమునకు ప్రేమ కతిరిక్తమైన వన్నియు నంధములే. ప్రేమయే అసలెన్నటికిని వ్యర్థము కాని లక్ష్యముగల యమోఘ బాణము. దాని గుఱి యెల్లప్పుడును సరిగా లక్ష్యమందే నిలుచును. 'తన' యనునదెక్కడ దాగియుండినను, ప్రేమ దానినక్కడ నుండియే వెదకి లాగికొని వచ్చును.

విశాల హిందూ ధర్మము ప్రేమ యొక్క సర్వవ్యాపకతను లక్ష్యమందుంచుకొనియే. ఉపాసనకు ఏదో ఒకే పద్ధతి నిశ్చయింపలేదు. నీకు దేనిమీఁద ప్రేమ యుండునో, నీ యంతఃకరణము దేని కంగీకరించునో దానికే భక్తి భావముతోఁ బూజార్చలను గావింపుము. దానిని నిరంతరము ధ్యానము చేయుము. నీవు చివరకు ప్రేమను జేసుకొందువు. నీ యుపాస్యమును నేదో యొకదానిని నిశ్చయించుకొనుము. నీ హృదయములో నేదో యొక ప్రియమును గూర్చుండఁ బెట్టుకొనుము. నీవు తరించితివి. భార్య భర్తయందు భగవద్భావన యుంచి వానిని ధ్యానింపవలెను. శిష్యుఁడు గురువును సాక్షాత్పరబ్రహ్మ యొక్క సాకార స్వరూపముగ భావించి వానికి నమస్కరించుము. వీటి యన్నిటి ఫలము చివరకొక్కటే. అందరు దమ యంతిమ యభీష్టము వఱకుఁ జేరుదురు, అందఱకు వారివారి భావనాను సారముగ ప్రభుపదప్రాప్తి లేదా ముక్తి లభించును. అందఱకు దుఃఖము లత్యంతాభావములగును. ఇది సచేతన సాకారవస్తువునందు ప్రేమ నుంచు పద్ధతి ఱాయి, మట్టి, ధాతువు, మఱియే యితర వస్తువుచేనైన మూర్తిని జేసి దానియం దీశ్వరబుద్ధిచేఁ బూజనము చేయునెడల నీకు శుద్ధ విశుద్ధ ప్రేమ ప్రాప్తి కలుగునని కూడ హిందూమతములో సిద్ధాంతము చేసినారు. కాని దానిలో దంభముగాని, కృత్రిమముగాని పనికిరాదు. దీని యందు నాకు పూర్ణానురాగము కలదా ? లేదా ? యని నీ హృదయమును బరిశోధించుకొనుము. ఏదో ఒకదాని

యందు నీకుఁ బూర్ణప్రేమ యుండేనా, నీకు కల్యాణమేకలదు. నీ సర్వస్వ మదియే యగును,

నిత్యానందప్రభువు పండ్రెండు పదుమూఁడేండ్ల యల్ప వయస్సులోనే యిల్లు విడిచివచ్చెను. దాదాపు ఇరువది వత్సరముల వఱ కితఁడు తీర్థములలో భ్రమణము చేయు చుండెను. ఈయన వెంటనున్న సన్న్యాసి యీతనిని వదలి యెచ్చటికి పోయినాఁడో జాడలేదు, కాని యీ మహాత్ముని కీతని హృదయమందేమియు విశేషస్థానము లభింపలేదని తప్పక తోఁచవచ్చును. ఆయనయం దీతనికి గురు భావము కలుగ లేదు. ఇరువది వర్షము లిట్లు అటునిటు తిరిగినాఁడు కాని యే ప్రేమ కొఱకీతని హృదయము కొట్టుకొను చుండెనో, ఆప్రేమ యీతని కెచ్చటను దొరకలేదు. మహాప్రభు గౌరాంగుని నామమును వినుటతోడనే యీతని హృదయ సాగరములోఁ దరంగములెగుర మొదలిడెను. గౌర దర్శనము కొఱకు మనస్సు వ్యాకులము చెందుచుండెను. అందువలన నీతఁడు నవద్వీపము వైపునకు వచ్చెను నేఁడు. నందనాచార్యుని యింటికి గౌరాంగుఁడు స్వయముగ వచ్చి యీతనికి దర్శన మిచ్చెను. ఈతని దర్శన మాత్రము చేతనే యీతని చిరకాల మనోకామనా పరిపూర్తి యయ్యెను. ఎవనికొఱ కీతఁడు వ్యాకులతను జెంది దేశవిదేశములలోఁ దిరుగు చుండెనో, ఆ వస్తువు నేఁడు స్వయముగనే యీతనికిఁ బ్రాప్తించెను. ఈతఁడా సన్న్యాసి, గౌరాంగుఁ డింకను గృహస్థుఁడుగానే

యుండెను. వయస్సులోను గౌరాంగునికంటె నీతఁడు పది పండ్రెండు సంవత్సరములు పెద్దయే, కాని ప్రేమలోఁ బిన్న పెద్దలుగాని, ఉచ్చనీచలుగాని యుండఁజాలవు. ఈతఁడు సర్వాత్మ భావేన గౌరాంగునికాత్మ సమర్పణము కావించెను, గౌరాంగుఁడును నితని దన యన్నగా భావించి యంగీకరించెను.

నందనాచార్యుని యింటినుండి నిత్యానందుని వెంటఁగొని గౌరాంగ భక్తులతోఁగూడి శ్రీవాస పండితుని యింటికి చేరెను. అక్కడికి చేరఁగానే సంకీర్తన ప్రారంభ మయ్యెను. భక్తులందఱును నిత్యానందుని యాగమనోల్లాసములో నూతనోత్సాహముతో భావావేశములోఁబడి బిగ్గఱగ కీర్తనచేయ మొదలిడిరి. భక్తప్రేమలో విహ్వలులై యొక్కొక్కప్పుడు నృత్యము చేయుదురు. ఒక్కొక్కప్పుడు పాడుదురు. ఒక్కొక్కప్పుడు బిగ్గఱగ 'హరిబోల్' యొక్క తుములధ్వని చేయుదురు. నేఁటి కీర్తనములో మిక్కిలి యానందము రా మొదలు పెట్టెను. భక్తులందఱు ప్రేమలో మునిఁగి యొడళ్ళు తెలియక తమ్ముఁదాము మఱచి నట్లుండెను. ఇప్పటి వఱకు గౌరాంగుఁడు శాంతముగ నుండెను. ఇప్పు డతఁడును నిలువలేక పోయెను. అతఁడును భక్తులతోఁ గూడి యొడలు తెలియక బిగ్గఱగ హరిధ్వని చేయ మొదలిడెను. మహాప్రభువు నిత్యానందుని రెండు చేతులను బట్టుకొని యానందముచే నృత్యము చేయుచుండెను. నిత్యానందుఁడును కాష్ఠప్రతిమవలె మహాప్రభుని యాధారముచే నృత్యముచేయు చుండెను. ఆహా,

ఆ సమయమున నా సౌందర్యవర్ణన మెవఁడు చేయఁగలఁడు ? భక్త బృందము మంత్రముగ్ధులవలె నీ మహాపురుషు లిద్దరి నృత్యమును గాంచుచుండిరి. మార్దంగికుఁడు మృదంగము వాయించలేక పోయెను. మంజీరమును వాయించువాని చేతల నుండి మంజీరము దానికదియే క్రిందపడెను. వాద్యములన్నియు మ్రోఁగుట యాగిపోయెను భక్తులు జడమూర్తులవలె మెదలక నిలువఁబడి నిమాయి నితాయిల నృత్య మాధుర్యమును నిరంతర భావముతోఁ బానము చేయుచుండిరి. నృత్యము చేయుచుఁ జేయుచు నిమాయి నితాయిని యాలింగనము చేసికొనెను. ఆలింగనమును బొందఁగానే నితాయి స్పృహతప్పి భూమి మీఁద పడిపోయెను, వెంటనే నిమాయియును చేతనాశూన్యుఁ డయ్యెను.

ఒక్క-క్షణములోనే మహాప్రభువు త్వరితముగ లేచి నిలుచుండి త్వరగా భగవదాసనముపైఁబోయి కూర్చుండెను. ఇప్పుడాతని శరీరమందు బలరామావేశము కనఁబడెను. ఆభావావేశములోనే 'వారుణీ' 'వారుణీ' యని బిగ్గఱగ నఱువ మొదలిడెను. చేతులు జోడించి శ్రీవాస పండితుఁ డిట్లనెను :— 'ప్రభూ ! ఏ 'వారుణి'ని గూర్చి మీరడుగు చుంటిరో, అది మీవద్దనే యున్నది. మీరెవనిపైఁ గృపఁ జూపుదురో వాఁడే యావారుణిని బానము కావించి యున్మత్తుఁడు కాఁగలఁడు.'

ప్రభువు వారి భావావేశమును తగ్గించుట కొక భక్తుఁడు సీసాలో గంగాజలమును నింపి ప్రభువునకిచ్చెను, గంగాజల

పానము గావించి ప్రభువు కొంచెము కొంచెముగ ప్రకృతిస్థుడై మరల నిత్యానందుని చేతులతో లేవనెత్తెను.



ఈ విధముగ భక్తులందఱును ఆదినము సంకీర్తన మందు మిక్కిలి యానందానుభవమును జెందెను. ఈ సోదరు లిద్దర నృత్య సుఖమును భక్తులందఱును మిక్కిలిగ చూరఁగొనిరి. శ్రీవాస పండితుని యింటినే నిత్యానంద ప్రభు నివాస స్థానముగ స్థిరపఱిచిరి. ప్రభువు తనతో నితాయిని తనయింటికిఁ గొనిపోయి శచీమాతతో నిట్లనెను:- 'అమ్మా! చూడుము, ఇడుగో నీవిశ్వరూపుఁడు తిరిగివచ్చినాఁడు. నీవు వానికొఱకు చాల దుఃఖించితివి' శచీమాత యాదినమున నిజముగనే నిత్యానంద ప్రభునిలో విశ్వరూపుని రూపమును గనెను, ఆయన నప్పటి నుండి చివరవఱకు ఆ భావముతోడనే ప్రేమించుచుండెడిది. ఆమె నితాయిని, నిమాయిని యిద్దరను సమానముగ పుత్రభావముతోఁ బ్రేమించుచుండినది.



ఒక దినమున మహాప్రభువు నిత్యానందుని ప్రేమతోఁ జేయి పట్టుకొని 'శ్రీపాదా! రేపు గురు పూర్ణిమ. వ్యాస పూజనమున కేస్థానమనుకూలముగ నుండు' నని యడిగెను.



నిత్యానంద ప్రభువు శ్రీవాస పండితుని పూజాగృహము వైపునకు సంకేతము కావించి 'ఈ స్థానమందు వ్యాసపూజనము జరుగదా?' అనెను.

నవ్వుచు గౌరాంగుఁ డిట్లనెను :- 'అవును, బాగుగానే యున్నది. ఆచార్యుఁడు శ్రీవాస పండితుఁడే. వీరిని బూజింప వలయును. మంచిది, బాగుగానే యున్నది. ఇప్పుడు పండితుఁడే సమస్త సామగ్రి చేకూర్చును. పూజోత్సవ భారమంతయు నీయన మీఁదనే యున్నది.'

ప్రసన్నతను బ్రకటించుచు శ్రీవాసపండితుఁ డిట్లనెను :- 'భారమేమి లెక్క, పూజా సామగ్రి యింటిలోనే యున్నది. అరఁటి పండ్లు, మామిడి పండ్లు, పల్లవ పుష్ప ఫలములు, సమిధాదులు, ఆవశ్యకమగు నితర వస్తువులు నేఁడే తెప్పింతము. ఇవి కాక యింకే వస్తువులు కావలెనో మీరే చెప్పుడు.'

'ఇప్పుడు నేనేమి చెప్పుదును. మీరేకదా ఆచార్యులు. అన్నియు మీరే గ్రహించి సేకూర్చుఁడు పదండి, కాలా తీతమైనది. ఇప్పుడు గంగా స్నానముచేసి వత్తము' అని ప్రభువనెను.

ఇది వినఁగానే శ్రీవాసుఁడు,మురారి గదాధరుఁడు మొదలగు భక్తులందఱు నిమాయి, నితాయి సహితముగ గంగా స్నానార్థము వెడలిరి. నిత్యానందుని స్వభావము పూర్తిగా బాలుర చేష్టలవలె నుండును. అతఁ డెగురుచు నెగురుచు మార్గమున బోవును. గంగలోఁ బ్రవేశించెనా మరలబయటకువచ్చు టెఱుఁగఁడు గంటలకొలఁది నీటిలోనే మునుఁగుచుండును. ఒకొక్క ప్పుడు వెల్లకిల పరుండి చాలదూరము వఱకు ప్రవాహములోఁ

బోవుచుండును. భక్తులందఱతో నతఁడును స్నానముచేయ మొదలిడెను. ఇంతలోనే ఆ సమయమున నొక ముక్కు చీమిడి నీటిలోఁ గనఁబడెను, వెంటనే యాతఁడు దానిని బట్టుకొనుటకు పరుగెత్తెను. ఇది చూచి శ్రీవాసపండితుఁడు హాయి హాయి యనుచు నఱచినను వినువాఁడెవరు? ముందుకు సాగిపోవుచునే యుండెను. శ్రీవాసుఁడు చెప్పఁగా స్వయముగ గౌరాంగుఁడు కేక వేయఁగా నెక్కడికోపోయి యితఁడు తిరిగివచ్చెను. ఈతని పనులన్నియు విలక్షణములుగ నుండెడివి. దీనికి ముందు రాత్రియే యీతడేమను కొనినాఁడో తన దండకమండలాదులన్నిటిని విఱిచి పగులఁగొట్టివైచెను. ప్రభువు దాని కారణమడుగఁగా నాతఁడు మెదలకూరకుండెను. అంతట ప్రభువు వానిని మిక్కిలి యాదరముతో నేతి గంగలోఁ బ్రవహింపఁజేసెను.

వ్యాసపూర్ణిమ దినమున భక్తులందఱును స్నాన,సంధ్యావందనాదులు చేసికొని శ్రీవాసపండితుని యింటికి వచ్చిరి. పండితుఁడు నేఁడు తన పూజా గృహమును బాగుగా నలంకరించెను. అక్కడక్కడ తోరణములు కట్టఁబడెను. ద్వారములో కదలీ స్తంభములు చాల యందముగ నుండెను. ఇల్లంతయు గోమయముచే నలకఁబడెను. దానిమీఁద నొక సుందర పాన్పు పఱచిరి. భక్తులందఱును వచ్చి వ్యాసపీఠము సమ్ముఖమునఁ గూర్చుండిరి. ఒక యున్నత స్థానమున చిన్న వేదిక నుంచి దానిమీఁద వ్యాసపీఠము నిర్మింపఁబడెను, వ్యాసుల

వారి సుందర విగ్రహము దానిమీఁద విరాజిల్లు చుండెను. ముందు పూజా సామగ్రి యంతయుఁ బెట్టఁబడి యుండెను. చాల పళ్ళెరములలో మంచి పక్వఫలముల నుంచిరి. ఒక ప్రక్కన నింటిలోఁదయారు గావించిన మిఠాయిలు పెట్టఁబడినవి. ఒక పళ్ళెములో నక్షతలు, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, పూగీఫలములు, పుష్పమాల, యితరపూజా సామగ్రి సుశోభితమై యుండెను, పీఠమునకుఁ గుడిప్రక్కన ఆచార్యుని యాసనము వేయఁబడినది. భక్తులు బలవంతము చేయఁగా పూజాపద్ధతిని చేతిలోఁగైకొని శ్రీవాస పండితుఁ డాచార్యాసనమున విరాజిల్లెను. భక్తులు విధిప్రకారము వ్యాసపూజ కావించిరి. ఇప్పుడు నిత్యానందుని వంతు వచ్చెను. అతఁడు శ్రీవాసుఁడు చెప్పఁగా పూజచేయఁ బ్రారంభించెను. శ్రీవాస పండితుఁ డొక సుందరమగు మాలను నిత్యానందుని చేతి కిచ్చుచు 'శ్రీపాదా! దీనిని వ్యాసుల వారికి వేయుఁడ' నెను. శ్రీవాసుఁడిట్లు చెప్పినప్పటికిని వ్యాసులవారి కా మాలను వేయక తన చేతిలోనే ధరించి మెదలక నిలుచుండెను. అంత మరల శ్రీవాస పండితుఁడు కొంచెము పెద్దగా 'శ్రీపాదా! మీరు నిలుచుండిరేల? మాల వేయరేమి' యనెను. రాతి విగ్రహము నిలుచుండినట్లు మాలను చేతిలోనికిఁ గైకొని నిత్యానందుఁ డట్లే వినని వానివలె నిలుచుండెను. అంత శ్రీవాస పండితుఁడు గాబరాపడి, యితఁడు మనమాట వినుట లేదు, ప్రభువు వచ్చి చెప్పిన యెడల వినునని తలఁచెను.

ప్రభువప్పు డింకొక వైపు కూర్చుండి యుండెను. శ్రీవాసుఁడు ప్రభువును బిలుచుచు 'ప్రభూ! నిత్యానందుఁడు వ్యాసునకు మాలను వేయుటలేదు. మీరితనికి మాలవేయు మని చెప్పుడు, ఆలస్యమగుచున్న' దనెను.

ఇది విని ప్రభువు కొంచెము ఆజ్ఞా స్వరముతో నిత్యానందునితో నిట్లనెను:- 'శ్రీపాదా! వ్యాసదేవునకుఁ బూల మాల వేయ రేల? చూడండి, ఆలస్యమగుచున్నది. భక్తులందఱు మీకొఱకు ప్రతీక్ష చేయుచు కూర్చుండి యున్నారు. త్వరగాఁ బూజను సమాప్తము కావింపుఁడు. తర్వాత సంకీర్తన జరుగఁగలదు.'

ప్రభువువారి యీమాటను విని నితాయి నిద్రనుండి లేచిన వానివలెఁ దనకు నలువైపులఁ జూడ మొదలిడెను. ఆ చూచుట యేదో ఒక విశేష వస్తువు కొఱకన్వేషణము చేయుచున్నట్లుండెను. ఇటునటు చూచి యాయన తన చేతి మాలను వ్యాసదేవునకు వేయనేలేదు. త్వరగాఁ దీసికొనిపోయి గౌరాంగుని శిరస్సున వేసెను. ప్రభువువారి దీర్ఘములై యుంగరములు తిరిగిన వెంట్రుకలపై చిక్కుపడి యది యెంతో అందముగ నుండెను. భక్తులందఱు నానందములో నొడలు తెలియని స్థితిలో నుండిరి. ప్రభువు కొంచెము సిగ్గుపడి నట్లుండెను. నిత్యానందుఁడు ప్రేమలో మునిఁగి యుండుటచే మూర్ఛితుఁడై నట్లుండెను. ఆహా! ప్రేమ యనిన నిట్లుండవలెను. తన ప్రియతమునిలో సమస్త దేవీదేవతలను, విశ్వమును దర్శించవలెను

గౌరాంగునే తన సర్వస్వ మనుకొను నితాయికి ఆయన యెడల నట్టి భావమే యుండెను. ఆయన మనోగత భావమిది:-

శ్లో॥ త్వమేవమాతాచ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవ దేవ ॥

(నీవే తల్లివి. తండ్రివియు నీవే. నీవే బంధువు. సఖుఁడవు నీవే. నీవే విద్యవు. ద్రవ్యమును నీవే. ఓ దేవదేవ! నాకు సర్వస్వము నీవే.)

గౌరాంగుఁడే ఆయునకు సర్వస్వమును. ఆతని భావనాను సారముగనే ఆతనికిఁ బ్రత్యక్ష ఫలముకూడ ప్రాప్తించినది. ఆతని సమక్షమునుండి గౌరాంగుని యీ నిత్యమానుషిక మూర్తి విలుప్తమయ్యెను. ఇప్పుడాతనికి గౌరాంగుని షడ్భుజ మూర్తి యొక్క దర్శనమయ్యెను. గౌరాంగుని ముఖకాంతి కోటిసూర్యప్రభా భాసమానమైనట్లుండుటయే గాక అంతకు మించియున్నట్లాతఁడు దర్శించెను. ఆతని నాల్గు చేతులలో శంఖము, చక్రము, గద, పద్మము విరాజిల్లుచుండెను. మిగిలిన రెండు చేతులలో నాతఁడు నాగలిని, ముసలము (రోఁకలి) ను ధరించియుండెను. ప్రభువువారి యీయద్భుతరూపమును గాంచి తాను కృతకృత్యుఁడైనట్లు నిత్యానందుఁ డనుకొనుచుండెను. ఆతని నేత్రములా దర్శనము నుండి తృప్తిఁజెందుట లేదు, ఆతని రెండు కండ్లు తెఱచినవి తెఱచినట్లే యుండెను. కను

ఱెప్పలు పడుట ఒక్కసారిగా నాగిపోయెను. నేత్రములయొక్క రెండు కొలకుల నుండియు నశ్రుధార ప్రవహించు చుండెను. శరీరము చేతనా శూన్యమయ్యెను. ఆతనికి శ్వాసలాగిపోవుటను భక్తులందఱును గాంచిరి. ఆతని శరీరము చచ్చిన వాని శరీరము వలె నీల్గి బిఱుచుకొని యుండెను కేవలము ముఖముయొక్క యపూర్వ జ్యోతిని గాంచియు, నేత్రములనుండి వెలువడు యశ్రుధారలను బట్టియు నాతఁడు జీవించి యున్నాఁడనుకొన వలసి వచ్చుచున్నది భక్తులితని యీస్థితిని గాంచి మిక్కిలి భయపడిరి. శ్రీవాసాది భక్తులందఱు అనేకోపచారముల ద్వారా యాతనిని స్పృహలోనికి వచ్చునట్లు చేయఁ జూచిరి. కాని ఆతనికి బొత్తుగా స్పృహ కలుగలేదు, నిత్యానందుఁడే విధముగనైనను లేవక పోవుటను ప్రభువు కాంచి, తన కోమల కరకమలముచే నాతని శరీరమున నిమురుచుఁ బ్రభు వత్యంత ప్రేమతో నిట్లనెను:- 'శ్రీపాదా! ఇప్పుడు లెండు. ఏ కార్యమును సాధించుటకు నీవీ శరీరమును ధరించితివో, యిప్పుడా కార్యమును బ్రచారము చేయుటకు కాలమాసన్నమైనది. లెండు, మీయహైతుక కృపామూలమున జీవుల నుద్ధరింపుడు. అందఱును నీకృపకొఱకై నిరీక్షించుకొని కూర్చుండియున్నారు. నీ వెవరి నుద్ధరింపఁదలఁచితివో వారి నుద్ధరింపుఁడు. శ్రీహరి యొక్క సుమధుర నామమును బంచి పెట్టుఁడు. నీవు జీవుల యందు దయజూపక భగవన్నామమును బంచిపెట్టకున్న పాపు లుద్ధరింపఁబడుటెట్లు?'

ప్రభువుయొక్క కోమల కరస్పర్శచే నితాయి యొక్క మూర్ఛ భంగమయ్యెను. ఆతఁ డిప్పుడు కొంచెము కొంచెముగఁ బ్రకృతిస్థుఁడగు చుండెను. నిత్యానందుఁడు స్పృహలోనికి వచ్చినట్లు గ్రహించి భక్తులతోఁ బ్రభువు 'వ్యాసపూజ అయిపోయినది. ఇప్పు డందఱును గలిసి యొక్కసారి సుమధుర స్వరముతో శ్రీకృష్ణ సంకీర్తనమును జేయుఁ' డనెను. ప్రభు వాజ్ఞ కాఁగానే మృదంగము వాయింపఁబడెను. భక్తులందఱును చేతులలో దాళములను గైకొని మిక్కిలి ప్రేమతోఁ గీర్తింప మొదలిడిరి. అందఱును బ్రేమ విహ్వలులై యొక్కసారిగ—

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

ఈ సుమధుర సంకీర్తనమును జేయసాగిరి. సంకీర్తనము యొక్క సుమధుర ధ్వనిచే శ్రీవాసపండితుని యిల్లు ప్రతిధ్వనించు చుండెను. సంకీర్తన ధ్వనిని విని దర్శకులు చాలమంది ద్వారప్రదేశమున మూఁగిరి. కాని ద్వారకవాటము మూయఁబడి యుండెను. వారు బయట నిలుచుండియే సంకీర్తనానందమును గొల్లగొట్టుకొనుచుండిరి. ఈ విధముగ సంకీర్తనానందముచే నెవరికిని నింతకాలమైనదను జ్ఞానము లేకుండెను. సూర్యాస్తమానమయ్యెను. అప్పటికి బ్రభువు సంకీర్తన నాపుమని యాజ్ఞాపించెను. అంత శ్రీవాసపండితుఁడు 'ప్రసాదమంతయు నిచ్చుటకుఁ దీసికొనిరం' డనెను. ప్రభువువారి

యాజ్ఞానుసారముగా శ్రీవాస పండితుఁడు ప్రసాదము నంతయుఁ బళ్ళెరములలోఁ బెట్టుకొని ప్రభువువారి దగ్గఱకుఁ దెచ్చిరి. ప్రభువువారు స్వయముగఁ దన చేతులతో నక్కడ కూర్చున్న భక్తులందఱకు ప్రసాద వినియోగము కావించిరి. ఆ మహా ప్రసాదమును బొంది భక్తులందఱును దమ తమ యిండ్లకు వెడలిపోయిరి.

ఈ విధముగ నిత్యానందుఁడు శ్రీవాస పండితుని యింటి యందే నివసింపసాగెను. శ్రీవాస పండితుఁడును, ఆతని ధర్మపత్ని మాలినీదేవియు నాతని తన స్వంత పుత్రునివలెఁ బ్రేమింప మొదలిడిరి. నిత్యానందునకు తన తల్లిదండ్రులను వదలి నేఁటికి షుమారిరువది సంవత్సరములయ్యెను. ఇరువది-సంవత్సరములనుండి యీతఁడు దేశవిదేశములలోఁ దిరుగుచుండెను. ఇరువది సంవత్సరముల తర్వాత నిప్పుడు మరల మాతాపితృ సుఖమునుబొంది యీతఁడు పరమ ప్రసన్నుఁడయ్యెను. గౌరాంగుఁడును నీతని హృదయపూర్వకముగ మిక్కిలి యాదరించుచుండెడువాఁడు. ఆతఁడు తన యన్న కంటె మిన్నగ నితనిని భావించుచుండెడువాఁడు. అప్పుడే యథార్థమైన ప్రేమ యుండును. రెండు వైపులనుండియు సత్కార భావమున్నప్పుడే యభిన్నత గోచరించును. శిష్యుఁడు తన గురువును సర్వస్వముగ నెంచవలయును. గురువు శిష్యుని నౌకరిగాను జీతగానిగాను నెంచక తన యంతరంగ సఖుఁడుగ భావించినప్పుడే దృఢ ప్రేమయుండును. గురువు తన గురుత్వము

లోనే యుండి, శిష్యుఁడు తన సేవకత్వము లేక దాసత్వము లోనే యుండి, శిష్యుఁడు యనిచ్ఛాపూర్వకముగఁ కర్తవ్యముగా నెంచుకొని సేవాశుశ్రూషలు చేయునెడల, వారిద్దరకు యథార్థమైన ప్రేమ యుండఁజాలదు. శ్రీకృష్ణార్జునులున్నట్లు గురుశిష్యు లుండవలయును. శాస్త్రములలోఁ జెప్పినట్లు జనక, శుకదేవులవలెనైన నుండవచ్చును. నిత్యానందుఁడు గౌరాంగుని తన సర్వస్వముగ నెంచెడువాఁడు. కాని గౌరాంగుఁడతని నెల్లప్పుడును తనకుఁ బూజ్యునిగ భావించి యాదర సత్కారములను జేయుచుండెడువాఁడు. ఇదియె ఈ మహా పురుషులలోఁగల విశేషత.

నిత్యానందుని స్వభావము మిక్కిలి చంచలమైనది. ఆతఁ డప్పుడప్పుడు తన చేతులతో భోజనము చేయువాఁడు కాఁడు. అప్పుడు మాలినీదేవి తన చేతులతోఁ జిన్నపిల్లలకు వలె భోజనము నోటిలోఁ బెట్టుచుండెడిది. ఒక్కొక్కప్పుడాతఁడామె తన శుష్క స్తనములను ఆయన నోట నదించి బాలకులవలె పాలు త్రాగించుచుండెడిది. ఆతఁడొక్కొక్కప్పుడామె వడిలో శిశువులవలెఁ క్రీడించుచుండెడువాఁడు. ఈ విధముగ నితఁడు శ్రీవాసునకు, ఆయన భార్యయగు మాలినీదేవికి వాత్సల్య సుఖానందము నొసంగుచు నింటిలో సుఖపూర్వకముగ నివసించుచుండెను.



# అద్వైతాచార్యుని పైఁగృప

శ్లో॥ సఖి! సాహజికం ప్రేమ దూరాదపి విరాజితే।
చకోరినయన ద్వంద్వ మానందయతి చంద్రమాః॥
(సు. ర, భాం. ౯౨-౨)

(ఒక సఖి ప్రేమలో నధీరురాలైన యొకానొక నాయికతో నిట్లు చెప్పుచున్నది:- 'ఓ సఖి! స్వాభావిక సహజప్రేమ యున్నయెడల నాప్రేమ పాత్రుఁ డెంతటి దూరములోనైన నుండుగాక, యదెన్నటికిని తగ్గిపోదు. ఆకాశమున వెలుఁగుచుండియును చంద్రుఁడు చకోరపక్షియొక్క నేత్రద్వయమున కానంద ప్రదానము కావించుచునే యుండును.)

ప్రేమ నిజముగ స్వాభావికమైనను, వాస్తవముగ దానిలో నేవిధమైన సాంసారిక స్వార్థము లేకున్నను రెండు వైపులనుండి హృదయమందొక రకమైన తరంగము లుబికినట్లుండును.

హృదయములో మనస్సును లాగుచున్నట్లుండుటను గాంచియే, యేమైనఁ గానిండు ఇది ప్రేమ బలమని యూహింపవచ్చును. అయినప్పటికి నిశ్చయ పూర్వకముగఁ జెప్పఁజాలరు. నిశ్చయాత్మక క్రియ నిచ్చుటలో భయపడుదురు. ధన్యుఁడు! యథార్థముగ దీనికి మించిన ప్రేమ పరిభాష యుండఁజాలదు.

శాంతిపురములోఁ గూర్చుండిన యద్వైతాచార్యుఁడు గౌరాంగుని లీలలన్నిటిని విని, మనస్సులోనే ప్రపన్నుఁడగు

చుండెను. తన ప్రియుని ప్రశంసను విని హృదయములో స్వాభావికముగానే యొక విధమైన యుల్లాసము కలుగును మహాప్రభుని యశఃసౌరభ మిప్పుడు మెల్లమెల్లఁగా గౌడదేశ మందంతటను వ్యాప్తమయ్యెను. ఆచార్యుఁడు ప్రభువువారి భక్తిభావమును గూర్చిన విషయములను విని యానందముచే నుప్పొంగి నృత్యము చేయ మొదలిడి తనలోఁ దానిట్లనుకొను చుండును. 'నేనెన్నాళ్ళనుండియో గంగాజలము, తులసీదళముల చేఁ భక్తభయభంజనుఁడగు భగవానుని జిరకాలము బూజించి నందులకు, ఆనాపూజ నేఁడు సఫలమైనట్లు తోఁచు చున్నది. గౌరహరి విశ్వంభర భగవానుని రూపముతోఁ బ్రత్యక్షమై భక్తుల దుఃఖములను దూరము చేయఁగలఁడు.' 'ప్రభువువారి ఛత్రచ్ఛాయయందుండి అనేక భక్తులు పావన మగుచున్నారు. వారు గౌరహరియొక్క సంసర్గము చేతను, సంపర్కము చేతను కృతకృత్యులగుచున్నారు. నీవును బోయి నీ యీ నీరసజీవనమును సార్థకమేల చేసికొన' వని యాతని హృదయము చెప్పుచున్నట్లుండెను. కాని ప్రేమలోను నొక విధమైన మధురమగు అభిమానము కలదు. తన ప్రియుని కృపాప్రతీక్షయందును ఒకానొక యనిర్వచనీయమగు సుఖము లభించును. కావున కొంచెము సేపటికే యాతఁడు 'నేను స్వయముగ నేల పోవుదును! ఆతఁడు నా యిష్టదేవుఁడైనప్పుడు నన్నాయన స్వయముగనే పిలువఁగలఁడు. పిలువనిది నేనేల పోవలె' నని యనుకొనుచుండును. ఈ యన్ని

కారణములవలన నిష్టమున్నను నద్వైతాచార్యుఁడు శాంతిపురమునకు వచ్చుట లేదు.

ఇచ్చట మహాప్రభువు భావావేశము కలిగినప్పుడు బిగ్గఱగా 'నాఢా' యెక్కడ నున్నది? నన్నుఁబిలిచి 'నాఢా' స్వయముగ శాంతిపురములో బోయి దాగుకొన్నాఁడు. వాని హుంకారముచేతనే నేను వచ్చితి' నని యఱచుచుండెను. మొదట మొదట 'నాఢా' యనఁగాఁ బ్రభువు వారి యభిప్రాయ మేదియో భక్తగణమునకుఁ దెలియఁ లేదు. శ్రీవాసపండితుఁడు దీనతా భావముతో 'నాఢా' యనఁగా నేమియో తెలిసికొనఁ దలఁపగా నంతఁ బ్రభువు స్వయముగ 'అద్వైతాచార్యుని ప్రార్థన చేతనే మేము జగదుద్ధారము కొఱకు భూమిమీఁద నవతరించితిని. 'నాఢా' అనుటచే నాయభిప్రాయము ఆయనయే' యని చెప్పెను.

ఇప్పుడు నిత్యానందుఁడు ప్రభువు వారి నవద్వీపమునకు వచ్చుటచే గౌరాంగుని యానంద మధికమయ్యెను. ఇప్పుడాతఁ డద్వైతుఁడు లేక యెట్లుండఁగలఁడు? అద్వైతుఁడు, నిత్యానందుఁడు వీరితని పరివారములో ప్రధాన స్తంభములు. అందువలన నొక దినమున నేకాంతమునఁ బ్రభువు శ్రీవాస పండితుని తమ్ముఁడగు రాముని శాంతిపురము పోవుఁడని సంకేతము చేసెను ప్రభువువారియింగితమును దెలిసికొని రమాయీ పండితునకుఁ బరమ ప్రసన్నత కలిగెను. ఆతఁ డా సమయ

మునసే యద్వైతాచార్యుని తీసికొని వచ్చుటకు శాంతిపురము నకు బోయెను.

శాంతిపురము చేరిన తర్వాత రమా యీ పండితుఁ డాచార్యుని యింటికి బోయెను. ఆ సమయమున నాచా ర్యుఁడు తన యింటి ముందు కూర్చుండి యుండి, దూరము నుండియే శ్రీవాసపండితుని సోదరుఁడు వచ్చుటను గాంచి యాతఁడు గద్గదికుఁడయ్యెను. ఆతని ప్రసన్నతకు మేఱలేదు. 'ఇప్పుడు నాకు శుభదినములు వచ్చినవి. దయయుంచి ప్రభువు నన్ను స్వయముగఁ బిలుచుకొని పోవుటకు రమాయి పండితుని బంపినాఁడు. భగవంతుఁడు భక్త ప్రతిజ్ఞయందు తన యైశ్వర్య మును గూడ మఱచునంతటి విలువ యుంచు' నని యాచా ర్యుఁడు గ్రహించెను. ఇంతలోనే రమాయి వచ్చి యాచా ర్యునకుఁ బ్రణామము కావించెను. ఆచార్యుఁడును ఆతనిని ప్రేమాలింగనము చేసికొనెను. ఆచార్యుని ప్రేమాలింగన మును బొంది రమాయి పండితుఁడొకవైపు నిలుచుండి యాచా ర్యుని వైపు చూచి కొంచెముగ నవ్వ మొదలిడెను. ఆతఁడు నవ్వుటను గాంచి యాచార్యుఁ డిట్లనెను:- 'ప్రభువు నన్ను స్మరించినట్లు తోఁచుచున్నది. కాని యథార్థముగ నాతఁడే నా ప్రభువని నాకేమి యెఱుక ? భూమిమీఁద సంకీర్తన ప్రచా రము చేయుట కవతరింపఁగోరిన నాయారాధ్య దైవ మీతఁడే ననుటకేమైన మీవద్ద ప్రమాణమున్నదా ?'

కొంచెముగ నవ్వుచు రమాయి పండితుఁడు 'ఆచార్య

మహాశయా! మేమంత పండితులము కాము. ప్రమాణములు, హేతువులు మీబోటి విద్వాంసు లెఱుఁగఁగలరు. అయితే ఒక్క విషయము మాత్రము మాకుఁ దెలియును. అదే మనఁ బ్రభువు మాటిమాటికి మిమ్ములను స్మరించుచు 'అద్వైతా చార్యుఁడే నన్ను బిలచినాఁడు. ఆతని హుంకారమునకు వశీ భూతుఁడనై నేను భూతలమునకు వచ్చితిని. లోకోద్ధారము కావలెనను నధిక చింత అద్వైతాచార్యునకే కలదు. అందు వలన నతని చింతను దూరము చేయుటకే శ్రీకృష్ణ సంకీర్తనము ద్వారా లోకోద్ధారము చేయుటకే నే నవతరించితిని' అను చుండును.

అద్వైతాచార్యుఁడు లోలోన నానందమగ్నుఁడగు చుండెను. ప్రభువుయొక్క దయాళుతను, భక్తవత్సలతను, కృపాళుతను స్మరించ నాతని హృదయము ద్రవీభూత మగు చుండెను. ప్రేమ కారణమున నతని కంఠమవరుద్ధ మయ్యెను. ఇచ్ఛయున్నను ఆతఁడేమియు నోటినుండి పలుకఁజాలకుండెను. ప్రేమలో గద్గదికుఁడై యాతఁడు రోదనము చేయ మొదలిడెను. దగ్గఱనే కూర్చుండిన ఆయన ధర్మపత్ని సీతాదేవి యును ఆచార్యుని యిట్టి దశను గాంచి ప్రేమకారణమున నశ్రువులు రాల్చుచుండెను. ఆచార్యుని పుత్రుఁడును తల్లి దండ్రులు ప్రేమలో విహ్వలు లగుటను గాంచి రోదనముచేయ మొదలిడెను.

కొంచెము సేపైన తర్వాత నద్వైతాచార్యుని ప్రేమ

వేగము కొంచెముగఁదగ్గెను. ఆతఁడు వెంటనే పూజాసామగ్రి నంతను ప్రోవుచేసి, తన భార్యాపుత్రులను వెంటఁగైకొని రమాయీ పండితునితోను నవద్వీపము వైపునకు బోయెను. నవద్వీపము చేరఁగానే ఆచార్యుఁడు రమాయీ పండితునితో నిట్లనెను:—'చూడుఁడు, మేమీవిధముగా ప్రభువువారి దగ్గఱకు రాఁజాలము. మేమీ నందాచార్యుని యింటిలోనే యుందుము. నీవు సరిగా నింటికి బొమ్ము. ఒక వేళ ప్రభువు మారాక విషయములో నేమైన నడిగినచో 'వారు రాలే'దని చెప్పవలెను. వారికి మామీఁద యథార్థమైన ప్రీతియున్న యెడల నాతఁడు మాదగ్గఱకు స్వయముగనే పిలిపింతురు. ఆతఁడు మా శిరస్సు పైన తన చరణముల నుంతురు. ఆయనకు మామీఁదఁ గృప కలదనియు మా ప్రార్థన వలననే జగదుద్ధారము నిమిత్తమవత రించినాఁడని అప్పుడు తెలిసికొనఁగలము.'

ఆచార్యుని యీ మాటలను విని రమాయీ పండితుఁడు తన యింటికి వెడలిపోయెను. సాయంకాలమునకు భక్తులంద ఱును వచ్చి శ్రీవాసపండితుని యింటిలోఁ జేరుచుందురు. కొంచెము సేపటికి ప్రభువుకూడ వేంచేయును. నేఁడు ప్రభువు ఇంటిలోఁ బ్రవేశించుటతోడనే భావావేశములోనికి వచ్చెను. భావావేశమున నాతఁడు త్వరగాఁబోయి భగవదాసనము మీఁద పోయి కూర్చుండి బిగ్గఱగా 'నాఢా' శాంతిపురము నుండి వచ్చినాఁడు. కాని నన్నుఁ బరీక్షించుటకు నందనా చార్యుని గృహమున దాగినాఁడు. ఆతఁ డిప్పుడును నన్ను

బరీక్షింపఁదలఁచుచున్నాఁడు. ఆతఁడు నన్నుఁ బిలిచినాఁడు. ఇప్పుడు నన్నా పరీక్షయే చేయఁదలఁచినాఁడు.' అనెను. ప్రభుని యీ వాక్యములను విని భక్తులొకరి ముఖము నొకరు చూచు కొనిరి. నిత్యానందుఁడు లోలోన నవ్వుకొనుచుండెను. మురారి గుప్త ఆ సమయమునఁ బ్రభుని బూజించి ధూప, దీప, నైవేద్యము లొసంగి, సుగంధిత పుష్పముల యొక్క మాలను ప్రభువువారి మెడలో వైచి, తినుటకు సుందర సువాసిత తాంబూలము నిచ్చెను. ఈ సమయముననే రమాయీ పండితుఁడు సమస్త వృత్తాంతమును యద్వైతాచార్యునకు జెప్పెను. వృత్తాంతమంతయును విని యాచార్యుఁడు చకితుఁడై, ప్రేమలో స్పృహతప్పిన వానివలెనై పడుచులేచుచు శ్రీవాసపండితుని యింటికి వచ్చెను. ఏ యింటిలో ప్రభువు విరాజిల్లుచుండెనో ఆ యింటిలోఁ బ్రవేశించుట తోడనే అద్వైతాచార్యునకా యిల్లు ఆలోకమయమైనట్లు తోఁచెను. ఆ యింటిలోఁ గోటి సూర్యులకాంతి యున్నట్లుండెను. ఆతనికి ప్రభువు యొక్క తేజోమయమూర్తి యొక్క దర్శనము స్పష్టముగ కాలేదు. ఆ సహింపరాని తేజఃప్రభావము నాచార్యుఁడు సహింపజాలక పోయెను. ఆతని కన్నులముందు మిరుమిట్లు గొలిపెను. ఆతఁడు మూర్ఛితుఁడై భూమిమీఁద బడెను. వాఁకిలి దాటి యొక యడుగైన పడుటలేదు. భక్తులు వృద్ధాచార్యుని లేవదీసి ప్రభునకు సమ్ముఖము కావించిరి. ప్రభు సమ్ముఖమైన తర్వాతను నాతఁడు సంజ్ఞాశూన్యుఁడుగనే పడియుండి, ఆ స్పృహలేని

సమయములో దీర్ఘనిశ్వాసములు విడుచుచు బిగ్గఱగా నేడ్చుచుండెను. ఆ వృద్ధ తపస్వి విద్వాంస పండితుని నిట్టి యవస్థను గాంచి యచ్చటనున్న భక్తులానంద సాగరములో మునుఁకలు వేయుచు, తమభక్తి తుచ్ఛమైనదని రోదనము చేయ మొదలిడిరి,

కొంచెము సేపైన తర్వాత ప్రభు విట్లనెను:-'ఆచార్యా! లెమ్ము. ఇప్పు డాలస్యము చేయవలసిన పనియేమి ? నీమనస్సులోఁగల కోరిక సిద్ధించినది. నీ చిరకాలాభిలాష సఫలము కావలసిన సమయము దగ్గఱకు వచ్చినది. ఇప్పుడు లేచి నన్ను విధ్యుక్తముగఁ బూజించుము.'

ప్రభువు యొక్క యీ ప్రేమమయ వాక్కులను విని యాతఁడు కొంచెము ప్రకృతిస్థుఁడయ్యెను. అమాయకపు బాలునివలె డెబ్బది సంవత్సరముల తెల్లని నెఱసిన వెండ్రుకలు గల విద్వాంస బ్రాహ్మణుఁడు సరళతా పూర్వకముగ ప్రభుపూజనము చేయుటకు సిద్ధపడెను. జగన్నాథమిశ్రయెవనిని పూజ్యునిగాను, శ్రేష్ఠునిఁగాను దలఁచినాఁడో, విశ్వరూపునకు విద్యాగురువైనట్టి, నిమాయిని వడిలో నాడించినట్టియు, భక్తులలో ముకుటమణియై మహామాన్యుఁడైన యద్వైతాచార్యుఁడొక ముప్పదేండ్ల యువకుని యాదేశానుసారముగా సేవకునివలెఁ దన యదృష్టమును బొగడుకొనుచు నాతనిని బూజించుటకు సిద్ధపడెను. దీనినే విభూతిమత్త యనియు, ఇదియే భగవత్తా యనియుఁ జెప్పుదురు. దీనిముందు

నన్ని ప్రాణులు అల్పములే. దీని ప్రభావముచేత కుల, రూపావస్థలలోఁ జిన్నదైనప్పటికిని పురుషుఁడు సర్వపూజ్యుఁ డుగ నెన్నఁబడుచున్నాఁడు,

అద్వైతాచార్యుఁడు సువాసిత జలములచే మొట్ట మొదట ప్రభువువారి పాదపద్మములను గడిగి, తర్వాత పాద్యార్ఘ్యముల నిచ్చి, సుగంధిత చందనమును ప్రభువువారి శ్రీ అంగములకు లేపనము కావించెను. అనంతరము అక్షత, ధూప, దీప, నైవేద్యాదుల నొసంగి సుందరమగు మాలను ప్రభువు యొక్క మెడలో వైచెను. తర్వాత తాంబూలము నిచ్చి యాతఁడు చేతులను జోడించుకొని గద్గదకంఠముతో స్తుతిచేయ మొదలిడెను ఆతఁడు రోదనము చేయుచుఁ జేయుచు మాటి మాటికి ఈ శ్లోకమును జదువుచుండెను,

శ్లో॥ నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణ హితాయచ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః॥
విష్ణుపురాణము ౧ అ.౧౯-౬౫.

(బ్రాహ్మణులకు పూజచేయు ప్రభు పాదపద్మములకు నమస్కారము చేయుచున్నాను. గోవులకును, బ్రాహ్మణులకును హితమును జేయు భగవంతునకు నమస్కరించుచున్నాను. సమస్త జగముల నుద్ధరించు కృష్ణునకు నమస్కారము చేయుచున్నాను. భగవంతుఁడగు గోవిందుని చరణములకు కోటికోటి నమస్కారములు.)

శ్లోకములను జదువుచుఁ జదువుచు నాతఁడు గౌరాంగుని లక్ష్యముగఁ బెట్టుకొని వివిధములగు స్తుతులింకను జేయ మొదలిడెను. స్తుతి చేయుచుఁ జేయుచు నాతఁడు మరల స్మృతి తప్పెను. ఇంతలోనే అద్వైతాచార్యుని భార్య సీతాదేవి ప్రభువువారి పూజచేసెను. ప్రభువు భావావేశములోనికి వచ్చి యాదంపతుల శిరస్సుల మీఁద తన రెండు పాదములను బెట్టెను. ప్రభువువారి పాదపద్మముల స్పర్శమాత్రము చేతనే ఆచార్యుని పత్నియు, నాచార్యుఁడును ఆనందములో మునిఁగి రోదనము చేయసాగిరి. ప్రభువాచార్యు నాశ్వాసించుచు నిట్లనెను:- 'ఆచార్యా! ఇప్పుడు త్వరగా లెమ్ము. ఇఁక నాలస్యము చేయవలసిన పనిలేదు. సంకీర్తనద్వారా నన్నానంద పఱుచుఁడు.'

ప్రభు వాదేశమును బొందిన వెంటనే ఆచార్యుఁడు రెండు చేతులను పైకెత్తి ప్రేమతో సంకీర్తనచేయ మొదలిడెను. భక్తులందఱు తమ తమ వాద్యములను వాయించుచు నాచార్యునితోఁగూడి సంకీర్తన చేయుటలో నిమగ్నులైరి. ఆచార్యుఁడు ప్రేమావేశములో తీవ్రముగ నృత్యము చేయుచుండెను. ఆయనకు శరీర స్పృహ కొంచెమైనను లేదు. ఎక్కడో కాలూనుట, యెక్కడో పడుట ఇట్లు నృత్యము చేయుచు శరీర స్పృహలేక ప్రేమోన్మత్తుఁడై యుండెను. క్రమక్రమముగా స్వేదము, కంపము, అశ్రువులు, స్వరభంగము, వికృతి మొదలగు సంకీర్తనమునఁగల సాత్త్వికభావములన్నియు

నద్వైతాచార్యుని శరీరముమీఁద నుదయింపసాగెను. భక్తులును తమ్ముఁ దాము మఱచి అద్వైతాచార్యుని తాళముతోను, స్వరముతోను తమ తాళస్వరములను గలిపి సంకీర్తన చేసిరి. ఈ విధముగ నాదినమున సంకీర్తనమం దందఱకు నపూర్వానందము కలిగెను. నేఁడు సంకీర్తనము సర్వశ్రేష్ఠముగ నున్నదని యనుభవము భక్తులందఱకును గలిగెను. ఏమైనఁ గానిండు, అద్వైతుఁడు, నిమాయి, నితాయి ఈ ముగ్గురు ప్రేమోన్మత్తు లొకచోట చేరినప్పుడు అక్కడ ద్వితీయము, నలౌకికము నగు నానందము వచ్చితీరవలెను. చాల ప్రొద్దు పోయిన తర్వాత సంకీర్తన సమాప్తమయ్యెను. భక్తులందఱును ప్రేమ సంతృప్తులై తమ తమ యిండ్లకు వెడలిపోయిరి.



# అద్వైతాచార్యునకు శ్యామసుందరరూపదర్శనము

శ్లో॥ దదాతి ప్రతి గృహ్ణాతి గుహ్యమాఖ్యాతి పృచ్ఛతి ।
భుంక్తే భోజయతే చైవ షడ్విధం ప్రీతిలక్షణమ్ ॥

సు. ర. భాం. ౧౬౬-౩-౬.

(తన ప్రేమ పాత్రునకు మాన సమ్మానము చేయుటయు తన కత్యంత ప్రీతికరమైనది వానికిచ్చుటయు ఆతఁ డిచ్చిన వస్తువులను ప్రేమతో గ్రహించుటయు, దనకు మిక్కిలి గోప్యమగు విషయములను వానికి జెప్పుటయు, ఆతని హృదయాంతరములోని విషయములను జెప్పుమని యడుగుటయు, స్వయముగఁదాను వారిచ్చిన పదార్థములను భోజనము చేయుటయు, వారికి తాను భోజనము పెట్టుటయు నను నీయాఱును ప్రీతి లక్షణములు.)

ప్రేమలోఁజిన్న యను భావమే లేదు. ప్రేమి యగు వాఁడు తన ప్రియుని యెల్లప్పుడును గొప్పగనే యెంచును. భగవంతుఁడు భక్త ప్రియుఁడు. భక్తులెచ్చట ఆయనను త సర్వస్వమని తలంచుచుందురో, అచ్చట ఆతఁడును భక్తులను తన సర్వస్వముగ నెంచును. భక్తుల యెడల శ్రద్ధాభావమును ప్రదర్శించుచు భగవానుఁడు స్వయముగ నిట్లనెను:- 'భక్తుల యొక్క పాదధూళి లేచి నామీఁద పడవలెననియు, దానివలన నేను పావనుఁడ గావలెననియు, నేను భక్తుల వెంట నంటి తిరుగుచుండెను.' జగత్పావనముచేయు ప్రభువు కీ భావము లున్నవి. భక్తులు రాత్రింబవళ్ళాయన భజన చేయుదురు.

ఆయనయు 'నన్నే విధముగ భజింతురో నేను నావిధముగనే భజనచేయుదు'ననెను. విశ్వమున కేకమాత్రుఁడగు భగవానుని లీలలను గాంచుఁడు. ప్రేమయొక్క విలక్షణమగు దృష్టాంత మెట్టిదో చూడుఁడు. ఎవఁడు విశ్వంభరుఁడును, చరాచర ప్రాణులను పాలన పోషణ చేయువాఁడును, తన సంకల్ప మాత్రము చేతనే సమస్త విశ్వమును దృప్తినొందింపఁగలఁడో ఆతఁ డెవ్వఁడైన నాకు భక్తితో నేకొంచెమిచ్చినను దానిని నేను ప్రసన్నుఁడనై తినెదనని చెప్పెను. పత్రముతిను వస్తువు కాదు, పుష్పము వాసనచూచు వస్తువు. జలము త్రాగునది. కేవల మన్నముగాని, ఫలముగాని తినుటకు వీలగును. ప్రేమోన్మత్తుఁడై భగవానుఁడు 'నాకెవఁడైనను భక్తి భావముతో పత్ర, పుష్ప, ఫల, జలముల నిచ్చినచో దానిని నేను చాల యమూల్యమైన వస్తువని భావించి సంతుష్ట మానసుఁడనై తినెద' ననెను. పత్ర, పుష్పములనుగూడ తినివేయును. అన్నిటికిని 'అశ్నామి' అనుక్రియను బ్రయోగించెను. ఆ తినుపదార్థము ధన్యమైనది! ఏమైనఁగానిందు, ప్రేమలో నీపార్థివ పదార్థములే తినఁబడుచున్నవి. నిజమైన తృప్తికి కారణము ఆ పదార్థములం దోతప్రోతమై నిండియున్న పదార్థము ప్రేమ. ఆ ప్రేమను దిని ప్రభువు పరమ ప్రసన్నుఁడగును. ప్రేమ యను వస్తువిట్టిదే. ఆప్రేమ యెక్కడ సమావేశమైనను ఆ పదార్థము సుఖమయము, మధుమయము, ఆనందమయము, తృప్తి కారక మగుచున్నది.

ఆ దినమున సంకీర్తనానంతరము రెండు మూఁడు రోజుల తర్వాత మరల నద్వైతాచార్యుఁడు శాంతి పురమునకు వెడలి పోయెను. ఆతని మనస్సులో నిప్పుడును ప్రభువు నెడల సందేహ భావముండియే యున్నది. ఈతఁడు నాయిష్టదేవుఁడా లేక మఱియొకఁడా యని యింకను మనస్సు సందేహములోనే యుండెను. ఈ కారణమున నొక దినమున సంశయ బుద్ధి చే మరల నతఁడు నవద్వీపమునకు వచ్చెను. అటులే యాతని హృదయము ప్రభువు వైపునకు స్వతః ఆకర్షితమయ్యెను. అతనికి మహాప్రభుని స్మరించుటచేతనే పరమానందము కలుగు చున్నట్లుండెను. లోపల విశ్వాసము లేక యిట్టి భావము కలుగఁజాలదు. కాని బయటకు తన యవిశ్వాసమునే ప్రక టించును ఆ సమయమునఁ బ్రభువు శ్రీవాసపండితుని యింట భక్తులతోఁగూడి శ్రీకృష్ణ కథాకాలక్షేపము చేయుచుండెను. ఆచార్యుఁడు వచ్చుటను గాంచి ప్రభువు భక్తులతోఁగూడ ఆయనను సమ్మానించుటకు లేచి నిలువఁబడెను. ప్రభువు మిక్కిలి శ్రద్ధా భక్తులతో నాచార్యునకుఁ బ్రణామము కావించెను. ఆచార్యుఁడును సిగ్గుపడుచు తన నెఱసిన వెంట్రుకల మీఁద ప్రభు పాదపద్మ పరాగమును తుడుచుకొనెను. అక్కడనున్న భక్తులందఱకును ఆచార్యుఁడు ప్రేమాలింగన ప్రదానము కావించెను. అంతఁ బ్రభువుతోఁగూడ సుఖపూర్వ కముగఁ గూర్చుండెను.

అందఱు కూర్చుండిన మీఁదట ప్రభువు చిఱునవ్వు నవ్వుచు 'ఇచ్చట సీతాపతి కూర్చున్నాఁడను భయ మెవరి

కైన నుండుఁగాక నాకు భయమిసుమంతైనలేదు. అతఁడు నన్ను శమింపఁజేయలేఁడు' అనెను. (అద్వైతాచార్యుని భార్య పేరు సీతాదేవి. ప్రభు వామె నుద్దేశించెను.)

కొంచెము లేని గంభీరతను దెచ్చుకొని, తనకు నలు వైపులఁ జూచుచు నాచార్యుఁడు 'ఇచ్చట రఘునాథుఁడు కనఁబడుటలేదు కాని యదునాథుఁ డవశ్యమున్నాఁడు.' అనెను. ప్రభువీ ప్రత్యుత్తరమును విని కొంచెము లజ్జితుఁడై నల్లుండెను. మాటను దాటవేయుటకు గాను 'చూడుఁడు, మేమందఱము కలిసి మీఛత్రచ్ఛాయలో నుండి శ్రీకృష్ణ కీర్తనము చేతుముగదా యని చిరకాలమునుండి యపేక్షించి యుంటిమి. కాని మీరు శాంతిపురములో వెళ్ళి యుంటిరి. మేమేమి యపరాధము చేసితిమి !' యనెను.

అద్వైతాచార్యుఁడు దీనికి ప్రత్యుత్తర మీయఁబో వునుపే, యింతలోనే మధ్యలో శ్రీవాస పండితుఁ డిట్లనెను:- 'అద్వైతాచార్యుని పేరు అద్వైతుఁడే. అందువలన నతఁడు శాంతిపురములో నివాసము చేయుచున్నాఁడు. ఇప్పుడు మీ యవతారము నవద్వీపరూపమగు నవవిధభక్తి పీఠమునఁ గలిగెను. దానిమీఁదఁ గూర్చుండి నిత్యానందుఁడు తద్రసా స్వాదనము చేయుచున్నాఁడు. అద్వైతుఁడును శాంతిపురమును వదలి యీ నిత్యానందపూర్ణ పీఠమందు వచ్చి గౌరగుణ గానముద్వారా తనను నిత్యానందమయము గావించుకొనఁ

గోరుచున్నాఁడు. ఇప్పు డీతఁడు ద్వైతాద్వైతములుగ రెండు విధములుగ నున్నాఁడు.

ఈ గూఢ ప్రత్యుత్తర మర్మమును గ్రహించి నవ్వుచు నాచార్యుఁ డిట్లనెను:- 'శ్రీవాసుఁ డెచ్చట నున్నాఁడో ఆచ్చట ప్రజకేమిలోపము? మాబోటి వందలకొలఁది మానవు లను దన ప్రభావముచే లాగుకొని వచ్చునంతటి యాకర్షణము శ్రీవాసునందు గలదనెను.

శ్రీవాస పండితుఁ డీ గూఢోక్తిచేఁ జాల సంతోష మును జెంది, ప్రభువును తీసివేయుచు 'లక్ష్మీదేవి యున్నప్పు డుండెను. ఆమె యిప్పు డిచ్చట నివసించుటలేదు. ఆమె యిప్పుడు నవద్వీపమునుండి అంతర్ధానమై పోయిన దనెను. (గౌరాంగుని మొదటి భార్యపేరు 'లక్ష్మి' 'శ్రీ' యనఁగా లక్ష్మిగాఁ బోల్చి శ్రీవాస పండితుఁడు ఇప్పుడిక్కడ శ్రీ నివసించుటలే దనెను.)

శ్రీవాసుఁడు తన్నుఁ దగ్గించుచున్నాఁడని తెలిసికొని ప్రభువు త్వరగా నిట్లనెను:- 'పండితప్రవరా! మీరేమి మాట మాటాడుచున్నారు? శ్రీ యనఁగా 'భక్తి' మీబోటి భక్త లెచ్చట నుందురో అచ్చట శ్రీ వాసము తప్పక చేయవలెను బాగు, ఇట్టి స్థానమును వదలి 'భక్తి' లేక 'శ్రీ' యెక్కడి కైనఁ బోఁగలదా?'

దీనిమీఁద నాచార్యుఁ డిట్లనెను:- 'అవును. అదియే నిజము. శ్రీ లేక హరి యెట్లుండఁగలఁడు. 'శ్రీ' విష్ణుప్రియా

నామమును ధరించి నవద్వీపములో నున్నది. లేక నామె శ్రీతోఁగూడిన విష్ణుప్రియయు తన పేరులో నింకఁగలుపు కొనినది. ఇప్పుడామె కేవలము శ్రీ గాక 'శ్రీ విష్ణుప్రియ' యైనది. (గౌరాంగుని ద్వితీయ పత్ని పేరు శ్రీవిష్ణుప్రియ. ఆమెను లక్ష్యములో నుంచుకొని యద్వైతాచార్యుఁడు మాటలనెను.)

విషయము నింకొక వైపునకు బోఁగొట్టుచు ప్రభు విట్లనెను:- 'శ్రీ' యెల్లప్పుడును విష్ణుప్రియయే. 'భక్తిప్రియో మాధవః'మాధవ భగవానుఁ డెల్లప్పుడును భక్తికిఁ బ్రియుఁడు. కావుననే శ్రీ లేక భక్తియొక్క నామము మొదటనుండియు విష్ణుప్రియయే.'

ఇది విని యాచార్యుఁడు త్వరగా ప్రభువునకుఁ బ్రణామము గావించుచు నిట్లనెను:- 'అప్పుడు ప్రభు వొక విగ్రహమున లక్ష్మీరూపముతో నామెను గ్రహించితివి. ఇప్పుడు శ్రీవిష్ణుప్రియారూపమున నామెయొక్క రెండవ విగ్రహమును నీ యర్ధాంగినిఁగాఁ జేసికొంటివి.'

ఈ విధముగాఁ దమలోఁదాము శ్లేషాత్మక సంభాషణము చేసికొనునంతలోఁ బ్రభువువారి యింటినుండి యొకఁడు వచ్చి నమ్రతాపూర్వకముగ ప్రభువుతో 'నేఁడాచార్యుఁడు మన యింటిలోనే భోజనము చేయవలెననియు, కృపతో వారు మన యీ నిమంత్రణము నవశ్యమంగీకరించవలెననియు శచీ మాత శలవిచ్చినది' అని నివేదించెను.

ఆ మనుష్యుని మాటలను విని ప్రభువు వానికేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. జిజ్ఞాసాభావముతో నాతఁడాచార్యుని ముఖమువైపు చూడ మొదలిడెను. ప్రభువువారి భావములను గ్రహించి యాచార్యుఁ డిట్లనెను:- 'మా భాగ్యము, ఏ జగన్మాత మమ్ముల భోజనమునకుఁ బిలిచినదో, దీనిని మేము మా యదృష్ట మనుకొను చున్నాము.'

మధ్యలోనే మాటను ఖండించుచు శ్రీవాసపండితుఁ డిట్లనెను:- 'ఈ సౌభాగ్య సుఖమును మీరొక్కరే చూరగొనెదరా లేక యితరులను గూడ భాగస్వాములను జేయుదురా? మేముమాత్రము మిమ్ముల నొంటరిగా నెన్నటికిని యీ యానందోపభోగము చేయనీయము. ఒకవేళ గౌరాంగుఁడు మమ్ముల నిమంత్రించకున్నచో, మేము శచీమాత దగ్గఱకుపోయి యాచన చేయుదుము. ఆమె సాక్షా దన్నపూర్ణయే. ఆమె దర్బారులో నెవఁడును నిరాశుఁడై తిరిగిపోఁడు. ఆచార్యమహాశయా! మీ రొంటరిగా పప్పు జీర్ణము కాదు. మమ్ములను గూడ వెంట తీసికొని పోవలయును.'

అంత నాచార్యుఁడు మధ్యలోనే యిట్లనెను:-'నాకేమి కష్టము? కష్టముండిన శచీమాత కుండవలయును. ఆమె జగన్మాతామెను. ఆమె కష్టమును కష్టమని యెంచుకొనదు. ఒకవేళ నామె వంట చేయఁజాలకున్న మనము చేసికొనవలసి యుండును.' ఈ ప్రత్యుత్తరము వలన నాచార్యుఁడు తన యింటిలోఁ దినుటకే యాపత్తియు లేదని తెలిసికొనెను.

యథార్థమునకు ప్రేమలో నే విధమైన నిశ్చిత నియమము లేనే లేదు. దీనింబట్టి ప్రేమీ పురుషులందఱు సామాజిక నియమములను భంగము చేయవలెనని కాని, ప్రేమీ పురుషులన్యులవలె సామాజిక నియమములను బాలనము చేసియే తీరవలెనని గాని కాదు. వీరికి నిశ్చిత నియమమేదియును లేదు. భగవంతుఁడగు రామునివంటి సర్వశ్రేష్ఠుఁడగు ప్రేమి, 'సీతా పరీక్ష' 'సీతాపరిత్యాగము' 'లక్ష్మణ పరిత్యాగము' వంటి యసహ్యా వేదనాపూర్ణ కార్యములను జేసినది లోకసంగ్రహ ధర్మ మక్షుణ్ణముగా నుండవలెననియే. దీనికి విపరీతముగా శ్రీకృష్ణ భగవానుఁడు ప్రేమకై సామాజిక నియమములను లెక్కయే చేయలేదు. అత్యంత ప్రేమపురుషులలోఁ జాలమంది సామాజిక, ధార్మిక నియమములను దృఢముగ నుండి నడుపు చుండుట నిప్పటికిని గాంచుచున్నాము. చాలమంది వీని నుపేక్ష చేయుటయును గాంచుచున్నారము. కావున ప్రేమ పంథా కేవిధమగు నిశ్చిత నియమము నిర్ధారింపవీలులేదు. ఇది నియమ రహితమైన యలౌకిక పంథా. ఆచార్యుని కిప్పుడు తన సర్వస్వము ప్రభు పాదపద్మముల కర్పించి నప్పుడు ప్రభు నింటిలో నేమి సంకోచముండఁ గలదు ?

అంగీకారమును గైకొని యామనుష్యుఁడు శచీమాతతోఁ జెప్పుటకు వెడలిపోయెను. ఇచ్చట ఆచార్యుఁడు మెల్లఁగా నేదియో విషయము శ్రీవాస పండితుని చెవిలోఁ జెప్పెను. పరస్పరము వీరిద్దఱు మెల్లమెల్లగా గుసగుసలాడుకొనుట గాంచి

ప్రభువు నవ్వుచు నిట్లనెను:- 'పండితులిద్దరకేమి గుసగుసలు జరుగుచున్నవి. ఆమాటలు నేను వినఁదగనా యేమి?'

ప్రభువువారి వాక్యములను విని యాచార్యుఁడు కొంచెము లజ్జితుఁడైనట్లుండి మెదలకుండెను, కాని శ్రీవాసపండితుఁడు కొంచెము సేపాగి 'ప్రభూ! ఆచార్యులు తన మనస్సులో నత్యంత దుఃఖితులై యున్నారు. నిత్యానంద ప్రభువువారి మీఁద కృపయుంచి యాయనకు తన నిజస్వరూపమును జూపించెను. కాని నామీఁద అట్టి కృపరాలేదేలకో? నీకు నానిజ స్వరూపమును జూపుదునని నాకాశ్వాసమును గూడ యిప్పించెను, కాని యింతవఱకు మామీఁదఁ గృపరాలే' దని యనుచున్నాఁ'డనెను.

కొంచెముగ నాశ్చర్యమును బ్రకటించుచుఁ బ్రభు విట్లనెను:- 'నిజ స్వరూపమనఁగా నాచార్యులవారి యభిప్రాయ మేదియో నేను దెలిసికొనలేకున్నాను. నా నిజస్వరూపము మీరందఱెల్లప్పుడు జూచునదియు మఱియు నిప్పుడు చూచుచున్నదియే,'

తమమాటలను ప్రభువు భిన్నముగ నర్థము తీయుచుండుటను గాంచి శ్రీవాస పండితుఁ డిట్లనెను:- 'అవును ప్రభూ! ఇది నిజమే. మీ యసలు స్వరూపమిదియే. మేమందఱమును నీ గౌరరూపమునకే శ్రద్ధాభక్తితో నమస్కరింతుము. కాని మీరు ఆచార్యులవారి కన్యరూప దర్శనము మీఁద నాశ్వాసన

మిప్పించితిరి. ఆతఁడా యాశ్వాసనమును జ్ఞాపకము చేయు చున్నాఁడు.

శ్రీవాసుని యీ ప్రత్యుత్తరమునకు సంతుష్టుఁడై ప్రభు విట్లనెను:- 'పండితవర్యా! మీకన్నియుఁ దెలియును. మనుష్య ప్రకృతి యెల్లప్పుడు నొక్కరీతిగ నుండదు. అది యొక్కొ క్కప్పు డొక విధముగను మఱొకప్పుడు మఱొక విధముగ నుండును. నేను నాయున్మాదస్థితిలో నేనేమి వాగితినో నాకే తెలియదు. దాని జ్ఞాపకము నాకే యుండదు. నేను నా యున్మాదావస్థలో నాచార్యునితో నేదైనఁ జెప్పియుండు నేమో, ఆ జ్ఞాపకము నాకిప్పుడు బొత్తుగాలేదు.'

ఇది విని కొంచెము దీనతా భావముతో శ్రీవాస పండితుఁ డిట్లనెను:- 'ప్రభూ! మీరు మమ్ముల నెప్పుడు నేల వంచన చేయుచుందురు. మానవుల కున్మాదముండు నెడల వానిని జూచిన నితరులకు చాలభయము కలుగును. మానవులు వాని దగ్గఱకు పోవుటకును భయపడు చుందురు, కాని మీ యున్మాదము ప్రజల హృదయములలో నమృతమును జిలుక చున్నది. భక్తులకు దానికి మించిన వేఱొక యానందము కనఁబడుట లేదు. మీ యున్మాదము నిజముగ నున్మాదమేనా? నిజముగా నంతే యగునెడల భక్తులకింతటి యపూర్వానంద మేల కలుగును? మీలో సర్వసామర్థ్యమున్నది. మీరే సమయమున నెట్లు కోరిన నారూపముఁ జూపఁగలరు.'

'పండితవర్యా ! నిజముగా మీరు నమ్ముఁడు. ఏరికైన నేరూపమును జూపినను అది నాయధీనమున బొత్తుగాలేదు. ఏ సమయమున నేరూపమునగుదునో అది నాకు తెలియనే తెలియదు. ఆచార్యులు శ్యామసుందర రూపమున దర్శనము చేయఁగోరుచున్నట్లు నీవు చెప్పుచున్నావు. ఇది నా చేతిలోని పనికాదు. ఇది యంతయు వారి వారి భావనాను సారముగ నుండును. వారి కేరూపమందు ప్రీతి యుండునో యా భావ నానుసారము వారికి దర్శనము కల్గును. ఆయన కుత్కటముగు నిచ్ఛ యున్నచో, యథార్థముగ నతఁడు శ్యామసుందరరూప దర్శనము చేయఁగోరు నెడల కన్నులు మూసికొని ధ్యానము చేయనిండు, ఆతఁడు తన భావనాను సారముగ శ్యామసుంద రుని మనోహరమూర్తి దర్శనము చేయఁగోరు నెడల చూడ వచ్చును' అని ప్రభు వనెను.

ప్రభువువారి యీ వాక్యములను విని యాచార్యుఁడు కొంచెము సందేహముగను, కొంచెము పరీక్షార్థముగను కన్నులు మూసికొనెను. కొంచెము సేపైన తర్వాత ఆచార్యుఁడు మూర్ఛితుఁడగుటను భక్తులు కాంచిరి. అచ్చట నున్నవా రాతని శరీరమును స్పర్శించి చూచునప్పటికి ఆయ నలోఁ జైతన్యమున్నట్లు తోఁచలేదు. శ్రీవాస పండితుఁ డాతని ముక్కురంధ్రముల కడ జేయి పెట్టి చూడఁగా నతనికి శ్వాస లేనట్లే తోఁచెను. ఈ లక్షణము లన్నిటి వలన నాతని శరీరములోఁ బ్రాణము లేనట్లుండెను. కాని ముఖకాంతి దగ్గఱ

నున్న వారి కాశ్చర్యము కలుగఁజేయు చుండెను. ఆతని ముఖములోఁ బ్రత్యక్షతేజము మెఱయు చుండెను. శరీర మంతయు రోమాంచిత మగుచుండెను. భక్తులందఱును వారి యీ యవస్థను గాంచి యాశ్చర్యము చెందుచుండిరి. శ్రీవాస పండితుఁడు గాబరాపడి ప్రభువును 'ప్రభూ! ఆచార్యుని కీస్థితి యేమి? ఆతఁ డీవిధముగా మూర్ఛితుఁడు, సంజ్ఞాశూన్యుఁడు వలె నయ్యె నేలకో తెలియదు' అని యడిగెను.

'మీరేమియు భయపడవలసిన పనిలేదు. ఆచార్యుని హృదయములో తన యిష్టదేవుని దర్శనమైనట్లు తోఁచు చున్నది; ఆ ప్రేమలో నీతఁడు మూర్ఛితుఁడయ్యెను. నాకట్టి యూహయే తట్టు చున్నది' అని ప్రభు వనెను.

గద్గద కంఠముతో శ్రీవాసపండితుఁ డిట్లనెను:- 'ప్రభూ! అనుమాన ప్రత్యక్షములు రెండును మీ యధీనములు. ఆచార్యుఁడు సౌభాగ్యశాలి. ఆతఁడు దేనినిఁ గోరెనో ఆ నీ శ్యామసుందరరూపదర్శన మాతనికైనది. మాకెన్నఁడు నిట్టిది ప్రాప్తించు నదృష్టము పట్టని హతభాగ్యులము మేము. అగుఁగాక, వారి వారి యదృష్టమది. మాకేరూపదర్శన మక్కఱలేదు. మాకొఱకీ గౌరరూపమే చాలును. ఆచార్యునకు స్మృతి వచ్చునట్లిపు డనుగ్రహించుఁడు!'

శ్రీవాసుని వాక్యములను విని ప్రభు విట్లనెను:- 'మీరును నేమి మాటలు మాటలాడుచున్నారు! నే నాయన

నెట్లు చేతనములోనికిఁ దేఁగలను? ఆయన స్వయముగనే చైతన్యము చెందును. ఇటు చూడుఁడు, ఆచార్యుఁ డిప్పుడు కొంచెము కొంచెముగఁ గన్నులు తెఱచు చున్నాఁడు' ప్రభు విట్లను చుండగనే ఆచార్యుని మూర్ఛ మెల్ల మెల్లఁగా భంగ మయ్యెను. ఆతఁడు స్వస్థుఁడు కాఁగానే శ్రీవాసపండితుఁ డిట్లనెను:- 'ఆచార్యా! ఏమి చూచితివి?' శ్రీవాసుఁ డడుగఁగా గద్గద కంఠముతో నాచార్యుఁ డిట్లనెను:- 'ఓహో! అద్భుత రూపదర్శన మయ్యెను. ఆ శ్యామసుందరుఁడు, వనమాలి, పీతవసనధారి, మురళీ మనోహరుఁడు నాముందు ప్రత్యక్షముగఁ బ్రకటమైనాఁడు. స్వయముగ గౌరహరియే యిట్టి రూపమును ధరించి నాహృదయములోఁ బ్రవేశించి తన మందహాసముచే నన్ను స్పృహ తప్పిన వానిఁగాఁ జేయుట నేను స్వయముగఁ గాంచితిని. నామనస్సు నాస్వాధీనములో లేదు. ఆ మాధుర్యమును బానము చేయుటలో నన్ను నేను మఱచునట్లు తల్లీనత కలిగినది. కొంచెము సేపైన తర్వాత నామూర్తి గౌరరూపమును ధరించి నాముందు వచ్చి కూర్చుండెను. అప్పుడు నాకు చైతన్యము కలిగెను' ఇట్లు చెప్పుచుఁ జెప్పుచు నాచార్యుఁడు ప్రేమకారణమున గద్గద కంఠముతో రోదనము చేయ మొదలిడెను. ఆయన కనుకొలుకులనుండి చల్లని యశ్రుధారలు రెండు ప్రవహించు చున్నట్లుండెను. ప్రభువు నవ్వుచుఁ గొంచెము కపటోపేక్షతో నిట్లనెను:- 'ఆచార్యుఁడు గతరాత్రి జాగరణము చేసినట్లున్నది. అందువలననే కన్నులు

మూతపడఁగానే నిద్ర వచ్చినది. ఆ నిద్రలో నీతఁడు స్వప్నమును గాంచెను. ఆ స్వప్నవృత్తాంతమును నీతఁడు చెప్పుచున్నాఁడు.'

ప్రభువువారి యిట్టి వాక్యములను విని యాచార్యుఁడధీరుఁడై ప్రభు చరణములందుపడి గద్గదకంఠముతో నిట్లనెను:- 'ప్రభూ! నన్నధికముగ నిప్పుడు వంచన జేయవలదు. ఇప్పుడు మీ పాదములందు విశ్వాస ముత్పన్నము కలుగుఁగాక! యని యాశీర్వాదమును బ్రసాదింపుఁడు' ప్రభువు వృద్ధాచార్యుని లేవఁదీసి కౌఁగిలించుకొనెను. అంతఁ బ్రేమలో నిట్లనెను:- 'మీరు పరమ భాగవతులు. మీనిష్ఠ యత్యుత్తమమైనది. కన్నులు మూసికొనఁగానే మీకు భగవద్దర్శనమైనది. యిది మీ నిరంతర ధ్యానమునకుఁ బ్రత్యక్షఫలము. వెళ్ళుఁడు యిప్పటికే చాల ఆలస్యమైనది. మాత భోజనము సిద్ధముచేసి మన యందఱకొఱకుఁ బ్రతీక్షించుచున్నది. నేఁడు మనమందఱము తోడుగాఁ బంక్తిని భోజనము చేయుదము.'

ప్రభువువారి యాజ్ఞను బొంది శ్రీవాసునితోఁ గూడి యాచార్యుఁడు మహాప్రభుని యింటికి వెడలుటకు సిద్ధమయ్యెను. ఇంటికి వెడలునప్పటికి మాత సమస్త పదార్థములను దయారుచేసి అరుగు మీఁద కూర్చుండి అందఱి యొక్క రాకకు ప్రతీక్షించు చుండుటను గాంచెను. ప్రభువు త్వరగా చేతులు కాళ్లు కడుగుకొని, ఆచార్యునియొక్కయు, శ్రీవాస పండితుని యొక్కయు పాదములను స్వయముగఁ

గడిగెను, అంత వారు కూర్చుండుటకు సుందర యాసనముల నొసంగెను. ఇద్దరును మిక్కిలి బలవంతము చేయఁగాఁ బ్రభువును నాచార్యునకును శ్రీవాసునకును మధ్యను భోజనము చేయుటకుఁ గూర్చుండెను. శచీమాత నేఁడు మిక్కిలి ప్రేమతో ననేక విధములగు వ్యంజనములను దయారుచేసెను. భోజనము వడ్డించిన తర్వాత నిద్దరు భగవదర్పణము చేసి తులసీ మంజరులు పడియున్న యా వ్యంజనముల నన్నిటిని ప్రేమతో గ్రహించిరి. ప్రభువు మాటిమాటికి బలవంతము చేయుచు నాచార్యునకు నింక నధికముగ వడ్డింపఁజేయుచుండెను. ఆచార్యుఁడును ప్రేమకు వశీభూతుఁడై వాటిని దినుచుండెడువాఁడు. ఈ విధముగా నాదినమున ముగ్గురును మామూలు రోజుల కంటెఁ జాల యధికముగ భోజనము చేసిరి. కాని యా భోజనములో నల్దిక్కుల ప్రేమకు ప్రేమయే నిండియుండెను. భోజనమైన తర్వాత ప్రభువు శ్రీవిష్ణుప్రియాదేవి నుండి తీసికొని యాచార్యునకు, శ్రీవాసపండితునకు ముఖశుద్ధికొఱకు తాంబూలము నిచ్చెను. కొంచెము సేపు విశ్రాంతి తీసికొనిన తర్వాత ప్రభ్వాజ్ఞను గైకొని యద్వైతుఁడు శాంతిపురమునకు పోయెను. శ్రీవాసుఁడు తన యింటికి వెడలిపోయెను.

# ప్రచ్ఛన్నభక్తుఁడు పుండరీక విద్యానిధి

శ్లో॥ తదశ్మసారం హృదయం బతేదం
యద్గృహ్యమాణైర్హరినామధేయైః ।
న విక్రియేతాఽథ యదా వికారో
నేత్రే జలం గాత్రరుహేషు హర్షః ॥

శ్రీమద్భాగవతము २-३-२४.

(శ్రీహరియొక్క మధుర నామములను శ్రవణమాత్రము చేతనే యెవని హృదయములో నేవిధమగు వికారము లుత్పన్నముకావో, లేక యెవని శరీరమందు స్వేదము, కంపము, అశ్రుపాతము, రోమాంచము మొదలగు సాత్త్విక భావము లుదయించవో వాని హృదయము ఉక్కుతోఁ జేయఁబడినదని తెలియవలెను.)

ఎవరి హృదయములో భగవంతుని యందు భక్తి యుత్పన్నమైనదో, ఎవరి హృదయము శ్యామవర్ణమందు చిక్కుకొనినదో, ఎవరికి భగవంతుని సుమధుర నామముల యందును, అతనికి జగత్పావనమగు లీలలందును రతిగలదో ఆ యదృష్టవంతులగు భక్తులు మాత్రమే యథార్థముగ మనుష్య శరీరమును సార్థకము కావించుకొనినవారు. సాధారణముగఁ జూచునెడల నెవనిమీఁద భగవత్కృప యుండునో, యెవఁడు ప్రభు ప్రేమలో నున్మత్తుఁడైనాఁడో వాని బాహ్య జీవనమును ద్యాగమయమగును. ఏలననఁగా నెవఁ డీయద్భుత

ప్రేమాసవము నొక్కసారైనను ద్రాగినాఁడో, వాని మరలఁ ద్రిలోకములలోని సాంసారిక సుఖములేవైనఁ గానిండు, అవన్నియు హీనములు గానే తోఁచును. యథార్థసుఖానుభవము లేనంతవఱకే మానవుఁడు సాంసారిక సుఖముల ననుభవించును. ఎవని కొక్క క్షణమైనను సుఖస్వరూపుఁడగు ప్రేమ దేవుని దర్శన మైనదో వానికి సాంసారిక పదార్థము లన్నియుఁ దుచ్ఛముగఁ గనఁబడును. అందువలననే సాధారణముగఁ బారమార్థిక పథికులగు భగవద్భక్తుల యొక్కయు, జ్ఞాననిష్ఠ సాధకుల యొక్కయు జీవనము సర్వదా త్యాగమయముగా నుండుటను గాంచుచున్నాము. వారు సాంసారిక భోగములకు స్వరూపతః దూరముగానే యుందురు. కాని కొందఱు భక్తుల జీవనము పైకి సాంసారిక జీవనము వలెనే యుండును. కాని హృదయములో నగాధ భక్తిరసము నిండియుండుటయును గనఁబడుచున్నది. వారికి కొంచెము దెబ్బ తగిలెనా ఆరసము చిలికి కన్నులద్వారా బయటకు ప్రవహించు చుండును. యథార్థమునకు భక్తి సంబంధము హృదయముతోఁగలదు. మనస్సు విషయ వాసనలతో రతి చెందకున్నచో నది యేపరిస్థితియైన నగుఁగాక, హృదయము సదా ప్రభు పాదపద్మ చింతనమునే చేయుచుండును.

సాధారణముగాఁ గాంచునెడల త్యాగమయ జీవనము గడుపు సాధకుని మనస్సులో స్వరూపతః బాహ్యముగ త్యాగమయ జీవనము గడుపనిది భగవద్భక్తి లభింపదని తోఁచును.

భక్తిమార్గములో నిది గొప్ప విఘ్నము. త్యాగమయ జీవన మెంత గడిపిననంత శ్రేష్ఠము, కాని స్వరూపత. త్యాగము చేసినఁగాని భక్తుఁడు కాఁజాలఁడను నిర్బంధము ఒకరకమైన త్యాగజన్యాభిమానమే యగును. భక్తుఁడు తృణముకంటె హీనుఁడై కుక్క, చండాలుఁడు, గోవు, గాడిద వఱకును మనస్సుతోఁగాదు కాని శరీరముతో దండమువలె నేలపై దొర్లి ప్రణామము చేయవలెను. అప్పుడే అభిమానము వదలును. భక్తుల విషయములో వారే రూపమున నుందురో యెవరేమి చెప్పఁగలరు ? నానా పరిస్థితులలో నుండి భక్తులు జీవనమును గడుపుచుండుటను గాంచుచున్నాము. కావున బాహ్య త్యాగలక్షణములు లేనివాఁడు భక్తుఁడు కాఁడని యెన్నడును దలఁపరాదు.

పుండరీక విద్యానిధి యిట్టి ప్రచ్ఛన్న భక్తుఁడు. అతని యాచార వ్యవహారములనుబట్టి చూచిన నితఁడు భక్తుఁడని యెవ్వరు ననుకొనరు. అందఱు నాతని విషయలాలసుని గానే తలఁచుచుందురు. లోకులట్లను కొననిండు, కాని పుండరీక మహాశయుఁ డెల్లప్పుడును ప్రభుప్రేమలో మునిఁగి యుండును. లోకులు చూచుట కాతఁ డేకార్యమును జేయఁడు. అతనికి తన ప్రియుని సేవ సేవని. అతని బాహ్యవ్యవహార మక్లై సాంసారిక విషయలాలసులకువలె నుండెడిది. అతని జన్మమొక కులీన వంశములో కలిగెను. అతఁడు చూచుట కందగాఁడు. శరీరము రాజపుత్రులవలె సుకుమారముగ మిక్కిలి నునుపు,

కోమలముగ నుండినది. ఆతనికి కోమలములై యుంగరములు తిరిగిన వల్లని వెంట్రుక లుండెడివి. వాటి కెప్పుడును బహు మూల్యములగు సుగంధిత తైలములను రాయుచుండెడువాఁడు. శరీరమునకు నలుగు, సుగంధతైలములను రాచి మిక్కిలి శుభ్రముగ నుంచెడువాఁడు. మిక్కిలి సన్నని పట్టు వస్త్రము లను గట్టును. ఎప్పుడును గంగాస్నానము చేయఁబోనేపోఁడు. లోకులంద జీతనికి గంగమీఁద భక్తి లేదనుకొను చుందురు. కాని యాతని హృదయమందు గంగామాత యెడల ననన్య భక్తి యుండెడిది. మాతృజలములకుఁ బాదస్పర్శ కలుగునని యాతనికి భయము. అందువలననే స్నానము చేయఁబోపు వాఁడు కాఁడు. ప్రజలు గంగాజలములందు మలమూత్రము లను, అస్థులను, వాసన నూనెలను, వెంట్రుకలను విసరివేయు టను గాంచి యాతనికి మిక్కిలి మార్మిక దుఃఖము కలుగు చుండెడిది దేవతార్చనకుఁ బూర్వమే యాతఁడు గంగా జలమును బానము కావించును. ఈ విధముగ నాతని విష యము లన్నియు లోక బాహ్యములుగ నుండెడివి. అందు వలన జనులాతనిని ఘోరసంసారి యని యాతని నెల్లప్పుడు నుపేక్ష చేయుచుండెడువారు.

ఒక దినమున ప్రభువు భావావేశములోనికివచ్చి బిగ్గరగ 'హా పుండరీక విద్యానిధి' 'ఓ తండ్రీ విద్యానిధి' అని బిగ్గరగ నేడ్వ మొదలిడెను. 'పుండరీకా' 'పుండరీకా' యనుచు నతఁడ ధీరుఁడై స్పృహతప్పి క్రింద పడెను. భక్తులు వారిలో వారు

ఒకరి ముఖము లొకరు చూచుకొను చుండిరి. అందఱ కాశ్చర్యము కలిగెను. 'పుండరీకా' యనుటచే మొదట మొదట భక్తులు ప్రభువు శ్రీకృష్ణు నుద్దేశించి యనిరో యను కొనిరి. పుండరీక శబ్దము వెంబడి విద్యానిధి యనుపదము మీఁద ధ్యానముంచు నప్పటికి యీపేరు గల ఒక భక్తుఁడుండ వచ్చు ననుకొనిరి. ఎంత విచారించి నప్పటికిని నవద్వీపములో 'పుండరీక విద్యానిధి' పేరుగల వైష్ణవ భక్తుఁ డెవఁడును వారికి స్మరణమునకు రాలేదు. కొంచెము సేపైన తర్వాత ప్రభువు వారికి మూర్ఛాభంగము కలిగి నప్పుడు భక్తులు నమ్రతా పూర్వకముగ 'ప్రభువు వారెవని పేరును తలఁచుకొని బిగ్గఱగ రోదనము చేసితిరో ఆ భాగ్యశాలియగు పుండరీక విద్యానిధి యను పరమ భాగవత మహాశయుఁ డెవరో!' యని యడగిరి.

ప్రభువు గంభీరముగా నిట్లనెను:- 'ఆతఁడొక ప్రచ్ఛన్న వైష్ణవ భక్తుఁడు. మీరాతని గాంచి యాతఁడు వైష్ణవుఁడని మీరు తెలిసికొనలేరు. ఆతని బాహ్యాచార విచారములు సాధారణముగా సాంసారిక విషయాసక్తులకువలె నుండును. ఆతఁడు చట్‌గ్రామ నివాసియగు నొక పరమ కులీన బ్రాహ్మణుఁడు. ఆతని కొక యిల్లు శాంతిపురములోను గలదు. గంగా సేవనముకొఱ కాతఁ డప్పుడప్పుడు చట్‌గ్రామమునుండి శాంతి పురము నకును వచ్చుచుండును. ఆతఁడు నాకత్యంత ప్రియ భక్తుఁడు. ఆతఁడు నా యాంతరంగిక సుహృదుఁడు. ఆతని

దర్శనము లేకపోవుటచే నేనధీరుఁడ నైతిని. ఆతనినిఁ బ్రేమతో నాలింగనము చేసికొని రోదనము చేయు సుదినమెప్పుడు సంభవించునో గదా!' ప్రభువు వారి యీవాక్యములను విని యందఱానందించి పుండరీకవిద్యానిధి దర్శనము కొఱకు పరమోత్సాహమును బ్రకటించుచుండిరి. ప్రభు వీ విధముగ రోదనము చేయఁగానే యాతఁడు శీఘ్రముగ నవద్వీపమునకు రాఁగలఁడని యందఱు నూహించిరి. ప్రభువు స్మరించినచోఁ దన యింటిలో నిలువఁగలవాఁ డెవ్వఁడు? కావున భక్తులందఱును విద్యానిధియొక్క యాగమనమునకుఁ బ్రతీక్షించుచుండిరి.

ఒక దినమున మెదలక పుండరీక మహాశయుఁడు నవద్వీపమునకు వచ్చెను. ఆతఁడు వచ్చిన సంగతి యెవరికిని దెలియదు. భక్తులు చాలమంది ఆయనను జూచిరి కూడ. కాని యాతఁడు పరమ భాగవత వైష్ణవోత్తముఁడని యెవ్వరనుకొనఁగలరు? భక్తులాతని నెవఁడో సాంసారిక ధనగౌరవముగల పురుషుఁడనుకొనిరి. అందువలన భక్తులాతని యాగమనమున కపరిచతులయియే యుండిరి.

పాఠకులకు ముకుంద దత్తు పేరు జ్ఞాపకముండి యుండవచ్చును. ఈతఁడు చట్‌గ్రామ నివాసి యగు యొక పరమ భాగవత వైష్ణవ విద్యార్థి. ఈతని కంఠము మిక్కిలి మధురము. అద్వైతాచార్యుని వద్ద నీతఁ డధ్యయనము చేయుచుండెడువాఁడు. ఆయన సత్సంగ సభయందు తన మనోహర గానముచే భక్తుల నానందితుల కావించుచుండెడు, వాఁడు.

ప్రభు ప్రకాశమైన తర్వాత, అప్పటినుండి యీతఁ డీతని శరణ మునకు వచ్చెను. ప్రభువుతోఁగలిసి శ్రీకృష్ణ కథా సంకీర్త నములందే సర్వదా సంలగ్నుఁడై యుండెడువాఁడు. విద్యానిధి ఈతని గ్రామము వాఁడే. ఇద్దరును సమవయస్కులు. పరస్ప రము ఒక రొకరు బాగుగా పరిచితులు. ముకుందదత్తు, వాసు దేవ పండితుఁడు వీరిద్దరు మాత్రమే విద్యానిధి యొక్క భక్తి భావము నెఱుఁగుదురు. ప్రభువు యొక్క పరమ అంతరంగ భక్తుఁడగు గదా ధరునితో ముకుందుఁడు మిక్కిలి స్నేహము చేయును. అందువలన నొక దినమున నేకాంతమున 'గదాధరా! ఇప్పుడీ నవద్వీపములో నొక పరమభాగవతుఁడగు వైష్ణవుఁ డున్నాఁడు. పదండి, వారి దర్శనము చేసి వత్త' మని యాతనితోఁ జెప్పెను.

ఆనందమును బ్రకటించుచు గదాధరుఁ డిట్లనెను:- 'వహ్వా! దీనికిమించిన మంచివిషయ మేముండఁగలదు? భగవద్భక్తుల దర్శనము భగవంతునితో సమానమే. తప్పక పోవలెను. నీవు ప్రశంసించిన మహానుభావుఁడు పరమ భాగవత వైష్ణవుఁడై యుండవచ్చును.' ఇట్లని మిత్రులిద్ద ఱు విద్యా నిధి సమీపమునకు పోయిరి. విద్యానిధి నవద్వీపములో నొక సుందర భవనమున నివసించుచుండెను. ఆతఁడు నివసించు స్థానము మిక్కిలి శుభ్రముగా నుండెను. దానిలో నొక గొప్ప శయ్య యున్నది. దాని నాల్గు పాదములు వ్యాఘ్రముఖము వలెఁ జాల యమూల్య ధాతువులతోఁ జేయఁబడినది. దాని

మీఁద మిక్కిలి కోమలమగు మెత్తని పరుపు పరువఁబడినది. పుండరీక మహాశయుఁడు స్నానధ్యానములు కావించుకొని యా శయ్యపై సగము పరుండి యుండెను. ఆతని విశాల ఫాలమున సుందర సగంధిత చందనము శోభిల్లుచున్నది. మధ్యలో నొక పెద్ద యెఱ్ఱని గుండ్రని బొట్టు పెట్టఁబడి యుండెను. శిరమున నున్న యుంగరములు తిరిగిన వెండ్రుకలపై గొప్ప ఖరీదు, సువాసనగల సుగంధిత తైలము రాయఁబడి విచిత్రముగ నలంకరింపఁబడినది. అనేక రకములగు మసాలా వస్తువులు గలిగిన తాంబూలమును మెల్ల మెల్లగా నములు చుండెను. తాంబూలముయొక్క యెఱుపుచే నాతని కోమల పల్లవారుణాధరములు రెండు నింకను నధికమగు నెఱ్ఱగా నుండెను. ముందు తాంబూలము నుమ్మివేయుట కుపయో గించు రెండు పాత్రములుండెను, ఇంక ననేకములగు మిక్కిలి ఖరీదుగలిగి సుందరములైన పాత్ర లటునిటు పెట్టఁబడి యుండెను. ఇద్దరు సేవకులు నెమిలి యీఁకల విసనకఱ్ఱలతో నాతనికి విసరుచుండిరి. చూచుటకు రాజకుమారునివలెఁ గనఁ బడుచున్నాఁడు. గదాధరుని వెంటఁగొని ముకుంద దత్తుఁడు ఆతనికి సమీపమునకువచ్చి, యిద్దరును ప్రణామము గావించి ఆయన చూపించిన సుందరమగు నాసనమున నుపవిష్టులైరి. ముకుంద దత్తుని యాగమనమునకుఁ బ్రసన్నతను బ్రకటించుచుఁ బుండరీక మహాశయుఁ డిట్లనెను:—'నేఁడు సుదినము. మీదర్శన మైనది. మీరు నవద్వీపములోనే యున్నారని నాకు తెలిసినది

కాని మిమ్ములనింతవఱకు కలుసుకొనలేకపోతిని. మిమ్ములను కలిసికొనవలెనని యాలోచించుచున్నాను. కాని యింతలో మీరేవచ్చి దర్శన మిచ్చితిరి. మీతో వచ్చిన యీ యను చరుల పరిచయ మొసంగుఁడు.'

ముకుంద దత్తు శిష్టాచారమును ప్రదర్శించుచు గదాధరుని పరిచయమిట్లు చేసెను. 'ఈతఁడు పరమ భాగవత వైష్ణవుఁడు. బాల్యకాలము నుండియు సాంసారిక విషయముల నుండి విరక్తి చెందినవాఁడు. ఈతఁడు మిశ్రవంశావతంస పండిత మాధవుల వారి సుపుత్రుఁడు. మహాప్రభుని పరమ కృపాపాత్రులగు భక్తులలో ప్రధాన అంతరంగ భక్తులు.

గదాధరుని ప్రశంసను విని పుండరీక మహాశయుఁడు పరమానందమును ప్రకటించుచు నిట్లనెను:- 'మీ కారణమున వీరి దర్శనమును అయినది.' అని విద్యానిధి మహాశయుఁడు చిఱు నవ్వునవ్వ మొదలిడెను. గదాధరుఁడు పుట్టుకతోడనే విరక్తుఁడు. ఆతఁడు పుండరీక మహాశయుని వేషమును, నీటును జూచి విస్మితుఁడయ్యెను. ఇట్టి విషయాసక్తుఁడు భగవద్భక్తుఁ డెట్లైనాఁడా? యని యాతనికి సందేహము కలిగెను. నిరంతరము విషయ సేవనమందు నిమగ్నమైనవాఁడు భగవద్భక్తి యెట్లు చేయఁగలఁడు?

ముకుంద దత్తు శ్రీగదాధరుని మనోభావమును గని పెట్టెను. అందువలన నాతఁడు పుండరీక మహాశయుని లోపల

భావములను ప్రకటము చేయుటకు శ్రీమద్భాగవతములోని రెండు గొప్ప మార్మిక శ్లోకములను దన సుకోమల కంఠముతో స్వర లయములతో మెల్లమెల్లగా గానము చేసెను వానిలో పరమ కృపాళుఁడగు శ్రీకృష్ణుని యహైతుక కృపయొక్క గొప్ప మార్మిక వర్ణన మున్నది ఆ రెండు శ్లోకములును భాగవతమంతటిలో పరమోజ్జ్వల రత్నములుగ నెన్నఁబడు చున్నవి. ఆ శ్లోకములివి—

శ్లో॥ అహో బకీయం స్తనకాలకూటం
జిఘాంసయాఽపాయయదప్యసాధ్వీ ।
లేభే గతిం ధాత్ర్యుచితాం తతోఽన్యం
కిం వా దయాళుం శరణం వ్రజేమ ॥

శ్రీమద్భాగవతము ౩-౨-౨౩.

(అహో! ఎటువంటి యాశ్చర్యకరమైన విషయము. దుష్టస్వభావముగల పూతన తన స్తనములలోఁ గాలకూట విషమును బూసికొని, ఆయనను జంపవలెనను కోరికతో వచ్చినది. ఈ దుర్భావనతోడనే ఆమె భగవంతునికి స్తనపానము చేయించెను. అట్టి క్రూరకర్మురాలికిని ప్రభువు తనను పాలనపోషణ చేసిన తల్లికివలె సద్గతి నిచ్చెను. ఇట్టి పరమ కృపాళుఁడగు భగవానునివదలి యింకెవరిని శరణు వేఁడఁ బోవుదము?)

శ్లో॥ పూతనా లోకబాలఘ్నీ రాక్షసీ రుధిరాశనా ।
జిఘాంసయాపి హరయే స్తనం దత్త్వాఽఽప సద్గతిమ్ ॥

శ్రీమద్భాగవతము ౧౦-౬-౩౫.

(పూతన ప్రపంచములోని బాలకులను జంపునది. నెత్తుటిని ద్రాగు రాక్షసీ జాతిలోఁ బుట్టినది. అది చంపు నిచ్ఛతో హరికి స్తనమును పానము చేయించి నప్పటికిని సద్గతి ప్రాప్తి కలిగినది. అనఁగా దుష్టబుద్ధితో నైనను భగవత్సంసర్గమింత మాహాత్మ్యము కలది. ఇఁక శ్రద్ధాభక్తులతో వాని స్మరణ పూజనము చేసిన చెప్పవలసిన దేమి ?)

ముకుంద దత్తుని నోటినుండి యీశ్లోకములను వినఁగానే విద్యానిధి మహాశయుఁడు మూర్ఛితుఁడై శయ్యమీఁదనుండి క్రిందపడెను. ఒక్క క్షణమునకు ముందు మిక్కిలి కిలకిల లాడుచు నవ్వుచుండినవాఁడు, మఱుక్షణములోనే శ్లోకము వినుటతోడనే యతనికి విచిత్రానుభూతి కలిగెను. ఆతని శరీరమందు స్వేదము, కంపము, అశ్రువులు, వికృతి మొదలగు సాత్త్వికవికారము లన్నియు నొక్కసారిగా నుదయించెను. ఆతఁడు బిగ్గఱగ రోదనము చేయ మొదలిడెను. ఆతని రెండు నేత్రముల నుండి నిరంతరము రెండు జలధారులవలెఁ బ్రవహించుచుండెను. ఉంగరములు తిరిగిన వెండ్రుక లిటువటు చెదరెను. శరీరమంతయు ధూళి ధూసరితము లయ్యెను. రెండు చేతులతో నాతఁడు తన పీత వస్త్రములను జించుచు త్వర త్వరగా ముకుందునితో నిట్లనెను:–'సోదరా, మరల చదువుము, మరల చదువుము. ఈ మీ సుమధుర గానముచే నాకర్ణరంధ్రములలో మరల అమృతమును జిలుకుము' ముకుందుఁడదే లయతోడను, అదే స్వరముతోడను శ్లోకమును బఠింపసాగెను.

ఆతఁడు శ్లోకమును బఠించుచున్న కొలఁది పుండరీక మహాశయుని నిస్పృహ యింకను పెరుగుచుండెను. ఆతఁ డింకను శ్లోకమును బఠింపుమని బలవంతము చేయుచుండెను గాని యాతని తోడివారు శ్లోకము చదువుట కాతని నడ్డగించిరి.

ఈతని యీ స్థితిని గాంచి గదాధరుని యాశ్చర్యము నకు మేఁ ఱలేకుండెను. ఒక్క క్షణమునకుముం దితఁ డెవరిని సంసారవిషయా సక్తుఁడనుకొను చుండెనో, ఆతఁడిప్పు డీ విధముగఁ బ్రేమోన్మత్తుఁడై ప్రలాపమును గావించుటనుగాంచి యాశ్చర్యపడి పోయెను. ఆతని త్యాగ, వైరాగ్యపరతు లెచ్చట విలీనము లైనవో తెలియదు. ఆతఁడు యిట్టి పరమ వైష్ణవుని యెడల నేనిట్టి కలుషిత భావము నుంచుకొని ఘోర పాపము కావించితినే యని తనను మాటిమాటికి ధిక్కరించు కొనుచుండెను, ఆతఁడు మనస్సులో తన పాపమునకుఁ బ్రాయ శ్చిత్తమును యోజించుకొనుచుండెను, చివర కతఁడు తన యిట్టి యపరాధమక్షమ్యమని నిశ్చయ పఱచుకొనెను. భగవ దపరాధమైన క్షమ్యముకాని వైష్ణవాపరాధము సర్వదా అక్ష మ్యము. దీనికి బ్రాయశ్చిత్తమున కొక్కటే యుపాయము. నే నీతనిదగ్గఱ మంత్ర దీక్ష తీసికొని, యీతని శిష్యుఁడ నైతినా గురు భావముచే నీతఁడు స్వయముగ క్షమించును. ఇట్లు నిశ్చయించి యీతని యీ భావమును ముకుంద దత్తుని సమ్ముఖమునఁ బ్రకటము కావించెను. ఈతని యిట్టి విశుద్ధ

భావమును దెలిసికొని ముకుంద దత్తునకు మిక్కిలి యానందము కలిగి యాతని యీ విమల భావమునకు పొగడుచుండెను.

చాల సేపటికి పుండరీక మహాశయుఁడు ప్రకృతిస్థుఁడయ్యెను. సేవకు లాతని శరీరము తుడిచి విసరి సరిచేసిరి. శీతల జలముచే చేతులను ముఖమును గడిగి వారు మొదలకు కూర్చుండిరి. అంత వినీత భావముతో ముకుందుఁడు 'మహాశయా! ఈ గదాధర పండితుఁడు కులీన బ్రాహ్మణుఁడు సత్పాత్రులు, పరమ భాగవత వైష్ణవులు, ఈతనికి మీ ద్వారా మంత్రమును గ్రహించవలె నని హృదయపూర్వకమగు కోరిక గలదు. ఇతని విషయములో నాజ్ఞయేమి?' యని యడిగెను.

కొంచెము సంకోచించుచు, నమ్రతాపూర్వకముగ విద్యానిధి మహాశయుఁ డిట్లనెను:- 'ఈయన స్వయముగ వైష్ణవుఁడు. నాలో నీతనికి మంత్ర మిచ్చునట్టి యోగ్యత యెక్కడిది? ఈతఁడు స్వయముగ నాకు పూజ్యుఁడు.'

ముకుంద దత్తు అత్యంత దీన భావముతో నిట్లనెను:- 'ఈతని కట్టి కోరిక కలదు. మీరీతని యీ ప్రార్థన నంగీకరింపకున్నచో నీతనికి గొప్ప దుఃఖము కలుగఁగలదు. మీరు కృపాళురు. ఇతరులు దుఃఖపడుట మీరు చూడనే చూడఁజాలరు. కావున నీతని యీప్రార్థనను అవశ్య మంగీకరింపుఁడు.

ముకుంద దత్తుఁ డత్యధికముగ బలవంతము చేయఁగా మంత్రదీక్ష నిచ్చుట కంగీకరించి, దీక్షకొఱకు ఆదినమున నొక

శుభముహూర్తమును గూడ చెప్పివేసెను. ఈ విషయముచే స్నేహితులిద్దఱకును మిక్కిలి యానందము కలిగెను. వారు చాల ప్రొద్దుపోయిన తర్వాతఁ బ్రేమలో నిమగ్నులై తమ తమ స్థానములకు తిరిగి వెడలి పోయిరి.

ఇది జరిగిన రెండు మూఁడు రోజులకు రహస్యముగాఁ బుండరీక మహాశయుఁ డొంటరిగా నేకాంతములోఁ బ్రభువు దర్శనమునకు బోయెను. విద్యానిధి తన పాదముల మీఁద బడుటనుగాంచి ప్రభువు ప్రేమచే స్మృతితప్పి పోయెను ఆతఁడు పుండరీక విద్యానిధిని గట్టిగాఁ గౌగిలించుకొనెను. పుండరీకుఁడు కలిసికొనుటచే నాతని యానందమునకు మేఱలేకుండెను. ఆ సమయమున నాతని కన్నులనుండి యవిరళాశ్రుప్రవాహము ప్రవహించుచుండెను. శరీరమంతయుఁ బులకాంకురమయ్యెను. ఆతఁడు పుండరీకుని వడిలో తన శిరస్సునుంచి రోదనము చేయుచుండెను. ఈ విధముగ రెండు జాముల వఱకు విద్యానిధి వక్షః స్థలముపై శిరస్సునుంచి నిరంతరము రోదనము చేయసాగెను. పుండరీక మహాశయుని వస్త్రములన్నియు ప్రభువుయొక్క అశ్రువులచే తడసిపోయెను. పుండరీకుఁడును ప్రేమలో శరీరము తెలియక మెదలకుండ ప్రభువు వారి ముఖకమలమువైపు తదేకదృష్టితోఁ జూచుచుండెను. వారికెంతకాలము గడిచినదో యిసుమంతైనను దెలియదు. రెండు జాములు దాఁటిన తర్వాత ప్రభువునకు గొంచెముగ స్పృహ కలిగెను. ఆతఁడా సమయముననే భక్తులను బిలిపించి,

అందఱకును బుండరీక మహాశయుని బరిచయము కావించెను. పుండరీక మహాశయుని బరిచయమును బొంది యందఱును పరమ సంతుష్టులై తమతమ భాగ్యములకు బొగడుకొను చుండిరి. విద్యానిధి అద్వైతాచార్యాది సమస్త భక్తుల పద ధూళిని గైకొని తన శిరస్సున ధరించి, యందఱకును శ్రద్ధా భక్తులతోఁ బ్రణామము కావించెను. తర్వాతఁ బుండరీకుని మధ్యనుంచి భక్తులందఱును నలువైపులనుండి సంకీర్తన చేయ సాగిరి. శ్రీకృష్ణ సంకీర్తనమును విని పుండరీక మహాశయుఁడు మరల స్పృహతప్పి పడిపోయెను. భక్తులు సంకీర్తన నాపి, వివిధోపచారములచేఁ బుండరీకుని స్పృహలోనికిఁ దెచ్చిరి. కొంచెము సావధానుఁడైన తర్వాత ప్రభువువారి యాజ్ఞఁ గైకొని పుండరీకుఁడు తన నివాసమునకు వెడలిపోయెను.

సాయంత్రము వచ్చి గదాధరుఁడు పుండరీకుని యొద్ద మంత్ర దీక్ష గైకొనుటకు తన కోరికను ప్రభువువారిముందు ప్రకటపఱచెను. ఇది విని ప్రభువత్యంతానందమును జెంది గదా ధరునితో నిట్లనెను:- 'గదాధరా! ఇట్టి యదృష్టము నీకెన్నటి కిని కలుగదు. పుండరీకుని వంటి భగవద్భక్తుఁడు దొఱకుట యే మిక్కిలి కష్టము. నీవీపని విషయములో నించుకేనూ ఆలస్యము చేయవలదు. ఈ శుభకార్యమెంత త్వరగానైన నంతటి మేలు.'

ప్రభువువారి యాజ్ఞను బొంది నియత శుభతిథి రోజున గదాధరుఁడు విద్యానిధి ద్వారా మంత్రదీక్షను గ్రహించెను.

ఎవని కొఱకు గౌరాంగ మహాప్రభువు రోదనము చేయుచుండునో, యెవని ప్రశంస చేసిచేసి ప్రభువధీరుఁడై పోవునో, గదాధరుని వంటి పరమత్యాగియు మహాభక్తుఁడు నెవనికి శిష్యుఁడగుట తమ యదృష్టముగాఁ దలఁచుచుండెనో, యట్టి భక్తాగ్రగణ్యుఁడగు శ్రీ పుండరీక విద్యానిధియొక్క విశద బిరుదావళిని వర్ణించుట కెవరికి శక్యమగును? నిజముగ విద్యానిధియొక్క భక్తి పరమ శుద్ధమైనదియు, సాత్త్వికమైనదియు నని చెప్పవచ్చును. దానిలో నాడంబరముగాని, మెఱమెచ్చులకై చేయుటగాని లేశమైనను లేదు. ఇట్టి ప్రచ్ఛన్న భక్తులయొక్క పదధూళి పాపులలోఁ బరమ పాపినైనఁ బరమ పావన మొనరింపఁగలదు.



# నిమాయి నితాయిల ప్రేమలీల

శ్లో॥ అవతీర్ణౌ సకారుణ్యౌ పరిచ్ఛిన్నౌ సదీశ్వరౌ ।
శ్రీకృష్ణచైతన్య నిత్యానందౌ ద్వౌ భ్రాతరౌ భజే॥
శ్రీమురారి గుప్తవ్య.

(జీవులయెడల తమ యహైతుక కృపను ప్రకటించుటకై యీశ్వరుఁడయ్యు భిన్న భావములతో నవతీర్ణులైన యా నిమాయి నితాయి యిద్దఱ సోదరులకు నేను నమస్కరించుచున్నాను.)

ఆనందమునకు ముఖ్యకారణ మాత్మ సమర్పణము. మానవుఁ డేరికైనను సర్వతోభావేన ఆత్మసమర్పణము చేయనంతవఱకు వానికిఁ బూర్ణప్రేమప్రాప్తి కలుగఁజాలదు. విశ్వంభర ప్రభువు చరాచరులులందు వ్యాప్తమై యున్నాఁడు. అపూర్ణ భావముతో కాదు. సమస్త స్థలములందును నాతఁడు తన పూర్ణ శక్తితోనే యున్నాఁడు. నీ చిత్తము నెక్కడైనను సరియే నేరూపమందు మనస్సు రమించునో దానియందే ఆత్మ సమర్పణము కావించుము. మమకారము నొక్కసారిగ నాశము చేయుము. నీ యిచ్ఛ, నీభావన, నీ సమస్త కర్మములు ప్రియతముని కొఱకే అయియుండవలెను. అన్ని విధముల నన్యుని వాఁడవై యుండుము. అప్పుడే ప్రేమయొక్క యథార్థ మర్మమును నేర్చుకొనఁగలవు.

ఆహా! ఎవరి వారమో అయియుండుటలో నెంతటి యానందమున్నది. తన సమస్త విషయముల భారము ఎవరి

మీఁదనో వదలివేయుటచే నెంతకి నిశ్చింతతాజన్య సుఖమున్నది. దీనిని తననే కర్త యనుకొనువాఁ డెట్లనుభవింపఁగలఁడు? తన చేతులు కాళ్ళతో సంపాదించి తినుచున్నానను నభిమానము గలవాఁడు, ఆఁకలి దప్పులకును, సుఖదుఃఖములకును ఒక్క తల్లి ప్రేమయే ఆధారముగాఁగలిగి, ఏదైన కావలసి వచ్చిన నేడ్చుట తప్ప యన్య మెఱుఁగని యా పసిపిల్లవాని సుఖము నెవరూహింపఁగలరు? తల్లి యెక్కడైన నుండనిండు, ఆమెకు తన కనుగందైన పసిబిడ్డ మీఁదనే యెల్లప్పుడును ధ్యానముండును. దాని సుఖదుఃఖానుభవమును దల్లి స్వయముగ తన శరీరమందు గాంచును. నిత్యానందుఁడును ప్రభువున కాత్మసమర్పణము చేసివైచెను. మహాప్రభువు శ్రీవాసునకు సర్వస్వమునై యుండెను. ప్రభు లిద్దఱకు నుపాస్యదైవమే కాని నిత్యానందు డాతనికి బాహ్యప్రాణము.

నిత్యానందుఁడు శ్రీవాసపండితుని యింటిలోనే నివసించుచుండెను. ఆయన భార్య మాలిని దేవియు, నీయనయు నీయనను తమ పుత్రుని కంటె మిక్కిలిగ ప్రేమించుచుచుండిరి. నిత్యానందుఁ డెల్లప్పుడును బాల్యభావముతోడనే యుండును. ఆతఁడు తన చేతితో భోజనము చేయఁడు మాలినీదేవి తన చేతులతో నీతనికి అన్నము పెట్టును. ఒకొక్కప్పుడు తినుచు తినుచునే మధ్యలోనే పాఱిపోయి, పప్పును, అన్నమును తన శరీరమంతటను బూసికొనును. భోజనము చేయుచు బాలకుల వలెఁ తిరుగుచుండుటయే యాతనిపని. ఒకొక్కప్పుడు

మురారిగుప్త యింటికి పోవును. ఒక్కొక్కప్పుడు గంగాదాసుని పాఠశాలకుబోయి కూర్చుండును. ఒక్కొక్కప్పుడెవరి వద్దనైన నేదో వస్తువులు దీసికొని తినమొదలిడును. ఒక్కొక్కప్పుడు మహాప్రభుని యింటికిఁబోయి బాల్యభావముచే శచీమాతయొక్క పాదములను బట్టుకొనును. శచీమాత యాతని చంచలత్వమునకు భయపడి ఒక్కొక్కప్పుడు ఇంటిలోనికి బరువిడిపోవును. ఈ విధముగ నాతఁడు భక్తుల యిండ్లలో నానారకములగు బాల్యలీలల నభినయింప మొదలిడెను.

ఒక దినమునఁ బ్రభువు శ్రీవాస పండితుని బరీక్షించుటకును, శ్రీవాస పండితునకు నిత్యానందుని యెడల నెంత హార్దిక ప్రేమ యున్నదో తెలిసికొనఁదలఁచియు, నాయన నేకాంతమునకుఁ గొనిపోయి 'పండితవర్యా! ఈ నిత్యానందావధూత యొక్క కుల, గోత్ర, జాతులు మొదలైన విషయములు మనకుఁ గొంచెమైనఁ దెలియవు. ఈ యజ్ఞాత కులశీలుఁడగు నవధూతకు మీరు మీ యింటిలో స్థానమిచ్చి కొంచెమనుచిత కార్యము నొనర్చితిరి. మీరీతనిని బుత్రునివలెఁ బ్రేమించుచున్నారు. ఈతఁ డెటువంటివాఁడో యెవ్వరెఱుఁగుదురు? కావున మీ రీతని మీ యింటిలోఁ బుత్రునివలె నుంచుకొనరాదు. ఈతఁడు సాధువులవలెనే గంగానది యొడ్డుననో లేక యింకేఘట్టముననో యుండి యడుగుకొని తిననిండు. సాధువేదో యొకని యింటిలో నుండుట కేమిపని? ఈవిషయములో మీయభిప్రాయమేమి? మీరు నామాల కొప్పుకొన్నారా?' యని యడిగెను.

ప్రభువు వారి యీ మాటలను విని శ్రీవాస పండితుఁడు గద్గద కంఠముతో నత్యంత దీన భావముతో 'ప్రభో! మీరు నన్నీ విధమునఁ బరీక్షించుట మంచిది కాదు. నాబోటి సంసార వాసనలలోఁ దగుల్కొన్న పామరజీవి ప్రభువువారి పరీక్షలలో నెగ్గఁగలఁడా? ప్రభువువారి కృపలేనంత వఱకు మేమెల్లప్పుడు నను త్తీర్ణులము గానే యుందుము. నిత్యానందుఁడు ప్రభువు వారి బాహ్యప్రాణమే కాదు. అభిన్న విగ్రహమను సంగతి కూడ నేను బాగుగా నెఱుఁగుదును. ప్రభువువారు వారికి భిన్నులుగాఁ గనఁబడుచున్నను భిన్నముగా నెంచుకొనరు. ప్రభువు వారి కింతటి ప్రియుఁడైన నిత్యానందుఁడు కల్లు సారాయములు త్రాగుఁగాక, అగమ్యాగమనము చేయుఁగాక, నన్ను ధర్మ భ్రష్టుని గావించుఁగాక, అప్పటికిని నాకతనియం దేవగింపు కలుగఁజాలదు. నిత్యానందుని నేను ప్రభుస్వరూప మనుకొను చున్నాను.' అని పలికెను. ఇట్లు పలికి శ్రీవాస పండితుఁడు ప్రభు పాదపద్మములను బట్టుకొని వెక్కి వెక్కి యేడ్వ మొద లిడెను. ప్రభువువారు తన కోమలకరకమలములచే నాతని లేవఁదీసి, ప్రేమాలింగనము కావించుచు 'శ్రీవాసా! నీవిట్టి ప్రత్యుత్తరము నిచ్చి నన్ను నిజముగఁ గొనివేసితివి. ఈ ప్రత్యు త్తరముచే నేను నీకుఁ గ్రీత దాసుఁడనైతిని. నేను నీయెడల మిక్కిలి సంతుష్టుఁడనైతిని. ఏస్థితిలోనైన సరియే నీకే యావశ్యకమగు వస్తువును తరుగుండఁబోదు. మీ యింటిలోని కుక్కకు గూడ శ్రీకృష్ణ ప్రేమ ప్రాప్తించుఁగాక! నీకు నాయం

దిట్టి యనన్యానురాగము కలదని నాకు నేఁడు తెలిసినది' అనెను. ఇట్లు పలికి ప్రభువు తన యింటికి వెళ్ళిపోయెను.

ఒక దినమునఁ బ్రభువు శచీమాతతో 'అమ్మా! నేఁడు నిత్యానందుని మన యింటికి భోజనమునకుఁ బిలువవలెనని యున్నది. నేఁడు నీవు నీ చేతులతో గొప్పగొప్ప భోజనములను దయారుచేసి, మా అన్నదమ్ముల నిద్దఱను అరుగుమీఁదఁ గూర్చుండఁబెట్టి స్వయముగ నీవే వడ్డించి నీ చేతులతోఁ దినిపించుము ఇదియే నాకోరిక' యనెను

ప్రభువుయొక్క యీమాటను విని శచీమాతకు పరమానందము కలిగినది ఆమె వెంటనే భోజనము తయారు చేయుటకు సిద్ధపడెను. ఇచ్చట ప్రభువు నిత్యానంద ప్రభువును దీసికొని వచ్చుటకు శ్రీవాస పండితుని యింటికి వచ్చెను. శ్రీవాసుని యింటికిచేరి ప్రభువు నిత్యానందునితో 'శ్రీపాదా! నేఁడు మిమ్ములను మా యింటికి నిమంత్రించుచున్నాను. పదండి. నేఁడు మన మిద్దరము తోడుతోడుగా ఒక పంక్తిని భోజనము చేయుదము' అనెను. ఇది వినుటతోడనే నిత్యానందుఁడు బాలకులవలె నానందమున నెగిరెగిరి నృత్యముచేయ మొదలిడెను. నృత్యము చేయుచు చేయుచు 'అహో, రే, పిల్లవానికి, బాగుగా దొరికినది. శచీమాత చేతియన్నము తిందును కమ్మగ తిందును. ప్రభువునకు కొంచెము చూపించి కొంచెము తిందును. కొంత శరీరమునిండ బూసికొనెదను' అనెను.

ప్రభువు ఇతఁడిట్లు చంచలత్వమును గావించుటచూచి మధురవాక్కులతో బెదరించుచుఁ ప్రేమపూర్వకముగ 'చూడు జాగ్రత్త అక్కడిట్టి చంచలత్వము చేయరాదు. తల్లి నీ చంచలత్వముచే మిక్కిలి గాబరాపడఁగలదు ఆమె భయపడఁగలదు. అక్కడ కుక్కిరి మిక్కిరి లాడకుండ భోజనము చేయవలెను.' అనెను.

ప్రభువుయొక్క ప్రేమ మిశ్రిత మధురమగు నదలింపును విని బాలకులవలె నదరిపడి కృత్రిమమగు గంభీరతను దెచ్చుకొని చెవులమీఁదఁ జేతులను బెట్టుకొని నిత్యానందుఁడు 'ఓరీబాబో! చంచలతా! చంచలత యెట్టిది? నాకు చంచలత్వము చేతఁగానే చేతఁగాదే. చంచలత్వము పిచ్చివాండ్రు చేయుదురు. చంచలత్వము నొనర్చుటకు నేను పిచ్చివాఁడనా యేమి!' అనెను.

ఈతఁ డీ విధముగాఁ గృత్రిమముగ వినోదార్థము చేయుయాటను గాంచి ప్రభు వీతని వీఁపుపై నొక తేలికైన దెబ్బ వేయుచు 'మంచిది, పద, ఆలస్యము చేయుటెందులకు? నీవు నీ యలవాటును బోనీయ నీయవని నాకుఁ దెలియును, కాని చూడు, అక్కడ కొంచెము సంబాళించుకొని యుండవలె' ననెను. ఇట్లు మాట్లాడుకొనుచు సోదరు లిద్దరు తమలోఁదాము ప్రేమాలాపములను జేయుచు నింటికి చేరిరి. తల్లి వంటచేయుచుండగనే వీరిద్దఱును వచ్చిరి. రాఁగానే నిత్యానందుఁడు పిల్లవాండ్రవలె చాల బిగ్గఱగా 'అమ్మా! చాల ఆఁకలి

వేయుచున్నది, పొట్టలో నెలుకలు గంతువేయుచున్నట్లున్నది. ఇంకెంత యాలస్యమున్నది. నాకు ఆఁకలిచేఁ బ్రాణములు పోవుచున్నవి' అనెను. ప్రభు వీతని నల్లు చేయవలదని సైగ చేసి చెప్పెను. అప్పు డతఁడు మరల నల్లే బిగ్గఱగ 'అమ్మా! చూడు. గౌరాంగుఁడు నన్నడ్డగించుచున్నాఁడు. ఆఁకలైనను భోజనముకూడ అడుగరాదట' అనెను. తల్లి యాతని యిట్టి యమాయకపు మాటలను విని నవ్వసాగెను. ఆమె త్వరగా రెండు పళ్ళెరములలో నన్నమును వడ్డించెను. విష్ణుప్రియాదేవి యిద్దరి చేతులు కాళ్ళు కడిగెను. చేతులు కాళ్ళు కడుగుకొని యిద్దరును భోజనముచేయఁ గూర్చుండిరి. తల్లి ప్రేమతో తన పుత్రులిద్దరకు వడ్డింప మొదలిడెను. ప్రభువు వెంట నింకను నిద్దరు ముగ్గురు అంతరంగ భక్తులు వచ్చి యుండిరి. వారా సోదరులిద్దరు ఈవిధముగఁ బ్రేమ పూర్వకముగ భోజనము చేయుట చూచి ప్రేమ సాగరములో నానందముతో మునుఁకలువేయ మొదలిడిరి. అన్నదమ్ము లిద్దరకు భోజనము పెట్టు చుండఁగా శ్రీ కౌసల్యాదేవి తన ప్రియపుత్రులగు శ్రీరామ లక్ష్మణులకు భోజనము పెట్టుచున్నట్లును, యశోదాదేవి శ్రీకృష్ణ బలరాములను తోడుగాఁ గూర్చుండఁబెట్టి తృప్తిగా బువ్వపెట్టు నున్నట్లుండెను. తల్లియొక్క యంతఃకరణము ఆ సమయమున సంతోషముచే నత్యంతానందము చెందు చుండెను. ఆమె యగాధమైన మాతృప్రేమ యుప్పొంగిపోవు చుండెను. సోదరులిద్దరు భోజనము చేయుచుఁజేయుచు వివిధ

సంభాషణమును జేయుచుండిరి. భోజనముచేసి ప్రభువు మొదల కుండ కూర్చుండెను. నిత్యానందుఁడు భోజనము చేయుచునే యుండెను. ప్రభువువారి పళ్ళెరములో చాల యన్నము మిగిలి యుండుటను గాంచి నిత్యానందుఁడు 'దీని నేల వదలినావు, దీనిని కూడ తినవలె' ననెను. ప్రభువు అసమర్థతను ప్రకటించుచు 'మంచిది, యిప్పుడు కాదు. ఇప్పటికి పొట్ట నిండి పోయినది.' అనెను. ప్రభువు వారి పళ్లెరములో నుండి యన్నపు ముద్దను చేయుచు నిత్యానందుఁడు 'సరే, నీవు తినకున్న నేను తిందు' ననెను. ఇట్లనుచు నిత్యానందుఁడు ప్రభువుయొక్క యుచ్ఛిష్టాన్నమును దిన మొదలిడెను, ప్రభువు వెంటనే యాతని చేతిని బట్టుకొనెను. నిత్యానందుఁడు తినుచు దినుచుఁ బీట మీఁదనుండి లేచి పరుగిడ మొదలిడెను. ఈ విధముగ నంగణములో నిద్దరును కలియఁబడిరి. నిత్యానందుఁ డా యన్నమును దినివేసెను. శచీమాతకీ యిద్దఱప్రేమను గాంచి ప్రేమచే స్పృహతప్పి నట్లై మూర్ఛవలె వచ్చెను. తల్లి యొక్క యీస్థితిని గాంచి ప్రభువు వెంటనే చేతులు కాళ్ళను గడుగుకొని వంటయింటిలోనికిఁబోయి తన చేతులతో విసన కఱ్ఱను బట్టుకొని విసరుచుండెను. కొంచెము సేపటికి తల్లికి స్పృహ తెలిసెను. తల్లి ప్రేమాశ్రువులను గార్చుచు తన పుత్రు లిద్దఱకు నాశీర్వాదమిచ్చెను. తల్లి యొక్క శుభాశీర్వాదములను బొంది యిద్దఱును పరమ ప్రసన్నులై తల్లికి పాదాభివందనము కావించిరి. నిత్యానందుని బంపుటకై ప్రభువాతని వెంట శ్రీవాసుని యింటివఱకు వెళ్లెను.

ఈ విధముగ నిత్యానందుఁడు మహాప్రభుని సన్నిధిలో నుండి యనిర్వచనీయ సుఖరసాస్వాదన చేయుచుండెను. ఆతఁ డెప్పుడును ప్రభువును వెంటనంటి తిరుగు చుండును. ప్రభు వెక్కడికి వెళ్లినను, ఏ భక్తుని యింటికి దయచేసినను నిత్యా నందుఁడు కూడ ఆయనవెంట తప్పక వెళ్ళవలసినదే. మహా ప్రభువునకుఁగూడ నిత్యానందుఁడు లేక యెక్కడికి వెళ్లుటకును నిష్టముండదు. భక్తులందఱును ప్రభువును తమతమ యిండ్లకుఁ బిలిచి, తమతమ భావనానుసారముగా ప్రభు శరీరమున వివిధ ములగు నవతారముల దర్శించుచుండిరి. ప్రభువుకూడ వివిధ ములగు లీలలను జేయుచుండును. ఒకొక్కప్పు డాతఁడు నృసింహావేశము లోనికివచ్చి బిగ్గఱగ హుంకారము చేయ మొదలిడును. ఒకొక్కప్పుడు ప్రహ్లాద భావములో దీనహీన భక్తునివలె గద్గదకంఠముచే ప్రభువువారి స్తుతి చేయ మొద లిడును. ఒకొక్కప్పుడు శ్రీకృష్ణభావముతో నాతఁడు మధురాగమనాభినయము చేయును ఒకొక్కప్పుడు అక్రూర భావముతో బిగ్గఱగ రోదనముచేయఁ బ్రారంభించును. ఒకొక్కప్పుడు వ్రజములోని గొల్లపిల్లలవలెఁ గ్రీడించును. ఒకొక్కప్పు డుద్ధవునివలెఁ బ్రేమలో నధీరుఁడై యేడ్వ మొదలిడును. ఈ విధముగ నిత్యానందుఁడు నితర భక్తు లతోఁగూడి నవద్వీప చంద్రుఁడగు శ్రీ గౌరాంగుఁడు వివిధ ములగు లీలలను సుప్రకాశము ద్వారా నవద్వీపము నంతను తన యమృతమయ శీతల ప్రకాశముచే ప్రకాశితము కావించు చుండెను.



# ద్వివిధ భావము

శ్లో॥ భగవద్భావేన యశ్శశ్వత్ భక్తభావేన చైవ తత్ ।
భక్తానానందయతే నిత్యం తం చైతన్యం నమామ్యహమ్॥

ప్ర. ద. బ్ర.

(ఎవ్వఁడు నిరంతరము భక్తభావము చేతను, భగవద్భావము చేతను భక్తుల నానందింపఁజేయుచుండునో అట్టి చైతన్య ప్రభువునకు నేను నమస్కారము చేయుచున్నాను.)

ప్రతి జీవియొక్క భావన భిన్నభిన్నముగ నుండును. అరణ్యములో పూచిన మాలతీపుష్పమును గాంచి సహృదయ కవి యానందములో నుప్పొంగి యెగిరి నృత్యము చేయ మొదలిడును. ఏ పుష్పములో నాతఁడు విశ్వ సౌందర్యము నంతను గాంచుచున్నాఁడో దానిని పశువుల గాయువాఁడు ప్రతిదినమును జూచుచున్నాఁడు, కాని దాని వైపునకు వాని దృష్టి కూడ పడదు. రోడ్డుమీఁద పడియున్న కఱ్ఱ ముక్కలు, రాళ్లు, నింక యితర వస్తువు లెంతో వానికా పుష్పముండుట కూడ నంతే. అతఁడా పుష్పమం దేవిధమైన విశేషభావనయు నారోపింపఁడు. అసలీ జీవి భావమయుఁడు. దేనియం దెట్టి భావముండునో దానియందట్టి భావమే దృష్టిగోచర మగుచుండును. ఈ భావమును గైకొనియే గోస్వామి తులసీదాసు గారు చెప్పినారు.

జాకీ రహీ భావనా జైసీ
ప్రభు మూరతి దేఖి తిన తైసీ ॥

'ఎవని కెట్టి భావన యుండునో ప్రభుమూర్తి యందట్టి భావన కనఁబడు చుండును.'

మహాప్రభువు శరీరము మీఁదఁగూడ భక్తులు తమతమ భావనాను సారముగా నానారూపములను దర్శించుచుండిరి. ఒకొక్కఁడు ప్రభువును వరాహరూపమునఁ గాంచును. వేఱొకఁ డాతని శరీరమందు నృసింహరూపమును దర్శించును. ఒకొక్కఁడు వామన భావము నధ్యారోపము గావించును. ఒకొక్కనికి ప్రభువువారి మూర్తి శ్యామసుందర రూపములోఁ గనఁబడును. ఒకొక్కనికి షడ్భుజమూర్తి రూపమున దర్శన మగును. ఒకొక్కఁడు ప్రభువుయొక్క యీ శరీరమును జూడక ఆతనిని చతుర్భుజరూపములోఁ గాంచును. ఆతని నాలుగు చేతులలో ప్రత్యక్షముగ నాతనికి శంఖము, చక్రము, గదా, పద్మము ఈ నాలుగును కనఁబడును. ఈ విధముగ నొకే ప్రభువువారి శ్రీవిగ్రహమును భక్తులు భిన్నభిన్నములుగఁ గాంచుచుండిరి. చతుర్భుజరూపము కనఁబడిన వానికి మాత్రమే చతుర్భుజ రూపముగఁ గనఁబడును గాని మిగిలిన వారందఱకు మామూలు ఆ సామాన్య రూపమే కనఁబడు చుండును. ప్రభువు శరీరము జ్యోతిర్మయముగఁ గనఁబడిన వానికి ప్రకాశము తప్పితే వానికి ప్రభువువారి రూపము కనఁ బడనే కనఁబడదు. ఆతని కన్నులలో నా ప్రకాశము వ్యాపిం

చును కాని, సాధారణముగా సామాన్యులకా ప్రకాశము కనఁబడదు. వారందఱకు ప్రభువుయొక్క ఆ గౌరరూపమే దర్శనమగుచుండును.

సామాన్యముగ ప్రభువు శరీరములో భగవద్భావము, భక్త భావము ఈ రెండు భావములు భక్తులకు దృగ్గోచరములగుచుండెను. ఈతనికి భగవద్భావము కలిగినప్పు డీతఁడు తనను దానః బొత్తుగా మఱచిపోవును. నిఃసంకోచ భావముతో దేవతా మూర్తులను దొలఁగించి స్వయముగ భగవంతుని సింహాసనమున విరాజమానమగు చుండును. అప్పుడు తనను భగవానునిఁగాఁ జెప్పుకొను చుండును. ఆ స్థితిలో భక్త బృందము ఆయనను భగవంతుని వలె విధిప్రకారము పూజించును. ఈతని చరణములను గంగా జలముచేఁ గడిగి, పాదములపై పుష్ప చందన తులసీ పత్రాదులను వేయుదురు. వివిధోపహారములను ఆతని ముందుంతురు. ఆ సమయమున నీతఁ డీ కార్యములను గొంచెమైనను బిభ్యంతర పెట్టఁడు. ఇంతేకాదు. కాని మిక్కిలి ప్రసన్నతా పూర్వకముగ భక్తులు చేయు పూజను గ్రహించి వారిని వరము లడుగుఁడని బలవంతము కూడ చేసి, వారి వారి కోరిక ప్రకారము వరదానము కూడ కావించును, ఈతని కిట్టి భగవద్భావమే వచ్చుటే కాదు, నానా దేవీ దేవతా భావములు కూడ వచ్చుచుండును. ఒకొక్కప్పుడు బలరాముని భావములోనికి వచ్చియరుణారుణ నేత్రములఁ గావించి పెద్దగ హుంకారము

చేయుచు 'మదిరా, మదిరా' యని సారాయమును గోరును. ఒకొక్కప్పు డింద్రావేశమునకు వచ్చి వజ్రమును ద్రిప్ప మొదలిడును. ఒకొక్కప్పుడు సుదర్శన చక్రము నాహ్వా నించును.

ఒక దినమున నొక జోగి మిక్కిలి మృదుమధుర స్వర మున డమరును వాయించుచు శివగీతా గానమును జేయుచు భిక్షనడుగుకొనుచుండెను. భిక్ష నడుగుకొనుచు నడుగుకొనుచు నీతని యింటికి కూడ వచ్చెను. శివగీతమును వినునప్పటి కీతనికి మహాదేవుని భావము వచ్చెను. అప్పు డాతఁడు తన వెంట్రుకలను విఱియఁబోసి చింపిరి తలగాఁజేసి శివభావముతో నాపాటపాడువాని భుజముల మీఁద నెక్కి కూర్చుండెను. అత్యైక్కి బిగ్గఱగా 'నేనే శివుఁడను, నేనే శివుఁడను, నీవు వరదానమడుగుము. నేను నీస్తుతికి మిక్కిలి ప్రసన్నుఁడనైతి' ననెను. కొంచెము సేపైన తర్వాత నీతని కీభావము సమాప్తి కాఁగానే కొంచెము చేతనుని వలెనై వాని భుజముమీఁదనుండి దిగి, వానికి యథేచ్ఛముగ భిక్షము పెట్టి శలవిచ్చి పంపివేసెను.

ఈ విధముగా భక్తులకు వారివారి భావనానుసారముగా నానా రూపములతో దర్శనమీయ మొదలిడెను. ఈయనకు కూడ విభిన్న దేవీ దేవతల యొక్కయు, పరమ భక్తుల యొక్కయు భావమురా మొదలిడెను. ఆ భావము శాంతింపఁ గానే ఆ భావములో పలికిన మాటలన్నియు నొక్కసారిగ

మఱచిపోయెడువాఁడు. అంత దీనహీన వినమ్ర భక్తునివలె నాచరణ మొక్కసారిగ చేయుచుండును. అప్పు డీతని దీన భావము కఠిక ఱాతి గుండెలనైనఁ గరిగించును. ఆ సమయ మున నీతఁడు తనను అత్యంత దీనునివలెను అధమునివలెను, దుఃఖునిఁగను జెప్పుకొని బిగ్గఱగ రోదనము చేయుచుండును. భక్తుల నాలింగనము చేసికొని వెక్కి వెక్కి యేడ్చుచు నేడ్చుచు 'శ్రీకృష్ణుఁ డెచ్చటికి పోయినాఁడు ? ఓ అన్నా ! నన్ను శ్రీకృష్ణునితోఁగలిపి నా ప్రాణములను శీతలము కావింపుము. నా విరహవేదనను శ్రీకృష్ణునకుఁజెప్పి శాంతి ప్రదానము కావింపుఁడు. నా మోహనుఁడు నన్ను విలపింపఁ జేసి యెక్కడికి వెళ్ళిపోయినాఁడు ?' అనును. ఈ విధముగఁ బ్రేమలో విహ్వలుఁడై యద్వైతాచార్యాది వృద్ధ భక్తుల పాదములను బట్టుకొనును. వారిపాదముల కాతని మాఁడును రుద్దు చుండును. అందఱకు మాటిమాటికి ప్రణామము కావించును. ఒకవేళ నాసమయములో నెవఁడైన నీతనికి బూజచేయఁదలఁచు నెడలను, లేక ఈతనిని భగవంతుఁడని పిలిచినను ఈతఁడు వ్యథచెంది గంగలోఁ బడుటకు పరువిడును. అందువలన నీతని కెవరును సాధారణ స్థితిలోఁ బూజించరు. భగవంతుఁడనియుఁ బిలువరు. అట్టి భక్తుల మనస్సులో నెల్లప్పుడు నొకే భావముతో నుండును.

ఈతఁడు సాధారణ భావములో నున్నప్పుడు అతఁడొక యమాకుఁడగు భక్తుని వలె శ్రద్ధా భక్తులతో గంగకు

సాష్టాంగ ప్రణామము కావించును. గంగా జలము నాచమించును. అప్పుడు భగవంతునకు విధివత్పూజనము కావించి, తులసికి పాదులో నీరుపోసి వానికి భక్తి భావముతోఁ బ్రదక్షిణము కావించును. భగవద్భావములో నీయన్ని భావములను మఱపించి స్వయముగ నీశ్వరీయాచరణము కావించును. భావావేశానంతరము ఈతని నెవఁడైన గొంచెమడిగినచో మిక్కిలి దీనతా భావముతో 'సోదరా, నాకేమియు తెలియదు. నా యచేతనావస్థలో నేనేమి వాగితినో నాకు తెలియదు. మీరీ విషయములను చెడ్డగాఁ దలఁపవలదు. నా యపరాధములను క్షమించుచుండుఁడు. నాయచేతనావస్థలోఁగూడ నానోటి నుండి మీ యెడలను శ్రీకృష్ణుని యెడలను అపరాధినగు వాక్యములు రాకుండు నట్లు నన్నాశీర్వదింపుఁడు.' అనును.

సంకీర్తనములోఁగూడ నీ రెండు భావములతో నృత్యము చేయును. ఒక్కొక్కప్పుడు భక్త భావముతో మిక్కిలి సరళతా పూర్వకముగ నృత్యముచేయును. ఆ సమయమున నీతని నృత్యము చాల మధురముగ నుండును. భక్త భావములో నీతఁడు సంకీర్తనము చేయుచుఁ జేయుచు భక్తుల పాద ధూళిని శిరస్సునఁదాల్చి, వారికి మాటిమాటికిఁ బ్రణామము కావించును. మధ్యమధ్య మూర్ఛపడి క్రిందపడిపోవును. భక్తులంద తీతని స్థితిని గాంచి గాబరాపడు నంతగ నీతఁడు క్రింద పడెడువాఁడు. ఒక్కొక్కప్పుడు శచీమాత యీతఁడు మూర్ఛపడి క్రింద పడుటను గాంచి మిక్కిలి యధీరురాలయ్యెడిది

ఆమె అప్పుడేడ్చుచు భగవంతునితో 'ఓ అశరణ శరణ్యా! నా నిమాయి కింత దుఃఖమును గలుగఁ జేయకుము' అని ప్రార్థించుచుండెడిది. ఈ కారణమున భక్తులందఱును సంకీర్తన సమయములో నీతనిని కనిపెట్టి యుందురు. ఈతనికి నాలుగు వైపులను మూర్ఛచెంది క్రింద పడకుండునట్లు పట్టుకొనుచుందురు.

ఒక్కొక్కప్పు డీతఁడు భావావేశములోనికి వచ్చి సంకీర్తనచేయ మొదలిడును, అప్పు డీతని నృత్యము మిక్కిలి యద్భుతము నలౌకికముగ నుండెడిది. ఆ సమయమున నీతని దాఁకుటకు కూడ భక్తులకు ధైర్యముండెడిది కాదు. ఈతఁడు నృత్య సమయమున హుంకారము చేయుచుండెడువాఁడు. ఈతని హుంకారముచే దిశలు మారుమ్రోగుచుండును. పదాఘాతముచే భూమి యూఁగుచుండును. ఆ సమయమున కీర్తన చేయు భక్తులందఱును విస్మితులై యొకవిధమైన యాకర్షముచే లాగఁబడి మంత్రముగ్ధులవలె సమస్త క్రియలను జేయుచుందురు. ఆయనకు బాహ్యజ్ఞానము బొత్తుగా నుండెడిది కాదు. ఆనృత్యముచే నందఱకు మిక్కిలి యానందము ప్రాప్తించెడిది. ఈవిధముగ నొక్కొక్కప్పుడు నృత్యసంకీర్తనము చేయుచు చేయుచు రాత్రియంతయు గడచిపోవుచుండెడిది. రోజంతయు గడచి నప్పటికిని సంకీర్తన సమాప్తమయ్యెడిది కాదు.

ఒకొక్కరు వచ్చి చాలమంది భావుక భక్తులు నవ ద్వీపములో నివసింపసాగిరి. శ్రీవాసుని యింటిలో సంకీర్తనము లోనికి వచ్చి చేరుచుండెడువారు. మెల్లమెల్లగా భక్తుల యొక్క ఒక చక్కని పరివారమేర్పడెను. వీరిలో నద్వైతాచార్యుఁడు, నిత్యానంద ప్రభువు, హరిదాసు వీరు ముగ్గురు ప్రధాన భక్తులుగ నెన్నఁబడుచుండెడువారు. అట్లైన నందఱు ప్రధానులే. భక్తులలో ప్రధానులు, అప్రధానులేమిటి ? కాని యీ ముగ్గురును సర్వస్వత్యాగులు, పరమ విరక్తులు. మహా ప్రభువునకు మిక్కిలి అంతరంగ భక్తులు. శ్రీవాసుని వదలిన వీరి ముగ్గురి మీఁదను ప్రభువున కత్యంత కృప యుండెడిది. వీరిద్వారానే యాతఁడు తన సమస్త కార్యమును జేయించుకొనవలెనను కొనువాఁడు. వీరిలో శ్రీ అద్వైతాచార్యుల యొక్కయు, అవధూత నిత్యానంద ప్రభువువారి యొక్కయు సామాన్య పరిచయము పాఠకుల కిదివఱకే కలిగినది. ఇప్పుడు భక్తాగ్రగణ్యుఁడగు శ్రీహరిదాసు యొక్క సంక్షిప్త పరిచయము పాఠకులకు రాఁబోవు అధ్యాయములో దొరకఁగలదు. ఈ మహాభాగవత వైష్ణవ శిరోమణి భక్తుఁడు నామజపమును గూర్చి యెంతటి మాహాత్మ్యమును బ్రకటించెనో అంతటి భగవన్నామ మాహాత్మ్య మెవరును బ్రకటింపలేదు. ఈతఁడు భగవన్నామ మాహాత్మ్యమునకు సజీవమగు నవతారమని యెంచుకొనవలెను.



# భక్తహరిదాసు

శ్లో॥ అహో బత శ్వపచోఽతో గరీయాన్
యజ్జిహ్వాగ్రే, వర్తతే నామ తుభ్యమ్ ।
తేపుస్తపస్తే జుహువుః సస్నురార్యా
బ్రహ్మానూచుర్నామ గృణంతి యే తే ॥

శ్రీమద్భాగవతము ౩-౩౩-౭.

(అహోహో! ఓ ప్రభూ! ఎవ్వని జిహ్వాగ్రమందు నీ యొక్క పవిత్రనామము వర్తించుచుండునో వాఁడు కుక్కను దిను చండాలుఁడైనను నెల్లప్పుడు నీ నామము నవహేళన చేయుచు నిరంతరము యజ్ఞయాగాదులు చేయుచున్న బ్రాహ్మణుని కంటెఁ బవిత్రుఁడు. త్రైలోక్య పావనమగు నీనామము నెవరు సంకీర్తన చేయుచుందురో వారే యథార్థముగ సమస్త తపస్సును, సుస్వర వేదాధ్యయనమును, విధిపూర్వకముగ హోమమును చేసిన ఫలమును, సమస్త తీర్థముల ఫలమును బొందును. ఏలననఁగా నీపుణ్యనామములలో సమస్త పుణ్యకర్మల ఫలము నిహితమై యున్నది.)

ఎవని యొక్క కృపాకటాక్షలేశముచే నీనామరూపాత్మకమగు సమస్త ప్రపంచము నిలిచియున్నదో, యెవని భ్రూభంగమాత్రముననే త్రిగుణాత్మకమగు ప్రకృతి తన సమస్త కార్యములను విరమించుచున్నదో, అట్టి అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడగు భగవానుని నామమాహాత్మ్యవర్ణనము

పాపమీ యపూర్ణ భాష యేమి చేయఁగలదు? హరినామ స్మరణముచే నేమి కాదు? భగవన్నామ జపముచే నే కార్యము నెఱవేఱదు. ఎవని జిహ్వకు సుమధుర శ్రీహరినామమును రసమంటుకొనియున్నదో, వానికీ ప్రపంచమునఁ బ్రాప్యవస్తు వేది యుండఁగలదు? యజ్ఞ, యాగ, జప, తప, ధ్యాన, పూజా, నిష్ఠా, యోగ, సమాధి మొదలగు వాటి యన్నిటి ఫలము భగవన్నామము మీఁద ప్రీతి కలుగుటయే కదా! ఈకర్మల నాచరించుటవలన భగవన్నామమందుఁ బ్రీతి కలుగకున్నచో నీకర్మలు వ్యర్థములని భావించవలయును. భగవన్నామమందు నిష్ఠ కలిగియుండుటయే యీ సమస్త క్రియలయొక్క అంతిమ, సర్వశ్రేష్ఠఫలము భగవన్నామము సాధ్యము. ఇఁక మిగిలిన కర్మలన్నియు దానికి సాధన మాత్రములు. నామ జపమందు దేశ, కాల, పాత్ర, జాతి, వర్ణ, సమయాసమయ, శుచి. అశుచి మొదలగు నీ విషయ విచారముండదు. నీవే స్థితిలో నున్నప్పటికిని, యెక్కడ నున్నను. ఎట్లున్నను, ఏ వర్ణము వాఁడవైనను, ఎట్టి యవస్థలో నున్నను నిరంతరము శ్రీహరి యొక్క సుమధురనామ సంకీర్తనము చేయవచ్చును. నామ జపము వలన పరమ పాతకి యగు వాఁడునుకూడ పరమ పావనుఁడగును. అత్యంత నీచాతి నీచుఁడైనను కూడ సర్వ పూజ్యుఁడుగ నెన్నఁబడును తక్కువలో మిక్కిలి తక్కువ వాఁడైనను సర్వశ్రేష్ఠుఁడగును. దుష్టులలో మిక్కిలి దుష్టుఁ డైనను గొప్ప భగవద్భక్తుఁడగును. కబీరుదాసు చెప్పినాఁడు చూడుఁడు——

నామ జపత కుష్ఠీ భలో
చుఇ చుఇ గిరై జోచామ్ ।
కంచన దేహా కిస్ కామకీ
జిహా ముఖ నాహీం రామ్ ॥

'చర్మము క్రుళ్లి బొట్లు బొట్లుగ రాలుచున్నప్పటికిని కుష్ఠు రోగి నామ జపము చేసినవాఁడే మంచివాఁడు, నోట రామనామము లేని బంగారువలె నుండు దేహ మెందుకు పనికివచ్చును!

భక్తాగ్రగణ్యుఁడగు మహాత్మ హరిదాసు యవన కులమునఁ బుట్టినప్పటికిని భగవన్నామ ప్రభావమున భగవద్భక్త వైష్ణవులకు ప్రాతఃస్మరణీయుఁడయ్యెను. ఈ మహాత్మునకు భగవన్నామమందు అలౌకిక నిష్ఠ యుండెడిది.

మహాత్మ హరిదాసుయొక్క జన్మము బంగాళములో యశోహార మండలాంతర్గతమగు 'బుడన్' అను పేరుగల ఒకానొక గ్రామమున నయ్యెను. ఈతఁడు ముసల్మాను జాతీయుఁడు. బాల్యకాలము నందే యీతని తల్లిదండ్రులు యీతనిని మాతృపితృ హీనుని గావించి పరలోకగాములైనట్లు తోఁచుచున్నది. అందువలన నీతఁడు చిన్నతనము నుండియే యిల్లు వాఁకిలి వదలిపెట్టి నిరంతరము హరినామ సంకీర్తనము చేయుచుఁదిరుగు చుండెడువాఁడు. పూర్వజన్మములో శుభసంస్కారములున్నవి. భగవంతునియొక్క అనన్య కృపకూడ కలదు. అందువలననే ముసల్మాను వంశములోఁ బుట్టియు నీతనికి భగవ

న్నామమందు స్వాభావికమగు నిష్ఠ కుదిరినది. 'యస్యాహ మను గృహ్ణామి హరిష్యే తద్ధనం శనైః.' 'ఎవ్వని గరుణింప నిచ్ఛయింతును నేను, అతని విత్తంబుచే నపహరింతు' అని భగవంతుఁ డనేకసార్లు చెప్పనే చెప్పినాఁడు. అనఁగా నెవనికై నేను గృపయుంచుటకు నాశరణము లోనికిఁగైకొందునో అన్నిటికంటె మొట్టమొదటగా మెల్లగా నీతని సర్వస్వము నపహరింతును. అతనియొద్ద నాది యని చెప్పుకొనుట కేవిధమైన ధనముండనీయను.' అని అన్నిటికంటె ముందీయనమీఁద భగవానుఁ డిదే కృపదయచేసెను. తనది యని చెప్పుకొనుట కీతనియొద్ద కొయ్య కమండలువుకూడ లేదు. ఆఁకలైనప్పు డీతఁడు గ్రామములలోనికి వెళ్ళి భిక్ష నడుగుకొని వచ్చి, ఆ భిక్షలో నేమి లభించునో దానిని ఇరువదినాల్గు గంటలలో నొక్కసారిమాత్రము తిని నిరంతరము భగవన్నామ జపము చేయుచుండును. గృహమును విడిచి యీతఁడు వనగ్రామ సమీపమున బేనాపోల్ అను పేరుగల ఘోర నిర్జన వనమందు పూరికుటీరమొకటి వేసికొని యొంటరిగనే నివసించుచుండెడు వాఁడు. ఈతని తేజః ప్రభావముల వలన నక్కడనున్న సమస్త జీవులు నొక విధమైన యలౌకిక శాంతిని యనుభవించు చుండిరి. ఎవ్వఁడీతని సమ్ముఖమునకు వచ్చినప్పటికిని ఈతని ప్రభావముచే ప్రభావాన్వితులగుచుండిరి. ఈతఁడు రాత్రింబవల్లు మూఁడు లక్షలు భగవన్నామ జపమును జేయుచుండెడు వాఁడు. అదియైనను మెల్లమెల్లగాఁగాదు. మిక్కిలి బిగ్గఱగా

సమస్త చరాచర ప్రాణులు ప్రభువుయొక్క పవిత్ర నామము లను శ్రవణము చేయుటచే పావనములు కావలెనని భగవన్నామము నుచ్చైస్స్వరమునఁ జేయుచుండెడువాఁడు. ప్రాణిమాత్రులకు నిష్కృతికిగాను ఈ భగవన్నామమునే ఏకమాత్ర సాధనముగ నెన్నుచుండెడువాఁడు. దీనివలన నీతని యశః సౌరభము కొలది దినములలోనే దూరదూరముల వ్యాపించెను. చాలచాలదూరము నుండి యీతని దర్శించుటకు జనము రా మొదలిడిరి. దుష్టబుద్ధులు, ఈర్ష్యాళువులగు వారల కీతని కింతటి కీర్తి వచ్చుటకు సహింపులేకపోయెను. వారీతని యెడల నకారణ ద్వేషము పూనసాగిరి. ఈతని యీర్ష్యాళువులలో అక్కడ రామచంద్రఖాఁ అను పేరుగలవాఁడు ఒక జమీందారుఁడుండెను. ఆతఁ డీతని నేదోవిధముగ నీచముగఁ గనఁబరుపఁ దలఁచుచుండెను. ఈతని యుత్కృష్టకీర్తిని ధూళిలోఁగలుప యత్నించుచుండెను. సాధకులను బతితులఁ గావించుటకు కామినీకాంచనములను నీ రెండే గొప్ప ప్రలోభనములు. వీనిలోఁ గామినీ ప్రలోభనమే సర్వశ్రేష్ఠమైనదిగ నెన్నఁబడుచున్నది. రామచంద్రఖాఁ ఆ ప్రలోభనముద్వారా హరిదాసును నీచముగఁజూప నిశ్చయము చేసికొనెను. కాని యాతని రక్షణ యాతని ప్రభువే నిరంతరము చేయుచుండెడువాఁడు. అట్టియెడ సమస్త ప్రపంచము నాతనికి విరోధులగుదురుగాక. ఆతని నేమియుఁ జేయఁజాలరు. కాని నీచపురుషులయొక్క వారి నీచత కొంత బయటపడును. రామచంద్రఖానుఁడు అత్యంత

సుందరియు, పదునాఱు సంవత్సరముల యీడు కలదియు నగు వేశ్యను ఈతని భజనమును జెఱచుటకుఁ బంపెను. రూపగర్వితయగు నా వేశ్య కూడ యీతనిని బతితుని జేయఁ బ్రతిజ్ఞను గొని మిక్కిలి యలంకారములు చేసికొని హరిదాసుని యాశ్రమమునకు వచ్చెను. ఆమెకు రూపాభిమానముండెడిది. ఏ పురుషుఁడైన సరియే నా రూపలావణ్యమును గాంచి యానందమును జెందక యుండలేఁడను కొనుచుండెడిది. కాని హరినామమందానందము చెందువారలకు బాహ్యసాంసారిక రూపలావణ్యము పరమ తుచ్ఛముగఁ జూతురు. ఇట్టి హరిజనులు ఈ రూపలావణ్యమువైపు కన్నెత్తియైనను జూడరు.

ఓహో! యెంత గొప్పత్యాగము! ఎట్టి యపూర్వ వైరాగ్యము! ఎంతటి యద్భుత యింద్రియ నిగ్రహము! పాఠకులు తమ హృదయములపైఁ జేయి వేసికొని యూహింపుఁడు. ఏకాంతప్రదేశమగు నడవి. హరిదాసునిది యౌవనావస్థ. ఏకాంత శాంతిస్థానము. పరమ రూపలావణ్యయుక్తమగు సుందరి. అదియును గాక ఆమె తనకుఁదానే హరిదాసుని ప్రణయ భిక్ష వేఁడవచ్చినది. కాని ఆ మహాపురుషుని హృదయములోఁ గించిన్మాత్రమైన వికారము కలుగలేదు. ఆతఁడట్లే అవిచల భావముతో నదే విధముగా నెడతెగక శ్రీకృష్ణ కీర్తనములో నిమగ్నుఁడై యుండెను. మానవబుద్ధి కతీతమైనది. వారాంగన అక్కడికి వెళ్లి మెదలకుండ కూర్చుండి యుండెను. హరిదాసు ధారాప్రవాహముగా నీ మంత్రమును

జపము చేయుచుండెను.

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

పగలంతయు గడచినది. రాత్రియైనది. రాత్రి గడచినది, ప్రాతఃకాలమైనది. వారాంగన ప్రతిరోజును వచ్చెడిది. మరల వచ్చిన త్రోవనే పోవుచుండెడిది. ఒక్కొక్కప్పుడు మధ్య మధ్య సాహసముచేసి హరిదాసునితోఁ గొంచెము మాటాడ వలెనను కోరికను బయటపెట్టెడిది. అప్పుడు హరిదాసు మిక్కిలి నమ్రతా భావముతో 'నీవు కూర్చుండుము. నా నామజపసంఖ్య పూర్తికానిమ్ము. అప్పుడు నీమాటలు విందును.' అని ప్రత్యుత్తర మిచ్చెను. కాని నామజపసంఖ్య పది, యిరు వది, వేయి, రెండువేలుకాదు. పూర్తిగా మూఁడు లక్షలు నామజపము చేయవలెను. అదియు నుచ్చైస్స్వరముతోను పాటతోను చేయవలెను. అందువలన నాలుగు దినములు ఆమెకు నిరాశయే కలుగుట జరిగెను. ప్రాతఃకాలముననే వచ్చెడిది, రెండు జాముల వఱకును కూర్చుండెడిది. హరిదాసు లయతో—

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

అని గానము చేయుచుండెడువాఁడు.

పాపమామె కూర్చుండి కూర్చుండి తానును నీ మంత్ర మునే పలుకుచుండెడిది. నాయంత్రమున వచ్చెనా అర్ధరాత్రి

వఱకు కూర్చుండెడిది. హరిదాసుని జప మఖండముగ నడచుచుండెను—

హరేరామ హరేరామ రామరామ హరేహరే।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

నాల్గు దినములు నిరంతరము నామస్మరణము జరుగుటచే నామె పాపములన్నియు నశించినవి. పాపక్షయమగుటచే నామెబుద్ధి యొక్కసారిగ మారిపోయెను. ఇప్పుడామె హృదయము ఆమెను మాటిమాటికి ధిక్కారమొనర్చుచుండెను. ఇట్టి మహాపురుషుని దగ్గఱకు నేనెట్టి నీచభావముతో వచ్చితినని మనస్సులో ననుకొనుచు నత్యంత దుఃఖితురాలగుచుండెడిది. చివరకామె నిలువలేక పోయెను. ఆమె అత్యంత దీన భావముతో హరిదాసుని చరణములపైఁబడి కంటనీరు గార్చుచు, గద్గదకంఠముతో 'మహాభాగా! నిజముగ మీరు పతిత పావనులు. మీరు జీవుల యెడల నహైతుక కృపను జూపుదురు. మీరు పరమ దయాళువు. మీ కృపమూలమున మీరు పాత్రాపాత్రవిచారము చేయక జీవులయెడల సమాన భావమున దయ జూతురు. నాఁబోటి పతితురాలిని, లోకనిందితను, దూషిత బుద్ధిగల యధమ స్త్రీ మీఁదను మీరు మీయపార ప్రేమను ప్రదర్శించితిరి. భగవాన్! నేను చెడు బుద్ధిచే మీదగ్గఱకు వచ్చితిని. కాని మీ సత్సంగ ప్రభావముచే నాయీ భావములన్నియు నొక్కసారిగ మాఱిపోయినవి. సుమధుర శ్రీహరినామ శ్రవణమాత్రము చేతనే నా

కలుషిత విచారములన్నియు భస్మీభూతములైనవి. ఇప్పుడు నేను మీచరణముల శరణువేడు చున్నాను. పతితయగు నీచబల నుద్ధరింపుడు. నా ఘోర పాపములకుఁ బ్రాయశ్చిత్తమును జెప్పుఁడు. నాకు నిష్కృతియగు నుపాయమేదైన కలదా ?' యనెను. ఇట్లు పలుకుచుఁ బలుకుచు నామె హరిదాసుని చరణములందు దొర్ల సాగెను.

హరిదాసామె నాశ్వాసించుచు నిట్లనెను :- 'దేవి ! లెమ్ము. భయపడవలసిన పనిలేదు. శ్రీహరి యతిదయాళుఁడు. ఆయన నీచ, పామర, పతితులైన సమస్త జీవుల నుద్ధరింపఁ గలఁడు. ఆయన సన్నిధానమున భేదభావము లేదు. భగవన్నామముముందు ఘోరాతిఘోరపాపములైనను నిలువఁ జాలవు. ఎంతటి ఘోరాతిఘోర పాపియైనను హరినామము నశింపఁజేయునంతటి పాపము చేయనేలేఁడు. నీవు పాపకర్మచే సంపాదించిన ధనమును అభ్యాగతులకు పంచిపెట్టి, నిరంతరము హరినామకీర్తనము చేయుము. దీనివలన నీ సమస్త పాపములు నశించిపోవుటయేగాక భగవంతుని దివ్య చరణారవిందములందు నీకు ప్రగాఢప్రేమ కలుగఁగలదు. మంచిది—

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

ఈ మంత్రములోనే సామర్థ్యమంతయు నిమిడియున్నది. దీనినే నిరంతరము జపము చేయుచుండుము. ఇప్పుడీ కుటీర

ములో నేనుండను. నీవే దీనిలో నుండుము.' ఆవేశ్య కిట్లుప దేశమొసంగి మహాభాగవతుఁడగు హరిదాసు పరిగా శాంతి పురమునకు పోయెను. అక్కడికిపోయి అద్వైతాచార్యుల వద్ద నధ్యయనము, శ్రీకృష్ణ సంకీర్తనముందు సర్వదా సంలగ్నుఁడై యుండెను.

ఈ వారవనితయును హరిదాసుని యాదేశానుసారముగాఁ దన సర్వస్వమును దానమొసర్చి యకించనులవలె వేషధారణము కావించెను. ఆమె ప్రాతవియు, జినిగినవియు నగు గుడ్డపీలికలను శరీరమునకుఁ జుట్టుకొని, భిక్షాన్నముచేఁ బొట్టపోసికొని తన గురుదేవుని చరణ చిహ్నముల ననుసరించుచుండెను. కొలది కాలములోనే ఆమె భక్తియొక్క ఖ్యాతి దూరదూరముల వ్యాపించెను. చాలమంది ఆమె దర్శనము కొఱకు రా మొదలిడిరి. ఆమె హరిదాసి యనుపేర సర్వత్ర ప్రసిద్ధ యయ్యెను. జనులామెను మిక్కిలిగ నాదరించుచుండిరి. మహాత్ములతో దుర్బుద్ధితోఁ జేసిన సత్సంగమును వ్యర్థము కాదను సంగతి మహాపురుషులు సత్యమునే చెప్పిరి. సత్సంగము మహిమయే యిట్టిది.

ఇచ్చట రామచంద్రఖానుఁడు తన దుష్కృత్యఫలము నిచ్చట ప్రత్యక్షముగఁ బొందెను. నియత సమయమునకు పాదుషాకు పూర్తిగా పన్ను లీయకపోవుట వలన నాయప

రాధమునకై వానికి గొప్పశిక్ష వైచెను. పాదుషా వారి మను
ష్యులు వానియింటిలోనికిఁ జొరఁబడి యఖాద్య పదార్థములను
దిని, వానిని, వాని భార్యాబిడ్డలను కట్టి రాజు దగ్గఱకుఁ గొని
పోయిరి. వాఁడింక ననేక యాతనలను బడవలసి వచ్చినది.
మతి యెంతో గతి యంత యను సామెత నిజమైనది.



# హరిదాసుని నామనిష్ఠ

శ్లో॥ రామనామ జపతాం కుతో భయం
సర్వతాపశమనైకభేషజమ్ ।
పశ్యతాత! మమగాత్ర సన్నిధౌ
పావకోఽపి సలిలాయతేఽధునా ॥

అనర్ఘ రాఘవ నాటకము

(అగ్నిలో కాల్చినను ప్రహ్లాదుఁడు కాలకపోవుటచే హిరణ్యకశిపునితో నిర్భీక భావముతో '(శ్రీ)రామ నామమును జపించువారలకు భయ మెక్కడిది? ఏలననఁగా సమస్త విధములగు నాధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికాది తాపములను శమనము కావించు రామనామమను రసాయనమును పానము చేయువారల దగ్గఱకు తాపమేదియు రానే రాఁజాలదు? ఓ తండ్రీ! ప్రత్యక్ష ప్రమాణమేది యందువా? నా శరీరాంగముల దగ్గఱకు రాఁగానే యుష్ణస్వభావముగల యగ్నియును జలమువలె శీతలమై పోయినది చూచుటలేదా? అనఁగా నది నాశరీరమును గాల్చలేక పోయినది. రామనామ మాహాత్మ్యమిట్టిది.)

జప, తప, భజన, పూజనములందును, లౌకిక పారలౌకికములందును, ఇతర కార్యములందును విశ్వాసమే ప్రధానము. ఎవనికి దేనియందెట్టి విశ్వాసముండునో వానికి వానిద్వారా యట్టి ఫలమే ప్రాప్తింపఁగలదు. ఫలప్రాప్తికి ప్రధానహేతువు

విశ్వాసమే. విశ్వాసము సమ్ముఖమున నసంభవ మనునదేది యునులేదు. అసంభవమనునది అవిశ్వాసమునకు పర్యాయ వాచక శబ్దము. విశ్వాసమువలన సమస్తమును సంభవమే. విశ్వాసము సహాయముననే చరణామృతమనుకొని మీరాబాయి విషపానముచేసెను. నామదేవుఁడు తాని విగ్రహముచే భోజనము చేయించెను. ధన్నా భక్తునకు దున్నకుండగనే పొలము పండెను. రైదాసు భగవన్మూర్తిని సజీవము కావించి చూపించెను. ఇవన్నియు భక్తులయొక్క దృఢ విశ్వాసము యొక్క చమత్కారము. భగవన్నామము మీఁద దృఢ నిష్ఠ గలవానికి ఘోరాతిఘోర విపత్తులును సాధారణముగనే తోఁచుచుండును. వారు భయాతి భయంకర విపత్తులలోను తమ విశ్వాసమునుండి చలింపరు. ధ్రువ ప్రహ్లాదుల లోకప్రసిద్ధ చరిత్ర దానికి ప్రమాణము ఈ చరిత్ర లతి ప్రాచీనములు. కొందఱు వీనిలో నర్థవాదారోపణమును జేయుదురు, కాని మహాత్ముఁడగు హరిదాసుని నామనిష్ఠా జ్వలంత ప్రమాణము నేఁటిది నిన్నటిది మొన్నటిదే. ఆయనతో ప్రత్యక్ష సంసర్గము, సహవాసము కలవారలును, స్వయముగఁ దమ నేత్రములచే నీభయంకర యాతనా దృశ్యములను జూచిన వారలును నీ చరిత్రను వ్రాసిరి. ఇట్టి భయంకర యాతనలను సాధారణ మానవుఁడెవఁడైన సహింపఁగలఁడా? భగవన్నామములో దృఢనిష్ఠ లేనిది యెవఁడైన నీ విధముగా తన నిశ్చయము మీఁద నిశ్చల భావముతో నిలిచి యుండఁగలఁడా? ఎన్నటికిని

గాదు. హృదయములో దృఢవిశ్వాస జన్యగొప్ప బలము లేనిది యిట్టి దృఢత్వముండనే యుండదు.

బేనాపోలులో నిర్జన కుటీరములో వారవనిత నుద్ధరించి, యామెను దన కుటీరములో నుంచి మహాత్మా హరిదాసు శాంతిపురమునకు వచ్చి అద్వైతాచార్యుని సత్సంగములో నుండెను. శాంతిపుర సమీపముననే భులియా యను పేరుగల గ్రామములో నేకాంతముగ నున్నదని గ్రహించి, అక్కడనే యాంతఁడు తనకొక చిన్న కుటీరమును నిర్మించుకొని, దానిలో నహర్నిశలు కీర్తన చేయుచు నివసించుచుండెను. ఆ రోజులలో దేశమందంతటను ముసల్మానుల ప్రాబల్యము కలదని నేనిది వఱకే చెప్పియున్నాను. బెంగాలమున విశేషముగ ముసల్మానుల యునికి, ముసల్మానుల మతము అత్యధిక తీవ్రమై యుండెను. ఇస్లామునకు విరుద్ధముగ నెవఁడు నోరెత్తెడువాఁడు కాఁడు అక్కడక్కడ యిస్లాము మత ప్రచారమునకై కాజీలు నియమింపఁబడి యుండిరి. ఎవఁడైన నిస్లాము మతమునకు విరుద్ధముగ నున్నాఁడనియు, దానికి విఘ్నము చేయుచున్నాఁడనియుఁ దెలిసెనా ఆతఁడు పాదుషాకు చెప్పి మరల నింకెవఁడును యిస్లాము ధర్మమునకు విరుద్ధముగఁ బ్రచారము చేయకుండునట్లు పెద్ద శిక్ష వేయించుచుండెడువాఁడు. ఈ విధముగ నాకాలమున కర్త, ధర్త, విధాత, మతమునకు గుత్తదారు కాజీయే. శాసన సత్తాపై సంపూర్ణ ప్రభావముండుటచే కాజీ ఆ రోజులలో పాదుషాగానే యెన్నఁబడుచుండెడువాఁడు.

ఫులియాకు దగ్గఱలో గోరాయి యను పేరుగల ఒక కాజీయు అను నీ పనిలో నియుక్తుఁడై యుండెను. హరిదాసుని యింతటి ప్రభావమును జూడఁగనే వానికి కలిగిన యీర్ష్య కంతులేక పోయెను. 'హరిదాసుని యింతటి యీ ప్రభావమును ఆపక పోయినచో యిస్లాము ధర్మమునకు గొప్ప దెబ్బ తగులఁగలదు. హరిదాసు ముసల్మాను జాతివాఁడు. ముసల్మానుఁడయ్యు నతఁడు హిందూధర్మప్రచారము చేయుచున్నాఁడు. మిడత ముఖము వేసికొని వాఁడు మహమ్మదీయ మతమునకు విరుద్ధముగ ప్రచారము చేయుచున్నాఁడు. ఈతఁడు కాఫిరుఁడు (ముసల్మానుమతము ప్రకారము ఈశ్వరు నొప్పుకొననివాఁడు) కావున కాఫిరును హత్యచేయుటయు సబబుగానే యుండును. ఇతరులును వీనిని గాంచి యిట్టిపనియే చేయఁగలరు. కావున వీనికి దర్బారులో శిక్ష వేయించవలయునని' యాలోచించెను. ఇట్లాలోచించి గోరాయి కాజీ యీతనికి విరుద్ధముగ రాజ దర్బారులో నభియోగమును దెచ్చెను. రాజాజ్ఞ వలన హరి దాసును బంధించిరి. ముల్కపతి వద్ద యీతనిమీఁద ఫిర్యాదు చేసిరి. ముల్కపతి యీయన తేజమును ప్రభావ మును గాంచి చకితుడయ్యెను. ఆయన యీతనికిఁ గూర్చుం డుట కాసనమిచ్చెను. హరిదాసు కూర్చుండిన తర్వాత దయాభావమును జూపుచు తన స్వాభావిక ధార్మిక విశ్వాసాను సారముగా 'అన్నా! నీవు ముసల్మాను నింటిలోఁ బుట్టితివి. ఈ విషయములో భగవానుఁడు నీయందత్యంత కృపఁ జూపి

నాఁడు. మునల్మానుఁడవై పుట్టియు నీవిట్లు కాఫిరులవలె నాచరణ మేల చేసెదవు? దీనివలన నీకు ముక్తి కలుగదు. ఇస్లాము ధర్మగ్రంథమగు కురానులో నేమి చెప్పఁబడినదో ముక్తి సాధనమదియే. నాకు నీమీఁద మిక్కిలి దయకలుగు చున్నది. నేను నిన్ను దండింపఁగోరను. నీవిప్పుడు నీపాపము నకుఁ బ్రాయశ్చిత్తము చేసికొనుము. తర్వాత మునల్మానుల తొలి ధర్మసూత్రములను పఠించి మహమ్మదు సాహెబు వారి శరణమునకు రమ్ము! భగవంతుఁడు నీ యపరాధముల నన్నిటిని క్షమింపఁగలఁడు. అప్పుడు నీవును మోక్షమున కధికారి వయ్యెద' వలెను.

ములుకపతియొక్క యిట్టి సరళమును, సుందరము లగు వాక్యములను విని హరిదాసిట్లనెను:- 'మహాశయా! మీరు చెప్పినదేదియో మీ విశ్వాసము కొలది చెప్పితిరి అది మంచిదే. ప్రతి మానవుని యొక్క విశ్వాసము వేఱువేఱుగ నుండును. ఎవరెవరికెట్టి దృఢ విశ్వాసముండునో వానికట్టి విశ్వాసమే ఫలప్రదాయకమగును. ఇతరులు బెదరించి భయ పెట్టుట చేతఁగాని లోభముచేఁగాని తమ స్వాభావిక విశ్వా సము నెవరు వదలివేయుదురో వారు భీరులు. ఇట్టి భీరపురుషు లకు పరమాత్మప్రాప్తి యెన్నటికిని కలుగఁజాలదు. మీరు మీ విశ్వాసానుసారముగా నుచితముగానే చెప్పితిరి. కాని నేను దండభయము చే భగవన్నామ కీర్తనమును వదలివేయు నెడల దీనివలన నాకు పుణ్యమునకు బదులు పాపమే కలుగును,

ఇట్లు చేయుటచే నేను నరకమునకుఁ బాత్రుఁడనగుదును. నాకు భగవన్నామమందు స్వాభావికమగు నిష్ఠ యేర్పడినది. దీనిని నేను వదలఁజాలను. దీని కొఱకై నాప్రాణములనైనఁ దీసికొన వచ్చును '

ఈతని యిట్టి యుక్తియుక్త వాక్యములను విని ముల్కపతి హృదయమును దయచేఁ గఱఁగెను. ఈతని సరళమును, మధురములు నగు వాక్కులలో నాకర్షణముండెను. దానిచే నాకర్షింపఁబడి ముల్కుపతి యిట్లనెను:- 'నీవాక్యములు నాకును గొంతగ నర్థమగు చున్నవికాని యీ వాక్యములు హిందువులకు బాగుండును. సరిపడును. నీవు ముసల్మానుఁడవు. నీవు ముసల్మానులవలె విశ్వాసముంచవలెను.

'మహాశయా! మీరు చెప్పినది నిజమే కాని విశ్వాసము నా స్వాధీనములోని విషయముకాదు. ఎవరికెట్టి పూర్వసంస్కారముండునో వానికట్టి విశ్వాసముండును. నాకు భగవన్నామమందే విశ్వాసమున్నది. ఎవఁడైన హిందువు తన విశ్వాసమును వీడి ముసల్మానుఁ డగుచో వానిని మీరేల శిక్షింపరు ? హిందువులు తమ మతమును వీడి ముసల్మానులగుట తమకు స్వతంత్రమనుకొనిరేని, ఆ స్వాతంత్ర్యము ముసల్మానులకును నుండవలయును, అట్టిచో మీరు నన్ను ఖురానును జదువుమని యేల నిర్బంధించెదరు ?' ఈతని యీ మాటలవలన బుద్ధిమంతుఁ డగు న్యాయాధీశుఁడు మెదలకూరకుండెను. గోరాయికాజీకి యిక్కడ నున్న వ్యాజ్యము తలక్రిం

దైన సంగతి తెలిసికొని తీవ్రముగ బిగ్గఱగ 'మేమీ మాట లేవియు వినము. ఇస్లాము ధర్మానుసారముగా నాచరణము చేయువానికే మోక్షప్రాప్తి కలదు కాని దీనికి విరుద్ధముగా నడచు కాఫీరులకు లేదని ఇస్లాము ధర్మశాస్త్రములో వ్రాయఁబడినది. నీ వధర్మమొనర్చుచున్నావు. అధర్మ మొనర్చు వారికి దండము నొసంగుట మావిధి. కావున నీవు ఖురాను జదువుట కొప్పుకొందువా లేక శిక్ష ననుభవింతువా ? రెంటిలో నేదియో యొక దానిని కోరుకొనుము' అనెను.

పాపము ముల్కుపతికి గత్యంతరము లేక పోయినది. ఇస్లాము ధర్మమునకు విరుద్ధముగా నాతఁడేమియు ననలేక పోయెను. కాజీలకు విరుద్ధముగా న్యాయము జరిపించుట కాతని కిష్టములేదు. ఆతఁడును గోరాయి కాజీని సమర్థించుచు 'మంచిది, నీకు ఖురాను ధర్మశాస్త్రమును బఠించుట కిష్టమే నేమో చెప్పు' మనెను.

హరిదాసు నిర్భయముగా నిట్లనెను:-'మహాశయా, నేను చెప్ప వలసినదేమో ఒక్కసారిగానే చెప్పితిని. మీ రెంతటి గొప్ప శిక్ష వేసినప్పటికిని నన్ను నా విశ్వాసమునుండి చలింపఁ జేయఁజాలరు. మీరు నా దేహమును ముక్కలు ముక్కలు చేసినను నా శరీరములోఁ బ్రాణములున్నంత వఱకు హరి నామమును వదలఁజాలను. మీ యిష్టము వచ్చిన శిక్షను నాకు వేయుఁడు.

హరిదాసుని యిట్టి నిర్భీకమగు ప్రత్యుత్తరమును విని ముల్కుపతి కింకర్తవ్యతా విమూఢుఁడయ్యెను. హరిదాసుని కేమి శిక్షవేయవలయునో ఆతఁడు యోజింపనైనఁ జాలక పోయెను. ఆతఁడు జిజ్ఞాసా భావముతో గోరాయికాజీ ముఖమువైపు చూడసాగెను.

ముల్కుపతి (న్యాయాధికారి) భావమును గ్రహించి గోరాయికాజీ యిట్లనెను:- 'శ్రీవారవశ్యము దండించవలెను. వీనిని శిక్షింపకుండునెడల నందఱు నిష్టము వచ్చినట్లు చేతురు. అప్పుడిస్లాము ధర్మముండనే యుండదు.'

'నాకేమియు తోఁచుటలేదు. వీనికేమి శిక్ష వేయవలయునో నీవే చెప్పు' మని న్యాయాధికారి యనెను.

గోరాయికాజీ ప్రోత్సాహ పూర్వకముగా'దొరవారూ! ఇది మొదటి వ్యాజ్యము. అందఱు హడలిపోవునట్లు ఈతనికి గట్టి శిక్ష వేయవలయును. ఆ శిక్షవలన ముందుముందిట్టి పని చేయుటకు ధైర్యముండరాదు. ఇస్లాముమతము ప్రకార మీతనికి ఉరిశిక్ష వేయవలయును. కాని సాధువునకు ప్రాణదండము విధింపరాదు. ఈతని వీఁపుమీఁద బెత్తములతో బాదుచు నీతనిని వీథులలోఁ ద్రిప్పవలెను. బెత్తపు దెబ్బలతోఁనే యీతని ప్రాణములు తీయవలయును. అప్పుడే జనులిట్టి పనులు ముందుముందు చేయ సాహసింపకుందురు.'

ముల్కుపతి వివశుఁడై యిదే శిక్షను వ్రాసెను. బెత్తపు దెబ్బలను గొట్టు నౌకరులు మహాత్మా హరిదాసును గట్టి,

వానివీఁపుమీఁద బెత్తపు దెబ్బలును గొట్టుచు వానిని బజారులలోఁ ద్రిప్ప మొదలిడిరి. నిరంతరము బెత్తముచేఁ గొట్టుటచే హరిదాసుని సుకుమార శరీరమున చర్మము లేచిపోయెను. వీఁపు మీఁదనుండి రక్త ప్రవాహము ప్రవహించుచుండెను. నిర్దయులగు ఘాతకులా గాయములపైననే యింకను బెత్తముతోఁ గొట్టుచుండిరి, కాని హరిదాసుని నోటినుండి వెనుకటివలెనే హరిధ్వని వచ్చుచునే యుండెను. ఆతనికి వీథులలోనివారు దీనిని జూడలేక కన్నులు మూసికొనుచుండిరి, కొందఱేడ్చుచుండిరి. కాని హరిదాసుని నోటినుండి 'ఉస్సు' రనునది వచ్చుటలేదు. ఆతఁ డానందముతో శ్రీకృష్ణకీర్తనముచేయుచు నౌకరులతో పోవుచుండెను.

ఆతని నన్ని బజారులలోఁ ద్రిప్పిరి. శరీరము రక్తములో ముద్దముద్దై పోయెను కాని హరిదాసుని ప్రాణములు పోలేదు. నౌకరు లాశ్చర్యమును బ్రకటించుచు నిట్లనెను:—'మహాశయా! ఇట్టి కఠోరుని మేమింతవఱకు ఒకనినైనఁ జూడలేదు. సాధారణముగాఁ బదిపండ్రెండు దెబ్బలకే మానవుఁడు చచ్చును. ఒకొక్కఁడు పది పదిహేను దెబ్బలకు స్మృహతప్పి పడిపోవును. నీవీఁపు మీఁద నసంఖ్యాకములగు బెత్తపు దెబ్బలు తగిలినను నిట్టూర్పైన విడువలేదు. నీ ప్రాణములు పోకున్న మమ్ములను శిక్షింతురు. నీవు చేయు నామోచ్చారణము వలన నెంతటి గొప్ప దుఃఖముచేనైనను బాధచెందనట్లు చేయు

గొప్ప ప్రభావము కలదని తోఁచుచున్నది. ఇప్పుడు మేమేమి చేయవలయు.'

దయాళుఁడగు హరిదాసా సమయమునఁ దనకు శిక్ష వైచిన వానికొఱకును, దెబ్బలు కొట్టువారి కొఱకును వారికి మేలు కలుగవలెనని భగవంతుని ప్రార్థించుచుండెను. అతఁడా పౌరబాలు మార్గమునఁ బడిపోయిన వారి యపరాధమును క్షమింపుఁడని భగవంతునిఁ బ్రార్థించుచుండెను. ఇంతలోనే హరిదా సచేతనుఁడై భూమిమీఁదఁ బడిపోయి నట్లుందఱకును దోఁచెను. సేవకులాతనిని శవమనుకొనిరి. అట్టి స్థితిలోనే యాతనిని ముల్కుపతి యొద్దకు గొనిపోయిరి. గోరాయి కాజీ యొక్క అంగీకారముచే ముల్కుపతి వానిని గంగలో పాఱ వేయవలసినదని యాజ్ఞాపించెను. 'వీనిని గోరీలో పాతి పెట్టిన ముసల్మాను ధర్మానుసారముగా స్వర్గము ప్రాప్తించును. వీఁడా, ముసల్మాను ధర్మమును వదలినాఁడు కావున వీని నిట్లు గంగలో పాఱవేయుటయే మంచి' దని గోరాయి కాజీ యనెను. సేవకులు ముల్కుపతి యాజ్ఞచే హరిదాసుని శరీరమును పతిత పావనియగు భాగీరథీ ప్రవాహములోఁ బడవైచిరి. గంగా మాతయొక్క సుఖద, శీతల జలస్పర్శచే హరిదాసునకు చైతన్యము కలిగెను. అతఁడు ప్రవాహములోఁ గొట్టుకొని పోవుచుఁబోవుచు ఫులియా సమీపమున ఘట్టము దగ్గఱకు వచ్చెను. ఈతని దర్శనముచే ఫులియా నివాసులందఱును బరమానందమును జెందిరి. నల్దిక్కుల ఈ సమాచారము

వ్యాపించెను. జనులందఱు హరిదాసుని దర్శనము కొఱకు మిక్కిలి యుత్సాహముతో రాసాగిరి. ఎక్కడ వినిన నక్కడ నుండియే జనులాయన దగ్గఱకు పరువిడి వచ్చుచుండిరి. దూర దూరముల నుండి చాలమంది రాసాగిరి. ముల్కపతి, గోరాయి కాజీలును నీ వృత్తాంతమును వినిరి. వారి హృదయములును కరిగిపోయి, యీదృఢ ప్రతిజ్ఞుఁడగు మహాపురుషుని యెడల వారి హృదయమందును శ్రద్ధాభావ ముత్పన్నమయ్యెను. వారును హరిదాసుని దర్శనము కొఱకు ఫులియాకు వచ్చిరి. ముల్కపతి నమ్రతాపూర్వకముగ నీతని నిట్లు ప్రార్థించెను. 'మహాశయా! నేను నీకు శిక్ష వేయక గత్యంతరము లేకపోయి నది. అందువలననే నీకా శిక్ష విధించితిని. నేను నీ ప్రభావమును తెలిసికొనలేకపోతిని. నా యపరాధమును క్షమింపుము. నీ విప్పుడు ప్రసన్నతా పూర్వకముగ హరినామ సంకీర్తనము చేసి కొనవచ్చును. నీ కార్యములో నెవఁడును విఘ్నము చేయఁ జాలఁడు.'

హరిదాసు నమ్రతాపూర్వకముగ నిట్లనెను:– 'మహా శయా! ఇందులో మీ యపరాధ మేమున్నది! మానవుఁడు తన కర్మానుసారముగ సుఖదుఃఖములను భోగించును. ఇతరులు దీనికి నిమిత్తమాత్రులగుదురు. నాకర్మలే యిట్లైనవి. మీ రే మాత్రము చింతింపవలదు. నా మనస్సులో మీయెడల కించిత్తై నను క్రోధము లేదు' హరిదాసుని యిట్టి సరళ, నిష్కపట వాక్యములను వినునప్పటికి ముల్కపతి మిక్కిలి యానందము

చెంది, యాతఁ డాయన పాదములకుఁ బ్రణమిల్లి వెడలి పోయెను. ఫులియా గ్రామములోని యితర వైష్ణవబ్రాహ్మణు లందఱును వచ్చి హరిదాసుని యీ యవస్థను గాంచి దుఃఖమును బ్రకటించిరి. కొందఱాతని గాయములను గాంచి వెక్కి వెక్కి యేడ్వ నారంభించిరి. అప్పుడు హరిదాసా బ్రాహ్మణుల నోదార్చుచు నిట్లనెను: 'విప్రోత్తములారా! మీరందఱును ధర్మాత్ములు. శాస్త్రమర్మములను బాగుగ నెఱుఁగుదురు. పూర్వజన్మ కర్మములు లేనిదే సుఖదుఃఖములు ప్రాప్తింపవు. నేను చెవులతో భగవన్నామ నిందను వింటిని. దానికి ప్రతిఫలము భగవానుఁడు నాకిచ్చియున్నాఁడు. మీరే మాత్రమును జింతింప నవసరములేదు. ఈ దుఃఖము శరీరమునకే గదా! నాకీ కారణమున నేవిధమగు క్లేశమును గనఁబడుటలేదు. భగవన్నామ స్మరణమే అన్ని సుఖములకంటె మిక్కిలి సుఖకరమైనది. భగవన్నామస్మరణము లేని క్షణము దుఃఖకరమైనది.

శ్లో॥ విపదో నైవ విపదః సంపదో నైవ సంపదః ।
విపద్విస్మరణం విష్ణోః సంపత్తస్యైవ సంస్మృతిః ॥

ఈ విపత్తులు విపత్తులుకావు. ఈ సంపదలు సంపదలు కావు. భగవంతుని మఱచుటయే విపత్తు. ఆయనను స్మరించుటయే సంపత్తు. భగవన్నామ స్మరణము చేయుచుండిన శరీరమున కెంతటి బాధలు కలిగినను దానిని బరమ సుఖమనియే

యొంచవలయును.' ఈతని యీ ప్రత్యుత్తరము వలన బ్రాహ్మణు లందఱును బరమ సంతుష్టులైరి. అంత నీతని యాజ్ఞను గొని యందఱును దమతమ గృహములకు వెడలిపోయిరి.

ఈ విధముగా హరిదాసు భాగీరథీతటమున ఫులియా గ్రామ సమీపమున నివసించు చుండెను. అచ్చట అతనికి సమస్త సౌకర్యములుకలవు. శాంతిపురములోని యద్వైతా చార్యులవద్దకు సాధారణముగాఁ బ్రతిదినము పోవుచుండెడు వాఁడు. ఆచార్యులవారును నీతని బుత్రునివలెఁ బ్రేమించు చుండెడువాఁడు. ఈతఁడును నాతని దండ్రికంటె మిక్కిలిగఁ జూచుచుండువాఁడు. ఫులియాలోని బ్రాహ్మణులును, వైష్ణ వులును, ధనికులును, గౌరవనీయులందఱు నీతని శాదర సత్కారములొనర్చు చుండెడువారు. ఈతఁ డెల్లప్పుడును నోట శ్రీహరియొక్క మధుర నామములను కీర్తించుచుండెడు వాఁడు. నిరంతర కీర్తన ప్రభావముచే నీతని రోమరోమము లందు హరిధ్వని వినిపించు చున్నట్లుండెను. భగవల్లీలలు వినుటతోడనే యీతఁడు మూర్ఛపడెడువాఁడు. ఒక్కసారిగా సాత్త్విక భావము లన్నియు నీతని శరీరమునఁ దోఁచెడివి.

ఒక దినమున జరిగిన సంగతి. ఆతఁడు తన కుటీరము నుండి యెచ్చటికో వెడలుచుండెను. దారిలో నితనికి మృదంగ తాళముల ధ్వనివినఁబడెను. అది శ్రీకృష్ణ సంకీర్తనమనుకొని ఆతఁడా వైపునకు బోయెను. ఆ సమయమున 'డంకు' లను పేరుగల ఒకానొక జాతివారు మృదంగ తాళములను వాయిం

చుచు నృత్యము చేయుచు, నృత్యమునకుఁదోడు హరిలీలలను గీర్తించుచుండిరి. ఆ సమయమున నొకానొక డంకువాఁడు నృత్యము చేయుచుండెను. హరిదాసు ఆ స్థలమునకుఁ జేరు నప్పటికి ఆ డంకు వాఁడు కాళియదమన లీలను గూర్చిన కీర్త నను బాడుచుండెను. డంకువాని కంఠస్వరము కోమలముగ నుండెను. నృత్యములోను నాతఁడు ప్రవీణుఁడు. వానికి పాడుట యందు మంచి యభ్యాసమును కలదు. ఆతఁడు చక్కని లయతో నభినయముతో యశోదా నందుల విలాపమును వర్ణించుచుండెను భగవానుఁడు బంతియాటకని చెప్పివచ్చి కాళియహ్రదములో దుమికెను. ఈ విషయమును విని యశోదానందులును, వ్రజవాసులందఱును నక్కడికి వచ్చిరి. బాలకృష్ణుఁడు తన కోమల చరణకమలములను కాళియుని ఫణాగ్రమునందుంచి తన లలిత త్రిభంగి గతిచే నిలుచుండి మురళీగానము చేయుచుండెను. నాగు తీవ్రముగ బుసలుపెట్టు చుండెను. దాని బుసకుతోడు మురారి మందమందముగ నృత్యముచేయుచుండెను. యశోదాదేవి యిట్టిస్థితిని గాంచి విలపించుచుండెను. తన పసిబిడ్డను నే మహామహుఁడైనను కాళియుని బారినుండి యుద్ధరించునేమోయని యామె నల్దిక్కు లను అచ్చటనున్న వారివైపు కాతర దృష్టితో చూచుచుం డెను. నందబాబు దూరముగనుండి కంటనీరు గార్చుచుండెను. ఈ భావమును వినివిని హరిదాసు మూర్ఛితుఁడై నేలపైఁ బడిపోయెను. డంకువాఁడు ఈతని సాత్త్విక భావములనుగాంచి

యాతఁడెవఁడో మహాపురుషుఁడని గ్రహించి, యాతని పద ధూళిని శిరస్సున ధరించి యాతనిని స్తుతిచేయ మొదలిడెను. అక్కడనున్న భక్తులు హరిదాసుని పాదముల క్రిందఁగల ధూళిని గైకొని శిరస్సున ధరించి, యాతనిని తమ యింటికి గొనిపోయిరి.

అచ్చట కీర్తికాంక్షగల ఒక బ్రాహ్మణుఁడును గూర్చుండి యుండెను. అరే, మూర్ఛపడి క్రింద పడిపోయిన నింతటి మర్యాద వీరు చేయుచున్నారే, నేను మాత్రమీ యవకాశము నేలఁబోఁగొట్టుకొనవలె ననుకొనెను. ఇట్లాలో చించి మరల నా డంకువాఁడాడ మొదలు పెట్టఁగానే దొంగ నటనచేయుచు నేలమీఁద నచేతనుఁడై పడిపోయెను. డంకు వాని కంతయుఁ దెలియును. ఈతఁడు పడఁగానే యాతఁ డీతనిని పెద్దగా బాదమొదలుపెట్టెను. దెబ్బకు దయ్యము పాఱిపోవును. వీఁడా దాంబికుఁడు. దెబ్బల కోర్వఁజాలక అక్కడనుండి పాఱిపోయెను. అక్కడ నున్న ధనికులకు వారు కొందఱును. నితరులును 'నీవు హరిదాసు నిట్లు స్తుతించితివేల? అట్టి భావమే వచ్చిన బ్రాహ్మణునిట్లు బాదితివేల?' యని వాని నడిగిరి.

అందఱడిగిన మీఁదట డంకువాఁ డిట్లనెను:– 'హరి దాసు పరమ భగవద్భక్తుఁడు. ఆతని శరీరమున నిజముగ సాత్త్వికభావము లుదయించినవి. ఈతఁడు దాంభికుఁడు, కేవలమాతఁడు బొగడ్త కొఱకై యీ పన్నుగడ పన్నినాఁడు.

అందులకే వారిని స్తుతించితిని, వీనిని బాదితిని. మోసమన్ని స్థలములందును సాగునా? ఒకొక్కప్పుడు మూర్ఖులవద్ద నది పనిచేయును. కాని వాని బ్రదుకు బయటపడిన తర్వాత వానికి సింధంతాం జరుగును. హరిదాసు నిజముగ రత్నము. ఆతఁడు నివసించుటచే నీదేశమంతయుఁ బవిత్రమైనది. ఇట్టి మహాపురుషుని ప్రతి దినమును దర్శనముచేయు మీరంద అదృష్టవంతులు' డంకువాని మాటలను విని యందఱును బరమానందమును జెంది, హరిదాసుని భక్తి భావమును గూర్చి మిక్కిలిగఁ బ్రశంసించిరి ఆ బ్రాహ్మణునకు ప్రజలకు ముఖము చూపించుటకే సిగ్గయ్యెను. యథార్థముగ, కపటుల కిట్టి దుర్దశయే సాధారణముగఁ గలుగు చుండును. ఒకానొకఁ డెంత చక్కఁగఁ జెప్పినాఁడో చూడుఁడు—

దేఖా దేఖీ సాధే జోగ్
ఛీజై కాయా బాఢై రోగ్ ॥

ఒకనిని జూచి యోగమును సాధించిరా రోగము మాత్రము పెరుగును.

హరిదాసుని నిష్ఠ యలౌకికకము. దానిని విచారించు టకు మానవ బుద్ధి చాలదు.



# హరిదాసుద్వారా నామమాహాత్మ్యము

శ్లో॥ హరికీర్తన శీలోవా తద్భక్తానాం ప్రియోఽపి వా ।
శుశ్రూషుర్వాపి మహతాం స వంద్యోఽస్మాభిరుత్తమః॥
శ్రీమద్భాగవతము ౫-౧౮.

(భగవంతుని సుమధుర నామ సంకీర్తనము చేయువారును, హరి భక్తులకుఁ బ్రియుఁడైన వాఁడును, దేవ, గురు ద్విజ ప్రాజ్ఞులకు శుశ్రూష చేయువాఁడు నగు నా యుత్తమ భక్తుఁడు మాకు నమస్కరింపఁదగినవాఁడని దేవతలు చెప్పిరి. అనఁగా దేవతలమగు మేము త్రిలోకవాసులకు వంద్యులము, కాని యట్టి భక్తుఁడు మాకును వంద్యుఁడే యని భావము.)

ప్రాణులయందు విభిన్న భావముల నధ్యారోపము కావించుటయే శోకమునకును మోహమునకును గారణమగుచున్నది. ఒకానొకఁడు తనకు సుఖమును గలిగించువాఁడని ప్రేమించి యొకనిని తన సుహృత్తని యెంచి, మఱియొకనిని తనకు దుఃఖముఁగలిగించు శత్రువని భావించి ద్వేషింప మొదలు పెట్టినయెడల వాని హృదయములో శోకమోహము లుదయించుట తప్పని సరియగును. సమస్త జీవులందును ఒకే యఖండ సత్తా స్వరూపమును గాంచుడు అనఁగా సర్వము వాసుదేవ మయముగాఁ జూచునప్పుడును, ప్రతి జీవిని ప్రభుని బిడ్డయని యందఱను మహద్భావముతోఁ బ్రేమించుచుండినచో నప్పుడా సాధకుని హృదయములోఁ మోహశోకములు పేర్చునకైన

బ్రదికినాఁడో తెలియుటలేదు. దాని శ్వాసచేతనే మానవుఁడు మృత్యువాతఁ బడియుండవచ్చును. అది యెచ్చటనో చాల లోపలయుండి శ్వాసించుచున్నది. ఈ ప్రభావమంతయుదానిదే. దానివలననే ఈ ప్రజల శరీరము మంటలు పుట్టుట జరుగు చున్నది. అది బయటకు వచ్చి గట్టిగా బుసపెట్టెనా, ఆబుసచే నెవఁడును చావక తప్పించు కొనలేఁడు. హరిదాసీ స్థానమును శీఘ్రముగ వదలిపెట్టి యింకెచ్చటనైన నుండుట మేలు లేకున్నఁ బ్రాణ 'యముకలదు.' అనుకొనిరి. మీరు మహాత్ములు గనుక మీకుఁ గష్టము లేక పోవుఁగాక, కాని యితరులకు మీ దగ్గఱ నుండుటచే చాల కష్టము కలుగును. దర్శనార్థులు రాకుండ నుండరు. వచ్చిరా అందఱకు శారీరకష్టము కలుగును. కావున మీరు మమ్ములను దృష్టిలోనుంచుకొని యీ స్థానమును వదలిపెట్టుడు.

అందఱు బలవంతముచేయఁగా హరిదాసు ఆ స్థానమును వదలిపెట్టుట కొప్పుకొనెను. ఆయన వారి నందఱ నాశ్వా సించుచు నిట్లనెను:- 'నా మూలకమున మీకందఱకు బాధ కలుగుట నేనోర్వను. రేఁపటికి యిక్కడినుండి సర్పము పోక పోయెనా రేపు సాయంకాలమునకు నేనీస్థలమును వదలి వెడలి పోయెదను. రేపు మాత్రము నేనైన నుండవలెను, సర్పమైన నుండవలెను. ఇఁక మేమిద్దరము తోడుతోడుగ నుండఁ జాలము.

ఈతని యీ నిశ్చయమును గాంచి ప్రజలందఱును మిక్కిలి యానందమును జెంది, తమతమ స్థానములకు వెడలి

పోయిరి. మఱునాఁడు చాలమంది భక్తులు చేరి హరిదాసుని వద్ద శ్రీకృష్ణ కీర్తనము చేయుచుండిరి. ఇంతలోనే అందఱకు నాయంధకార స్థలములో నొక గొప్ప ప్రకాశము కనుపించెను. భక్తులందఱు ఆశ్చర్యముతో నాప్రకాశము వైపునకుఁ జూచుచుండిరి. ఒక చిత్రవిచిత్ర రంగులుగల గొప్ప సర్పమక్కడ నుండి బయలుదేఱి గంగానదివైపునకు వెడలుచుండుటను గాంచిరి. దాని శిరస్సుపైన నొక గొప్ప మణియున్నది. ఈ ప్రకాశమంతయు దానిదే. అందఱా భయంకర సర్పమును గాంచి యాశ్చర్యమును బ్రకటించిరి. సర్పము మెల్లమెల్లఁగా గంగానది యొడ్డుననే చాలదూరము వెడలిపోయెను ఆదినము నుండి ఆశ్రమమునకు వచ్చువారి కెవరికిని శరీరమందు దురద పుట్టుటలేదు. భక్తుల కిట్టి ప్రభావమే యుండును. వారిముందు కాలకూటమును హరించుకొను దేవాధిదేవుఁడగు శంకరుఁడును భయపడుచుండును. ఇదియంతయు భగవద్భక్తి యొక్క మాహాత్మ్యము.

ఈ విధముగ మహాత్ముఁడగు హరిదాసు ఫులియాలో నివసించుచు భాగీరథీ పావన జలములను సేవించుచు నద్వైతాచార్యుని సత్సంగమున నిరంతర మానందము ననుభవించుచుండెను. అద్వైతాచార్యుఁడే యాతనికి గురువు, తండ్రి ఆశ్రయదాత, సర్వస్వమును. ఆయనమీఁద ఈతనికి కడుంగడు భక్తి. నవద్వీపములో మహాప్రభువు జన్మించిన దినమున నాచార్యునితోఁబాటు ఈతఁడును ఆనందమున నుప్పొంగి నృత్యము

చేయుచుండెను. ఈ జగన్నాథ తనయుఁడే కాలాంతరమున గౌరాంగరూపమున జనోద్ధారము కావించి, దేశమంతటను శ్రీకృష్ణ కీర్తన ప్రచారమును జేయునని చెప్పుచుండెను. ఆచార్యుని వచనములపై హరిదాసునకును సంపూర్ణ విశ్వాసము కలదు. అందువలన నాతఁడును గౌరాంగ ప్రకాశ ప్రతీక్షలో నిరంతరము శ్రీకృష్ణ సంకీర్తనము చేయుచుఁ గాలయాపన మొనర్చుచుండెను.

ఆ సమయమున సప్తగ్రామములో హిరణ్య, గోవర్ధన మజూందారులను నిద్దరు ధనికులగు జమీందారు సోదరులు నివసించుచుండిరి. వారి కుల పురోహితుఁడు పరమవైష్ణవ శాస్త్రవేత్త యగు పండిత బలరామాచార్యుఁడు. ఆచార్య మహాశయుఁడు వైష్ణవులకు మిక్కిలి ఆదరసత్కారములు చేయుచుండును. అద్వైతాచార్యునితో నాతని కత్యంత దగ్గఱ పరిచయము కలదు. ఇద్దరును విద్వాంసులు, కులీనులు, భగవద్భక్తులు, దేశకాల మర్మజ్ఞులు. ఈ కారణమున హరిదాసును అప్పుడప్పుడు సప్తగ్రామమునకుబోయి బలరామాచార్యునివద్ద నివసించుచుండెడువాఁడు. ఆచార్యుఁ డీతని నామనిష్ఠను, భగవద్భక్తిని గాంచి మిక్కిలి ప్రసన్నుఁడై, యాతని సర్వదా తన పుత్రునివలెఁ ప్రేమించుచుండెడువాఁడు. గోవర్ధన మజూందారు కుమారుఁడు రఘునాథదాసు చదువుకొనుట కాచార్యుని దగ్గఱకు వచ్చినప్పుడు హరిదాసు సదా నామజపము చేయు

చుండుటను గాంచెను. ఆ కారణమున నాతనికి మనస్సులో నీతని యెడల మిక్కిలి శ్రద్ధాభక్తు లేర్పడెను.

ఒక దినమున నాచార్యుఁ డీతని మజుందారుని సభకుఁ గొనిపోయెను. మజుందారు మహాశయుఁడు తన కులగురువు చరణములం దత్యంత శ్రద్ధాభక్తులుంచెడివాఁడు. వైష్ణవ భక్తులకు లెస్సగ నాదర సత్కారములను గావించెడువాఁడు. తమ కులగురువుతోఁ గలిసి హరిదాసును వచ్చుటను గాంచి హిరణ్యగోవర్ధను లిద్దఱు సోదరులును ఆచార్యునకు హరిదాసునకు వేచి యభ్యర్చన కావించి, శిష్టాచారమును బ్రదర్శించుచు వారికిఁ గూర్చుండుటకు చక్కని యాసనముల నిచ్చిరి. హరిదాసు విడువక బిగ్గఱగ నిదే మంత్రమును జపించుచుండెను.

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

సభలోని వారందఱును సంభ్రమ భావముతో నీతని వైపు తదేక దృష్టితోఁ జూచుచుండిరి. ఈతని నిరంతర నామ జపమును గాంచి యా జమీందారు సోదరు లిద్దఱకు నీతని యెడల స్వాభావికముగానే మిక్కిలి భక్తిశ్రద్ధ లుదయించెను. వారి దర్బారులో నింకను జాలమంది పండితులు కూర్చుండి యుండిరి. భగవన్నామజప ప్రసంగము రాఁగానే పండితు లందఱు నమ్రతా పూర్వకముగ 'భగవన్నామ జపమునకు అంతిమ ఫలమేది? దీనివలన నెట్టి సుఖప్రాప్తి కలుగును?

హరినామ స్మరణముచే సమస్త దుఃఖము లత్యంతాభావము లగునా? కేవలము నామజపము చేతనే మోక్షముకలుగునా?' యని యడిగిరి.

హరిదాసు నమ్రతాపూర్వకముగఁ జేతులు జోడించుచు పండితుల కిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. 'మహానుభావులారా! మీరు శాస్త్రజ్ఞులు. ధర్మ మర్మములను బాగుగాఁ దెలిసిన వారు. మీరు సమస్త గ్రంథములను, వైష్ణవ శాస్త్రములను బాగుగ నధ్యయనము గావించితిరి. నేను మీాముందేమి చెప్పఁ గలను, కాని భగవన్నామ మాహాత్మ్యముచే నాత్మకు సుఖము కలుగును. అందువలనఁ గొంచెము చెప్పుటకు సాహసించు చున్నాను. భగవన్నామ జపముచే హృదయములో నొక విధమైన యపూర్వానందము కలుగును. ఇదియే భగవన్నామ జపమునకు సర్వశ్రేష్ఠ ఫలము. ఆ యానందజన్య సుఖాస్వాదన చేయుటయే భగవన్నామముయొక్క సర్వశ్రేష్ఠ, సర్వోత్తమ ఫలము భగవన్నామ జపముచేయు సాధకుఁడు మోక్షమును అనఁగా దుఃఖములయొక్క యత్యంతాభావేచ్ఛను గూడ కోరఁడు. ఆతఁడు సగుణ నిర్గుణములను రెండు సుడులకు దూర ముగ నుండును. వాని కంతిమ ధ్యేయము భగవన్నామజపమే. ఎక్కడైన నుండనిండు, ఎట్టి పరిస్థితులలోనైన నుండనిండు, ఏజన్మయైన నెత్తనిండు నిరంతరము భగవన్నామ స్మరణము చేయుచునే యుండవలయును. క్షణము సేపైనను భగవన్నామ మునకు వేఱుగనుండరాదు. ఇదియే భగవన్నామ జప సాధకున

కంతిమ లక్ష్యము. భగవన్నామ సాధకులకు సాధ్య, సాధనములు రెండును భగవన్నామమే. భగవన్నామముగాక ఆతఁడు వేఱొక ఫలమును గోరనే కోరఁడు. నాకింతవఱకే తెలియును. ఇంతకంటె నధికముగ మీకుఁ దెలియునేని నాకు జెప్పుఁడు.'

ఈతని యిట్టి యుక్తియుక్తమును సారగర్భితము, మధురమునగు వాక్యములను విని యందఱును బరమ ప్రసన్నచిత్తులైరి. ఆ సభలోనే గోపాలచంద్ర చక్రవర్తి యను పేరుగల జమీందారుని ఒక నౌకరు కూర్చుండి యుండెను. ఆతఁడు గొప్ప తార్కికుఁడు. ఆతఁడు హరిదాసుని వాక్యములను ఖండించుచు నిట్లనెను:- 'ఇవన్నియు నూహాపోహాలే. ఇవి చదువు సంధ్యలు లేనివారి యూహాపోహాలు. అట్టివారే యీ విధముగ పెద్దగ నామకీర్తన చేయుచుఁ దిరుగుచుందురు. యథార్థ జ్ఞానము శాస్త్రాధ్యయనము చేతనే కలుగును. భగవన్నామముచే దుఃఖనాశము కలుగనే కలుగదు. శాస్త్రములలో నక్కడక్కడ భగవన్నామమును గూర్చి చెప్పఁబడినది కేవల మర్థవాదము. అసలు విషయము వేఱుగ నున్నది.

హరిదాసు కొంచెము వేగముగ నిట్లనెను:- 'భగవన్నామమందు అర్థవాదాభ్యారోపము చేయువారు శుష్కతార్కికులు. వారు భగవన్నామ మాహాత్మ్యమును దెలిసికొననేలేరు. భగవన్నామమం దర్థవాదము లేనే లేదు.'

అంతట గోపాలచంద్ర చక్రవర్తియు దన వాదనను సమర్థించుకొనుచు నిట్లనెను:- 'ఇది మూర్ఖులనెడు వాక్య

ములు. అజామిళునివంటి పాపి నారాయణ యని పుత్రుని పేరునఁ బిలువఁగానే తరించెను. ఘటఘటవాసి యగు భగవంతున కీతఁడు తన పుత్రుని బిలిచినాఁడని తెలియదా యేమి? ఇది అర్థవాదము కాదా యేమి?'

హరిదా సిట్లనెను:- 'దీని నర్థవాదమను వారలు స్వయముగ ననర్థవాదులు. వారికి నేనేమియుఁ జెప్పఁజాలను.

ఉత్సాహమును జెంది గోపాల చక్రవర్తి యిట్లనెను:- 'భగవన్నామ స్మరణ చేసిన మానవుని నీచత పోవునెడల నేను నాముక్కు కోయించుకొందును.'

హరిదాసుఁడును బరిపూర్ణోత్సాహముతో నిట్లనెను:- 'భగవన్నామ జపముచే నీచత మూలమట్టముగ నాశము కాకున్న నేను నా చెవులు ముక్కులు కోయించుకొనుటకు సిద్ధముగనున్నాను. వాదము ముదిరి పోవుటనుగాంచి అందఱు నిద్దఱను శాంత పఱిచిరి. జమీందారులా నౌకరు యెడల చాల నసంతుష్టులైరి. ఆతనిని వైష్ణవాపరాధియనియు, భగవన్నామ విముఖుఁడనియుఁ దెలిసికొని జమీందారాతని నౌకరు నుండి తీసివేసెను. కాలాంతరమున నాతని ముక్కుకూడ తెగిపోయినదని వినికిడి.

ఇట్టి సంఘటనయే యింకొకటి హరినదీ యను గ్రామములో జరిగెను. హరినదీ గ్రామములో నొక పండితమాని, అహంకారి యగు బ్రాహ్మణునకుఁ దన శాస్త్రజ్ఞానమందు

మిక్కిలి గర్వ ముండెను. హరిదాసు నడచుచుఁ దిరుగుచు, నిలుచుండుచుఁ గూర్చుండుచు నుచ్చైస్స్వరముతో—

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

ఈ మహామంత్రమును జపము సర్వదా చేయుచుండెడు వాఁడు. ఈతఁడు ముసల్మానుఁడనియు, మహామంత్రమును జపించుట కనధికారి యనియు భావించి యాతఁ డీయనను 'ముసల్మానుఁ డీ యుపనిషణ్మంత్రమును జపించవచ్చునని యెక్కడ వ్రాయఁబడియున్నది? నీవు చేయునది యనధికారచేష్ట. నిన్ను భగవద్భక్తుఁడని యెవరు పూజింపుచున్నారో వారుకూడ పాపమునే చేయుచున్నారు. అపూజ్యులను బూజించుటయును, బూజ్యుల నుపేక్షించుటయు నెచ్చట జరుగునో అచ్చట దుర్భిక్ష, మరణ, భయ, దారిద్ర్య వ్యాధులు కలుగునని శాస్త్రములందు వ్రాయఁబడినది. కావున నీవీ యశాస్త్రీయ కార్యమును వదలిపెట్టుము. నీయొక్క యీ యాచరణముచే దేశమున దుర్భిక్షము సంభవించును' అని యడిగెను.

హరిదాసు మిక్కిలి నమ్రతా భావముతో నిట్లనెను:- 'విప్రోత్తమా! నేను నీచుఁడను. శాస్త్ర మర్మములు నాకేమి తెలియును? కాని మీబోటి పండితుల నోటినుండియే వేద శాస్త్రాధ్యయనము ద్విజాతులు తప్పితే అన్యులు చేయరాదనియు, కాని భగవన్నామమును కిరాత, హూణ, ఆంధ్ర

పులింద, పుల్కస, ఆభీర, కంక, యవన, ఖశాది జాతులును, పాపులును, ఆటవికులును అందఱును పావనము గావించు ననియు, భగవన్నామము కధికార మందఱకు సమానరూప మున నున్నదని విని యున్నాను.' ♦

హరిదాసుని యీ శాస్త్రసమ్మతమగు ప్రత్యుత్తరమును విని బ్రాహ్మణుఁడు 'మంచిది, భగవన్నామమున కధికార మందఱకును గలదు. కాని మంత్రజప మీవిధముగా బిగ్గఱ బిగ్గఱగా చేయుటచే నేమిలాభము? శాస్త్రములలో మానసిక, ఉపాంశు, వాచికములని మూఁడు రకముల జపములు చెప్పఁ బడినవి. వాచిక జపముకంటె నుపాంశు జపము వేయిరెట్లధిక గుణము కలదగును. ఉపాంశుకంటె మానసిక జపము లక్ష రెట్లు శ్రేష్ఠమైనది. నీవు మనస్సులో జపము చేసికొనుము.

---

♦ శ్లో॥ కిరాత హూణాంధ్ర, పులింద పుల్కసా
ఆభీర కంకా యవనాః ఖశాదయః ।
యేఽన్యే చ పాపా యదుపాశ్రయాశ్రయాః
శుధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః ॥
శ్రీమద్భాగవతము ౨-౪-౧౮.

కిరాతులు, హూణులు, ఆంధ్రులు, పుళిందులు, పుల్కసులు, ఆభీరులు, కంకులు, యవనులు, ఖశులు మొదలైన వారును, ఇతరపాపులును నెవని యాశ్రయముచే శుద్ధులగుదురో వారందఱిలో నుండు ఈశ్వరునకు నానమస్కారము.

నీ యీ జపము మానసిక, ఉపాంశు, వాచికములలో దేనిలోను జేరదు. ఇది 'వైఖరీజపము.' అని అడిగెను.

హరిదాసా విధముగానే సగ్రమతా పూర్వకముగ నిట్లనెను: 'మహారాజా! నాకు బొత్తుగా నేమియుఁ దెలియదు, కాని నేను నా గురుదేవుఁడగు శ్రీ అద్వైతాచార్యులవారి ముఖతః కొలఁదిగ శాస్త్రరహస్యమును వినియున్నాను. మీరు మూఁడు రకములగు జపములను గూర్చి చెప్పి, అందులో మానసిక జపము సర్వశ్రేష్ఠమని చెప్పితిరే అది కేవలము విధి ప్రకారము గురుముఖమున దీక్షనుగ్రహించి శాస్త్రవిధి-చొప్పున కేవలము మడితో పవిత్రావస్థలో సాంగోపాంగముగ జపము చేయునప్పటి విషయము. ఇట్టి మంత్రములు గోప్యముగఁ జెప్పఁబడును. వాని నితరుల సమ్ముఖమునఁ బ్రకట పరుపరాదు. కాని భగవన్నామమునకు శాస్త్రములలో నేమియు విధి నిర్ణయింపఁబడలేదు. దీని జపము సర్వకాలములలో, సర్వ స్థానములలో, నందఱి యెదుటను, సమస్త పరిస్థితులలోఁ జేయఁబడును. అన్యమంత్రములను మెల్లమెల్లఁగా జపించుటలో నధిక మాహాత్మ్యముండిన నుండుఁగాక, కాని భగవన్నామ మాహాత్మ్యము బిగ్గఱగ నుచ్చరించుటలోననే కలదు. భగవన్నామము నెంత బిగ్గఱగ నుచ్చరించిన నంతటి యధిక మాహాత్మ్యము కలుగును. ఏలననఁగా మెల్లమెల్లఁగా నామజపము చేయువాఁడు తనకుఁదానే పావనుఁడై తరించును కాని యుచ్చైస్స్వరముతో సంకీర్తనచేయువాఁడు ఆ కీర్తనను వినెడు జడ చేతనములను గూడ పావనచేయును. ♦

ఈతని యీ వాక్యములను విని బ్రాహ్మణుఁడు మండి పడి యిట్లనెను:- 'ఈ శాస్త్ర వాక్యములన్నిటిని అర్థవాదమని పిలుతురు. ప్రజలకు నామజపమందును సంకీర్తనమందును శ్రద్ధ కలుగవలెననియే యిట్టి వాక్యము లచ్చటచ్చట చెప్పఁబడినవి. యథార్థ విషయమేమన దైవీ సంపత్తి నాశ్రయించనిది నామజపము వలన కించితేనఁ బ్రయోజనము లేదు. నామజపముతోడనే మానవునకుద్ధారము కలిగినచో నిన్ని శాస్త్రములు రచించుటెందులకు ?'

హరిదాసజ్జీ నమ్రతతో నిట్లనెను:- 'పండితవర్యా ! శ్రద్ధ కలుగుట చాలకష్టము. నిజముగఁ గేవలము భగవన్నామమందే పూర్తిగ శ్రద్ధాభక్తులు కలుగు నెడల వానికిఁక శాస్త్రములతోఁ బనియే లేదు. శాస్త్రములలో మాత్రమేమున్నది ! ఎక్కడ చూచినను 'భగవంతుమీఁద భక్తి శ్రద్ధలు కలిగియుండు' మను వాక్యములే లభించును. శ్రద్ధా విశ్వాసములను గట్టి పరుచుటకే శాస్త్రము.

ఆవేశమున బ్రాహ్మణుఁ డిట్లనెను:- 'కేవలము భగవన్నామజపము చేతనే అన్నియు నగుచో నేను నా ముక్కు చెవులు కోయించుకొందును.

---

• శ్లో॥ జపతో హరినామాని స్థానే శతగుణాధికః ।
ఆత్మానం చ పునాత్యుచ్చైర్జపన్ శ్రోతౄన్ పునాతి చ ॥
నారదీయే. ప్ర. వా.

'మీకు విశ్వాసము లేకపోయినఁ బోనిండు. నేను నా విశ్వాసానుసారముగఁ జెప్పినా'నని హరిదాసు వెడలిపోయెను. తర్వాత నా బ్రాహ్మనకు పీనసరోగము వచ్చి ముక్కు క్రుళ్ళి క్రుళ్ళి రాలిపోయినట్లు వినికిడి. భగవన్నామ విరోధుల కేదశ ప్రాప్తించినను జాలదు. సమస్త దుఃఖములకు మూలకారణ మొక్కటియే. అది భగవన్నామమునకు విముఖతయే.

ఈ విధముగ మహాత్ముఁడగు హరిదాసు భగవన్నామ మహాత్మ్యమును స్థాపించుచు గంగా తీరమున నివసించుచుం డెను. గౌరచంద్రుఁడు నవద్వీపములో నుదయించి తన శీతల సుఖమయ కృపాకిరణములచే భక్తుల హృదయములను భక్తి రసామృతముచేఁ జల్లులిడుచున్నట్లు విని హరిదాసుయును ఆ నిష్కళంక రాకాసుధాకరుని ఛత్రచాయలోనికి వచ్చి నవ ద్వీపములోనే నివసించుచుండెను. ఈతఁ డద్వైతాచార్యునకు మొదటినుండియుఁ గృపాపాత్రుఁడే. ఆ కారణమున నీతఁడు ప్రభువున కంతరంగ భక్తుఁడగుట కధిక కాలము పట్టలేదు. కొలఁది దినములలోనే యీతఁడు ప్రభువునకుఁ బ్రధాన కృపా పాత్రులగు భక్తులలో నొకఁడుగ నెన్నఁబడు చుండెను. ఈతని భగవన్నామ నిష్ఠకు భక్తులందఱును మిక్కిలి యాదరించు చుండిరి. ప్రభువున కీతఁ డనిన మిక్కిలి యిష్టము. ఈతఁడును తన సర్వస్వమును ప్రభుపాదపద్మములకు సమర్పించి వేసెను. ఈతని చేష్టలన్నియుఁ బ్రభువు యొక్క యిష్టానుసారముగ నుండును. ఈతఁడు భక్తులతో సంకీర్తనలో రాత్రియంతయును

నిష్టము వచ్చినట్లు నృత్యము చేసిచేసి, నృత్యములో స్పృహ తప్పి క్రిందపడి పోవుచుండెడువాఁడు. ఈ విధముగ శ్రీవాస పండితుని గృహము శ్రీకృష్ణ సంకీర్తనమునకు ప్రధాన స్థాన మయ్యెను. సాయంకాలమగునప్పటి కందఱును జేరెడువారు. భక్తులందఱును జేరఁగానే తలుపుబిగించి సంకీర్తన ప్రారంభించెడువారు. రానివాఁ డెంతటివాఁడైనఁ గానిండు మరల తలుపు తెఱచుటలేదు. ఈ కారణమునఁ జాలమంది మనుష్యులు నిరాశులై తిరిగిపోయి, వారు సంకీర్తన సంబంధమున ననేకాపవాదములను వ్యాపింపఁజేసెడువారు ఈ విధముగ నొకవంక సజ్జన భక్తవరేణ్యులు సంకీర్తనానందమున బరమానంద రసాస్వాదన చేయుచుండిరి. వేఱొకవంక నిందకులు సంకీర్తన యెడల దుష్ప్రచారమును జేయుచు తమ యాత్మలను గలుషిత మొనర్చుకొను చుండిరి.



# సప్త ప్రహరియా భావము

శ్లో॥ దివి సూర్య సహస్రస్య భవేద్యుగ పదుత్థితా ।
యది భాః సదృశీ సాస్యాద్భాస స్తస్య మహాత్మనః ॥
గీత. ౧౧-౧౨.

(వేయిమంది సూర్యులు, (చంద్రులు) ఒక్కసారిగా ప్రకాశింపఁగా నాప్రకాశ మా మహాత్ముని ప్రకాశముతో సమానముగనున్నది )

మహాభారత యుద్ధక్షేత్రమందు అర్జునుఁడు ప్రార్థించఁగా భగవానుఁ డాతనికి తన విరాట్స్వరూపమును జూపించెను. భగవానుని యీ విరాట్స్వరూప మర్జునున కొక్కనికి మాత్రమే కనఁబడినది. రెండు సేనలలోను లక్షల కొలఁది మనుష్యులచ్చటనే యున్నారు కాని యెవ్వరికిని భగవంతుఁ డారూపముతో దర్శనమీయలేదు. అర్జునుఁడును నీ చర్మ చక్షువులతో భగవంతుని దర్శింపలేకపోయెను. అందువలన భగవానుఁ డనుగ్రహించి వానికి దివ్యదృష్టి నొసంగెను. ఆదివ్యదృష్టి సహాయముచే నా యలౌకిక రూపమును జూచుటకు సమర్థత కలిగెను. ఇచ్చట వ్యాస భగవానుఁడు సంజయునకు దివ్యదృష్టిని ప్రసాదించెను. ఆ కారణమున హాస్తినాపురముననే కూర్చుండియే యీ రూపమును జూడఁగలిగెను. అసలు దివ్యదృష్టి లేక దివ్యరూప దర్శనమే కలుగఁజాలదు. బాహ్యమైన యీ లౌకిక దృష్టితో బాహ్యమగు భౌతిక

పదార్థములనే చూడగలుగుదుము. లోపలనున్న నేత్రము తెఱువనిది, అనుగ్రహించి శ్రీకృష్ణుఁడు దివ్యదృష్టి ప్రదానము కావించనిది యలౌకికమును, బరమ ప్రకాశమయమునగు స్వరూపము కనఁబడనే కనఁబడదు. భక్తుల లోకమే వేఱుగ నుండును. వారి భాషయు వేఱుగనుండును. వారి వ్యవహారము కూడ భిన్నముగానే కనఁబడును. భగవంతుఁడను గ్రహించి యెవనిని దనవానిఁగాఁ గైకొనునో తనవాఁ డనుకొని యెవనిని వరించునో, యెవనికి రతిరూపమగు నంతర్దృష్టిని దెఱచునో, వానికి మాత్రమే తనధ్యేయ పదార్థమగు నిష్టదేవుని దర్శన మగును. వానిముందు వాని భావనాను సారముగఁ బ్రత్యక్ష మగును. దృఢ విశ్వాసము లేనిది యెన్నడును తన యిష్ట దేవతా దర్శనము కానే కానేరదు.

గౌరాంగుని జీవితములో ద్వివిధభావములు దృష్టిగోచ రములగుచున్నవని నేను మొదటనే చెప్పియుంటిని. అతఁడు సర్వదా ఒక అనూనియగు భగవద్భక్తుని భావములో నుండెడు వాఁడు, కాని ఒక్కొక్కప్పుడు వాని శరీరమందు భగవ ద్భావము కూడ ప్రకటమగు చుండును. ఆ సమయమున నాతని చేష్టలన్నియును, వ్యవహారమును నైశ్వర్యమయములుగ నుండును. ఇట్టి భావము చాలకాల ముండెడిది కాదు. కొంచెము సేపైన తర్వాత నా భావము శమనమై తర్వాత యథా ప్రకా రముగ భగవద్భక్త భావములోనికి వచ్చుచుండును. ఇంత వఱకు ఈ భావము కొలఁది కాలము మాత్రమే నిలిచియుండె

డిది. కాని యొకసారి యాతఁడు పూర్తి నేఁడు జాములు భగవద్భావములోనే యుండెను. ఈ భావమును 'సప్తప్రహరియాం భావ'మనియు 'మహాప్రకాశ' మనియుఁ బిలిచి వైష్ణవ భక్తులు దీనిని విశద రూపమున వర్ణించిరి. నవద్వీపమునందు ప్రభువువారి శరీరమున నిదియే యన్నిటికంటె గొప్ప భావము. వాసుదేవ ఘోషు, మురారిగుప్త, ముకుందదత్తు వీరు ముగ్గురును మహాప్రకాశ సమయమున నచ్చట నుండిరి. వీరు ముగ్గురే వైష్ణవులలో ప్రసిద్ధ పదకారులైరి. వీరు ముగ్గురును చైతన్య చరిత్రను వ్రాసిరి. వీరు తమ నేత్రములతోఁ బ్రత్యక్షముగఁ గాంచి వర్ణనచేసిరి. అయినప్పటికిని విశ్వసింపనివారు విశ్వసించనే విశ్వసింపరు. ఏలననఁగా వారి విషయమున ననభిజ్ఞులు. వారి బుద్ధి భౌతిక పదార్థములను తప్పితే యిట్టి విషయములందుఁ బ్రవేశింపనే ప్రవేశింపదు. కాని పరమార్థ విషయములోఁ గొంచెమైనను బ్రవేశము కలవారికి యీవిషయమును శ్రవణము చేయుటచే మిక్కిలి సుఖము లభింపఁగలదు. కావున నిప్పుడు 'మహాప్రకాశము' యొక్క వృత్తాంతమును వినుఁడు.

ఒక దినమునఁ బ్రాతఃకాలముననే భక్తులందఱును శ్రీవాస పండితుని యింటిలోఁ జేరిరి. ఒక్కొక్కరక్కడకు భక్తులందఱును జేరిరి. వారిలోఁ బ్రధాన ప్రధాన భక్తులు వీరు— అద్వైతాచార్యుఁడు, నిత్యానందుఁడు, శ్రీవాసుఁడు, గదాధరుఁడు, మురారిగుప్త, ముకుంద దత్తుఁడు, నరహరి, గంగాదాసు, మహాప్రభుని పెత్తల్లి భర్త చంద్రశేఖర,

ఆచార్యరత్నము, పురుషోత్తమాచార్యుఁడు (స్వరూప దామో
దరుఁడు), వక్రేశ్వరుఁడు, దామోదరుఁడు, జగదానందుఁడు,
గోవిందుఁడు, మాధవుఁడు, వాసుదేవఘోషు, సారంగుఁడు,
హరిదాసు మొదలగువారు. వీరు కాక యింకను జాలమంది
భక్తులచ్చట నుండిరి.

ఆ దినమున జాము ప్రొద్దెక్కినదో లేదో భక్తులలో
ముఖ్యమైన వారందఱును శ్రీవాస పండితుని యింటికివచ్చిరి.
ఇంతలోనే మహాప్రభువును వచ్చెను. ప్రభువువారు రాఁగానే
భక్తుల హృదయములలో నొకవిధమైన నవజీవన సంచారము
కలుగసాగెను. ఇతర దినములలో ప్రభువు అన్యభక్తులవలె
వచ్చి కూర్చుండి యందఱితోఁగలిసి భక్తిభావముతోఁ జాల
సేపటివఱకు సంకీర్తనచేయు చుండెడువాఁడు. అప్పుడెప్పుడైన
నొకదినమున భగవదావేశము వచ్చుచుండెడిది. కాని యా
దినమున సరిగా వచ్చి ఒక్కసారిగా భగవంతుని సింహాసన
ముపైఁ గూర్చుండెను. సింహాసనము మీఁదనున్న మూర్తు
లావలకుఁ నెట్టఁబడినవి. అతఁడు శాంత, గంభీర భావములతో
భగవదాసనముమీఁద నాసీనుఁడయ్యెను. ఈయన కూర్చుం
డుటతోడనే భక్తులందఱు హృదయములలో నొక విచిత్ర
ప్రకాశము గనఁబడ మొదలిడెను. అందఱాశ్చర్య సంభ్రమ
భావములతో ప్రభువువారి శ్రీవిగ్రహమును జూడసాగిరి. కాని
యెవరికిని నాతని వైపునకు చాలసేపటి వఱకు చూచుటకు
ధైర్యము లేకుండెను. ఆవెలుఁగు వేయిమంది సూర్యులు,

వేయిమంది చంద్రులు ఒక్కసారిగా నొకేచోటఁ బ్రకాశించు చున్నట్లుండెను ఎంత ప్రయత్నము చేసినప్పటికిని ఎవని దృష్టియుఁ జాలసేపటివఱకు ప్రభు సమ్ముఖమున నిలువఁజాల కుండెను. ఒక్కసారిగ నాలుగు దిక్కులను విమల ధవళ ప్రకాశముయొక్క జ్యోతిర్మయ కిరణకాంతులు ప్రసరించెను. అవి అగ్నియొక్క శుభ్రజ్వాలలనుండి గొప్పగొప్ప విస్ఫులింగములు ఇటునటు యెగిరెగిరి యంధకారమును సంహరించుచున్నట్లుండెను. ప్రభువువారి పదనఖముల జ్యోతులాకాశమునఁ బెద్దపెద్ద నక్షత్రములవలె స్పష్టముగ వేలువేలుగఁ గనఁబడుచుండెను. ఆతని వైఖరి దేదీప్యమానముగ నుండెను. భక్తుల కండ్లకు మిఱుమిట్లు గొలిపెను. కాని యా రూపమును దృష్టి నుండి తొలగించుటకు నాకిష్టములేదు. ఈ విధముగ భక్తులందఱును చాలసేపటివఱకు ఱాతిప్రతిమలవలె స్తబ్ధభావముతో మెదలకుండ కూర్చుండిరి. ఆ సమయమున నెవఁడును గట్టిగ శ్వాసకూడ పీల్చుటలేదు. ఒక్క సూది క్రిందఁబడినను దాని శబ్దమందఱకు వినిపించుచున్నట్లుండెను. ఆ నీరవ నిస్తబ్ధతను భంగము కావించుచుఁ బ్రభువు గంభీర భావముతో నిట్లు చెప్పుట కారంభించెను. 'భక్తబృందములారా! నేను నేఁడు మీ మనోవాంఛల నన్నిటిని బూర్తి కావించెదను. మీరీవేళ నన్ను విధ్యుక్తముగ నభిషేకము కావింపుఁడు.'

ప్రభువువారిట్టి యాజ్ఞను విని అందఱును నానందించిరి ముఖ్యముగ శ్రీవాసుని యానందమునకు మేఱయే లేక

పోయెను. ఆతఁడు ప్రేమకారణమునఁ దనను దాను మఱచెను. ఒకానొక చక్రవర్తి ఒకానొక దరిద్రదామోదరుని ప్రేమకు వశీభూతుఁడై వెంటనే తెల్లబైన తుక్క పూరింటిలోనికి వచ్చినవానికెట్టి యానందము కలుగునో, అంతకంటె నధిక ప్రేమమయ దశ శ్రీవాస పండితునకుఁ గలిగెను. ఆతఁ డానంద కారణమునఁ దికమకపడెను. శరీరమును మఱచి స్వయముగ నొక బిందెను తీసికొని గంగవైపునకు పరుగెత్తుకొని పోయెను కాని మధ్యలోనే ప్రేమకారణమున మూర్ఛితుఁడై పడి పోయెను. అంతట నాయన దాసదాసీలు చాల బిందెలు తీసికొని గంగాజలము తీసికొనివచ్చుటకు వెడలిపోయిరి. చాల మంది భక్తులును నక్కడక్కడ బిందెలనడిగి తీసికొని గంగా జలము తెచ్చుటకు పరుగెత్తుకొనిపోయిరి. అనేకములగు బిందె లతో గంగాజలము వచ్చెను. భక్తులు ప్రభువునొక సుందర మగు పీఠమునఁ గూర్చుండఁబెట్టి యాతని శరీరమునకు వివిధము లగు సుగంధిత తైలములచే మాలిసుచేసిరి. తదనంతరము సువాసిత జలకలశములచే వారిని విధ్యుక్తముగ స్నానము చేయించిరి. అద్వైతాచార్యులు, ఆచార్యరత్న ప్రభృత పండితశ్రేష్ఠ మహాపురుషులు స్నానమంత్రముల నుచ్చరించు చుండిరి. భక్తులు వరుసగా నొకరొకరు ప్రభువువారి శ్రీయంగ ములమీఁద గంగాజలము నభిషేకించుచుండి మనస్సులో నానందము చెందుచుండిరి. ఈవిధముగ గంటలకొలది స్నానము జరుగుచునే యుండెను. అందఱును వారివారి కిష్టము వచ్చినట్లు

స్నానము చేయించిన తర్వాత ప్రభువువారి అంగము నొక సన్నని సుందర స్వచ్ఛ వస్త్రముచే బాగుగఁ దుడిచిరి. ఆ సమయమున శ్రీవాస పండితుఁడు తన యింటినుండి నూతనమగు సన్నని పట్టు వస్త్రములను తీసికొనివచ్చెను. ఆ సుందర వస్త్రములను భక్తులు విధ్యుక్తముగ ప్రభు శరీరమున ధరింపఁజేసి, అతనినొక యలంకరింపఁబడిన సుందర సింహాసనము మీఁదఁ గూర్చుండఁబెట్టిరి.

ప్రభువు సింహాసనారూఢుఁడైన తర్వాత భక్తులు ఒక్కరొక్కరు ప్రభువువారి యంగముల మీఁద కేసరము, కర్పూరము, కస్తూరి కలిపిన చందనమును లేపనము కావించిరి. చరణములందు తులసీ చందనముల నర్పించిరి. పూలమాలలింటిలో కొద్దిగానే యున్నవని గ్రహించి, కొందఱు భక్తులాసమయమున బజారునకు పరుగెత్తి సుందరములగు మాలలను చాల త్వరగాఁ గొనితెచ్చిరి. అందఱు నొక్కొక్కరు ప్రభువువారి కంఠమున మాలలను వైచిరి. భక్తులర్పించిన పుష్పములచే ప్రభువువారి పాదపద్మములు కప్పఁబడెను. పూలమాలలచే మెడనిండిపోయెను ప్రభువు భక్తులందఱకును తన కరకమలములచే ప్రసాదమాల నిచ్చెను. ప్రభువువారి యాప్రసాదమాలను బొంది భక్తులానందమున నృత్యముచేయ మొదలిడిరి.

శ్రీవాసుఁడు మాత్రము ఒడలు తెలియకుండ నుండెను. ఆతని స్థితి జన్మదరిద్రునకు పరమమణి దొఱకినట్లుండెను. ప్రభువువారి యీ యలౌకిక ఛవియొక్క దర్శన మెవరెవరికి

చేయింతునా యని యాతని హృదయము కొట్టుకొనుచుండెను. ఏదైన ప్రియవస్తువు లభించునెడల దానిని ప్రియజనులందఱకుఁ జూపించవలెనని ప్రతివాని హృదయములో స్వాభావికముగానే యుత్పన్నమగును. ఇట్లాలోచించి యాతఁడు అద్వైతాచార్యుల చెవిలో 'శచీమాత నామీఁద చాలకోపము పడుచుండును. మీరందఱును జేరి మా నిమాయిని జెడగొట్టినారు. వస్తుతః వాఁడెంతటి మంచివాఁడు. ఇప్పుడు మీరేమి వానికి బోధించితిరో నాకు తెలియకుండా నున్నది.' అని యామె నన్నను చుండును.' ఇవ్వేళ తల్లిని దీసికొనివచ్చి మీ నిమాయి యథార్థముగ నెట్టివాఁడో చూపింతును. ఈతఁడు నీపుత్రుఁడు కాఁడు, కాని సమస్త జగత్తునకు తండ్రియని చూపింతును. మీరనుమతించినచో నేను శచీమాతను బిలిచికొని వత్తు' ననెను.

ఆచార్యుఁడు శ్రీవాసు నభిప్రాయమును సమర్థించుచు 'అవునవును, అవశ్యము. శచీమాతకు తప్పక దర్శనము చేయించవలయును.' అనెను

ఇది వినుటతోడనే శ్రీవాస పండితుఁడు త్వరగా పరు గెత్తుకొనిపోయి శచీదేవిని పిలుచుకొని వచ్చెను. శచీదేవి వినుటతోడనే అద్వైతాచార్యుఁడు 'అమ్మా! నీ సమక్షమునఁ జూడుము. ఇదివఱకు మావాఁడు మావాఁడని అనుకొనుచుంటివే అట్టివాఁడిప్పుడు నీపుత్రుఁడు కాఁడు. ఇప్పు డీతనిని దర్శించుకొని నీజీవితమును సఫలము కావించుకొనుము.' అనెను.

తల్లి ఆశ్చర్యముచెంది మెదలకుండ నిలుచుండెను. ఆమె కేమి చేయవలయునో యేమియుఁ దోఁచలేదు. శ్రీవాస పండితుఁడు తల్లియొక్క స్థితినిగాంచి దీనభావముతో 'ప్రభో! ఇదిగో జగన్మాతయగు శచీదేవి యెదుట నిలుచుండి యుండెను. ఈమెకు నీతల్లి యగు పరమ సౌభాగ్యము కలిగినది. ఈమెపై మీరు కృపయుంచవలెను. ఈమెకు యథార్థస్వరూప దర్శనమిప్పింప వలయుననియే మా ప్రార్థన' అని ప్రార్థించిరి.

ప్రభువు హుంకారము చేయుచు 'శచీమాతపై కృప యుండఁజాలదు. వైష్ణవులందఱు కలిసి నా నిమాయిని పాడు చేసినారని సర్వదా వైష్ణవులను దూషించుచుండు' ననెను.

ప్రభుని యీ వాక్యములను విని యద్వైతాచార్యుఁడు 'ప్రభో! తల్లికి నీయెడల వాత్సల్య భావమున్నది. ఆమె యేమన్నను వాత్సల్య భావమునకు వశీభూతయై మాత్రమే పలుకుచుండును. వైష్ణవుల యెడల నీమె హృదయములో ద్వేషభావము లేదు. ఈమె ఉపాసన వాత్సల్య భావమునకు సంబంధించినది. ఆమెపై ననుగ్రహము చూపవలసినదే' యనెను.

అద్వైతాచార్యుఁడు ఈ ప్రార్థన చేయుచుండఁగానే, యింతలో మెల్లగా శ్రీవాస పండితుఁడు తల్లి చెవిలో 'నీవు ప్రభు పాదపద్మములకుఁ బ్రణామము కావించుము' అనెను. తల్లి కుమారునకు నమస్కారము చేయుటకు వెనుకాడు చుండెను. అప్పుడాచార్యుఁడు ప్రోత్సహించుచు 'తల్లీ! ఇప్పుడు నీవు

నిమాయి భావమును మఱచిపోవలెను. ఈతనిని భగవద్బుద్ధిచేఁ ప్రణామము కావించుము. జాగుచేయవలసినపనిలేదు' అనెను.

వృద్ధాచార్యుఁడిట్లు బలవంతము చేయఁగా తల్లి ముందుకుపోయి ప్రభు పాదపద్మములకు సాష్టాంగ దండప్రణామము కావించి గద్గదకంఠముతో 'భగవానుఁడా నేనజ్ఞ స్త్రీని. నీ వెవరో నేను తెలిసికొనఁజాలను. నీ వెవరైన కానిండు, నన్నను గ్రహింపుఁడు' అని ప్రార్థన చేయుటకుఁ ప్రారంభించెను. తల్లి ప్రణామము చేయుటగాంచి ప్రభువామె శిరస్సుపై తన చరణముల నుంచుచు 'వెళ్లు, వైష్ణవాపరాధమును క్షమించితిని. నిన్ననుగ్రహించితిని' అనెను. తల్లి యిది విని ఆనందమున మునిఁగిపోయి రోదనముచేయఁ ప్రారంభించెను.

అంత భక్తులందఱును క్రమముగాఁ ప్రభువును వివిధములగు పూజలు కావింప మొదలిడెను. ఒకొక్కఁడు ధూపము వేసెను. ఇంకొకఁడు దీపమును ముందు పెట్టెను. వేఱొకఁడు ఫలమూలములను ముందుంచెను. ఒకొక్కఁడు క్రొత్తక్రొత్తవియు, సుందరములైనవియు నగు వస్త్రములను దీసికొనివచ్చి ప్రభు శరీరమున ధరింపఁజేసిరి. ఈ విధముగ నందఱు తమతమ యిచ్ఛానుసారముగ ప్రభువును బూజించిరి. ఇప్పుడు నైవేద్యము వంతు వచ్చెను. అందఱును తమ తమ యిచ్ఛానుసారముగ వివిధ ప్రకారములగు వ్యంజనములను, నానారకములగు మిఠాయిలను, వివిధములగు ఫలములను పళ్లె

రములలోఁ బేర్చుకొని ప్రభువునకు నైవేద్యములను దెచ్చిరి. అందఱానంద పూర్వకముగ ప్రభువువారి చేతులలో వివిధము లగు వస్తువులను బెట్టిరి. ఒకొక్కఁడు మిఠాయి నర్పించి 'ప్రభువువారు! దీనినారగింపుఁడు' అనును ప్రభువు దానిని ప్రేమపూర్వకముగఁ దినివేయును. వేఱొకఁడు ఫలముల నర్పించి 'దీనిని స్వీకరింపుఁ'డనును. ప్రభువు మొదలకుండ ఫలములను దినివేయును. ఒకొక్కఁడు లడ్డు, పేడా, మొదలగు వివిధమిఠాయీల నర్పించును. ఒకొక్కఁడు గిన్నెతో పాలను దీసికొనివచ్చి 'ప్రభో! దీని నారగించుఁడు'అని ప్రార్థించును. ప్రభువు వాటి నారగించును. ఆ సమయమునఁ బ్రభువు వారికేవస్తువు నర్పించినను దానికి బ్రభువువారు భక్షించుచుండెను. ఏ వస్తువునైనను నతఁడు స్వీకరించనిది లేదు. అయినను అస్వీకారమెట్లు చేయఁగలఁడు? 'ఎవఁడైన భక్తి చేత నాకు పత్రము, పుష్పము, ఫలము, తోయము మొదలైన వాని నర్పించిన వానినే నేను సంతోషపూర్వకముగ గ్రహింతును.' అని భగవంతుని ప్రతిజ్ఞ. అట్టి యెడ భక్తులు ప్రేమతో నొసంగిన నైవేద్యమును నాతఁడెట్లు వదలిపెట్టఁ గలఁడు. ఆ దినమున ప్రభువెంత తినినాఁడో, భక్తులెంత పెట్టినారో యెవ్వఁడు నూహింపఁజాలఁడు. అందఱయొక్క ప్రేమ ప్రసాదమును బొందిన తర్వాత శ్రీవాస పండితుఁడు కంపించుచున్న తన హస్తములతో సువాసిత తాంబూలమును బ్రభువున కర్పించెను. ప్రభువు ప్రేమ పూర్వకముగ తాంబూల

చర్వణము చేయసాగెను. అందఱును వరుసవరుసగ తాంబూలము నర్పించిరి. ప్రభువు వాటిని స్పర్శించి భక్తులకు ప్రసాదరూపమున నిచ్చుచుండెను. ప్రభుదత్తమైన తాంబూలమును బొంది భక్తులందఱు తమతమ భాగ్యమును బొగడుకొనుచుండిరి.

తాంబూల చర్వణానంతరము ప్రభువు మందహాసముతో నందఱయందు తన కృపాదృష్టులను బఱపుచుఁ గొంత ప్రేమ ప్రసంగము కావించెను. ఆ సమయమున నాతని నోటినుండి వెడలిన పలుకులు అమృతములో ముంచి వదలుచున్నట్లుండెను. ఆ వాక్యములు భక్తులహృదయములలో నొక విధమైన యాకర్షణముఁ కలిగించుచుండునవిగ నుండినవి. ప్రభువారి నోటినుండి యాసమయమున వెలువడిన పలుకులు అందఱను కదలక తాము కూర్చుండిన చోట్లలోనే కూర్చుండి ప్రభువు నోటినుండి వెలువడు ఉపదేశ నామామృతమును నిరంతరము భావముతోఁ బానము చేయునంతటి యధికాకర్షణముగ నుండెను. తామేలోకములోఁ గూర్చుండినది అక్కడివారి కెవరికిని తెలియుటయే లేదు. ఆ సమయమున భక్తుల కీదృశ్య జగత్తు అత్యంతాభావముగఁ గనఁబడుచుండెను ప్రాతఃకాలమునఁ గూర్చుండఁగా సంధ్యాకాలము దాఁటిపోయెను భగవంతుఁడగు భువన భాస్కరుఁడు ప్రభువు యొక్క భావ పరివర్తనమునకై ప్రతీక్షించి ప్రతీక్షించి యస్తాద్రిని జేరెను, కాని ప్రభువువారి భావమణుమాత్రమైనను బరివర్తనము కలుగ

లేదు. భక్తులు కూడ నా ప్రకారమే ప్రేమపాశములతోఁ గట్టఁబడి కూర్చుండి యుండిరి.

శ్రీవాస పండితుని సేవకు లింటిలో దీపములు పెట్టిరి కాని యా క్షీణదీప జ్యోతులు ప్రభువువారి దేహముయొక్క దివ్యప్రకాశమందు వెలవెల పోవుచుండెను. పగలుపోయి రాత్రి యెప్పుడు వచ్చినదో యెవరికిని తెలియదు. అందఱు నా దివ్యాలోక ప్రకాశమందు తమ్ముదాము మఱచి కూర్చుండి యుండిరి.



# భక్తులకు భగవద్దర్శనము

శ్లో॥ మల్లానామశనిర్నృణాం నరవరః
స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం
శాస్తా స్వపిత్రోః శిశుః ।
మృత్యుర్భోజ పతే ర్విరాడవిదుషాం
తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవ తేతి విదితో
రంగం గతః సాగ్రజః ॥

శ్రీమద్భాగవతము ౧౦-౪౩-౧౭.

(భగవానుఁడు కంసుని సభామండపమునఁ బ్రవేశించి నప్పుడు రంగమండపములో నున్న వారందఱకు వారివారి భావనానుసారముగా భగవానునియొక్క విభిన్న రూపములు కనఁబడెను. మల్లులకు వాని శరీరము వజ్రముతో సమానముగాను, నరులకు నరపతి (రాజు) వలెను, స్త్రీలకు మూర్తిమంతుఁడగు మన్మథుని వలెను, గోపకులకు సఖునివలెను, దుర్మార్గులగు రాజులకు శాస్తవలెను, తన తల్లి దండ్రులకు పుత్రునివలెను, కంసునకు మృత్యువువలెను, అజ్ఞానులకు విరాట్స్వరూపముగాను, యోగులకు పరమ తత్త్వముగాను, యాదవులకు పరమ దేవతవలెను గనఁబడు చుండెను.)

జాకీ రహీ భావనా జైసీ
ప్రభు మూరతి దేఖీ తిన్హ తైసీ ॥

(ఎవని కేభావన యుండెనో అట్టి రూపముననే ప్రభు వుని జూచిరి.)

శ్రీకృష్ణ భగవానుఁడు బలరామునితోఁగూడి కంసుని రంగమండపములోఁ బ్రవేశించి నప్పుడు అక్కడ విభిన్నము లగువారు కూర్చుండి యుండిరి. వారు వారివారి ప్రకృతుల ననుసరించి భిన్నభిన్న రూపములను దర్శించిరి. అందువలన నచ్చట నున్న స్త్రీపురుషులు తమ తమ ప్రకృతుల ననుసరించి నవరసముల ననుభవించిరి. కొందఱు భగవద్రూపమునుగాంచి భయపడిరి, కొందరు వణఁకిరి, కొంద ఱేవగించిరి, కొందఱు నవ్విరి, కొందఱకుఁ బ్రేమపుట్టెను, కొందఱి హృదయములలో ప్రేమముత్పన్నమయ్యెను, కొందఱకు క్రోధము కలిగెను. స్త్రీల కతఁడు సాక్షాత్తుగ మన్మథునివలెఁ దోఁచెను. కాని యిక్కడ ప్రభు ప్రకాశసమయమున భక్తులందఱొకే ప్రకృతి గల భగవద్భక్తులు. ఆ కారణమున ప్రభువుయొక్క మహా భావముచే నందఱకు సమాన భావమున నానందము కలిగెను. అందఱు ఆయన ప్రకాశాలోకమున సుఖానుభవము కలిగెను. అందఱు ఆయనయొక్క భగవత్త్వమునే దర్శించిరి. కాని అందఱియొక్క యిష్ట దేవతలు భిన్నభిన్నములగుటచే నొకే భగవంతుఁడు వారికి భిన్నభిన్న రూపములుగఁ గనఁబడెను.

అందఱును ప్రభు శరీరమందు తమతమ యిష్టదేవతా స్వరూపమును గాంచెను.

అందఱికంటె ముందు ప్రభువు శ్రీవాస పండితుని మీఁదఁ గృప చూపెను. అతఁడు శ్రీవాస పండితుని సంబోధించుచు 'శ్రీవాసా! నీవు నాకు కృపాపాత్రుఁడవు. నేనెల్లప్పుడును నిన్ను కనిపెట్టి యుండెదను. దేవానంద పండితుని వద్ద నీవు చాలమంది యితర శిష్యులతోఁగూడి శ్రీమద్భాగవత పాఠమును వినుచుండుటను నే నెఱుఁగుదును. పాఠమును వినుచు వినుచు నీవు మధ్యలోనే భావావేశములోనికి వచ్చి మూర్ఛితుఁడవైతివి. ఆ సమయమున నీ భావావేశమును పండితుల వారుగాని శిష్యులుగాని తెలిసికొనలేక పోయిరి. శిష్యులు నిన్ను భుజములమీఁద మోసికొనిపోయి మీయింటికిఁ జేర్చిరి. ఆ సమయమున నేనే నిన్ను స్వగృహాలోనికిఁ దెచ్చితిని. నేనే నీ మూర్ఛను భంగము కావించితిని' అనెను.

ప్రభువువారి ముఖతః తన యీ రహస్య సంఘటనమును విని శ్రీవాస పండితునకుఁ బరమాశ్చర్యము కలిగెను. అతఁ డీ సంఘటనమును నెవరి సమ్ముఖముననను ప్రకటించలేదు. తర్వాత ప్రభువద్వైతాచార్యులను జూచి 'ఆచార్యా! నీకీ క్రింది భగవద్గీతా శ్లోకము విషయమున శంక కలిగిన ఆదినము విషయము నీకు జ్ఞాపకమున్నదా?

శ్లో॥ సర్వతః పాణి పాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥
గీత. ౧౩-౧౩.

నీ వా దినమున భోజనము చేయకయే నిద్రపోతివి. అంత నేనే 'పాణిపాదం తత్' స్థానమున 'పాణి పాదాన్తః'యను నీప్రకృత పాఠమును జెప్పి నీకు శంకా నివారణ గావించితిని' అనెను.

ఈ విషయమును విని యాచార్యుఁడు ప్రభు చరణములను పునః పునః ప్రణామములు కావించెను. అప్పుడు భక్తులు భగవదావేశములో నాసనముపైఁ గూర్చుండిన ప్రభువునకు సంధ్యాహారతి నీయ యోచించిరి. ఒక గొప్ప హారతి నలంకరించిరి. భక్తులు తమ హస్తములతో శంఖములు, గంటలు, జాగంటలు మొదలైన యనేక వివిధ వాద్యములను వాయించిరి. శ్రీవాస పండితుఁడు శచీమాతయొక్క చేతికి హారతి నిచ్చి యామెకు హారతి నీయుఁడని చెప్పెను. శ్రీవాసుని భార్యాసహాయముతో వృద్ధమాత తన కంపిత హస్తములతోఁ ప్రభువునకు హారతి నొసంగెను. ఆ సమయమున భక్తులందఱును నానందోన్మత్తులై వాద్యములను వాయించుచుండిరి. ఎట్టులో ఒకటుల హారతి సమాప్తమయ్యెను. శ్రీవాస పండితుఁడు శచీమాతను ఇంటికి పంపివేసెను. ఇప్పుడు భక్తులందఱకు వరదానము చేయు సమయము వచ్చెను. ప్రభువుగారి అంతరంగ భక్తులందఱు నా సమయమున నక్కడుండిరి. కాని యాతని పరమ ప్రియ భక్తుఁడు శ్రీధరుఁ డచ్చట లేఁడు.

భక్త శ్రీధరుఁడు పాఠకులకు పరిచయమయియే యుండవచ్చును. ఈతఁడు అరఁటి యూచ తమలపాకులు అమ్మినటువంటి యదృష్టవంతుఁడగు భక్తుఁడు. ఈతనినే ప్రభు వెల్లప్పుడును నెగతాళి పట్టించుచు, గడియయో రెండు గడయలో పోట్లాడి సగము ఖరీదుకు అరఁటి యూచను దీసికొని పోయెడువాఁడు. అరఁటి బోదెలో ఆఖరు పొరకావల లావుపాటి కఱ్ఱవలె నుండు దానిని బంగాళా దేశములో ఊచ యందురు. బంగాళా దేశములో దానితో కూరవండుదురు. ప్రభువారి భోజనములో శ్రీధరుని అరఁటి ఊచలేకపోయెనా మిగిలిన పదార్థము లాయనకు రుచించెడివి కావు. అరఁటి బోదెపై నుండు కోమలములగు పొత్తులను కోసి వాటిని పళ్లెరములవలె విస్తళ్లు కుట్టికూడ బీద దుకాణదారు లమ్ముచుందురు. వాటిలోఁ బూజా సామగ్రి పెట్టుకొని పూజకు తీసికొని పోవుటకు స్త్రీపురుషు లుపయోగింతురు. శ్రీధరుఁడు కూడ ఈ వస్తువులనే అమ్మి తన జీవితమును గడుపుకొనుచుండెడు వాఁడు. ఈ యాదాయములో సగభాగము దేవపూజకు గంగాపూజకు వినియోగపఱచి మిగిలినదానితో నెట్లోయొకట్లు జీవన నిర్వాహము చేసికొనుచుండెను. రాత్రింబవళ్ళితఁడుచ్చైస్వరమున హరినామ కీర్తనము చేయుచుండును. అందువలన నీతని యిరుగుపొరుగు వారీతని జూచిన కోపము చెందుదురు. 'ఈ ముసలవాఁడు రాత్రిళ్ళెవరిని నిద్రపోనీయఁ' డని అనుకొనుచుందురు. ఈ దరిద్రదుకాణదారు నందఱుపేక్ష చేయుచుం

దుఁడు. ఈతనిని భక్తుఁడని యెవ్వరుననరు, కాని ప్రభువున కీతనియందు హృదయ పూర్వకమగు ప్రేమ కలదు. ఆతఁ డీతని భగవద్భక్తి నెఱుఁగును. అందువలన నాతఁడు భగవ ద్భావములోఁ గూడ ఈతనిని స్మరించెను.

శ్రీధరుని యిల్లు చాల దూరమున నగరమునకు వేఱొక మూలనునుండెను. వినుటతోడనే యెనమండుగురు భక్తులు పరులిడిరి. ఆ సమయమున శ్రీధరుఁడానందమునఁ బడియుండి శ్రీహరి మధురనామములను సంకీర్తన చేయు చుండెను. వీరు వెళ్ళి తలుపు తట్టిరి. 'శ్రీకృష్ణ గోవింద హరే మురారే, హేనాథ నారాయణ వాసుదేవ' యనుచునే 'ఎవరు వారు' అని పలికెను.

'తలుపు తెఱువుము. ఎవరో నీకే తెలియఁగలదు. ముందు త్వరగా తలుపు తెఱువుము' అని భక్తులు త్వరగా ననిరి.

ఇది విని శ్రీధరుఁడు తలుపును దెఱచి మిక్కిలి నమ్రతా పూర్వకముగ భక్తులు వచ్చిన కారణము నడిగెను. 'ప్రభువు నిన్ను స్మరించినాఁడు. త్వరగా బయలు దేరండి' అని భక్తులు త్వరగా ననిరి.

ఈ దీనహీన దరిద్రుని ప్రభువు స్మరించి నాఁడని విను నప్పటికి శ్రీధరుఁడు ప్రేమచే శరీరమును మఱచెను. ఆతఁ డాహా యని ఒక్కసారిగా తటుక్కున భూమిపైఁ బడిపోయెను.

ఆతనికి శరీరస్పృహా లేనేలేదు. ఇదేమి క్రొత్త అపస్తు వచ్చి నదే అయినను ప్రభువాజ్ఞను నెఱవేర్చవలెనని యోచించి భక్తులు మూర్ఛితుఁడగు శ్రీధరుని తమ భుజములమీఁద కెత్తుకొని, ఆ స్థితిలో ప్రభువు దగ్గఱకు తీసికొని వచ్చిరి. ఇంత వఱకు శ్రీధరుఁ డచైతన్య స్థితిలోనే యుండెను. ఇంతలోనే ప్రభువు తన కోమల కరకమలములచే నాతని స్పర్శించెను. ప్రభువువారి స్పర్శ తగులు నప్పటికి శ్రీధరుఁడు చైతన్యుఁ డయ్యెను. శ్రీధరుఁడు చైతన్యము లోనికి వచ్చుటను గాంచి ప్రభువాతనితో 'శ్రీధరా! నీవు నా రూపమును దర్శించుము. ఇన్ని దినములనుండి నీకున్న మనోవాంఛ నెఱవేఱినది' అనెను. శ్రీధరుఁ డేడ్చుచు నేడ్చుచు ప్రభువు వారి తేజోమయ రూపమును దర్శించెను. అంతఁ బ్రభు వారాతని స్తుతింప నాజ్ఞాపించెను.

శ్రీధరుఁడు చేతులు జోడించుచు గద్గదకంఠముతో 'నేను దీనహీనుఁ పతితుఁడను. హీనకృతుఁడనగు నధమ పురుషుఁడను. అట్టి వాఁడను నేనెట్లు ప్రభువును స్తుతింపఁ గలుగుదును ? ప్రభో! నేను గొప్ప అపరాధిని. మీ యథార్థ మహిమను దెలిసికొనలేక నేను సదా మీతో పోట్లాడు చుండితిని. మీరు నాకు మాటి మాటికిఁ దెలియఁజెప్పు చుంటిరి గాని మాయాజాలములోఁబడిన నావంటి యజ్ఞాని మీగూఢ రహస్యమును సరిగా నెట్లు తెలిసికొనఁజాలను? నేఁడు మీ యథార్థ స్వరూప దర్శనమగుటచే నాయజ్ఞానాంధకారము

పటాపంచలైనది. నేను ప్రభువువారిని నాసమస్త అపరాధము లను క్షమించవలయునని కోరుచున్నాను' అనెను.

ప్రభువు గద్గద కంఠముతో 'శ్రీధరా ! నేను నీయెడల మిక్కిలి సంతుష్టుఁడనైతిని. నీవిప్పుడు నీయిష్టము వచ్చిన వరము నడుగుము. బుద్ధి, సిద్ధి, ధనము, సంపద, ప్రభుత్వము ఇవేకాదు నీకేది కావలెనన్న దానినే కోరుకొనుము. చెప్పుము, నీకేమి కావలయునో' అనెను.

చేతులు జోడించుచు నత్యంత దీనభావముతో గద్గద కంఠస్వరముతో శ్రీధరుఁడు 'ప్రభో ! నాకు లభించని దేది ? లోకమంతయు నన్నుపేక్షించుచున్నది. నేనడిగినను నన్ను దరిద్రునిగ భావించి ప్రజలు నా విషయమున నవహేలనము గావించుచున్నారు. అట్టి తుచ్ఛ దరిద్రుని మీరనుగ్రహించి పిలిచి మీయొక్క దేవదుర్లభమగు దర్శనమిచ్చి నన్నుఁ గృతార్థుని గావించితిరి. ఇంక నిప్పుడు నాకేమి కావలయును ? బుద్ధి సిద్ధులను బొంది నేనేమి చేయుదును ? అదియు నొక విధమగు పెద్ద మాయయే.

ప్రభువు బలవంతముచేయుచు 'కాదు కొంచెము వర మడిగి తీరవలెను. బుద్ధి సిద్ధులక్కఱ లేకున్న నీకేది ప్రియమైన దానినే కోరుకొనుము' అనెను.

శ్రీధరుఁడదే దీనతా స్వరమున 'ప్రభువు వారేదైన నీయఁదలఁచిన యెడలనే బ్రాహ్మణ కుమారుఁడు నాదగ్గఱను

అరఁటి ఊచ గొనవచ్చి పోట్లాడిపోవుచుండెడువాఁడో అట్టివాఁడెల్లప్పుడు నా హృదయములో నుండునట్లు వరమీయవలె' ననెను.

శ్రీధరుని యీ నిష్కించనతకు, నిఃస్పృహకు ప్రభువు పరమ ప్రసన్న మయ్యెను. శ్రీధరుఁడు భగవానుని మురళీ మనోహరరూపోపాసకుఁడు. అతఁడు భగవానుని 'శ్రీకృష్ణ గోవింద హరేమురారే, హేనాథ నారాయణ వాసుదేవ' అను మధుర నామముల నెల్లప్పుడు సంకీర్తించుచుండువాఁడు. అందు వలన వానికి ప్రభువు శ్రీకృష్ణరూపదర్శన మిప్పించెను. వారి శ్రీవిగ్రహమందు తన యిష్ట దైవమును దర్శించి శ్రీధరుఁడు కృతార్థుఁడయ్యెను. అతఁడు మూర్ఛితుఁడై క్రిందపడఁగా భక్తులాతని గొనిపోయి యొకవైపునఁ బరుండఁబెట్టిరి.

ఇప్పుడు మురారిగుప్త వంతువచ్చెను. మురారి పరమ ధార్మికుఁడు, విశుద్ధవైష్ణవుఁడు. కాని అతనికి తర్కవితర్కము, శాస్త్రార్థము చేయు వ్యసనము కొంచెముండెను. ప్రభువాతనిని సంబోధించుచు 'మురారి! నీవు భక్తుఁడగుటలో నిదియే లోపము. నీవు శుష్క వాదవివాదమును గావించుటను వదలి పెట్టుము. అధ్యాత్మశాస్త్రములలో భక్తిగ్రంథములకే ప్రాధాన్యత నిమ్ము' అనెను.

మురారిగుప్త 'నేను వాదవివాదములను, తర్కవితర్కము లింకెక్కడ చేయుదును? కేవలము విద్వాంసుల సమీపమున నేదైన ప్రసంగము వచ్చినఁ బలుకుదును' అనెను.

'అద్వైతాచార్యునితో నీవు తర్కవితర్కమును జేయవు గదా? ఆయనతో నీవద్వైత వేదాంత విషయములు ప్రసంగింపవుగదా?' అని ప్రభువనెను.

అంత నద్వైతాచార్యుఁడు 'ప్రభో! అద్వైతవేదాంత విషయములు పలుకుట దుష్కార్యమా?' యని ప్రభువు నడిగెను.

ప్రభువు కొంచెముగ నవ్వుచు 'దుష్కార్యమని యెవ రందురు! చాల మంచిదే. కాని భక్తిమార్గావలంబుల కిట్టి సిద్ధులు ప్రక్రియలలోఁ బడినఁ బ్రయోజనమేమి కలదు?' అనెను. ఇట్లనుచుఁ బ్రభువు గంభీర ఘోషముతో నీశ్లోకమును బఠింప మొదలిడెను—

శ్లో॥ న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ ।
న స్వాధ్యాయ స్తపస్త్యాగో యథాభక్తిర్మమోర్జితా ॥
శ్రీమద్భాగవతము ౧౧-౧౪-౨౦.

(ఓ యుద్ధవా? నన్నూర్జితమైన భక్తిచే సాధించినట్లు యోగముగాని, సాంఖ్యముగాని, ధర్మముగాని, స్వాధ్యాయముగాని, తపస్సుగాని, త్యాగముగాని సాధింపఁజాలదు.)

ప్రభుని యొక్క యిట్టి యాజ్ఞను విని మురారిగుప్త మొదలకూరకుండెను. అంతఁ బ్రభువు 'మురారి! నీవు బ్రహ్మసిద్ధికొఱకుఁ బ్రక్రియల నాశ్రయింప నవసరమేమి కలదు? నీ భగవానుఁడు జన్మ సిద్ధుఁడు. నీవు ప్రభువునకు జన్మ జన్మాంతర

ములలో భక్తుఁడవు. హనుమంతునకు వలె నీకు భావము విగ్రహము కలదు. నీవు సాక్షాత్తు హనుమంతుఁడవు. నీరూపమును స్మరించుకొనుము' అనెను.

మురారి రామ భక్తుఁడు. ప్రభువు జ్ఞాపకము చేయు నప్పటికాతఁడు తన యిష్టదేవుని ధ్యానింప మొదలిడెను. తాను సాక్షాత్తు హనుమంతుఁడే యైనట్లును, తన యిష్టదేవుని చరణ సమీపమునఁ గూర్చుండి యాయనను బూజించుచున్నట్లును ఆతనికిఁ దోఁచెను. ఆతఁడు తన కన్నులను దెఱచి తలయెత్తి ప్రభువువైపు చూచెను. ఆతనికి ప్రభు స్వరూపము తన యిష్ట దైవమగు సీతారామస్వరూపముగఁ గనుపించెను. తన యిష్ట దైవమును ప్రభువువారి శ్రీవిగ్రహరూపమున దర్శించి మురారి గద్గద కంఠముతో స్తుతిచేయ మొదలిడెను. మాటిమాటికి భూమిమీఁద దొర్లుచు సాష్టాంగ ప్రణామము చేయ మొదలు పెట్టెను.

ప్రభువు వరము నడుగు మని యాజ్ఞాపింపఁగాఁ జేతులను జోడించుచు మురారి యవిచల శ్రీరామభక్తి కావలెనని ప్రార్థించెను. ఆ ప్రార్థనమునఁ బ్రభువు ఆతని శిరస్సుపై తన పాదపద్మములనుంచి ప్రేమపూర్వకముగ వరప్రదానము కావించెను.

పిమ్మట తర్వాత నొక్కొక్కరుగ భక్తుల కందఱకు వంతువచ్చెను. అద్వైతుఁడు, శ్రీవాసుఁడు, వాసుదేవుఁడు

మొదలైన వారందఱును ప్రభువువారి నహైతుక భక్తి కావలె నని ప్రార్థించిరి. హరిదాసు తాను మిక్కిలి దీనహీన దరిద్రుఁడనియు నధముఁడనియు భావించుచుండెడువాఁడు. అందువలన నాతఁడు ప్రభువు ముందుకు వచ్చుటకు సంకోచించి అందఱి కంటె దూరమున భక్తులకు వెనుక దాగుకొని నక్క కూర్చుండెను. ప్రభువు గంభీర భావముతో 'హరిదాసా! హరిదాసుఁ డెక్కడనున్నాఁడు? వానిని నాముందుకు తీసికొని రండు' అనెను. భక్తులందఱును నలువైపులను హరిదాసుని వెదుక మొదలిడిరి. హరిదాసు అందఱకు వెనుక ముడుచుకొని కూర్చుండి యుండెను. భక్తులాతనిని ప్రభు సమ్ముఖమునకు రమ్మని కోరిరి కాని యాతఁడు ప్రేమలో మునిఁగి స్పృహ లేకుండెను. భక్తులాతనిని లేవఁదీసి ప్రభు సమ్ముఖమునకుఁ దెచ్చిరి. హరిదాసుని సమ్ముఖమునఁ గాంచి ప్రభువాతనితో 'హరిదాసా! నిన్ను నీవు నీచుఁడ ననుకొనకుము. నీవు సర్వ శ్రేష్ఠుఁడవు నాది నీది యొక్కటియే జాతి. నిన్ను స్మరించిన వారలు, నిన్ను ధ్యానించినవారు నాకు పూజచేసినట్లే. నేనెల్ల ప్పుడు నీవెంట నుండెదను. నీవీపుమీఁద బెత్తపు దెబ్బలుపడి నప్పుడుకూడ నేను నీవెంటనే యుంటిని. ఆ బెత్తపుదెబ్బలు నావీపుమీఁద పడుచుండెడివి. చూడుము. నా వీపుమీఁద ఇంకను గుర్తులు పడియున్నవి. నాభక్తులందఱి కష్టములను నేను అనుభవించుచుండెదను. అందువలననే యెంత గొప్ప కష్టము కలిగినప్పటికిని భక్తులు దుఃఖింపరు. కారణ మేమనగా

నఁగా భక్తులకుఁ గష్టమును గలిగించు వారలు నాకు కష్టమును గలుగఁజేసి నట్టులే. కావున నిప్పుడు నేను దుష్టసంహారము చేయను. ఉద్ధారము కావింతును. నీవు నన్ను దుష్ట సంహారము చేయుమని ప్రార్థింపలేదు. కాని వారి బుద్ధిని శుద్ధి కావించవలెననియు, వారికి మేలు చేయువలసిన దనియుఁ బ్రార్థించితివి. కావున నిప్పుడు నేను నాయొక్క సుమధుర నామ సంకీర్తనద్వారా దుష్టుల నుద్ధరింపఁజేసెదను. నా యీ కార్యములో జాతి వర్ణ విచారముగాని, ఉచ్చనీచ విచారము గాని యుండఁబోదు. నా నామసంకీర్తనము నందఱను బావను లఁగావింపఁగలదు. ఇప్పుడు నీవు నీకభీష్టమగు వరమును గోరుము' అనెను.

చేతులు జోడించుచు దీనభావముతో హరిదాసు 'వర దాతలలో శ్రేష్ఠుఁడవగునో దీనదయాళో! ఓ ప్రేమావతారా! నీకు నాకు వరమీయవలెనను కోరిక యుండునెడల, నే నెల్లప్పుడును దీనహీన దరిద్రుఁడుగాను, నిష్కించనుఁడగు నమానిగా నుండునట్లు వర మొసంగుము. నాకు ప్రభువువారి దాసుఁడ నగుటతప్ప వేఱొక యభిమాన మేదియు నుండరాదు. నేనెల్ల ప్పుడు వైష్ణవుల పదధూళిని నా మస్తకము మీఁద పరమ భూషణముగ నెంచుకొనునట్లును, వైష్ణవ చరణములందు నాకెల్లప్పుడును బ్రీతి కలుగునట్లును వరమిమ్ము. ప్రభువువారి నింతకంటె వేఱొక వరదాన మడుగఁదలఁచలేదు' అనెను.

ఈతని యిటువంటి వరయాచనను విని భక్తమండలి నల్దిక్కులను ఆనందధ్వనిని జేయ మొదలిడిరి. అందఱును హరిదాసుని భక్తిభావనను గూర్చి యత్యధికమగు ప్రశంసలు చేయ మొదలిడిరి.

ముకుంద దత్తుకూడ పారకుల కపరిచితుఁడై యుండఁడు. ఆతఁడుకూడ అక్కడనే యుండెను. కాని తనను ప్రభు దర్శనమున కనధికారిగా భావించి దూరముగనే కూర్చుండి యేడ్చుచుండెను. శ్రీవాస పండితుఁడు భయపడుచు భయపడుచు 'ప్రభో! ఈ ముకుందుఁడు నీ కత్యంత ప్రియుఁడు. వీనిపైఁ గూడ కృపయుంచవలయును. ఈతఁడు తనను ప్రభు దర్శనమున కనధికారిగాఁ దలఁచుచున్నాఁ'డని ప్రార్థించెను.

ప్రభువు కొంచెము రోషస్వరముతో గంభీరభావముతో 'ముకుందునిపైఁ గృపకలుగఁజాలదు. ఈతఁడు తనను భక్తుఁడనుకొని ప్రసిద్ధికావించుకొనును, కాని మాటలు మాత్రము తార్కికునికి వలె మాటలాడును. వైష్ణవ లీలలను పండిత సమాజములోఁ గూర్చుండి హాస్యము చేయుచుండును. తాను గొప్ప విద్వాంసుఁడనియు, జ్ఞానియనియు ననుకొనుచుండును. ఈతనికి భగవద్దర్శనము కలుగఁజాలదు' అనెను.

ఏడ్చుచు నేడ్చుచు ముకుందుఁడు శ్రీవాసుని ద్వారా 'నే నెన్నటికిని భగవత్కృప కధికారిని కాదా?' అని యడిగించెను. ఈతఁ డడిగిన మీఁదట శ్రీవాసపండితుఁడు 'ప్రభో!

నే నెప్పటికైనను భగవత్కృపాపాత్రుఁడ నగుదునా ? యని ముకుంద దత్తుఁడడుగుచున్నా' డని యడిగెను.

ప్రభువు కొంచెముగ నుపేక్షా భావముతోఁ బ్రత్యుత్తర మిచ్చుచు 'అవును, కోటిజన్మలైన తర్వాత అధికారి యగును, అనెను. ఇట్లనఁగానే ముకుందుఁడు ఆనందకల్లోలముల మునిఁగి నృత్యముచేయుచు ప్రేమ పులకాంకితుఁడై గద్గద కంఠముతో 'ఎప్పటికైన కలిగినఁ జాలును, ఎప్పటికైనఁ గలిగినఁజాలును' అని పలుకుచు నృత్యము చేయసాగెను. ఆయన స్వయముగఁ జెప్పుచుండఁ గోటిజన్మలు లెక్కయేమి ! కోటి జన్మములు త్రుటిలో గడచిపోవును. చిరకాలమైనప్పటికిని చివరకు నాకు ప్రభు కృప కలుగఁగలదు. ఎప్పటికైనఁ గలుగుఁగాక భగవత్కృప కలుగవలెను' అనెను. ఈతని యిట్టి యానందావస్థను గాంచి భక్తులందఱు నాశ్చర్యపడిరి. వారీతని యిట్టి దృఢ నిష్ఠను గాంచి యవాక్కులైరి. చివరకు ప్రభువీతనికి ప్రేమాలింగన ప్రదానము గావించుచు 'ముకుందా ! నీవు నీ వీ యవిచల నిష్ఠచే నన్నుఁగొని వేసితివి. నిజముగ నీవు పరమ వైష్ణవుఁడవు. నీ యీ దృఢనిష్ఠవలన నా యానందమునకు మేఱ లేదు. నీవు భగవత్కృపకు సర్వశ్రేష్ఠమైన యధికారివి. నీవిట్లు పలికి నాయానందమును లక్షరెట్లు పెంచితివి. ముకుందా ! నీకుగల ధైర్యము, నీకుఁగల యుచ్చ నిష్ఠ సామాన్యులకుండుట దుర్లభము. నీవు భగవత్కృప కధికారివైతివి. నా తేజోమయ రూపమును దర్శింపుము' అనెను. ఇట్లనుచు ప్రభువాతనికి తన

తేజోమయ రూపమును జూపించెను. ముకుందుఁడా యలౌకిక రూపమును దర్శించి మూర్ఛితుఁడై క్రిందపడిపోయెను. అంత భక్తులందరును తమ తమ భావనానుసారముగ శ్యామవర్ణ, మురళీమనోహర, సీతారామ, రాధాకృష్ణ, దేవీ దేవతా రూపములను నితర భగవద్రూపములను ప్రభు శరీరమందు దర్శించిరి.



# భగవద్భావసమాప్తి

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస ॥

గీత. ౧౧-౪౫.

(ఓ దేవేశ! సమస్త జగత్తుకు నాధారమైన వాఁడా! నీ యీ యలౌకికము దివ్యమును, నిదివఱకెన్నఁడును జూడఁబడనిదియు నగు రూపమును గాంచి నేను చాల యానందము చెందితిని. కాని ప్రభో! ఇప్పుడు నామనస్సేల భయవ్యాకులత చెందుచున్నదో తెలియుటలేదు. నీ యీ యసహ్య తేజము నిప్పుడధికముగ సహింపఁజాలను. కావున నో కృపాళో! నా మీఁద ప్రసన్నుఁడవై నీ యాపూర్వ రూపమును నాకు మరలఁ జూపింపుము' అని భగవంతుని విశ్వరూపమును జూచిన తర్వాత అర్జునుఁడు ప్రార్థించెను.)

మానవుఁ డెంతటి భారమును మోయఁగలఁడో, తెలిసినవారు వానిపై నంతటి భారమునే వేయుట లోకనియమము. ఒకవేళ నెవఁడైన నజ్ఞానవశమున నెవని మీఁదనైన వాని శక్తి కిమించి బరువు వేసినచో వాఁడా బరువును మధ్యలోనే పడవేయును లేదా దానివలన మూర్ఛితుఁడై తానే క్రిందపడి పోవును. ఇట్లే భగవంతుఁడును తన సంపూర్ణ తేజమును గాని

ప్రేమనుగాని యెక్కడను ప్రకటింపఁడు. ఎక్కడెట్టి యధికారిని గాంచిన నచ్చట అట్టి తన రూపమును బొందును. భగవంతుని తేజము విషయ మట్లుంచుఁడు. మనుష్యులలో నైనను సదాచారులు, తపస్వులు, కర్మనిష్ఠులు, సంయమ శీలురు, సచ్చరిత్రులు, తేజస్వులయిన వారి దగ్గఱ క్షుద్రప్రకృతిగల అసంయమశీలుఁడు, ఇంద్రియలోలుపులగు పురుషులు చాలకాలము కూర్చుండి మాటలాడఁజాలరు. వారి తేజస్సుముందు వారు చాలసేపు నిలుచుట దుర్ఘటముగ నుండును. ఏదైన విశేష కారణవశమున వాఁడక్కడ నుండుటయే తటస్థించు నెడల నాకాలమంతయు వానికి భారముగఁ దోఁచును. కావున భగవంతునియొక్క యథార్థమగు తేజమును మాయాబద్ధుఁడగు జీవుఁడీ పాంచభౌతికమగు శరీరముతో దర్శింపఁజాలఁడు. వానికి భగవానునియొక్క మాయావిశిష్టమగు తేజమునే చూపించును. కాఁబట్టియే భగవంతుఁడర్జునునికి విశ్వరూపమును జూపినప్పుడుకూడ ఆతఁడడుగఁగా నీకు చూపించిన యీ రూపము కూడ ఒక రకముగ మాయికమేనని సమాధానము చెప్పెను. మాయాబద్ధ జీవుఁడు శుద్ధ స్వరూపము నెట్లు దర్శింపఁగలఁడు? కావున నాతని పూర్ణ తేజము నధిక కాలము సహించుటకు దేవతలకుఁగూడ సాధ్యముకాదు. ఇఁక మానవులొక లెక్కా? భక్తుల హృదయములో నొకరకమైన యపూర్వజ్యోతి నిరంతరము వెలుఁగుచుండును, కాని ప్రత్యక్షముగ వానికిఁగూడ అధిక కాలము భగవంతుని తేజోమయ రూపము సహింపరానిదిగనే యుండును. వారు మధురభావముతో నిరంతరము తమ

ప్రియతమునితో క్రీడించుచుందురు. ఆభావము వేఱు. దానిలో తేజము, ఐశ్వర్యము, మహాత్వముండదు. అదిలేక భక్తుఁడు బ్రదుకనే లేఁడు. ఆ మధురభావమే భక్తులకు సర్వస్వము. ఉత్తను భక్తుఁడైశ్వర్యలేక తేజోమయ రూపమును దర్శింపనే కోరఁడు. భగవదేచ్ఛచే నది స్వతః కలిగినచో నది వేఱు విషయము.

ప్రభువునకు భగవద్భావములో పూర్తిగ నేడుజాములు గడిచినవి. పగలు దాఁటిపోయెను, రాత్రిగూడ దాఁటిపోవు చుండెను. కాని ప్రభువుయొక్క తేజము లేక ఐశ్వర్యములో నేవిధమైన పరివర్తనము కనఁబడుటలేదు. భక్తులు కూర్చున్న వారు కూర్చున్నట్లే యుండిరి. ఎవరును భోజనమునకును బోలేదు, చేరగిలబడి నిద్రయుఁబోలేదు. నల్దిక్కులను ప్రభువు చుట్టు కూర్చుండి యుండిరి. రాత్రిపూర్తి కాఁగానే ప్రభాత సమయమయ్యెను. భక్తులందఱును భయము చెంది నట్లద్వైతా చార్యులు కనిపెట్టెను. వారింక ప్రభువుయొక్క యలౌకిక తేజమును సహింపలేకపోయిరి. అందువలన నాతఁడు శ్రీవాస పండితుని చెవిలో 'మేము సాధారణ సాంసారికులము. ప్రభువు యొక్క యీ యసహ్య తేజమును ఇఁకమీఁద చాలసేపు సహింపలేము. ఏవిధముగానైనను సరియే ప్రభువువారి యీ భావమును శమింపఁజేయు నుపాయము చూడవలెను' అనెను.

శ్రీవాస పండితున కద్వైతాచార్యుని యీ యాలో చన యుక్తియుక్తముగఁ దోఁచెను. వారి వాక్యములను సమ

ర్థించుచు 'అవును, నీవు సరిగాఁ జెప్పితివి. ఈ యైశ్వర్యమయ రూపమున కంటె మాకు గౌరరూపమునందే ప్రీతి. మన మంద ఱము కలిసి 'ప్రభో! ఇప్పుడీ యద్భుత యలౌకిక భావమును సంవరణము చేయుఁడు. మాకు వెనుకటి గౌరరూపముతో దర్శనమి' మ్మని ప్రార్థింతము. శ్రీవాసుని యీమాట అంద ఱకు నచ్చెను. అందఱు చేతులను జోడించి 'ప్రభో! ఇప్పుడు మీయీ యైశ్వర్యము నుపసంహరించుఁడు. ఈ తేజముచే మాబోటి సాంసారిక జీవులు తగులఁబడుదురు. మాలో దీనిని చాలకాలము సహించుశక్తి లేదు. ఇప్పుడు మాకు వెనుకటి యా గౌరరూపమునే చూపింపుఁడు' అని స్తోత్రము చేయ సాగిరి. భక్తులయొక్క యీప్రార్థనమును విని ప్రభువు బిగ్గఱగ నొక హుంకారము చేసెను. హుంకారము చేయుట తోడనే ఒక్కసారిగ మూర్ఛవచ్చెను. మూర్ఛరాఁగానే 'సరే యిఁక నేను వెళ్ళిపోవుదు' ననెను. అంత నచేతనుఁడై సింహాసనము నుండి భూమిమీఁద పడిపోయెను. భక్తులు త్వరత్వరగా పరువిడి వచ్చి లేవఁదీసి ప్రభువు నొక సుందర సింహాసనమునఁ బరుండఁబెట్టిరి. ప్రభువు మూర్ఛితుఁడై యట్లే పడియుండెను. కొంచెమైనను నిటునటు కదలుట మెదలుట లేదు.

ప్రభువు మూర్ఛ చెందుటను గాంచి భక్తు లందఱును వివిధోపచారములు చేయసాగిరి. కొందఱు విసనకఱ్ఱలను దీసి కొని విసరుచుండిరి. సుగంధిత తైలమును, నితర శీతల లేపము లను బ్రభువువారి మస్తకమున లేపనము చేయుచుండిరి కాని

ప్రభువునకు మూర్ఛ తెలియలేదు. ప్రభువును బరీక్ష చేయుట కొఱకు అద్వైతుఁడు, శ్రీవాసుఁడు మొదలగు ప్రముఖ భక్తులు ప్రభువువారి శరీరము నంతను బరీక్షించిరి. ఆతని ముక్కు దగ్గఱ చాలసేపటివఱకు చేతిని బెట్టిరి, కాని శ్వాస ఆడుచున్న జాడయే లేదు. చేతులు, కాళ్లు, శరీరములోని యంగ ప్రత్యంగములు సంజ్ఞాశూన్యము లయ్యెను. ఏ యవయవ మెట్లు వేసిన యట్లే పడియుండెను. ఏవిధమైన చైతన్యమున్న ట్లును దోఁచుటయే లేదు. ప్రభుని యీ స్థితిని గాంచి భక్త లందఱకు చాల భయము వేసెను. 'సరే యిఁక నేను వెళ్ళి పోవుదు' నను వారివాక్యమును మాటి మాటికి స్మరించు చుండిరి. నిజముగ ప్రభువు తమ్ము వదలి వెళ్ళిపోయినాఁడని యందఱును భావించిరి 'అది సరిగాదు, ఆభావము ప్రభువు వారి యైశ్వర్య, తేజములకు సంబంధించిన భావము. మన గౌరహరి కొంచెము సేపటికే చైతన్య లాభమును జెందఁ గలఁడు.' అని చాలమంది పలుకసాగిరి. కాని వారి యనుమా నము సరిగాఁ దోఁచుటలేదు. ప్రాతఃకాలమునుండి ప్రతీక్ష చేయఁగాఁ జేయఁగా మధ్యాహ్నము రెండుజాములయ్యెను. కాని ప్రభు భావములోఁ గొంచెమైనను బరివర్తనము కలుగ లేదు. ఆతఁడట్లే సంజ్ఞాశూన్యుఁడై పడియుండెను.

జ్యేష్ఠమాసము భక్తులు కూర్చుండి కూర్చుండి ముప్పది గంటలు గడిచెను. ప్రభువువారి స్థితిని గాంచి యందఱు వ్యాకులత చెందుచుండిరి అందఱదే భావముతో ప్రభువువారి

చుట్టును గూర్చుండి యుండిరి. వారిలో నెవ్వరును శౌచస్నానములకుఁ బోలేదు. ఆఁకలిదప్పు లెవరికిని తోఁచుటలేదు. అందఱు ప్రభువువారి భావములో నధీనులై మెదలకుండ కూర్చుండి యుండిరి. ఒకవేళ ప్రభువు తెలివికి రాకుండిన యెడల మనముకూడ కూడు నీళ్ళు వదలి ప్రాణత్యాగము చేయవలసినదే నని చాలమంది నిశ్చయించుకొనిరి. ఈ యుద్దేశ్యముచే నేడ్వక మొత్తుకొనకయే ధైర్యముతో ప్రభువునకు నాల్గువైపులఁ గూర్చుండి యుండిరి. క్రిందటి దినము ప్రాతఃకాలమున వేసిన తలుపు లిప్పటికిని అట్లే యుండెను. ఉదయముఁనఁగూడ నెవరును లోపలనుండి బయటకు రానేలేదు ఈ సంఘటన వృత్తాంతము శచీమాతకుఁ గూడ తెలుపరాదని నిశ్చయించుకొనిరి. ఏలననఁగా నక్కడ నున్నవారందఱును తమ తమ ప్రాణములను త్యాగముచేయ నొట్టుపెట్టుకొని కూర్చుండిరి. ఇంతలోనే యొక భక్తుఁడు 'చాల సార్లు ప్రభువు మూర్ఛితుఁడై క్రిందపడినప్పుడు సంకీర్తనము యొక్క సుమధుర ధ్వనిని విని స్పృహలోనికి వచ్చెను. ప్రభువువారిని చైతన్యములోనికిఁ గొనివచ్చుటకు మనమేల సంకీర్తనము చేయరాదు?' అనెను. ఈ యాలోచన అందఱకు నచ్చినది. అంత నందఱును ప్రభువువారి చుట్టును జేరి సంకీర్తన చేయుటకుఁ ప్రారంభించిరి. భక్తులందఱును తమతమ మృదు మధుర కంఠములతో కరుణా మిశ్రిత స్వరముతోఁ దాళయుక్తముగ, సమస్త వాద్యములతో—

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

ఈ మహామంత్రమును సంకీర్తనము చేయ మొదలిడిరి. ప్రాణముల కంటెం బ్రియమైన సంకీర్తనయొక్క నవజీవన సంచారియగు ధ్వనిని విని ప్రభువువారి శరీరమున రోమాంచము కలిగెను. ఇప్పుడు భక్తులయొక్క ఆనందమునకు మేఱయే లేక పోయెను. వారు నామ సంకీర్తనమును వదలి ప్రేమ విహ్వాలులై పదసంకీర్తనము చేయసాగిరి. ప్రభు శరీరమును బరీక్షచేయుటకై మరల పరీక్ష చేయుటకై యద్వైతాచార్యులు వారి ముక్కు దగ్గఱ తన చేతినుంచెను. ఆయనకు శ్వాసలు వచ్చుట పోవుట జరుగుచున్నట్లు ప్రత్యక్షముగం దోంచెను. ఇంతలోనే ప్రభువొక పెద్ద హుంకారమును గావించెను. హుంకారము వినుటతోడనే విషణ్ణ చిత్తులకు భక్త మండలిలో నానంద ప్రవాహము వెల్లువిరిసెను. వారున్మత్త భావముతో పెద్దపెద్ద జయ జయ ధ్వనులు చేయ మొదలిడిరి. ఆకాశవ్యాపకమగు తుముల ధ్వని కారణమున దిక్కులు ఘూర్ణిల్లెను. భక్తుల పదాఘాతములచే భూమి వణఁకసాగెను. వాయువు స్థిరముగ నున్నట్లుండెను. నల్దిక్కులను ఆనందము తప్ప వేఱులేకుండెను. ప్రేమోన్మత్తులై కొందఱు నృత్యము చేయసాగిరి. కొందఱానంద వేగమును సహింపఁజాలక పోవుటచే మూర్ఛితులై క్రిందపడిరి. కొందఱు శంఖములూదిరి. కొందఱు శీతల జలములను గైకొని ప్రభువువారి శ్రీముఖ

మునందు మెల్లమెల్లగా చల్ల మొదలిడిరి. ఈ విధముగ శ్రీ వాసుని యిల్లంతయు నాసమయమున నానందతరంగిత సాగర మయ్యెను. దానిలో భక్తులయొక్క ఆనందమను తరంగము లెగిరి యెగిరి దిక్కులు ఘూర్ణిల్లుచు భీషణ శబ్దములు చేయు చుండెను.

కొంచెము సేపటికే ప్రభువు కన్నులు నులుముకొనుచు నిద్రనుండి లేచిన మనుష్యుని వలె లేచి, తన చుట్టును భక్తులు గుమికూడి యుండుటను, చాలక నభిషేక సామగ్రి పడియుండు టకు గాంచి యాశ్చర్యముతో 'ఉన్నవివి యేమిటి? నేనెక్క డికి వచ్చితిని? మీరంద ఱిచ్చట యేల గుమిగూడితిరి. మీరంద ఱిచ్చట ఈవిధముగ, విచిత్రభావముతో నేల కూర్చుండియుండిరి?' అని యడిగెను.

ప్రభువువారి యీ ప్రశ్నలను విని భక్తులు ఒకరి ముఖ ములనొకరు చూచుకొని చిరునవ్వు నవ్వసాగిరి. ప్రభువువారి యీ ప్రశ్నలకెవరును ప్రత్యుత్తర మీయలేదు. అంతట ప్రభువు శ్రీవాస పండితుని సంబోధించుచు 'పండితులవారు! అసలు విషయమేమియో చెప్పరుగాదా. నేనేమియు చాంచల్య కార్యము చేయలేదుకదా! అచేతనావస్థలో నేనేమియు నప రాధము చేయలేదు గదా! ఇబ్బంది యేమి? సత్యము చెప్ప రేల?' అనెను.

తన నవ్వు నాపుకొనుచు శ్రీవాస పండితుఁడు 'ఇప్పుడు మాకు చెప్పవలసిన దేమియులేదు. బలవంత పెట్టవలదు. ఇచట నెవరును చెప్పువారు లేరు' అనెను.

ప్రభువు ద్విగుణితాశ్చర్యమును ప్రకటించుచు 'ఎట్లు చెప్పించునది, ఎందు చెప్పరు ? విషయ మేమిటి ?' అనెను.

అంత నా విషయమును దాటవేయుచు శ్రీవాసుడు 'ఏమియు లేదు. మీరు సంకీర్తనములో నచేతనులైతిరి. అందువలన మిమ్ములను చైతన్యములోనికి దెచ్చుటకు భక్తులందరును గలిసి కీర్తన చేయుచుండిరి' అనెను.

ఈ విషయమును విని కొంచెము లజ్జితుడై ప్రభువు 'మంచిది, సరియే. మీ కందఱకు నావలన చాల శ్రమ కలిగినది. మీరందఱు నన్ను క్షమించవలెను, చాల కాలము గడచినది. ఇప్పుడు వెళ్ళి స్నాన సంధ్యావందనాదులను నెఱవేర్చుకొనవలెను. ఇంకను ప్రాతఃకాల సంధ్యావందన మింకను కానట్లుగ దోచుచున్నది' అనెను. ఇది విని భక్తులందఱు స్నానసంధ్యాదుల నిమిత్తమై గంగవైపునకు వెడలి పోయిరి.



# ప్రేమోన్మత్త యవధూతపాదోదక పానము

శ్లో॥ వాగ్భిః స్తువంతో మనసా స్మరంత
స్తన్వా నమన్తోఽప్యనిశం న తృప్తాః ।
భక్తాః స్రవన్నేత్ర జలాః సమగ్ర
మాయుర్హరే రేవ సమర్పయంతి ॥

హరి. భ. సు ౧౮-౩౮.

(ఇది ప్రభువుయొక్క ప్రియభక్తులు వారి జీవనము నెట్లు గడుపుదురో, వారి ఆయుష్కాలము నెట్లు వెళ్ళఁబుచ్చెదరో ఆ వర్ణనమును దెలుపు శ్లోకము. 'భగవద్భక్తులు తమ వాక్కులచే నిరంతరము సుమధుర హరినామోచ్చారణము చేయుచుందురు. స్తోత్రములచే శ్రీకృష్ణుని బిరుదావళులను గానము చేయుచుందురు. మనస్సుతో నామురళీ మనోహరుని దివ్య సుందర రూపమును జింతించుచుందురు. శరీరముతో వారికెల్లప్పుడును దండప్రణామములు చేయుచుందురు. వారెల్లప్పుడును వికలులవలెను, నున్మత్తులవలెను, అధీరుల వలెను, అతృప్తుల వలె నుందురు. వారి నేత్రములనుండి సర్వదా ఆనందాశ్రువులు రాలుచుండును. ఈ విధముగ తమ యాయువు నంతను శ్రీహరికి సమర్పింతురు. ఆహా ! అట్టి భక్తులు ధన్యులు.)

భగవద్భక్తి గలిగినవారియొక్కయు, ప్రభుప్రేమచే నున్మత్తులైనవారి యొక్కయు కర్మలన్నియు లోక బాహ్యములగును. ఏదైన యుద్దేశ్యము నెఱవేఱుటకు చేయఁబడు క్రియ

లకు కర్మలందురు. కాని యట్లే నిరుద్దేశ్యముతోఁ జేయఁబడు నవి లీలలనఁబడును. బాలకుల యొక్క సమస్త కార్యము లిట్లే యుండును. వానిలో నింద్రియ జన్య సుఖ స్వార్థముగాని, లేక వేఱొక యుద్దేశ్యముగాని యుండఁజాలదు. భక్తుల కార్యము లన్నియు నిట్లే యుండును. కావున వాటిని కర్మలని పిలువక లీలలని పిలుచుట పూర్వము నుండియు పరిపాటియై పోయినది. సాధారణముగా భక్తుల లీలలు మిక్కిలిగ బాలుర లీలలను బోలి యుండును. లోకలజ్జా భయమున్న చోటను, సేవస్తువు నందైనను నశ్లీలతాకారణమున సేవగింపు కలిగిన చోటను, పరభయమున్న చోటను యథార్థమగు ప్రేమ యుండఁజాలదు. యథార్థ ప్రేమలేనిది విశుద్ధలీలలుండజాలవు. కావున లజా, ఈర్ష్యా భయములు స్వార్థజన్య మోహాద్యోతక భావములు. భక్తులలోను, బాలకులలోను నీ మూఁడు భావములుండవు. అట్లు లేనప్పుడే వారి హృదయము విశుద్ధమైనదని చెప్ప వచ్చును.

ప్రేమోన్మత్తుఁడగు భక్తుఁ డొక్కొక్కప్పుడు నవ్వును, ఒక్కొక్కప్పుడేడ్చును, మఱొక్కప్పుడు పాడును. వేఱొ క్కప్పుడు ప్రాపంచిక సంబంధమగు లోకలజ్జను వదలి దిగంబర వేషముతో తాండవ నృత్యము గావించును. వాని నడక విచిత్రముగ నుండును. ఆతఁడు విలక్షణ భావముతో నవ్వును. వాని చేష్టలలో నున్మాదము గానుండును. వాని భాషణములో నిరర్థకత యుండును, వాని భాష సాంసారిక భాషకు భిన్న

ముగ నుండును. ఆతఁడు బాలకులవలె నందఱను ప్రేమించును. వాని కెవనిని జూచినను భయముండదు. దేనికిని లజ్జయుండదు. దిగంబరిగానున్నను,వస్త్రము ధరించినను నొక్కటే. వానికి బాహ్యవస్త్రము లవసరములేదు. ఆతఁడు ప్రాపంచిక సంబంధమగు విధి నిషేధములకు బానిసకాఁడు. అవధూతయగు నిత్యానందుని స్థితియు నిట్టిదే. ముప్పది రెండేండ్లవాఁడై నప్పటికిని యాతఁడింకను బాల్య భావములోనే యుండును. మాలతీదేవియొక్క శుష్క స్తనములను నోటఁబెట్టుకొని పిల్లలవలె చీఁకును. తన చేతితో నన్నమును దినఁడు. చిన్న చిన్న విషయములందును గోపము తెచ్చుకొనును. మఱల నాక్షణముననే బాలురవలె నవ్వ ప్రారంభించును. శ్రీవాసుని 'నాయనా'యని పిలుచును. ఆయన దగ్గఱ పిల్లలవలె హఠము గావించును. గౌరాంగుఁడీతనిని మాటిమాటికి మందలించును, కాని యీతఁ డెవరిమాటను విననేవినఁడు. సర్వదా ప్రేమవారుణీపానము గావించి యీమత్తులోనే యొడలు తెలియక యుండును. శరీర స్పృహయే లేదు. వస్త్రము జారిపోయినది. దానిని మరల తీసుకొనవలెనను స్పృహకూడ లేదు. మొండి మొలయైనను, నా మొండిమొలతోనే బజారులోఁ దిరుగుచుండును. ఆటలాడుట మొదలిడెనా గంటలకొలఁది అదేఆట. ఒక్కొక్కప్పుడు బాలకులతో నాటలాడును, ఒక్కొక్కప్పుడు భక్తులతోఁ క్రీడించును. ఒక్కొక్కప్పుడు గౌరాంగుని గూడ తన బాలకౌతూహలముచే సుఖుని గావించును. ఒక్కొక్కప్పుడు

మాలతీదేవికి వాత్సల్య సుఖమును గలిగించును. ఈ విధముగా నాతఁ డందఱను తనయొక్క సరళత, నిష్కపటత, సహృదయత, బాల చపలతా కారణమున నానందితులఁగావించు చుండును.

ఒక దినమున నీతఁడు శ్రీవాస పండితుని యింటి యావరణములో నిలుచుండియే యేదియో తినుచుండెను. ఇంతలోనే ఒక కాకి వచ్చి స్వామికి దీపారాధన చేసిన నేతి దీపపాత్ర నెత్తికొని పోయెను. దీనివలన మాలతీదేవికి చాల దుఃఖము కలిగెను. తల్లి దుఃఖించుటను గాంచి యీతఁడు బాలకులవలె మాటిమాటికి కాకికి రొట్టె ముక్కను జూపించుచు పిలుచుచుండెను. మాటిమాటికి కాకిని లాలనగాఁ బిలుచుచు గాయన స్వరములో శిరస్సు నూగించుచు నిట్లను చుండెను—

కాకమ్మా నీవిటు రావే
కమ్మని మిఠాయిని తినిపోవే ।
నాకా ప్రమిదను నిటు తేవే
నీవీ ముక్కను కొని పోవే ॥
అమ్మ యేడ్చుచు కూర్చుందే
అశ్రువులను దా రాల్చిందే ।
అమ్మకు ధైర్యం బిచ్చి పోవే
కాకమ్మా నీవిటు రావే ॥

కమ్మని మిఠాయి తినిపోవే
కాకమ్మా నీవిటు రావే ॥

నిజముగానే యీతని మాటను విని కాకి త్వరగా పరుగెత్తుకొని వచ్చి యీ యిత్తడి పాత్రను ఈతని సమీపమునఁ బడవేసెను, తల్లికీ కారణమునఁ జాల యానందము కలిగెను. ఆమె యీతనియం దీశ్వర భావము ననుభవించెను. అంత నాతఁడు చాల బిగ్గఱగా పకపక నవ్వి, చప్పట్లు చఱచుచు నిట్లనెను—

కాకమ్మా యిదె నా చెల్లి
నాకును నీవౌదువు తల్లి ।
నాకీ గారాబము చెల్లి
నీకగునే ముద్దుల బుల్లి ॥

నేను పాత్రను తెప్పించితినే
త్వరగా దానిని యిప్పించితినే ।
కావున నొకజత మిఠాయి లడ్డూ
మాకిపుడీవే నీకేమడ్డూ ॥

తల్లి కీతని యీ బాల్య చాపల్యముచే మిక్కిలి యానందము కలిగెను. ఇప్పు డాతఁడు త్వరగా యింటినుంచి బయటకు బయలు దేరెను. బజారులో పిచ్చివానివలెఁ బరువెత్తు చుండెను, ఆతనికి శరీర స్పృహ లేదు. దారి డొంక స్పృహయు లేదు. ఎక్కడినుండి వెళ్లుచున్నదియు, నెక్కడికి

వెళ్ళుచున్నదియుఁగూడ తెలియుటలేదు. బజారునఁ బరువెత్తు చుండఁగా గోచీయూడిపోయెను. దానిని తొందరలో తలకు చుట్టుకొనెను. ఇప్పుడు దిసమొలతో దిగంబరుఁడగు శివుని వలె తాండవ నృత్యము చేయ మొదలిడెను. బజారులో నీతని వెంటఁ పిల్లలు చప్పట్లు చఱచుచు పరులిడుచుండిరి. కాని యాతఁడు వేటిని లెక్క చేయలేదు పెద్దగ గంతుచుండెను. ఈ విధముగ పూర్తిగ దిగంబరియై యాతఁడు ప్రభుని యింటికి చేరెను. ప్రభు లీ సమయమున తన ప్రాణేశ్వరి యను విష్ణు ప్రియాదేవితోఁ గూర్చుండి కొంచెముగ ప్రేమాలాపములు చేయుచుండెను. విష్ణుప్రియ మెల్లమెల్లగా తమలపాకులు ముడిచి యిచ్చుచుండెను. ప్రభువు ఆమెను సంతోషపెట్టుటకై మాటలాడకుండ తినుచుండెను. ఆయన యెన్ని ఆకులు నమిలి నాఁడో విష్ణుప్రియకు అంతులేదు. ప్రభువున కంతులేదు. తమలపాకులు నిమిత్తమాత్రము. నిజమున కప్పుడు తిను చున్నవి ప్రేమతాంబూలము. ఇంతలోనే ఆదిసమొల యున్మత్త అవధూత అక్కడకు చేరెను. కన్ను లెఱ్ఱబాఱి యుండెను. శరీరమంతయు ధూళిధూసరితమయ్యెను. గోచీ తలకు చుట్టఁబడి యుండెను. శరీరము చాల పొడుగుపాటి దగుటచే దిగంబర వేషములో నీతఁడు దూరమునుండి దేవునివలెఁ గనఁబడు చుండెను. ప్రభువు దగ్గఱకు వచ్చునప్పటి కీతఁడు పిచ్చివాని వలె హూఁ హూఁ యన మొదలిడెను. విష్ణుప్రియాదేవి యాతఁడు దిగంబరుఁడగుటను గాంచి వేగముగ నింటిలోనికి

పరువిడిపోయి తలుపులు వేసికొనెను. శచీమాత లోపలఁ గూర్చుండి రాట్నము త్రిప్పుచుండెను. తన కోడలిట్లు వేగముగ లోపలికి పరుగెత్తుకొని వచ్చుటనుగాంచి యామె త్వరగా 'ఏమేమి? ఏమైనది' అని అడిగెను.

విష్ణుప్రియాదేవి నోట గుడ్డ పెట్టుకొని నవ్వుచుండెను. నిమాయి యేదియో కొంచెము సరసము లాడియుండ వచ్చునని మాత భావించెను. అందువలన నామె 'నిమాయి యిక్కడ నున్నాఁడా? లేక బయటకు వెళ్ళిపోయినాఁడా?' అని అడిగెను.

తన నవ్వు నాపుకొనుచు వెక్కిళ్ళతో రొప్పుచు విష్ణుప్రియాదేవి 'మీ పెద్ద కొడుకును జూడండి. నేఁడాయన నిజముగ అవధూత యైనాఁడు.' అనెను. ఇది విని తల్లి బయటకుపోయి, నిత్యానందుని యీవిధమగు బాలక్రీడను గాంచి నవ్వ మొదలిడెను.

ప్రభువు నిత్యానందునితో '(శ్రీ)పాదా! నేఁడు నీవు చేయు పనియేమిటి? అతి చాంచల్యము పనికిరాదు. త్వరగా గోచీ పెట్టుకొనుము.' అని అడిగెను. కాని అతని కేమైన గోచీ గుర్తు ఉండినగదా! పెట్టుకొనుటకు, గోచీ యెక్కడ నున్నదో, దాని నెక్కడ పెట్టుకొనవలయునో అతనికి గుర్తు లేనేలేదు. ప్రభు వాతని యీ స్థితిని గాంచి వెంటనే తన పట్టువస్త్రమును దీసి అతని నడుమునకుఁ దానే స్వయముగఁ జుట్టెను. అంతఁజేయి పట్టుకొని తన దగ్గఱఁ గూర్చుండఁ

బెట్టుకొని మెల్లమెల్లగా 'శ్రీపాదా! ఎక్కడ నుండి వచ్చు చున్నావు? నీకేమైనది? ఈధూళి శరీరమందంతట నేల యంటుకొనినది?' అని యడిగెను.

శ్రీపాదుఁడు తన్మయుఁడయ్యెను. ఆతనికి శరీరస్పృహ యెక్కడిది? ఆతఁడు నల్దిక్కులను జూచుచు పిచ్చివాని వలె 'హుఁ హుఁ' అను చుండెను. ప్రభు వీతని యీ యుచ్చ ప్రేమావస్థను గాంచి యత్యంత ప్రసన్నుఁడయ్యెను. ఆసమ యముననే ఆతఁడు భక్తులనందఱను బిలిపించెను. భక్తులంద ఱును వచ్చి నిత్యానందునకు నాల్గువైపులను గూర్చుండిరి. ప్రభువు నిత్యానందునితోఁ 'శ్రీపాదా! మీగోచీని ప్రసాద రూపముగ నాకు ప్రసాదింపుఁ' డని ప్రార్థించెను. నిత్యానం దుఁడు వెంటనే తలకు చుట్టుకొనిన గోచీని తీసిపారవేసెను. ప్రభువా గోచీని యత్యంత భక్తిభావముతో శిరస్సున ధరించి, తర్వాత దానిని చిన్నచిన్న తుంపులను చాలచేసెను. భక్తు లందఱకు నొక్కొక్క ముక్క నిచ్చుచుఁ బ్రభువు 'ఈ ప్రసాద రూపమగు పేలికను మీరందఱు చాల సురక్షితముగ నుంచు కొనవలెను.' అనెను. ప్రభువు వారి యాజ్ఞను శిరసావహించి యందఱును నా ప్రసాదరూపమగు పేలికను కంఠమునకు జుట్టి కట్టిరి. కొందఱు దానిని శిరస్సున నుంచుకొనిరి.

తర్వాత ప్రభువు నిత్యానందుని పాదపాదపద్మములందు స్వయముగ సుగంధిత చందనమును లేపనము గావించెను. పుష్పములచేఁ బూజించెను. ఆతని చరణములను దన చేతు

లతోఁ గడిగెను. నిత్యానందుని పాదోదకమును భక్తుల కందఱకును బంచిపెట్టెను. అందఱును మిక్కిలి శ్రద్ధాభక్తులతో వానిని పానము గావించెను. మిగిలిన దంతయు ప్రభువు పానము గావించెను. అట్లు పానము గావించుచు 'నేఁడు మనము కృతకృత్యులమైతిమి. నేఁడు మనజన్మ సఫలమైనది. నేఁడు మనకు యథార్థమగు కృష్ణభక్తి ప్రాప్తించెను. శ్రీపాదుని చరణామృతపానముచే మనము ధన్యులమైతిమి' అనెను.

ఈ విధముగ భక్తులందఱును తమ తమ యదృష్టములను బొగడుకొనిరి. భాగ్యమును బొగడుకొనవలయును. భగవానుని యథార్థపూజ నేఁడు నెఱవేఱినది. తన భక్తులను బూజించుటలో సంతసించినట్లు తన పూజ చేసిన నంతగా సంతసింపఁడు. కేవలము నా భక్తులు భక్తులుగారు. యథార్థముగ నా భక్తులకు భక్తుఁడే నిజమగు భక్తుఁడని భగవంతుఁడు స్వయముగ చెప్పనే చెప్పినాఁడు.

శ్లో॥ యే మే భక్తజనాః పార్థ న మే భక్తాశ్చ తే జనాః।
మద్భక్తానాంచ యే భక్తా స్తే మే భక్తతమామతాః॥
ఆదిపురాణము.

('ఓ పార్థ! నా భక్తులు భక్తులు గారు. నా భక్తులకు భక్తులెవరో వారే సర్వోత్తమ భక్తులు' అని భగవానుఁ డర్జునునకుఁ జెప్పినాఁడు.)

ఏలననఁగా భగవంతునకు భక్తులే యత్యంత ప్రియులు. అతని ప్రియజనముల నవహేళనము గావించి కేవల మాతని

పూజనము చేయువారు ఆయనకు ప్రీతిపాత్రు లెట్లు కాఁగలరు? కావున నన్ని యారాధనములకంటె విష్ణు భగవానుని యారాధనము సర్వశ్రేష్ఠమైనది. కాని విష్ణు భగవానుని యారాధనముకంటె శ్రేష్ఠమైనది విష్ణు భక్తులయొక్క అరాధనము.♦

భగవద్భక్తుల మహిమను ప్రకాశింపఁజేయుటకే ప్రభువీ లీలను గావించెను. భక్తులందఱకును నిత్యానందుని పాదోదక పానముచే నొక విధమైన యాంతరిక శాంతి కలిగెను.

ఇప్పుడు నితాయికి కొంచెము కొంచెముగ స్పృహ వచ్చెను. ఆతఁడు బాలకులవలె నల్దిక్కులఁజూచుచు శచీమాతతో దీనతతో పిల్లవానివలె 'అమ్మా, ఆఁకలి మండిపోవుచున్నది. తినుటకేదైన పెట్టుము' అడిగెను. శచీమాత యిది విని త్వరగా లోపలకుఁబోయి, యింటిలోఁ దయారుచేసిన మిఠాయిని దెచ్చి యీతని చేతిలోఁ బెట్టెను. ఈతఁడు బాలకునివలె త్వరత్వరగా కొంచెము తిని కొంచెము నేల మీఁద పాఱవేయుచుండెను. తినుచునే యీతఁడు తల్లి పాదములను బట్టుకొనుటకుఁ బరువెత్తెను. తల్లి భయపడి గబగబ లోపల దూరెను. ఈవిధముగా నాదినమున నిత్యానందుఁడు తన యద్భుతలీలలచే నందఱను నానందితులఁ గావించెను.

---

♦శ్లో॥ ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరమ్ ।
తస్మాత్ పరతరం దేవి ! తదీయానాం సమర్చనమ్ ॥
పద్మపురాణము.

# ఇంటింట హరినామ ప్రచారము

శ్లో॥ హరేర్నామ హరేర్నామ
హరేర్నామైవ కేవలమ్ ।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ
నాస్త్యేవ గతి రన్యథా ॥

బృహన్నారదీయపురాణము ౩౮-౧౨౬.

(కలియుగములోఁ గేవలము హరినామమే ముముక్షువులకు హరి నామమే సంసార సాగరమును దాటించుటకు అత్యుత్తమ సాధనము. ఈ కలియుగములో నిది తప్ప వేఱొక గతి లేనే లేదు, లేనే లేదు. ముముక్షువులకు లేనే లేదు.)

కృతయుగములో సాధారణముగ నందఱును ధర్మాత్ము లగువారే యుండిరి. ధర్మముండుటచే సకాలమున వర్షములు కురియుచుండెడివి, యోగక్షేమముల చింత అసలే లేకుండెడిది. దేశకాలములందును, ఖాద్య పదార్థములందును బూర్ణముగ విశుద్ధత యుండెడిది. అప్పుడున్న వారికి ధ్యానము ప్రధాన ముగ నుండెడిది. కృతయుగములో ప్రభుప్రాప్తికి ముఖ్య సాధనము ధ్యానముగానే యెంచఁబడుచుండెడిది. త్రేతాయుగ ములో భోగసామగ్రి అధికముగ నుండెడిది. కావునఁ బూర్తి ద్రవ్యమును వెచ్చించి యా కాలమున గొప్ప గొప్ప యజ్ఞ యాగములు చేయు వాడుక కలదు. ఆ కాలమున భగవ త్ప్రాప్తికి ముఖ్యసాధనము యజ్ఞము చేయుటే యని యెన్నఁ

బడు చుండెడిది. సకామముతోడను, నిష్కామము తోడను ద్విజాతులు యథాశక్తి యజ్ఞయాగాదులు చేయుచుండెడు వారు. ద్వాపరయుగములో భోగ సామగ్రి తగ్గిపోయినది. జనులయొక్క భావనలంత విశుద్ధములుగ లేవు. దేశకాలము లందును, ఖాద్య పదార్థములందును పవిత్రతా సందేహము కలుగ మొదలిడెను. ఆ కారణమున నాకాలమునఁ బ్రధాన సాధనము భగవత్పూజనము, ఆచార విచారముగ వెన్నఁబడు చుండెడిది. కలియుగములోఁ బర్యాప్తముగ నందఱకు భోగ సామగ్రియు లేదు, అన్యయుగములలో వలె ఖాద్యపదార్థము లెక్కువగను లేవు. పవిత్ర స్థానములు దుర్మార్గుల నివాసముచే దూషితము లయ్యెను. ధర్మస్థానములు కలహాలయము లయ్యెను. ప్రజల హృదయములనుండి ధర్మమునందు ప్రీతి తొలఁగిపోవు చుండెను. ప్రజలయొక్క యధర్మ భావములచే వాయుమండలము దూషితమయ్యెను. వాయుమండలము దూషితమగుటచే దేశములనుండి పవిత్రత పాఱిపోయెను. కాలము విపరీతమయ్యెను, సత్పురుషులు, సచ్ఛాస్త్రములు, సత్సంగము సర్వత్ర అభావముగ నయ్యెను. ఇట్టి ఘోర సమయమున బాగుగా ధ్యానము, యజ్ఞయాగాదులు, పూజా పాఠములు జరుగుట అందఱకు చాల కష్టముగఁ దోఁచెను. ఈయుగమున కొక్క భగవన్నామమే ముఖ్యమైనది పైనఁ జెప్పిన ధార్మిక కార్యములను పవిత్రతతో, సన్నిష్ఠతో చేయఁ గలవారు చేయవచ్చును, కాని సర్వసాధారణులకు సులభము,

సరళము, సర్వశ్రేష్ఠమగు సాధనము భగవన్నామమే. భగవన్నామమును శరణు చెందియే కలియుగములోని మానవులు సులభముగ భగవత్ప్రాప్తి వైపునకగ్రసరులు కాఁగలరు. ♦ కావున కలియుగములోని సంతమహాత్ములందఱును నామమునే యెక్కువగ బలపఱచిరి. మహాప్రభువు నామావతారమే. ఇంతవఱకాతఁడు భక్తులతో నేకాంతముగ శ్రీవాసునింట సంకీర్తన చేయుచుండెను. ఇఁక నిప్పుడందఱకు హరినామమును బంచుటకు నిశ్చయపఱచుకొనెను.

ప్రచారకార్యము త్యాగులగు మహానుభావులు మాత్రమే చేయఁగలుగుదురు. భక్తిభావమునకు, భజన పూజనములకు నందఱు నధికారులే, కాని ప్రజలకు అట్లు చేయుటకు శిక్షణ నిచ్చుటయే త్యాగుల పని. ఉపదేశకులు లేక నాయకులే త్యాగులగుచుందురు. భగవంతుఁడగు బుద్ధుఁడు రాజయ్యు ధర్మసంగఠనము చేయఁగలిగెను. శంకరాచార్యులవంటి పరమజ్ఞాని మహాపురుషునకు లింగసన్న్యాసము, దండధారణ మెందులకు ? గౌరాంగుఁడు గృహస్థుఁడయ్యు సంకీర్తన ప్రచారము చేయఁగలిగెను. కాని యీ మహాపురుషు లందఱును ప్రజలకుపదేశము చేయుటకు మాత్రమే సన్న్యాసాశ్రమ స్వీకారము

---

♦ శ్లో॥ కృతే యద్ధ్యాయతో విష్ణుం-త్రేతాయాం
యజతో మఖైః ।
ద్వాపరే పరిచర్యాయాం-కలౌ తద్ధరికీర్తనాత్ ॥
శ్రీమద్భాగవతము ౧౨-౩-౫౨.

కావించిరి. సన్న్యాసి కానిదే లోకశిక్షణకార్యము బాగుగ జరుగఁజాలదు.

ప్రభువువారికి భక్తులలో నిద్దఱు సన్న్యాసులు గలరు. వారిలో నొకరు అవధూత యగు నిత్యానందుఁడు, రెండవ వారు మహాత్ముఁడగు హరిదాసు. అవధూత నిత్యానందుఁడు లింగ సన్న్యాసి. మహాత్మా హరిదాసు అలింగ సన్న్యాసి. బ్రాహ్మణేతర వర్ణమునకు సన్న్యాసి విధియున్నది కాని శాస్త్రములలో వారికి సన్న్యాస చిహ్నముల విధానము లేదు. వారు విదురుని వలె నలింగ సన్న్యాసులు కావచ్చును. లేదా వనములలో నివసించి వానప్రస్థ ధర్మాచరణము చేయవచ్చును. ఆ కారణమున హరిదాసు ఏవిధమగు సాధువేషమును వేయ లేదు. ప్రభుప్రాప్తికొఱ కేవిధమగు బాహ్యవేషములు వేయ వలసిన పనియు లేదు. ప్రభు వంతర్యామి. ఆయన దగ్గఱ లోపలి భావములు దాప వీలులేదు. బాహ్య చిహ్నములను జూచి యాయన మోసపోవు వాఁడునుగాదు. చిహ్నములను ధరించుట ఒక విధమగు లోకపరంపరా చారము.

ప్రభువు నిత్యానందుని హరిదాసుని బిలిచి 'ఇప్పు డిట్లు ఏకాంతముననే సంకీర్తనము చేసికొనుచుండుటవలనఁ బ్రయో జనములేదు. ఇప్పుడు మనము నగర నగర మందును, నింటిం టను హరినామ ప్రచారము చేయవలసి యుండును. ఈపని మీకు వప్పగింపఁబడుచున్నది. మీరిద్దఱును నవద్వీపములో పేట పేట, ఇల్లిల్లు వెళ్లి హరినామ ప్రచారము చేయవల

యును. అందఱకు వినయముగ చేతులు జోడించుకొని, పాద ములు పట్టుకొని మీరు హరినామ భిక్షనడుగుడు. మీరు హరి నామ వితరణమును గావించు సమయమున పాత్రాపాత్ర విచారముగాని చిన్న పెద్ద విచారము కొంచెమైనను జేయ వలదు. బ్రాహ్మణుని మొదలు చండాలుని వఱకును, పండి తుని మొదలు మూర్ఖునివఱకును సమాన భావముతో హరి నామోపదేశము చేయవలెను. హరినామమున కందఱు నధికారులే. అడుగనిండు అడుగక పోనిండు వారి దగ్గఱ మీరు భగవానుని సుమధుర నామములను సంకీర్తనము చేయవలెను. వారిని గూడ సంకీర్తనము చేయవలెనని ప్రార్థింపుడు, వెళ్లుడు, శ్రీకృష్ణ భగవానుఁ డీ కార్యమందు మీకుఁ దోడుపడుగాక యనెను,

ప్రభువువారి యాదేశమును బొంది యవధూత లిద్దఱును పరమోల్లాసముతో నవద్వీపములో హరినామ వితరణము కావించుటకు వెళ్ళిరి. ఇద్దఱు నొకే యుద్దేశ్యములోను, నొకే పని కొఱకై వెంటవెంట బయలు దేరిరి కాని యిద్దఱ స్వభా వములలో నాకాశపాతాళముల కున్నంత భేదమున్నది. నిత్యా నందుని శరీర వర్ణము గౌరవర్ణము, హరిదాసు కొంచెము నల్లగా నుండెడువాఁడు. నిత్యానందుఁడు పొడవు, కొంచెము బక్కపలచనివాఁడు. హరిదాసుని శరీరము కొంచెము స్థూలము, కొంచెము పొట్టి. హరిదాసు గంభీర ప్రకృతి కలిగిన శాంతుఁడు. ఇఁక నిత్యానందుఁడా పరమ ఉద్దండుఁడు, చంచల ప్రకృతి

కలవాఁడు. హరిదాసు వయస్సు మీఱినవాఁడు. నిత్యానందుఁ డింకను యువకుఁడు. హరిదాసు నమ్రతతో కార్యము గ్రైక్కొంచువాఁడు. నిత్యానందుఁడు వేళాకోళము చేయక మాటలాడనే మాటలాడఁడు. ఈవిధముగ నీ భిన్నప్రకృతులు గల జంట నవద్వీపములో నామవితరణముచేయ బయలు దేరిరి. వీరిద్దఱు నింటింటికి వెళ్ళి యక్కడ బిగ్గఱగ నిట్లు పలుకుచుండిరి—

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

ప్రజలందఱు వీరు బిచ్చగాండ్రనుకొని వివిధములగు భిక్షలను గైకొని వీరిదగ్గఱకు వచ్చెడువారు. మేము అన్నమునకు బిచ్చగాండ్రము కాము, భగవన్నామమునకు బిచ్చగాండ్రమని సమాధాన మిచ్చుచుందురు. మీరందఱు మీ నోట ఒక్కసారి శ్రీహరి యొక్క—

శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే!
హేనాథ! నారాయణ! వాసుదేవ!

ఈ సుమధుర నామముల నుచ్చరించి మా హృదయములను శీతలము కావింపుఁడు. ఇదియే మాకొఱకు పరమ భిక్ష. జనులందఱు వీరి యీవిధమగు మార్మికవాక్యములను విని ప్రభావాన్వితులై యుచ్చస్వరముతో నందఱును గలిసి హరినామ సంకీర్తనమును జేయుచుందురు. ఈవిధముగ వీరొక

ద్వారమునుండి వేఱొక ద్వారముకడకు వెళ్ళుచుందురు. వీరెక్కడికి వెళ్ళినను ప్రజల ఒక పెద్ద గుంపుగ వీరివెంటఁ బోవుచుందురు. వీరు అందఱునుచ్చైస్స్వరమున హరినామ కీర్తనము చేయుచును చుండిరి. అందఱును గలిసి వీరివెనుక నామసంకీర్తనము చేయుచు వెళ్ళుచుందురు. ఈవిధముగ పేట పేట, బజారు బజారులందు నాల్గువైపులను భగవంతుని సుమధుర నామము మాత్రమే గింగురుమనుచు ప్రతిధ్వనించుచుండెడిది.

నిత్యానందుఁడు మార్గములో వెళ్ళువెళ్ళుచు తన చిలిపితనమును వదలెడువాఁడు కాఁడు. ఒక్కొక్కప్పుడు వెంటఁబడి వచ్చు పిల్లవానిని మెల్లగా గిచ్చును. వాఁడులికిపడి నలువైపులఁ జూచును. అప్పుడీతఁడు నవ్వుచుండును. ఒక్కొక్కప్పుడు ఇద్దఱు పిల్లల తలలను రెంటిని బట్టుకొని తటుక్కున ఢీకొట్టించును. ఒక్కొక్కప్పుడు పిల్లలతోఁగలిసి నృత్యము చేయుచుండును. వాకిలి దగ్గఱ చిన్నచిన్న పిల్లలు నిలుచుండుటకు గాంచెనా వారివైపు క్రోఁతిమూతి పెట్టి క్రోఁతివలె 'ఖాఁ ఖాఁ' యనుచు వారిని బెదరించుచుండును. పిల్లలు బెదరి యేడ్చుచు తమ తల్లుల దగ్గఱకు పరువిడిపోవుచుందురు. అంత నీతఁడు ముందుకు సాగిపోవును. ఒక్కొక్కఁడువచ్చి యీతనిని దబాయించి పోవును. కాని యీతనికి దబాయించుటయుఁ, బ్రేమించుటయు రెండును సమానమే. ఆతఁడు కోపముతో నుండుటనుగాంచి యీతఁ డుపేక్షాభావముతో 'కృష్ణకృష్ణ యను కృష్ణకృష్ణ' వృథాగా జిహ్వ

నేల గాసిపెట్టుకొందువనును. ఇట్లని తన కోకిల కూజిత కమనీయ కంఠముతో నిల్లు గానము చేయఁ బ్రారంభించును—

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

కోపగించుకొనినవారి రోషమంతయు కర్పూరము వలె కఱగి మాయముకాఁగా వారుకూడ యీతనితోఁగలిసి తన్మయత్వముతో శ్రీకృష్ణకీర్తనము చేయఁ బ్రారంభించును. ఈతఁడు నిర్భీకభావముతో స్త్రీలలోనికిఁ జొరఁబడి వారితో 'తల్లులారా! నేను మీపుత్రుఁడను. పుత్రుని యీ ప్రార్థనము స్వీకరింపుఁడు. మీరొక్కసారి భగవానుని నామసంకీర్తనమును గావించి నాహృదయము నానందము గావింపుఁడు' అనును. ఈతని యిట్టి సరళ, సరస, నిష్కపట ప్రార్థనచే తల్లులందఱకును హృదయములు కరిగి నీరైపోయి వారందఱు గూడ శ్రీకృష్ణ కీర్తనములో నిమగ్నులగుదురు. ఈవిధముగ వీరు ప్రాతఃకాలము మొదలుకొని సాయంకాలమువఱకు ఇల్లిల్లు తిరిగి సంకీర్తనము యొక్క శుభసందేశమును సమస్త జనులకు వినిపించును. సాయంత్రమునకు ఇంటికివచ్చి ప్రచార వృత్తాంతమంతయు ప్రభువునకు విన్నవించును. వీరి సఫలతా వాక్యములను విని ప్రభువు వీరి సాహసమును బొగడుచు వీరల వివిధ విధములఁ బ్రోత్సాహితులఁ గావించును. వీరిద్దఱకును నామప్రచారములో మిక్కిలి యానందము కలిగెడిది. దాని మూలకముగ వీరు ఆహారపానీయముల నన్నిటిని మఱచి పోయెడువారు.

ఇప్పుడు ప్రభువువారికీర్తి నలుదిశల వ్యాపింపసాగెను. దూరదూరములనుండి ప్రజలు ప్రభుదర్శనమునకు వచ్చుచుండిరి. భక్తులీతనిని సాక్షాత్తు భగవదవతారముగఁ జెప్పుకొను చుందురు. కొంద ఱీతనిని పరమ భాగవతునింగ నెంచి యీతని కెన్నో ఆదర సత్కారములు కావించెడువారు. కొందఱు విద్వాంసుఁడగు భక్తునిగ భావించి, యట్లే యీతని ప్రభావమునకుఁ బ్రభావాన్వితులై పూజా స్తుతులను జేయుచుందురు. ఈవిధముగ తమతమ ప్రకృతుల ననుసరించి జను లీతని వివిధ ప్రకారములఁ బూజింప మొదలిడిరి జనులు వివిధములగు నుపహారములు కానుకలు ప్రభువు కొఱకు తెచ్చుచుండెడువారు. ప్రభువు వారి నందఱను సంతోషపెట్టవలెనని వాటిని గ్రహించెడువారు. ఈతఁడు గంగాఘట్టమునకుగాని, బజారునకుఁగాని, యింకెక్కడికైనఁగాని వెళ్లినా అక్కడ జనులు లేచి నిలువఁబడి, యీతనికి వివిధ ప్రకారముల దండ ప్రణామములు చేయ మొదలిడుదురు. ఈవిధముగా నెంతెంతగా సంకీర్తన ప్రచారము జరుగుచున్నదో అంతంతగా ప్రభువు యొక్క యశః సౌరభము సర్దిక్కులను వ్యాప్తమగు చున్నట్లు కనఁబడు చుండెను. ప్రభువందఱ దగ్గఱను నమ్రతా పూర్వకముగ నుండును. పెద్దలనందఱను భక్తి భావముతో నమస్కరించును. చిన్నవారిని కుశల క్షేమముల నడుగును. సమానులను ప్రేమతో నాలింగనము చేసికొనును. మూర్ఖులు, పండితులు, ధనికులు దరిద్రులు, గొప్పవారు కొద్దివారు, చిన్నలు పెద్దలు సమస్త జనము ప్రభువు నాదర దృష్టితోఁ జూచు

చుండిరి. ఇచ్చట భక్తుల యుత్సాహము కూడ యిప్పుడధికము కాజొచ్చెను.

నిత్యానంద హరిదాసులయొక్క ప్రతిదిన ప్రచార ప్రభావము ప్రత్యక్షముగ దృష్టి గోచరమగుచుండెను. పాఠశాలకు వెళ్లు బాలురు ఉచ్చ స్వరముతో హరికీర్తనము చేసికొనుచు వెళ్ళసాగిరి. గొడ్లకాచు పిల్లలు, గొల్లలు మహామంత్రమును అస్పష్ట స్వరముతోఁ గీర్తించుచు వెళ్లుచుండిరి. ఉత్సవ సమయములందును పర్వసమయము లందును స్త్రీలందఱు సమావేశమై హరినామ గానమును చేయుచు వెళ్లుచుండిరి. ప్రజలలో పురుషుల సంగతియేల? స్త్రీలు కూడ బజారులలో హరినామ సంకీర్తనము చేయుచు, పైకి చేతులెత్తుకొని ప్రేమతో నృత్యము చేయుటకూడ జరిగెను. నలువైపులనుండి యీ శబ్దములే వినిపించుచుండెను—

కృష్ణ కేశవ కృష్ణ కేశవ కృష్ణ కేశవ పాహిమాం ।
రామరాఘవ రామరాఘవ రామరాఘవ రక్షమాం ॥

రఘుపతిరాఘవ రాజారాం
పతితపావన సీతారాం ॥

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే!
హేనాథ! నారాయణ! వాసుదేవ!

# జగాయి - మధాయిాల క్రూరత్వము

(నిత్యానందుఁడు వారి నుద్ధరింపఁ బ్రార్థించుట.)

శ్లో॥ కిం దుస్సహం ను సాధూనాం విదుషాం కిమపేక్షితమ్ ।
కిమకార్యం కదర్యాణాం దుస్త్యజం కిం ధృతాత్మనామ్॥
శ్రీమద్భాగవతము. ౧౦-౧-౫౮

(సాధుపురుషులకు దుస్సహమైనదేది కలదు? విద్వాంసుల కే వస్తువు మీఁద కోరిక యుండును? నీచుఁ డేపని చేయ లేఁడు? ధైర్యము కలవాని కేపని కఠినమగును? అనఁగా మహాత్ములు సర్వమును సహింపఁగలరు. నిజమైన విద్వాంసున కేవస్తువు అక్కఱలేదు. నీచపురుషుఁడు అత్యంత నింద్యాతి నింద్య క్రూరకార్యమును గూడ చేయఁగలఁడు. ధైర్యవంతున కేకార్యమును కఠినము కాదు.)

ఈ స్వార్థపూరితమగు ప్రపంచములో సాధుపురుషులే లేకపోయినట్లైనను, ఈ పృథివిని పరమార్థులగు మహాపురుషులు తమ పాదధూళిచేఁ బావనము చేయకున్నను, ఈ ప్రపంచములో జనులందఱు తమ తమ స్వార్థవిషయములనే యాలోచించు కొనువారలైనను, ఈభూమి రౌరవ నరక సమానము కాఁ గలదు. ఈ దుఃఖమయ జగత్తును పరమార్థులగు సాధువులే సుఖమయముగఁ గావించిరి. ఈ నిరానంద జగత్తును తమ. నిస్స్వార్థ భావముతో మహాత్ములు ఆనంద స్వరూపముగఁ జేసిరి. స్వార్థములోఁజింత కలదు. నిస్స్వార్థములో నుల్లాసము

కలదు. స్వార్థములో నెల్లప్పుడును భయమే యుండును, కాని పరమార్థ సేవనముచేఁ బ్రతిదినము అధికాధిక ధైర్యము పెరుగుచుండును. స్వార్థములో హీనమగుటచే దీనత్వము కలుగును. పరమార్థి నిర్భీకుఁడు, సాహసము కలవాఁడగును. ఇవన్నియు నున్నప్పటికిని క్రూరపురుషులుండనే యుందురు. అవిచారులై పాపకర్మములుచేయు క్రూరపురుషులే లేకున్న యెడల మహాత్ముల దయ, సహనశీలత, నమ్రతా, సహిష్ణుత, సరళత, పరోపకారిత, జీవమాత్రుల యెడల సహైతుక కరుణా ప్రకాశమెట్లు కలుగును? క్రూరులు తమ క్రూరతను కావించి, మహాత్ములకు తమ సద్వృత్తులను లోకులయెదుట ప్రకటించుట కవకాశమిత్తురు. వాని ననుసరించి దుఃఖులు, చింతిత పురుషులు తమ జీవనములను సుఖమయముగను నానందమయము గను నొనరించుకొనుదురు. కావుననే సృష్ట్యాదియందే మధు కైటభులను పేరుగల యిద్దఱు రాక్షసులు మొట్టమొదటనే యుత్పన్నమైరి. వారిని జంపియే భగవంతుఁడు మధుకైటభారి యయ్యెను. రావణుఁడే లేకపోయిన యెడల శ్రీరామచంద్రుని పరాక్రమము నెవరు గుర్తింపఁగలుగుదురు? పూతనయే లేక పోయినయెడల ప్రభువు యొక్క అసీమదయాళుత్వమెట్లు తెలియఁగలదు? శిశుపాలుఁడు భగవంతుని దిట్టి భగవంతుని చేతిమీఁదుగాఁ జచ్చి ముక్తిని బొందకున్నచో 'క్రోధోఽపి దేవస్య వరేణతుల్యః' (అనఁగా భగవంతుని క్రోధము కూడ వరదానముతో సమానమే.) అను నీ మహామంత్ర ప్రచార మెట్లు కాఁగలదు? అజామిళ్లుని వంటి నీచకర్మలు చేయు

పాపి పుత్రుని 'నారాయణ' యని పిలిచి సద్గతిని జెందకున్న భగవన్నామమున కింతటి యపార మహిమ యెట్లు ప్రకట మగును ? కావున ప్రపంచమునకు మహాత్ములు, సత్పురుషులు వీరి యావశ్యకత యెట్లు కలదో అట్లే దుష్టులయొక్క క్రూర త్వముచేఁగూడ దానికి కొంత కార్యము నడచును. భూమి మీఁద చాలమంది క్రూరకర్మచేయువారుత్పన్నమైనప్పుడు భగవంతుఁ డవతారమెత్తును. క్రూరకర్మచేయు దుష్టులు తాము క్రూరత్వమును జేయుటలో వెనుకకు తగ్గరు. మహా త్ములు తమ పరమార్థమును, పరోపకార ధర్మమును వదలఁ జాలరు. అంతమున విజయము ధర్మమునకే కలుగును. ఏల ననఁగా 'యతో ధర్మః స్తతో జయః.'

మహాప్రభు గౌరాంగదేవుని సమయమునందుఁగూడ నవద్వీపములో జగాయి-మధాయి (జగన్నాథ మాధవులు) లనుపేరు గల యిద్దఱు క్రూరులగు బ్రాహ్మణ కుమారులు నివసించుచుండిరి. 'రాక్షసాః కలిమాశ్రిత్య జాయంతే బ్రహ్మ యోనిషు' అనఁగా 'గలియుగము రాఁగానే రాక్షసులు బ్రాహ్మణుల రూపముతో భూమిమీఁదఁ బుట్టుదురు.' శాస్త్ర ములలోని యీ వాక్యమునకు ప్రత్యక్ష ప్రమాణము జగాయి మధాయిలను నిద్దఱు సోదరుల జీవనములో దృష్టి గోచరమగు చుండును. వారా సమయమున గౌడేశ్వరుని యీ దేశమున నదియాకు కోత్వా (పోలీసు ఇనస్పెక్టరు) లైరి. కోత్వాలైన నేమి ? వారు ప్రజను సంహరించు నొక విధముగ నవద్వీపము

నకు మకుటములేని మహాపతులే. వీరు చేయని దుష్కర్మ అసలు లేనే లేదు. మానవవినాశమున కెన్ని లక్షణములు చెప్పఁబడినవో అవన్నియు వీరికి నిత్యనైమిత్తిక కర్మలు. భగవంతుఁడు వినాశ లక్షణములను స్వయముగ వర్ణించినాఁడు.

శ్లో॥ యదా దేవేషు వేదేషు గోషు విప్రేషు సాధుషు ।
ధర్మేమయి చ విద్వేషః సవా ఆశు వినశ్యతి ॥

శ్రీమద్భాగవతము ౪-౨౮.

భగవంతుఁ డిట్లు చెప్పుచున్నాఁడు- 'ఎప్పుడు మానవుఁడు దేవతలయందు, వైదిక కర్మలయందు, గోవులయందు, బ్రాహ్మణులయందు, సాధువులందు, ధర్మమునందు, నా (భగవంతుని) యందు విద్వేషము నుంచుచున్నాఁడో, వానికి త్వరలోనే నాశము కలుగును' వీరికి వీటిలో నేవియు మిగుల లేదు. దేవాలయములకు వెళ్లుట వీరు పుట్టుకనుండియే నేర్చుకొనలేదు. బ్రాహ్మణులయ్యును వీరు వేదము పేరైన నెఱుఁగరు. మాంసము వీరికి ప్రతిదినము సాధారణ భోజనము. సాధు బ్రాహ్మణుల కవజ్ఞ చేయుట వీరికి సాధారణ విషయమే. ఎవరినైనను సరియే బజారులో నిలువఁబెట్టి ముచ్చెలతోఁ గొట్టుచుందురు. ఎవనినైన మర్యాద చేయుట యనునది వీరెఱుఁగనే యెఱుఁగరు. మంచి మంచి కర్మిష్ఠులు, విద్వాంసులు నగు బ్రాహ్మణులు వీరి పేరు చెప్పినఁజాలును గడగడ వణఁకవలసినదే. ఎవనికిని వీరిముందుకు వెళ్లుటకు ధైర్యము లేదు. ధర్మమనునది ఏపక్షిపేరో, అది యెక్కడ నివసించునో

వీరికి తెలియనే తెలియదు. ధనికుల దగ్గఱ లూటీచేసి దోఁచుకొని వారిని భయపెట్టుటయు, ప్రజలను వేధించుటయు, పతివ్రతల సతీత్వమును భంగముచేయుటయు, ఇవి వీరికి సాధారణ కార్యములు. ఎవరితోనైనను సరసముగ మాటలాడుట లేదు. ఎవరిదగ్గఱనైనఁ గూర్చుండుట లేదు. ఇఁక నెప్పుడు నిష్టము వచ్చినట్లు సారాయము త్రావి, యామత్తులో మదించి వీరు సర్వదా పాపకర్మలయందే ప్రవృత్తులై యుందురు. వీరు నగరములోని కాజీకికొల్లగ ధనమిత్తురు. ఆకారణమున నాతఁడు వీరికి విరుద్ధముగ నేమియు మాటలాడఁ జాలఁడు. ఇట్లు వీరు భగవతీ భాగీరథి యొడ్డున నొకయింటిలో నివసించుచుండిరి. కాని వీరింటిలో నుండరు. ఎల్లప్పుడును వీరు డేరా తీసుకొని ఒకపేట నుండి వేఱొక పేటకు తనిఖీ కొఱకు పోవుచుందురు. ఇప్పుడీ పేటలో డేరా యుండిన, నింతలోనే వేఱొక పేటలో వేయుదురు. ఈవిధముగ వీరు పేటపేటకు పది పది దినములు, ఇరువది ఇరువది దినములు నివసించుచుందురు. వీరి డేరా యేపేటలో పడునో ఆపేటలోని వారి ప్రాణము ఎగిరి పోవును. ఎవఁడును వీరి యెదురుగ పోఁజాలఁడు. అందఱును వీరికి కనఁబడకుండ కనుమొఱగి పోదురు. ఈవిధముగ వీరి పాపము పరాకాష్ఠ కందుకొనెను. ఆ సమయమున వీరు నవద్వీపమందు అత్యాచారములలో రావణకంసులవలెను, శిశుపాల దంతవక్త్రులవలెను, నాదిరుశాహ్ గజనీలవలెను, డయ్యరు ఓడ్వాయ్యరుల వలెను ప్రసిద్ధులైరి.

ఒక దినమున వీరు మదిరామదమున నున్మత్తులై పిచ్చి వాండ్రవలెఁ బ్రలాపించుచు నరుణారుణ నేత్రములతో నెక్కడికో వెళ్లుచుండిరి. దారిలో నిత్యానందుఁడు, హరిదాసు వీరిని జూచిరి. వీరియొక్క యీ శోచనీయ విచిత్ర స్థితిని గాంచి నవద్వీపమునకుఁ గ్రొత్తగా వచ్చిన నిత్యానందుఁడు జనులను 'ఏమండీ; వీరెవరు? వీరు పిచ్చివాండ్రవలె నిట్లు వాగుచు వెళ్ళుచున్నారేల? వేషభాషలను గాంచిన వీరేదో సభ్యపురుషులవలెఁ దోఁచుచున్నారు' అని అడిగెను.

ప్రజలు కొంచెము శుష్కహాసమును జేయుచు నిట్లనెను. 'ఇప్పటి వఱకు మీకు వీరి సంగతి తెలియనట్లున్నది. అందువలననే యిట్లడుగుచున్నారు. వీరిచ్చట సాక్షాత్తుగ యమధర్మరాజులే. నవద్వీపములోని స్త్రీపురుషులకు ఈ నరాధముల వలనఁ గలుగు భయము సాధారణముగ యమరాజు వలనఁ బాపులకు కూడ కలుగదు. వీరు పుటుకకు బ్రాహ్మణుల యింటిలోనే పుట్టిరి. కాని వీరు చేయు పనులు చండాలురను మించి యుండును. చూడుఁడు, మీరెప్పటికిని వీరికి ముందుగాఁ బోవలదు. వీరికి సాధువులనిన మిక్కిలి మంట. వీరు మిమ్ములను జూచిరా క్షేమము లేదు. పరదేశస్థులు కావున మీకీ విషయమును దెలియఁ జెప్పినాము.'

ప్రజల నోటినుండి యిట్టి వాక్యములను విని నిత్యానందునకు వీరిపైఁ గరుణ కలిగెను. అంత నాతఁడు 'నామము నందు శ్రద్ధగల వారలును, సర్వదా సత్కర్మలనే చేయుచుండు

వారలును మేము చెప్పఁగానే భగవన్నామకీర్తనము చేసి నచో నందులో మాయొక్కయు భగవంతుని యొక్కయు గొప్పతనమేమియును లేదు. ఇట్టి పాపులుకూడ వారిపాపమును వదలి భగవన్నామాశ్రయమును గ్రహించి ప్రభుశరణము లోనికి రావలెను. భగవన్నామము యొక్క యథార్థ మాహాత్మ్య మప్పుడే ప్రకటమగును. ఇటువంటివారే అందఱి కంటె నధిక కృపాపాత్రులు. ఇట్టివారికే భగవన్నామోప దేశము పరమావశ్యకము. ఏదో యొక విధముగ వీరి యుద్ధా రము జరుగ వలయును.' అని యాలోచించెను. ఈవిధముగ నిత్యానందుఁడు లోలోన యాలోచించుచుండెను. ఎవని యెడల మహాత్ముల హృదయములలో శుభకామనోత్పత్తి కలుగునో, మహాత్ములెవని మేలు కొఱకై యాలోచించు చుందురో, వానికిఁ గళ్యాణము కలిగినదని భావింపవలెను. ఇంక వాని యుద్ధారము నెడల నాలస్యముండఁబోదు. మహా త్ములయొక్క యథార్థమగు కోరిక, సత్సంకల్పము కలిగెనా పరమ పాపియుఁ బరమ పావనుఁడు పుణ్యవంతుఁడు కాఁగలఁడు. నిత్యానందుని హృదయములో నీ సోదర ద్వయముద్ధరింపఁబడ వలెనను కోరిక యెప్పుడు కలిగినదో, అప్పుడే వీరి పాపము క్షయించు సమయ మత్యంత సమీపమునకు వచ్చినదని భావింపవలెను. అనఁగా వీరి సౌభాగ్య సూర్యుఁడు కొలఁది కాలములోనే యుదయమగునని తెలియవలెను.

నిత్యానందుఁడు తన మనోగతాభిప్రాయమును హరిదాసునకుఁ బ్రకటించెను. హరిదాసిట్లనెను. మీరాలోచించకుండ మొద్దులమీఁద చేయి పెట్టఁదలచినారు. అందఱు నేమి చెప్పినారో యిప్పుడు వినలేదా?

నిత్యానందుఁడు కొంచెము గంభీరముగ నిట్లనియెను :- అన్నియు వింటిని, కాని యింతమాత్రమునకే మనము భయపడరాదు. మనము భగవన్నామ ప్రచారము చేయవలెను.

హరిదాసిట్లనెను :- నేను భగవన్నామ ప్రచారము మానవలసినదని యెప్పుడు చెప్పితిని? పదండి, ఇదివఱకు చేసినట్లే యింకొక వైపునకు వెళ్లి నామప్రచారము చేయుదము. నిద్రించుచున్న యీ సింహములను మేల్కొలిపిన నేమి ప్రయోజనము? అనెను.

నిత్యానందుఁడు 'మీరు చెప్పునది నిజమే, కాని భగవన్నామ వితరణమునకు పాత్రాపాత్ర విచారము చేయవలదు; అందఱకును సమానముగ నుపదేశింపవలెనని ప్రభువు వారియాజ్ఞ కలదు. పాపికానిండు, పుణ్యుఁడు కానిండు భగవన్నామమును గ్రహించుట కందఱు నధికారులే. కావున వీరికి భగవన్నామోపదేశ మేల చేయరాదు. అనెను.

హరిదాసు కొంచెము నమ్రతాపూర్వకమైన స్వరముతో 'ఇది నిజమే. నీకెదుట పడిన వారికి మాత్రమే భగవన్నామో

పదేశము చేయుఁడు, కానివీరికి విశేషముగ నుద్దేశించి వీరి దగ్గఱకు వెళ్ళుట మంచిది కాదు. వీరిదగ్గరకు హఠపూర్వక ముగ నేల వెళ్లవలయును? భగవన్నామోపదేశము చేయుట కింకను జాలమంది కలరు. వారిదగ్గఱకు వెళ్లి యుపదేశము చేయుఁడు' అనెను.

నిత్యానందుఁడు కొంచెము దృఢతాపూర్వకముగ 'చూడుఁడు, రోగము బలముగా నున్నవారికి యితరరోగుల కంటె నోషధులధికముగ కావలయును. బుద్ధిమంతుఁడగు వైద్యుఁడందఱకంటెముందు ఆరోగికే చికిత్స చేయువలయును. ముందు వానికౌషధమిచ్చిన తర్వాతనే యితర రోగికి నాడిని జూడవలయును. ఇతరులకంటె వీరికే భగవన్నామము ముఖ్యముగ కావలయును. ఇంతటి వీరి క్రూర కర్మలన్నిటికి భగవన్నామమే ప్రాయశ్చిత్తము కాఁగలదు. వీరికి నిష్కృతికి వేఱొక మార్గము లేనేలేదు. అంతే కాదూ? మీరు నాయభి ప్రాయమునకు సమ్మతించరా ? అనెను.

హరిదాసు 'మీ యిష్టము. వీరే అందఱకంటె భగవ న్నామమున కధికారులని మీకుతోఁచెనా నాకేమియు నభ్యం తరము లేదు. నేను కూడ మీ వెంట వచ్చుటకు సిద్ధముగ నున్నాను'. అనెను.

ఇట్లని హరిదాసు——
హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

ఈ మహామంత్రమును తమ సుమధుర కంఠముతో గానము చేయుచు జగాయి-మధాయిలున్న డేరా వైపునకు వెళ్ళిరి. సిరిద్దలకుఁ బాదుషా వద్దనుండి కొద్దిగ సైన్యము కూడ లభించినది. దానిని వీరెల్లప్పుడును తమ దగ్గఱ నుంచుకొనుచుండిరి. ఈ యిద్దఱు సన్న్యాసులు నిర్భీకులై భగవన్నామ గానమును జేయుచు వీరి నివాసస్థానముదగ్గఱకు చేరిరి. దైవికముగ నీ యిద్దఱున్నదమ్ము లెదురుగా సారాయిమత్తులో విరిగిన కుర్చీ-మంచములోఁ గూర్చుండి యుండిరి. వీరిద్దఱు తమ యెదుట గానము చేయుటను గాంచి వీరివైపు అరుణారుణ నేత్రములతోఁ జూచుచు వారు 'మీరెవరు? మీకేమి కావలయు' ననిరి.

నిత్యానందుఁడు మిక్కిలి మృదు మధుర స్వరముతో నిట్లనెను—

కృష్ణకహో కృష్ణభజో లేహు కృష్ణనామ్ ।
కృష్ణమాతా కృష్ణపితా కృష్ణ ధన ప్రాణ్ ॥

తర్వాత వీరు 'మేము భిక్షుకులము. మిమ్ము భిక్షమడుగ వచ్చితిమి. మీరు మీనోళ్ళతో—

శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే!
హేనాథ! నారాయణ! వాసుదేవ!

భగవన్నామము యొక్క యీ మధుర నామముల నుచ్చరింపుఁడు. ఇదియే మాకు కావలసిన భిక్ష' అనిరి. ఇది విను

నప్పటికి ఈ సోదరు లిద్దఱకు క్రోధముచే కన్నులెఱ్ఱ నయ్యెను. అంత వెంటనే లేచి వీరి వైపున కురికిరి. ఉరుకుచు వారు 'ఎవఁడురా అక్కడ ? ఈ బద్మాషుల నిద్దఱను పట్టుకొనుఁడు' అనిరి. ఇది వినునప్పటికి నిత్యానందుఁ డచ్చటనుండి పరుగెత్తెను. హరిదాసుకూడ రొప్పుచు నాయన వెనుకనే పరుగెత్త మొదలిడెను. కాని శరీరము స్థూలమగుటచేతను, వయస్సు మీఱిన వాఁడగుటచేతను నీతఁడు బక్కపలచని చిలిపియువకుఁడగు నిత్యానందునితో నెట్లు పరుగెత్తఁగలఁడు ? నిత్యానందుఁడాతనిని తన బాహువులతోఁ బట్టుకొని, ఆతని నీడ్చుకొనుచుఁ బరుగిడ మొదలిడెను. హరిదాసు రొప్పుచు నిత్యానందునితో వెళ్లుచుండెను. జగాయి-మధాయిాల నౌకరులు కొంచెముదూరము వీరిని బట్టుకొనుటకుఁ బరువెత్తి, 'వీరు త్రాగుడు మత్తులో నిట్లు వాగినారు, మనమీ సాధువులను బట్టుకొనుటవలన నేమి ప్రయోజనమును బొందఁగలము?' యని యనుకొని వారి యిద్దఱవెంటఁ జాలదూరము పడలేదు.

హరిదాసు రొప్పుచు, మాటిమాటికి వెనుదిరిగి చూచుచుఁబోవు చుండెను. చివరకాతఁడు చాల యలసిపోయెను. కొంచెము మండిపడి నిత్యానందునితో ఏమండి, ఇఁకనైన వదలిపెట్టుము. ప్రాణముఁపోవుచున్నది. ప్రాణము తీసి వదలిపెట్టుదువా యేమి ? నీవు నీ చంకలో బాధకు మరణించునంతగ నిఱికించుకొంటివి. ఇప్పుడిఁక వెనుక నెవరును వచ్చుట లేదు గదా !' అనెను.

నిత్యానందుఁడు పాఱిపోవుచు 'కొంచెము సేపు ధైర్యముగ జిక్కఁబట్టుఁడు. ఆముందు కనఁబడు చెఱువు వఱకే' యనెను.

హరిదాసు కొంచెము క్షోభము చెందుచు 'నీ చెఱువు తగులుబడ! నాకా ప్రాణములు పోవుచున్నవి, నీకో చెఱువు పట్టినది. నాచేతిని వదలి పెట్టుము' అనెను. ఇట్లని వృద్ధుఁడు హరిదాసు గట్టిగా నొక విదిలింపు విదిలించెను. కాని నిత్యానందుని చేతినుండి యెట్లు తప్పించు కొనఁగలఁడు? అప్పుడు నిత్యానందుఁడు నవ్వి నిలుచుండెను. హరిదాసు స్పృహతప్పి క్రిందపడిపోయెను. దీర్ఘ నిశ్వాసములు విడుచుచు 'కొంచెము బ్రదుకనిండు. మీారెప్పుడును చిలిపితనమునే చేయుచుందురు. నేను మొదటనే వద్దని చెప్పితిని. మీారు నామాట వినలేదు. మొదట మూర్ఖముచేసి యక్కడకు వెళ్ళితివి, రెండవది నన్నుఁ బట్టుకొని యీాడ్చి యీాడ్చి సగము చంపితివి' అనెను.

నవ్వుచు నిత్యానందుఁడు 'మీా యిష్టము మీాఁదనే మనము వెళ్ళితిమి, మీారొప్పుకొన కున్నచో మనమెందులకు వెళ్ళుదుము? మీారే మన యిద్దఱిలో వృద్ధులు పూజ్యులు' అనెను.

హరిదాసు కొంచెము రోషమును జెంది 'వృద్ధులు పూజ్యులెవరు' నాయంగీకారము మీాఁద వెళ్ళి యుండిన మొదల నక్కడనుండి పాఱిపోయి వచ్చితివి? అప్పుడు నా యంగీకారము నేల గ్రహించలేదు' అనెను.

బిగ్గఱగా నవ్వుచు నిత్యానందుఁడు 'ఆ సమయమున నీ యంగీకారము కొఱకు నిరీక్షించుచుండిన యెడల నన్నియు నక్కడే ఆయిపోయెడివి' అనెను. ఈ విధముగ నొండొరులు తమలోఁదాము ప్రేమతో వాదించుకొనుచు నిద్దఱును ప్రభువు వారి దగ్గఱకు వచ్చిరి. ఆ సమయమునఁ బ్రభువువారు భక్తులతోఁగూర్చుండి శ్రీకృష్ణ కథను జెప్పుచుండెను. ఈ ప్రచారక తపస్వు లిద్దఱను గాంచి యాతఁడు సంతోషమును బ్రకటించుచు 'అదిగో, సోదరులారా! జంటవచ్చినది. ప్రచారక మండలి యొక్క నాయకులు వచ్చిరి. ఇప్పుడు మీ యందఱును వీరినోట నగర ప్రచార వృత్తాంతము వినుఁడు' అనెను.

ప్రభు విట్లనఁగానే హరిదాసు 'ప్రభో! శ్రీపాదుఁడగు నిత్యానందుఁడు మిక్కిలి చంచలత్వము కావించును. ఈతనిని మితముగ చంచలత్వమును జేయ వలసినదని మీ రాజ్ఞాపింపుఁడు' అనెను,

ప్రభువు 'ఏమేమి? విషయమేమి? ఏమైనది? ఇవ్వేళ మఱేదైన క్రొత్త చంచలత్వమును గావించెనా యేమి? అవును, మీరిద్దఱీనాఁడు చాల యలసినట్లున్నది. అంతయు వినిపింపుఁడు' అని అడిగెను.

ప్రభువడుగఁగా హరిదాసు వృత్తాంతమును వినిపించుచు 'ప్రజలందఱును మాటిమాటికా సోదరు లిద్దఱ దగ్గఱకు వెళ్ళ వలదనిరి; కాని యాతఁడు వినలేదు. వారు బెదరించఁగానే అక్కడనుండి బాలకులవలె పాఱిపోయివచ్చెను. ఇప్పుడు

కీర్తన పరులకు క్షేమము లేదని ప్రజలు చెప్పుచునే యుండిరి. జనులు పరస్పరమిట్టి విషయములే చెప్పుచుండిరి' అనెను.

హరిదాసుని వాక్యములను విని నవ్వుచు ప్రభువు నిత్యానందునితో 'శ్రీపాదా! వారి దగ్గఱకు వెళ్ళుటకు నీకేమి పనియున్నది? కొంచెము చంచలతను తగ్గించుము. ఇట్టి చంచలతవలనఁ బ్రయోజనమేమి' అనెను.

కొంచెముగ యథార్థముకాని ప్రేమ కోపమును బ్రదర్శించుచు నిత్యానందుఁడు 'ఈవిధముగ మీ యీ కార్యము నావలనఁగాఁజాలదు. మీ రా యింటిలోఁ గూర్చుందురు. నగర ప్రచారములోఁగల కష్టములు మీకేమి తెలియును? అందఱకు నామ ప్రచారము కావింపవలెనని చెప్పితిరి. బ్రాహ్మణుఁడుమొదలు చండాలుని పర్యంతము, పాపిమొదలు పుణ్యాత్ముల వఱకు అందఱు భగవన్నామమున కధికారు లంటిరి, మరల నిప్పుడు వారి వద్దకేల వెళ్లితి రనుచున్నారు. అందఱికంటె గొప్ప యధికారులు వారే. మేము పుట్టినది మొదలుకొని యిల్లువాకిలి వదలి బిచ్చమెత్తుకొని తిరుగు చుంటిమి, అట్టి మమ్ముల నుద్ధరించుటలో మీ గొప్పతన మేమున్నది! ఇటువంటి భయంకర క్రూరకర్మములు చేయు పాపుల నుద్ధరించినప్పుడే, మీ పతితపావన నామము సార్థక మగును. ఇప్పుడిఁక నింటిలోఁ గూర్చుండినఁ బ్రయోజనము లేదు. ఇటువంటి ఘోరపాపులను హరినామ శరణము లోనికిఁ

దీసికొనివచ్చి భక్తులను జేయకున్న లోకులు హరినామ మహా త్వము నెట్లు తెలిసికొనఁగలరు ?' అనెను.

కొంచెము నవ్వుచు ప్రభువు భక్తులతో 'శ్రీపాదుఁ డెవరి యుద్ధారము కొఱకు మిక్కిలి చింతించుచుండిరో ఆ మహాభాగవత పురుషు లెవరు?' అనెను.

దగ్గఱనే కూర్చుండిన శ్రీవాసుఁడు, గంగాదాసు మొదలగు భక్తులు 'ప్రభో! వారు మహాభాగవతులు కారు. వారు బ్రాహ్మణకుల కంటకులగు నత్యంత క్రూరప్రకృతి గల రాక్షసులు. నగరమం దంతటను వారి బాధ చాలగ నున్నది' అనిరి, ఇట్లు పలికి వారు జగాయి-మధాయిల మహా క్రూర త్వమును వర్ణనము కావించెను.

ప్రభువు నవ్వుచు 'ఇప్పుడింక వారెంతకాలము క్రూర త్వము నెఱపఁగలరు ? శ్రీపాదు లెవరిని దర్శించి, వారి మనస్సులో నెవరి యుద్ధారము కొఱకు విచారించుచుండెనో వారింక పాపులుగా నుండఁగలరా ? వాఁడెంత పాపియైనఁ గానిండు శ్రీపాదులు తలఁచిన భక్తుని జేయఁగలఁడు' అనెను.

ఈ విధముగా నిత్యానందుఁడు సంకేతముగా ప్రభు సన్నిధిని జగాయి-మధాయిల యుద్ధారము కొఱకు ప్రార్థిం చెను. ప్రభువుకూడ సంకేతముగానే వారికా సోదరద్వయము యొక్క యుద్ధారమును గూర్చి యాశ్వాసనము కావించెను. నిజముగా మహాత్ముల హృదయములలో నన్యుల మొదల

స్వాభావికముగనే దయ యుత్పన్న మగును. వారి స్వభావము వారి దగ్గఱకు వచ్చి యెవరైన దయా ప్రార్థన కావించి నప్పుడు దయ చూపుటకాదు, కాని వారిని యాచింపకయే దీనదుఃఖుల యెడల దయ కలుగుటయే వారి స్వభావము. దయను జూపక వారుండనే లేరు. నీతి శాస్త్రవేత్తలేమి చెప్పిరో చూడుఁడు.—

శ్లో॥ పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవచక్రవాళమ్ ।
నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి
సంతః స్వయం పరహితేషు కృతాభియోగాః ॥

భర్తృహరి నీతిశతకము ౭౪.

రాత్రియందు దుఃఖముచే ముడుచుకొని పోయిన కమలము మరీచిమాలియు భగవంతుఁడు నగు భువన భాస్కరుని సమీపమునకు పోయి తన దుఃఖములను జెప్పుకొని యేడ్చుటకు పోదు. అడుగకయే కమలబంధువైన సూర్యుఁడు దాని దుఃఖములను దూరము చేయుటకు వికసింపఁజేయును. లజ్జచే నవగుంఠితమైన కుముదినీ కలికను కలానాథుఁడగు చంద్రుఁడు స్వయముగఁ దానే ప్రస్ఫుటితము కావించును. యాచింపకయే జలములతో నిండిన మేఘము తనలోని నీటి నంతను వర్షింపఁజేసి ప్రాణులయొక్క దుఃఖమును దూరము కావించును. ఈవిధముగానే మహాత్ములగు సాధుపురుషులు

కూడ స్వయముగ పరహితము కొఱకే ప్రయత్నించుచుందురు. పరోపకారము చేయుట వారికి స్వభావమగును. ప్రాణు లందఱు తెలిసినప్పుడు, తెలియనప్పుడు శ్వాసల నెట్లు తీసి కొందురో అట్లే సంతమహాత్ములే కార్యము చేసినను, నవి యన్నియు లోక కల్యాణకారులుగానే యుండును.

# చైతన్య చరితావళి

## జగాయి - మధాయిల యుద్ధారము

శ్లో॥ సాధూనాం దర్శనం పుణ్యం తీర్థ భూతా హి సాధవః।
కాలేన ఫలతే తీర్థం సద్యః సాధు సమాగమః॥

(సాధువుల శరీరమే తీర్థస్వరూపమైనది. వారి దర్శనమువలననే పుణ్యము కలుగును. సాధువులకు తీర్థములకు చాలగొప్ప భేదమున్నది. తీర్థములకు వెళ్లువారికి ఫలము కాలాంతరమున లభించును. కాని సాధుసమాగమ ఫలితము తత్కాలముననే లభించును. కాబట్టి యథార్థమగు సాధువులతో సత్సంగము ఫలమొసంగుచుండు, వారి దర్శనమే కోటి తీర్థముల ఫలము కంటె నధికమైనది.)

నిజముగాఁ గోమల హృదయము కలవాఁడును, ప్రాణు లందఱను ప్రేమదృష్టితోఁ జూచువాఁడును, ఘృణా ద్వేషము

లచే మలినము కాని బుద్ధిగలవాఁడును, పరోపకారము చేయుటే వ్యసనముగాఁ గలవాఁడు నగు సాధు పురుషుఁడు హృదయ పూర్వకముగ ఘోరాతిపాపికైనను కల్యాణము కలుగవలెనని కాంక్షించినచో వాఁడు ధర్మాత్ముఁడగుటకు సందేహము లేదు. మహాత్ములయొక్క స్వాభావికేచ్ఛయ మోఘమగును. అతఁడు ప్రసన్నతా పూర్వకముగ నెవని వైపునైనను గాంచెనా, అప్పుడే వాఁడుద్ధరింపఁబడినవాఁడే. సాధువులతో కుట్ర బుద్ధితో చేసిన సాంగత్యముకూడ వ్యర్థముకాదు. సాధువు లను ద్వేషించు వారలకుఁగూడ మేలు కలుగుచుండుట కాంచు చున్నాము. పాపులపైన నేదైన నపరాధకారణమున నెప్పు డును గోపము చెందని మహాత్ములకు దైవికముగఁ గోపము వచ్చెనా వాని సర్వస్వము నాశనమగును. కాని మహాత్ములకు సాధారణముగా క్రోధము నామమాత్రముననే వచ్చును. వారు వారికహితము చేయు వారలకుఁగూడ హితమునే చేయుదురు. దెబ్బ కొట్టి నప్పటికిని వారు వృక్షముల వలె సుస్వాదు ఫలములనే యిచ్చును, ఏలననఁగా వారి హృదయము దయచేఁ బరిపూర్ణమగును.

వీరిద్దఱ పాపములకు పరిసమాప్తికాల మాసన్నమైనదా యనునట్లీ ఘోరపాపులు సోదర ద్వయమగు జగాయి-మధా యీాల మీఁద నిత్యానందునకుఁ గృపకలిగెను. వీరి హృద యములో నీ యిద్దఱ యుద్ధారము కొఱకు సంకల్పముపుట్టెను. వీరిద్దఱ కేదినమున నవధూతయగు నిత్యానందుని యొక్కయు,

మహాత్మా హరిదాసు యొక్కయు దర్శనమయ్యెనో ఆదినము ననే వీరికి శుభదినములకు విఘ్నేశ్వరపూజ యయ్యెను. సంయోగ వశమున వీరు మహాప్రభువు నివసించు పేటలోనే డేరాలు వేసికొనిరి. పేటలోని వారందఱు భయముచెందిరి. 'ఇప్పుడీ సంకీర్తన పరులకు విపత్తు వచ్చినది. ఈ యిద్దఱు రాక్షస సోదరులు తప్పక యీ కీర్తన పరులను పంద పట్టించెదరు' అని ఒకరొకరనుకొన మొదలిడిరి. కొందఱు సంకీర్తన విరోధులు 'అరే, భలే, ఈ సంకీర్తనపరులు రాత్రులందు నిద్ర పోనిచ్చుటలేదు. వీరి కోలాహలకారణమున రాత్రులందు నిద్రయే పట్టుటలేదు. మంచిది, ఇప్పుడింక సుఖముగ నిద్రపో వచ్చును' అనుకొనిరి. కొందఱు కొందఱు తమ యూహలచే 'ఇఁక నిప్పుడే కీర్తనపరులు వారికి వారే సంకీర్తన నాపివేతురు, లేదా చేసిన దానికి ఫలమనుభవింతురు' అనుకొనిరి. ఈవిధముగ లోకులు వివిధములగు తర్కవితర్కములు చేయసాగిరి.

ప్రభువారి యిల్లు గంగ దగ్గఱనే యుండెను. ప్రభువు స్నానమునకై యేఘట్టమునకు బోవునో, ఆ దారిలోనే యీ యిద్దఱు క్రూరకర్ముల డేరా వేయఁబడి యుండెను. వీరి భయముచే గంగాస్నానమున కొంటరిగా నెవఁడును వెళ్లెడు వాఁడు కాఁడు. పది యిరువది మంది ఘట్టమునకు స్నానము చేయఁబోదురు. రాత్రులం దెవరును తమ యిండ్లనుండి బయటకు వచ్చెడువారు కారు. కారణమేమనఁగా నీ సోదరు లిద్దరు మత్తులోనుండి యిటునటు తిరుగుచు నెవరు దొరికిన

వారిని గొట్టుచుండురు. అందువలన సాయంత్రము కాఁగానే పక్షులెల్లు తమ గూళ్ళలోఁజేరి మరల ప్రాతఃకాలమున వాటి నుండి బయటకు వచ్చునో అట్లే యాపేటలోనివారు సూర్యాస్తమయమైన తర్వాత పొరపాటుననైన నింటినుండి బయటకు వచ్చెడువారుకారు. ఏలననఁగా వీరి క్రూరత్వము, నృశంసత్వమందఱకుఁ దెలియును.

సాయంత్రము పూట నియమ ప్రకారము భక్తులు సంకీర్తన చేయుచుండెడువారు. ఒక్కొక్కప్పుడు రాత్రియంతయు సంకీర్తనము జరుగు చుండెడిది. వీరిద్దరు డేరా వేసికొని నప్పటికి సంకీర్తన యథా ప్రకారము జరుగుచునే యుండెడిది. రాత్రియందు భక్తులందఱు సమావేశమై యథా ప్రకారముగ లయ ధ్వనులతో ఖోల్, మృదంగము, కరతాళములు, మంజీరము మొదలైన వాద్యములతో భగవంతుని యొక్క సుమధుర నామములను సంకీర్తనమును జేయుచుండిరి.

సంకీర్తనముయొక్క త్రితాపహారియు, నత్యంత యఘ సంహారియు నగు సుమధురధ్వని యీ సోదరద్వయముయొక్క చెవులలోఁబడెను. వీరిద్దరు సారాయిమత్తులో మునిఁగి యుండిరి. ఆ కర్ణానందకరమైన ధ్వనిని వినఁగానే వీరధిక యున్మత్తులైరి. ఎండాకాలపు దినములు. బయట మంచముల మీఁద పరుండి వీరు కీర్తనము యొక్క జగత్పావన కారియగు రసామృతమును బానముచేయసాగిరి. ఒక్కొక్కప్పుడు వీరు స్పృహతప్పి హుంకారములు చేయుచుందురు. ఒక్కొక్క

ప్పుడు పరుండియే 'ఆహా, ఆహా' అని యనుచుందురు. ఒకొ్క్కప్పుడు భావావేశములోనికి వచ్చి కీర్తనలోని లయ ననుసరించి లేచి నృత్యముచేయ మొదలిడుదురు. ఈవిధముగా వీరు సంకీర్తన మాహాత్మ్యము నెఱుఁగక పోయినప్పటికిని కేవలము దానిని వినుటచేతనే పిచ్చివాండ్రవలె నైరి. ఒక దినమున దూరమునుండి కీర్తన ధ్వని వినఁగానే వీరి హృదయములలోని కఠోరత చాలవఱకు తగ్గిపోవుచుండెను. ఏ హృదయములోని కర్ణములద్వారా భగవన్నామము ప్రవేశించినదో అక్కడ కఠోరత యెట్లు నిలువఁగలదు? సంకీర్తనము వినుచు వినుచునే యీ సోదరులిద్దరు నిద్రించిరి. ప్రాతఃకాలమున వీరు లేచునప్పటికి భక్తులు గంగా ఘట్టము వైపునకు గంగాస్నానార్థము వెళ్ళుటను గాంచిరి. మహాప్రభువుకూడ అటే పోవుచుండెను. ప్రభువువారే సంకీర్తనకు జీవనదాత యని వీరిదివఱకే విని యుండిరి. అందువలన ప్రభువును జూచుటతోడనే వీరు కొంచెము గర్వితస్వరముతో ప్రసన్నతా పూర్వకముగ 'నిమాయి పండితా! రాత్రి చాల సుందరగానమును చేసితిరి. 'మంగళ చండీ'గీతమాయేమి? ఒకదినమున నీ తోడివారంద ఱితోఁగలిసి మా సమక్షమునఁ గూడ గానము చేయుము. నీవే సామగ్రి కావలెనని చెప్పుదువో వాటినన్నిటిని దెప్పింతును. ఒక దినమున తప్పక మాదగ్గఱ చండీమంగళ మ్పాడవలెను. మాకు మీగీతము చాలబాగున్నది' అనెను. భగవన్నామ సంకీర్తన కెట్టి విలక్షణ ప్రభావమున్నది! ఎప్పుడు నెరివ

తోడను సౌమ్యవాక్యములు పలుకుటే మెఱుఁగని సోదర ద్వయము మహాప్రభువును తమ దగ్గఱ గానము చేయుటకు ప్రార్థించిరి. ఇది యంతయు కేవల మనిచ్ఛాపూర్వకముగ శ్రవణముచేసిన ఫలము. ప్రభు వీ మాటకుఁ బ్రత్యుత్తర మీయలేదు. అతఁడు పేమ భావముతో ముందుకు సాగి పోయెను.

మూఁడు జాములవేళ భక్తులందఱును ప్రభువువారి యింటిలో సమావేశమైరి. అందఱు ప్రభువును 'ప్రభో! ఈ సోదరద్వయము నిప్పుడవశ్య ముద్ధరింపవలెను. వీరి నుద్ధరించుట కిదియే సమయము. అప్పుడే లోకులకు సంకీర్తన మహాత్మ్యము తెలియఁగలదు; మీపతితపావన, దీనబంధు నామము సార్థక మగును' అని ప్రార్థించిరి.

ప్రభువు నవ్వుచు 'భక్తులారా! ఎవరి యుద్ధారము కొఱకు మీఱంద ఱింతగాఁ జింతించుచున్నారో, ఎవరి కల్యాణము కొఱకు మీ యందఱ హృదయములలో నింతటి కోరిక గలదో వారి యుద్ధార మిప్పటికే అయినదని గ్రహించుఁడు. ఇప్పుడింక వారి యుద్ధారమున కాలస్య మేమికలదు? శ్రీపాదుల దర్శన భాగ్యము లభించిన వారింక పాపులుగా నెట్లుండఁ గలరు? శ్రీపాదుల దర్శనము వ్యర్థమెన్నడును కాఁజాలదు. అతనివలన వారికి కల్యాణ మవశ్యము కలుగును' అనెను. ప్రభువు వారి యిట్టి యాశ్వాసన వాక్యములను విని భక్తులు తమ తమ స్థానములకు వెడలిపోయిరి.

ఒక దినమున రాత్రిపూట నిత్యానందుఁడు మహా ప్రభువు యింటి వైపునకు వెళ్లుచుండెను, నిత్యానందుఁడు బుద్ధిపూర్వకముగ, కేవలమాసోదర ద్వయము నుద్ధరించుటకే అక్కడినుండి బయలుదేఱి వచ్చెను. ఈతఁడు మెల్లమెల్లగా భగవన్నామోచ్చారణము చేయుచు వారి డేరా ముందుగా పోవుచుండెను. ఆసమయమున నిసోదర ద్వయము సారాయి మత్తులో మునిఁగి యుండిరి. నిత్యానందుఁడు రాత్రిపూట యటుగాఁబోవుటను గాంచి గుడ్డ నెఱుపు చేసి సారాయిత్రాగి స్వప్రహాతప్పిన స్థితిలో మధాయి 'ఎవరా వెళ్లునది' అని అడిగెను. నిత్యానందుఁడు జవాబునిచ్చువాఁడా! ఆతఁడు మెదలకుండెను. అంత నీతఁడు గద్దించుచు బిగ్గఱగా 'అరే, ఎవఁడురా ఆ వెళ్లునది ? పలుకవేమి ?' అనెను.

అంత నిత్యానందుఁడు నిర్భయముగ 'ఏమి, ఎవరైన నేమి ? ఏమందువు' అనెను. మధాయి 'నీ వెవరు ? నీపేరు చెప్పుము, ఈ రాత్రి సమయమున నెక్కడికి వెళ్లుచున్నావు!' అనెను. నిత్యానందుఁడు సరళతా పూర్వకముగ కొంచెము వినోద పూర్వకముగ 'ప్రభువు దగ్గఱకు సంకీర్తన చేయఁబోవు చున్నాను. నాపేరు 'అవధూత' అనెను.

అవధూత యను పేరు వినఁనప్పటికి మధాయి మండి పడెను. ఆతఁడు 'అవధూత, అవధూత, చాల విచిత్రనామము. అవధూత యను పేరుండునటరా బద్మాష్ ! నాతో నీకు పరియాచకమా !' అనెను. ఇట్లని యవిచారియు, మహోన్మ

మధాయికంటె జగాయి కొంచెము కోమల ప్రకృతి కలవాఁడు, దయగలవాఁడు. వానికి నిత్యానందుని యీ స్థితిని గాంచఁగా దయ కలిగెను. దెబ్బకొట్టిన వానిపైఁగూడ క్రోధమును జూపక ఆతఁ డానందముతో నృత్యముచేయుట, అంతేకాక తన కపరాధము చేసినవాని కల్యాణము కొఱకు ప్రభువును ప్రార్థించుట, యీ రెండు కారణములచే జగాయి హృదయము కఱగిపోయెను. ఆతఁడు మధాయిని అడ్డగించుచు 'నీవు చేయున దేమి? ఒక సన్న్యాసిని విషయము తెలిసికొనకయే కొట్టు చున్నావు. ఇట్లు చేయుట బాగుండలేదు' అనెను.

ఎఱ్ఱని నేత్రములతో నలువైపులఁ జూచుచు మధాయి 'వీఁడు సరిగా వీని ఊరు. పేరు చెప్పఁడు' అనెను.

సరళతా పూర్వకమైన స్వరముతో జగాయి 'ఈపర దేశీ సన్న్యాసి తన పేరు ఊరు ఏమి చెప్పఁగలఁడు. చూచుటలేదా అవధూత మైనది; అడుగుకొని తినుచున్నది: అక్కడ యిక్కడ పడి యుండునది' అనెను. జగాయి యీ విధముగ నివారిం చఁగా మధాయి శాంతపడెను. ఆతఁడు రెండవసారి నిత్యా నందునిపైఁ ప్రహారము చేయలేదు. నిత్యానందుఁ డానంద మున నున్మత్తుఁడై నృత్యము చేయుచుండెను. శిరస్సునుండి రక్తము ధారలుగా ప్రవహించుచుండెను. అక్కడ నేల యంతయు రక్తముచేఁ దడిసిపోయెను. ప్రజలు త్వరత్వరగా వెళ్లి యీ సంవాదమును ప్రభువువారికిఁ దెలిపిరి. ఆ సమయ

మున మహాప్రభువు భక్తులతోఁగూడ కీర్తన నారంభము చేయఁబోవు చుండిరి. నిత్యానందుని కొట్టిన వృత్తాంతమును వినునప్పటి కీతఁడిఁక నిలువలేకపోయెను. ఈతఁడు నిత్యానందుని తన ప్రాణములకంటె నధికముగఁ బ్రేమించెడు వాఁడు. నిత్యానందునికి విపత్తు కలిగినదను సమాచారమును విని యాతఁడొక్కసారిగా లేచి పరుగెత్తుకొనివచ్చి యాస్థలము నకుఁజేరెను. వీరి వెంట భక్తులందఱు నట్లే లేచి వచ్చిరి. ఒకని మెడలో డోలకు వ్రేలాడుచున్నది. ఒకని నడుమునకు మృదంగము కట్టఁబడినది. ఒకానొకఁడు చిన్న మృదంగమును పట్టుకొని యుండెను. ఇంకొకఁడు రెండుచేతులలో కరతాళము లను గ్రహించియుండెను. చాలమంది చేతులలో మంజీరము లుండెను. నిత్యానందుఁడానందో ద్రేకములోఁ బ్రేమముతో నున్మత్తునివలె నృత్యము చేయుచుండుటను ప్రభువు గాంచెను. అతని మస్తకమునుండి రక్తము ప్రవాహమువలెఁ గారుచుండెను. అతని శరీరమంతయు రక్త రంజితమయ్యెను. శరీరము మీఁద నుండి రక్తము బొట్లుబొట్లుగ క్రింద పడుచుండెను. అతనికి క్రిందనున్న నేలయంతయు రక్తముచేఁ దడియుటచే నెఱ్ఱనయ్యెను. ఇట్టి స్థితిలోఁగూడ భగవానుని మధుర నామములను గీర్తించుచుండెను! నిత్యానందుని రక్త ప్రవాహమును గాంచిప్రభువువారి రక్తముప్పొంగెను.అతఁడా సమయమున తన ప్రతిజ్ఞనంతయుమఱచిపోయి, ఆకాశము వైపునకుఁ జూచుచుఁ బెద్ద హుంకారముచేయుచు 'చక్రము,చక్రము' అని కేక వేసెను,

అనఁగా నీపాపులనిద్దరను సంహారము చేయుటకు సుదర్శనచక్రము నాహ్వానించు చున్నాఁడా యేమి యనునట్లుండెను. ప్రభువీ విధముగ క్రోధావిష్టుఁడగుటను గాంచి నిత్యానందుఁడు వారితో వినీత భావముతో 'ప్రభో! మీ ప్రతిజ్ఞను స్మరించుఁడు. ఈ పాపుల మీ హృదయములోఁగల కోపము నుప సంహరింపుఁడు, పాపులయెడల మీరు దయచూపక కోపమునే చూపునెడల వీరి కుద్ధారమెట్లు కలుగును? మీరు పాపసంహారులు. మీనామము పతితపావనము. మీరు దీననాథులు. వీరికి మించిన దీనులు, హీనులు, పతితులు మీ కుద్ధారము కోఱకెచ్చట దొఱకుదురు? ప్రభో! ఈపాపులు మీకృపకు పాత్రులు. వీరు గౌరాంగుని దయ కధికారులు. వీరిపై ననుగ్రహించవలెను. మీ జగద్వంద్య చరణములను వీరి మస్తకముపై నుంచి వీరి నుద్ధరింపుఁడు' అనెను. నిత్యానందుఁడిట్లు ప్రార్థించి నప్పటికిని ప్రభువువారి క్రోధము శాంతింపలేదు. ఇచ్చట ప్రభువు క్రుద్ధుఁడగుటను గాంచి భక్తులందఱును విస్మితులైరి. అందఱు నాశ్చర్యముతో ప్రభువువారి కుపిత ముఖము వైపునకు సంభ్రమభావముతోఁ జూడసాగిరి. నేఁడు ప్రపంచ ప్రళయము కలుగునేమో నని యందఱకుఁ దోఁచెను. ప్రపంచమంతయు ప్రభు ప్రకోపముచే భస్మీభూతమగునేమో నను నట్లుండెను. ప్రభుని యీ స్థితిని గాంచి కొందఱు భక్తులు స్వాధీనము తప్పిరి. మురారి గుప్తాది వీర భక్తులు మహావీరావేశములోనికి వచ్చి యాపాపుల నిద్దరను

సంహారము చేయుట కుద్యుక్తులైరి. ఆ సమయమున భక్తుల హృదయములలో నొక విధమైన గొప్ప కల్లోలము పుట్టెను. ఉత్తేజితమైన భక్తమండలిని గాంచి జగాయి - మధాయీల సేవకులందఱు భయకారణమున గడగడ వణఁకు చుండిరి. వేలకొలఁది స్త్రీపురుషులా స్థలమునకు వచ్చి మూగిరి. నగర మందంతట నొక విధమైన కోలాహలము పుట్టెను. నిత్యానందుఁ డుత్తేజితులైన మురారి గుప్తాది భక్తుల కాళ్ళమీఁద పడి వారిని శాంతింపుఁడని ప్రార్థించుచుండెను. ప్రభువును గూడ మాటిమాటికి శాంతుఁడగుటకుఁ బ్రార్థించుచుండెను. ఆ సోదరు లిద్దరు భయపడిన వారివలె మెదలకుండ నిలుచుం డిరి. వారి కిప్పుడేమి చేయవలెనో యేమియుఁ దోఁచుటలేదు. ఇంతలోనే ఆకాశము నుండి సుదర్శన చక్రము వారిని సంహ రించుటకు వచ్చుచున్నట్లు తోఁచెను. సుదర్శన చక్రమును జూచునప్పటికి వారింక నధికముగ భయభీతులై, భయకారణ మున గడగడ వణఁకు చుండెను. నిత్యానందుఁడు వీరి మనో గతావస్థను దెలిసికొని చక్రమును ఆకాశమందే నిలుచుటకుఁ బ్రార్థించి, దీన భావముతో మరల ప్రభువును ప్రార్థింప మొద లిడెను, ప్రభో! మీరీయుగములోఁగూడ పాపులను దండించి నచో నింకఁబాపు లెట్లుద్ధరింపఁబడుదురు? మీరిప్పుడు జెప్పినది సంహారమాయెను. మీరిదివఱకు పాపులను సంహరింపక ఉద్ధ రించెద నని మీరు హరిదాసునకు మాట యిచ్చితిరి. ఎదుట నిలుచుండిన యీ పతితపాతకుల నుద్ధరించి మీరు మీపతిత

పావన నామమును సార్థకమేల చేసికొనరు? మీరు దండింపఁ దలఁచి నట్టైన మధాయి నొక్కనినే దండించుఁడు. జగాయి నీకేమియు నపరాధము చేయలేదుకదా! అదియునుగాక యీతఁడు మధాయిని ప్రహారము చేయుటను నివారించెను. రెండవసారి కొట్టవచ్చి నప్పుడు కూడ జగాయి-మధాయి నడ్డగించెను. 'ప్రభో! జగాయి నాకు రక్షకుఁడైనాఁడు. ఆతఁడు సర్వథా నిర్దోషి.'

'జగాయి శ్రీపాదుని రక్షించినాఁడు. ఆతనిని మధాయి యొక్క ద్వితీయ ప్రహారము నడ్డగించెను' అను సంగతి వినఁగానే ప్రభువువారి యానందమునకు మేఱలేకుండెను. ఆతని శరీరమంతయు పులకితమయ్యెను. ప్రేమ కారణమునఁ బ్రభువు జగాయిని కౌగిలించుకొని, గద్గద కంఠముతో 'నీవు నా సోదరుని రక్షించితివి. నీవు నా సోదరునకు రక్షకుఁడవు, నీకంటె నాకుఁ బ్రియుఁడెవఁడుండఁగలఁడు? రమ్ము, నన్నుఁ గౌగిలించుకొని నాయనుతప్త హృదయమును చల్లపఱచుము' అనెను. ప్రభువువారి ప్రేమాలింగనమును బొందునప్పటికి జగాయి మూర్ఛితుఁడయ్యెను. ఆతఁడచేతుఁడై ప్రభువువారి చరణములందు దొర్లుచుండెను. నేఁడా యదృష్ట వంతులగు బ్రాహ్మణ సోదరులు జన్మ సఫలమయ్యెను. వాని పాపములన్నియు క్షయించెను. వాని హృదయములోని పాపపుంజ సమూహమును మంచుకూడు కొనియుండెను. అది ప్రేమమను నగ్ని సాన్నిధ్యమును బొంది కరిగి కరిగి కన్నులనుండి ప్రవహింప

సాగెను. ప్రభు చరణములందు పడిన జగాయి బిగ్గఱగా వెక్కి వెక్కి యేడ్వసాగెను.

తన సోదరుఁ డిట్లు ప్రేమలో నధీరుఁడై రోదనము చేయుటఁ గాంచి మధాయి హృదయములోఁగూడ పశ్చాత్తాపజ్వాల జ్వలింప మొదలిడెను. అతనికిఁగూడ తాను జేసిన దుష్కృత్యము నెడల లజ్జ కలిగెను. అతఁ డింక నధిక కాలము స్థిరముగ నుండఁజాలకపోయెను. కన్నుల నీరు గార్చుచు గద్గద కంఠముతో నాతఁడు 'ప్రభో! మేము అన్నదమ్ముల మిద్దరము కలిసి సమానముగఁ బాపము చేసితిమి. మేమిద్దరము లోక నిందిత పాతకులము. మీరు నా సోదరున కొక్కనికే మీ చరణ శరణ ప్రదానము కావించితిరి. 'నాథా! మాయిద్దరిని నీవారిగాఁ జేసికొనుము. మమ్ముల నిద్దరను రక్షించుము' అనెను. ఇట్లు పలుకుచు మధాయి కూడ ప్రభు చరణముల మీఁద దొర్లసాగెను. అశ్రుధారలచే నక్కడనున్న ధూళి యంతయు బురద బురద అయిపోయెను. ఆ బురద సోదరు లిద్దరు శరీరమంతటను తగిలెను. శరీరమంతయు ధూళితోడను, బురదతోడను నిండియుండెను. నదియా నగరమునకు కిరీటము లేని రాజులైన వీరీవిధముగా ధూళిలో దొర్లుట చూచి స్త్రీ పురుషులందఱును నిస్పృహులైరి. అందఱు ఆ పాపులయొక్క పాపములను మఱచి వారియందు దయాభావమును ప్రదర్శింప మొదలిడిరి. ఆహా! నమ్రతలో నెంతటి గొప్ప యాకర్షణ మున్నది!

మధాయి మీాఁదనుండి ప్రభువు వారి కోపమింకను దొలఁగలేదు. అతఁడు గంభీర స్వరముతో 'మధాయి! నేను నిన్ను క్షమింపఁజాలను. నేను నాకపరాధము చేయువారి యెడల నెన్నటికిని కోపపడను. కాని నీవు శ్రీపాదుఁడగు నిత్యానందున కపరాధము గావించితివి. అతఁడు నిన్ను క్షమించు నెడల నప్పుడు నీవు నాకు ప్రియుఁడవు కాఁగలవు. అతఁడు నిన్ను క్షమింపనంత వఱకు నీవు నాసమక్షమున దోషివే యగుదువు వెళ్లుము. నిత్యానందుని శరణు వేడుము' అనెను.

ప్రభువువారి యిట్టి యాజ్ఞను విని మధాయి అస్తవ్యస్త భావముతో ప్రభువువారి చరణములను వదలిపెట్టి నిత్యానందుని చరణములందు పోయిపడి వెక్కి-వెక్కి యేడ్వసాగెను. వానికి తాను జేసిన దుష్కృత్యము నెడల చాల లజ్జకలిగెను. ఆ లజ్జాకారణమున నతఁ డధీరుఁడై బావురు మని యేడ్చుచుండెను. వాని రోదనము విని ఱాయికూడ కరుగునట్లుండెను. నల్దిశలును మధాయి రోదనమును విని ద్రవీభూతమై సమస్త దిశలును రోదనముచేయుచున్నవా యనునట్లు శాంతి నెలకొనెను. చుట్టుపట్లనున్నవారా పాపుల యీా స్థితినిగాంచి తమ్మునేఁదాము మఱచిరి. వారు స్వర్గములో నున్నారా; మర్త్యలోకములో నున్నారా యను సంగతి ఆక్షణమున వారికి తెలియనే తెలియుటలేదు. అందఱు గౌరాంగుని ప్రేమ ప్రభావమునకు వశవర్తులై యీా యభూతపూర్వ దృశ్యమును చూాచుచుండిరి.

మధాయి నిత్యానందుని పాదములక్రింద పడియుండు టను గాంచి నిత్యానందునితోఁ బ్రభువు 'శ్రీపాదా! ఈ మధాయి నీకపరాధము గావించినాఁడు. నీవే యితనిని క్షమింపఁగలుగుదువు. నాలో నాకపరాధము చేసినవానిని క్షమించు నంతటి ఓర్పు లేదు. చెప్పుము, ఏమి చెప్పెదవో' యనెను.

అత్యంత దీనభావముతో నిత్యానందుఁడు 'ప్రభో! ఇది మీ కెప్పుడును నుండు స్వభావమే. మీ రెల్లప్పుడును మీ సేవకుల యశమునకు తలయొగ్గి యుందురు. వీని యుద్ధారము యొక్క శ్రేయస్సును మీరు నాతలపై వేయఁ జూచు చున్నారు. పతితపావనుఁడైన గౌరాంగునకే యిట్టి పాపుల నుద్ధరించు శక్తి గలదని అందఱకుఁ దెలియును. 'ప్రభో! నా హృదయములో మధాయి యెడల నణుమాత్రమైన ద్వేషము లేదని నా హృదయపూర్వకముగఁ జెప్పుచున్నాను. నేను నా జన్మజన్మాంతరములలో నెప్పుడైన నేదైన పుణ్యమొనర్చిన యెడల నాపుణ్యము నంతయు యీసోదరుల కిద్దరకు ప్రదానము గావింతును' అనెను.

ఈ మాటవినఁగానే ప్రభువు పరువెత్తుకొనిపోయి మధాయి తన చేతులతో లేవదీసి, గట్టిగా వాని నాలింగనము చేసికొనుచు 'మధాయీ! ఇప్పుడు నీవు నాకత్యంత ప్రియుఁడ వైతివి. శ్రీపాదుఁడు నిన్నిప్పుడు క్షమించినాఁడు. ఆతఁడు నీకు తన పుణ్యము నంతను ధారపోసి నిన్ను పరమ భాగవత

వైష్ణవుని జేసివేసెను. నీవు నేఁటికి నాకంతరంగ భక్తుఁడ వైతివి' శ్రీపాదుని కృపచే నీవు పాపరహితుఁడ వైతివి? అనెను. ప్రభువు యొక్క ప్రేమాలింగనము దొఱకు నప్పటికి మధాయి యానందమునకు మేఱలేకుండెను. ఆతఁడా క్షణముననే మూర్ఛితుఁడై ప్రభువువారి పాదపద్మములమీఁద పడెను. ప్రభువు వారి రెండు పాదములను బట్టుకొని నవద్వీప మునకునరే. సర్వ ఏకమాత్ర శాసన కర్తలగు నాసోదరు లిద్దరు ధూళిలో దొర్లుచు నేడ్చు చుండిరి. భక్తులును, నింక నగరము లోని యితర స్త్రీపురుషులును మంత్రముగ్ధులవలె నిలుచుండి యీ పతితోద్ధార దృశ్యమును జూచుచుండిరి. హృదయమును కదలించివేయు యీ దృశ్యమువలన వారికి తృప్తి కలుగుట లేదు. ఆ సమయముననే ప్రభువు తన పాదముల మీఁదఁబడి యుండిన ధూళిధూసరితులగు సోదరుల నిద్దరను లేవఁదీసి, భక్తులను సంకీర్తన చేయవలసిన దని యాజ్ఞాపించిరి.

ఈ సోదరు లిద్దరి యొక్క యిట్టి దీనతను గాంచి భక్తులకు కలిగిన యానందమునకు మేఱయే లేకుండెను. వారు వేఱు వేఱు సంప్రదాయముల ననుసరించి ప్రేమలో నున్మత్తులై హరిధ్వనిని చేయ మొదలిడి, గట్టిగా తాళ స్వర సహితముగ కీర్తనము చేయసాగిరి. నగరములో స్త్రీ పురుషు లందఱును సంకీర్తనములో సమ్మిళితులైరి. నేఁడు వారికి సంకీర్తనము చూచుట కిదియే ప్రథమ పర్యాయము. అందఱు భక్తులతోఁగూడి—

చైతన్య. 3-3

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

ఈ మహామంత్రము నుచ్చారణచేయ మొదలిడిరి. జంజీరా, మృదంగము, మంజీరము మొదలగునవి వాయించుచుండిరి. భక్తులున్మత్తులై కీర్తన చేయసాగిరి. మధ్య మధ్య గౌరహరి యొక్క జయ జయ ధ్వనులచే నాకాశమండలము ప్రతిధ్వనించుచుండెను. కీర్తన ధ్వనిచేత నందఱకు స్వేదము, కంపము, అశ్రుపాతము మొదలగు సాత్త్వికభావములు కలుగ మొదలిడెను. ఆసమయము సంకీర్తనములో నొక విధమైన కళ తోఁచెను. అందఱు ప్రేమోన్మత్తులైరి. సంకీర్తనము చేయుచు భక్తగణము సోదరుల నిద్దరను గైకొని ప్రభుని గృహమునకుఁ జేరుకొనిరి.

# జగాయి - మధాయిాల ప్రపన్నత

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ ॥

(భగవంతుఁడగు రామచంద్రుఁడు విభీషణుఁడు రాఁగా వానరులతో నిట్లనెను:- 'ఒక్కసారి యైనను బ్రపన్నుఁడై 'నేను నీ వాఁడను' అని నన్ను కృపా యాచన చేయునెడల వానికి సర్వ భూతములనుండి నేనభయ ప్రదానము కావించెదను. ఇది నా వ్రతము.')

బృందావనములో నొక పరమ భగవద్భక్త యగు తల్లి నాకీ కథను చెప్పెను- 'భక్తభయభంజనుఁడగు భగవంతుఁడు ద్వారకయొక్క భవ్య భోజన భవనములోఁ గూర్చుండి సత్యభామాది స్త్రీలతోఁగూడి భోజనము చేయుచుండెను. భగవానుఁడొక మిక్కిలి సుందర సువర్ణ పీఠమునఁ గూర్చుండి యుండెను. సువర్ణమయమైన పళ్లెరములలో వివిధములగు స్వాదిష్ట వ్యంజనములు అందముగఁ బెట్టఁబడినవి. బహు

మూల్యములగు రత్నజడితములగు గిన్నెలలో వివిధ ప్రకారము లగు పేయ పదార్థము లుంచఁబడినవి. ఎదురుగా రుక్మిణీదేవి కూర్చుండి విసన కఱ్ఱతో విసరుచుండెను. అటునిటు నితర పట్టపు రాణులు కూర్చుండి యుండిరి. హఠాత్తుగా భగవంతుఁడు భోజనము చేయుచుఁజేయుచు నొకసారిగా నాగిపోయెను. ఆయన నోటిలోని ముద్ద నోటిలోనే యుండెను. చేతిలోని ముద్ద చేతిలోనే యుండెను. అతఁడు నిర్జీవ ప్రతిమ వలె నున్న దున్నట్లుగానే నిలిచిపోయెను. ఆయన యొక్క వికసిత ముఖారవిందము ముడుచుకొని పోయెను. కంటినీరు గార్చుచు నాతఁడు రుక్మిణీవైపు చూచుచుండెను. పట్టపు రాణులందఱును భగవంతుని యీ భావమును గాంచి భయ భీతలైరి. వారేదో భావ్యాశంకా భయముచే భయభీతులై ప్రభువువారి ముఖము వైపునకే చూచుచుండిరి. కొంచెము కంపిత స్వరముతో భయభీతయై రుక్మిణీదేవి 'ప్రభో! మీ కొక్కసారిగ నిట్టి స్థితి యేల కలిగినది? ఎవఁడో నీయొక్క పరమ ప్రియభక్తుఁడు గొప్పసంకటములోఁ బడినట్లు తోఁచు చున్నది. ఆ కారణమున మీరింత ఖిన్నులై తిరి. నా యీ యూహ నిజమేనా?' అని యడిగినది.

రుక్మిణీదేవివైపు చూచుచు ప్రభువు 'నీయూహ అసత్యముకాదు' అనెను.

అధీరతను బ్రకటించుచు రుక్మిణిదేవి 'ప్రాణేశ్వరా! చేనా భక్తశిరోమణిని గూర్చియు, నా విపత్తి వృత్తాంతమును గూర్చియుఁ దెలిసికొనఁగోరుచున్నాను' అనెను.

విషణ్ణస్వరముతో భగవంతుఁడు 'దుష్టుఁడగు దుశ్శాసనుఁడు నిండు సభలో ద్రౌపది చీరెను లాగుచున్నాఁడు. గురుజనుల సమక్షమున నాపతివ్రతను నగ్నము కావింపఁ జూచుచున్నాఁడు' అనెను.

ద్రౌపదియొక్క దుఃఖ వృత్తాంతమును విని స్త్రీ సహాజముగు భీరుతను కాతరతను బ్రకటించుచు రుక్మిణీదేవి 'అట్లయిన మీరాలోచించునదేమిటి ? ఆమెకు మానభంగము కాకుండ నుండునట్లు త్వరగా నామెకు సహాయత నేల కావింపరు? 'ప్రభూ! ఆ దీనహీన యబలను రక్షించుము. నాథా! ఆమె దుఃఖముచే నాహృదయముకూడ కొట్టుకొనుచున్నది' అనెను.

గద్గద కంఠముతో భగవానుఁడు 'సహాయమెట్లు చేయుదును? ఆమె తన వస్త్రమును నొక కొంగు తన పండ్లచేఁ బట్టుకొనినది. ఆమె సర్వతో భావేన నాసహాయమును గొనకుండ దంతముల సహాయము కొనుచున్నది. ఆమె సర్వ ఆశలను వదలి పూర్ణముగ నాపై భారము వేయనప్పుడు నేనెట్లామెకు సహాయత నెట్లు గావింపఁగలను?' అనెను.

భగవానుఁడు ద్వారకలో నిట్లను చుండగనే ద్రౌపది సమస్త విధముల తనయొక్క నిస్సహాయతను గ్రహించి భగ

వంతునే ఆశ్రయించుటకు నిశ్చయించుకొనెను. ఆమె నోటి నుండి 'కృష్' యింత మన్నదో లేదో దంతములనుండి వస్త్రము జారిపోయెను. దంతములనుండి యాశ్రయము పోయినది. నోటి నుండి యింకను 'ణ' కూడ రాలేదు, యింతలోనే భగవంతుఁ డచ్చటికి వచ్చి ద్రౌపది యొక్క చీరల నక్షయము కావించెను. దీనిని వర్ణించుచు సూరదాసిట్లు చెప్పు చున్నాఁడు-

'ద్రుపద సుతా నిర్బల భఇ తా దిన్,
గలా లాయే నిజ ధామ్
దుశ్శాసనకీ భుజా థకిత భఈ,
వసనరూప భయే శ్యామ్ ॥

సునేరీ మైఁనే నిర్బలకే బలరామ్ ।

(ద్రౌపది నిర్బలయై యా దినమున భగవంతుని వేఁడినప్పుడు శ్రీకృష్ణుఁడు వసన రూపమును ధరించెను. అప్పుడు దుశ్శాసనునికి చీరెలు లాగలేక యలపువచ్చెను. నిర్బలునకు బలము రాముఁడే నని నేను విన్నాను.)

ఏలననఁగా మానవుఁడు తన బలమునే యాశ్రయించు నంత వఱకును, తననే బలునిగాను, సమర్థునిగాను భావించు నంతవఱకును భగవంతుఁడు సహాయమేల చేయును ? ఆతఁడు నిర్బలులకు సహాయకుఁడు- నిష్కించనులకు రక్షకుఁడు- అందు వలననే తర్వాత సూరదాసిట్లు చెప్పినాఁడు-

'అపబల తపబల ఔర్ బాహోబల
చౌథా హై బలదామ్ ।
సూరకిసోర కృపా తేఁ సబ బల
హారేకో హరి నామ్ ॥

సునేరీ మైంఁనే నిర్బలకే బలరామ్ ॥

(చెడుబలము, తపోబలము, బాహుబలము, నాల్గవది ధన బలము ఇవియే యీలోకములో బలములు. సూరకిశోరుఁడైన కృష్ణుని కృప గలవాఁడు హరినామమువలన నన్నిబలముల నోడించఁగలఁడు. నిర్బలునకు బలము రాముఁడే నని నేను విన్నాను.)

జగాయి-మధాయీల దగ్గఱ నన్యాయోపార్జితమైన ధనము చాల యున్నది. వారిద్దరి శరీరము పుష్టి కలిగినది. పాదుషానుండి వారి కధికారముకూడ లభించినది. ధనము, జనము, సేన, అధికారము మొదలైన వన్నియు కలిగి యీ మదములో తమ్మిదామే కర్తల మనుకొనుచుండిరి. కావునఁ బ్రభువు కూడ వీరికి దూరముగానే యుండెను. ఏ క్షణమున వీరు తమ సమస్త అధికార బలములను మఱచి నిర్బలులు, నిష్కించనులైరో ఆ సమయమునఁ బ్రభువు వీరిని తన శరణము లోనికిఁ గైకొనెను. ఆక్షణకాలమాత్రపు ఉపశమనము వలననే ఆజన్మపాపులైన వీరు సమస్త వైష్ణవులకు కృపాభాజనులైరి. ప్రపన్నతా శరణాగతులం దిట్టి మహిమముగలదు. ఏ క్షణమున 'నేను నీవాఁడను' అని నిజమైన హృదయముతో నాతనిఁ

ప్రార్థించిన నాక్షణముననే తనవానిగాఁ గైకొనును. ఆతఁడు నిరంతరము భక్తతృష్ణ కలిగి యుండును. భగవంతుఁ డూరక 'నేను నీవాఁడను' అని యెవరందురా యని ప్రజల ముఖములను జూచుచుండును. ఆయన యెంతటి దయాళుఁడు? ఆజామిళుఁడు పుత్రమోహమున 'నారాయణ' యని పలుకఁగానే ఆతనిని రక్షించి, వాఁడు జీవితములో చేసిన పాపములన్నిటిని క్షమించెను.

భక్తబృందము జగాయి-మధాయీల నిద్దరు సోదరులను వెంటఁగొని ప్రభువు దగ్గఱకు వచ్చిరి. భక్తులందఱు యథాస్థానమునఁ గూర్చుండిరి. ఒక ఉన్నతాసనమునఁ బ్రభువు కూర్చుండెను. కుడి యెడమలందు గదాధరుఁడు, నిత్యానందుఁడు కూర్చుండి యుండెను. ఎదుట వృద్ధాచార్యుఁడగు నద్వైతుఁడు కూర్చుండి యుండెను. వీరు గాక పుండరీక విద్యానిధి, హరిదాసు, గరుడుఁడు, రమాయి పండితుఁడు, శ్రీనివాసుఁడు, గంగాదాసు, వక్రేశ్వరుఁడు, చంద్రశేఖరుఁడు మొదలగు ననేకమంది భక్తులు ప్రభువునకు నలువైపులను గూర్చుండి యుండిరి. మధ్యలో నీసోదరులిద్దరు- జగాయి-మధాయీల తల క్రిందకు వంచుకొని కన్నులనుండి యశ్రువులను గార్చుచుండిరి, వీరి యంగ ప్రత్యంగములనుండి విషణ్ణతా పశ్చాత్తాపజ్వాలలు వెడలు చున్నవా యనునట్లుండెను. ఇద్దరి శరీరములు పులకించుచుండెను. ఇద్దరును నిత్యానందుని యొక్కయు, ప్రభువు యొక్కయు నసమానమైన కృపా భార

ముచే నణఁగిపోవు చున్నట్లుండిరి. వారికి శరీర స్పృహ లేదు. ప్రభువు వారి నీవిధముగ విషాద యుక్తముగ నుండుటను గాంచి వారితో 'సోదరులారా! మీాయందు శ్రీపాద నిత్యానందులకు కృపగలదు. ఇప్పుడింక మీారు శోకమోహములను వదలివేయుఁడు. మీారిప్పుడు నిష్పాపులై తిరి. భగవంతుఁడు మీాయందు మిక్కిలి కృపచూపినాఁడు' అనెను.

ప్రభువు మాటలను విని గద్గద కంఠముతో నేడ్చుచు నిద్దరు సోదరులు 'ప్రభో! మా పాపుల నిద్దర నుద్ధరించి నేఁడు మీారు మీా 'పతిత పావన'నామమును యథార్థముగ సార్థకము చేసికొంటిరి. మీాపతితపావన నామము నేఁడే సార్థకమైనది. అజామిళుని రక్షించుటలో మీా గొప్పదనమేమియు లేదు. ఏలనన నాతఁడు సమస్త పాపములను క్షయము కావించు నాల్గక్షరములు గల 'నారాయణ'యను నామమును గ్రహించి నాఁడు. గణిక చిలుకను మాటలు నేర్పుచు నేర్పుచు రామ నామోచ్చారణము చేయుచుండెడిది. ఏదోవిధముగా వారి నోట భగవన్నామోచ్చారణముండెడిది. వాల్మీకి వేలకొలఁది సంవత్సరములు తలక్రిందుగానైనను సరియే నామ జపము చేసినాఁడు. పొలములో వెదవేసిన విత్తులు సరిగాను, తల క్రిందులుగాను పడును. అయినను మొలకలెత్తును. దంతవక్ర, శిశుపాల, రావణ, కుంభకర్ణ, శకటాసుర, శంబరాసుర, అఘాసుర, బకాసుర, కంసాది సమస్త అసురులు, రాక్షసులు ద్వేష బుద్ధితోడనే కానిండు నీరూపచింతనమును గావించిరి. వారు

లేచుచుఁగూర్చుండుచు, నిద్రించుచు, మేల్కొనుచు సర్వదా నీధ్యానముచే చేయుచుండెడువారు. వీరందఱకు ముక్తి వచ్చి తీరవలెను. వీరందఱు భగవత్సంబంధులగుట వలన ముక్తి కధికారులైరి. కాని ఓదీనానాథ! ఓ అశరణ శరణా! పతితు లకు ఏకైకాధారమైనవాఁడా! ఓ కృపాసముద్రా! ఓ పాపు లకు చుక్కానియైనవాఁడా! ఓ అనాథ రక్షకా! మేము పాపుల మిద్దరము పొరపాటుననైన మీ నామమును గ్రహించ లేదు. మేము సదా మదోన్మత్తులమై పాపకర్మలలోనే ప్రవృ త్తులమైతిమి. మాకు మిమ్ములను గూర్చిన జ్ఞానము కొంచె మైనను లేదు. మామీఁద మీకృపను జూపి, యెవఁడైన భజన చేయనిండు, చేయకపోనిండు, వాఁడెంతటి పాపియైనను గానిండు అట్టివానిపైనైనను ప్రభువునకు కృపవచ్చితీరు' నని లోకమునకుఁ బ్రత్యక్షముగఁ జూపినారు: ఓ ప్రభూ! మమ్ము లను మా పాపఫలములను భోగింపనిండు. మమ్ములను, అర్బుద సంవత్సరములో, నిర్బుద సంవత్సరములో, అసంఖ్యాకములగు సంవత్సరములు నరకములో భయంకర యాతనలను భోగింప నిండు! ప్రభో! మేము మీయీ యహైతుకకృపను సహింప లేము. నాథా! మాహృదయము విదీర్ణమై పోవుచున్నది. ప్రభువారు మాపైఁజూపు కృపకు యోగ్యముగ కోటిజన్మల కైనను పాత్రులమై యుండఁజాలము' అనిరి.

నిన్నటివఱకు మద్యపానము తప్ప నన్యమెఱుఁగని వీరి నోటినుండి యిట్టి యపూర్వ స్తుతిని వినునప్పటికి భక్తులందఱు

నాశ్చర్య మగ్న మానసులైరి. వారొకరి ముఖముల నొకరు చూచుకొని యాశ్చర్యమును ప్రకటించు చుండిరి. అద్వైతాచార్యులా సమయమున నీశ్లోకమును జదివి ప్రభుపాదపద్మములకు నమస్కరించెను.

శ్లో॥ మూకం కరోతి వాచాలం పంగుంలంఘయతే గిరిమ్ ।
యత్కృపా తమహం వందే పరమానంద మాధవమ్ ॥
శ్రీధరస్వామి భా. టీ.

(ఎవనియొక్క కృపచే మూఁగవాఁడుకూడ వాచాలుఁడగునో, కుంటివాఁడుకూడ నెవరి సహాయము లేకయే పర్వతశిఖరమున కెగుర గలఁడో అట్టి పరమానంద కందుఁడగు మాధవునకు నేను నమస్కరించు చున్నాను.)

జగాయి-మధాయిలయొక్క యీ స్తుతిని విని ప్రభువు వారితో 'మీరిద్దరు సోదరులు భక్తులందఱకు పాదాభివందనము కావింపుఁడు. భక్తులయొక్క పదధూళిచే నతిపాపాత్ములైనను పరమపావన పుణ్యాత్ములు కాఁగలరు' అనెను. ప్రభువువారి యాజ్ఞను బొంది సోదరు లిద్దరు తమ యశ్రువులచే భక్తుల చరణములను దడపుచు వారి కందఱకు పాదాభివందనము కావించిరి. భక్తులందఱును వారిని హృదయపూర్వకముగఁ బరమ భాగవతులగు నట్లు సర్వోత్తమ ఆశీర్వాదము నిచ్చెను.

ఇప్పుడు మహాప్రభువు వారికి శాంతి కలుగుటకు వేఱొక యుపాయము నాలోచించెను. భగవతీ భాగీరథి సమస్త పాప

ములను మూలమట్టముగఁ బెల్లగించి పారవేయున దగుటచే ప్రభువు భక్తులందఱను జాహ్నవీ తటమునకు వెళ్ళవలసినదని యాజ్ఞాపించెను. వెన్నెలరాత్రి, ఎండాకాలము, ప్రజలందఱు కొందఱు నిద్రించుచుండిరి. కొందఱు పరుండు ప్రయత్నము చేయుచుండిరి. ఆ సమయమున భక్తులందఱును నీ సోదరుల నిద్దరను ముందు బెట్టుకొని సంకీర్తన చేయుచు ప్రేమలో నాడు కొనుచుఁ బాడుకొనుచు గంగాస్నానము కొఱకు పోవుచుండిరి. సంకీర్తన యొక్కయు, జయజయ ధ్వానముల యొక్కయు ధ్వనిని విని వేలకొలఁది స్త్రీపురుషులు గంగాఘట్టమునకు మూగిరి. చాలమంది మంచముమీఁద నుండి యట్లే ఉత్తరీ యాదులు ధరింపకయే బయలుదేరి వచ్చిరి. కొందఱు భోజన ములు చేయకయే పరుగెత్తుకొని వచ్చిరి. భార్యలు భర్తలను వదలియు, తల్లులు పుత్రులను వదలియు, కోడండ్రు అత్తలను ఆడుబిడ్డలను లెక్కచేయక సంకీర్తనను గాంచుటకు పరువిడి వచ్చిరి. అందఱు వచ్చివచ్చి భక్తులతోఁ గూడి సంకీర్తన చేయుటలో నిమగ్నులైరి. అందఱు నొక యపూర్వాకర్షణకు లోనై తమ్ముఁదాము మఱచిరి. మహాప్రభువు సంకీర్తన నాప వలసినదిగ నాజ్ఞాపించెను. వారీ సోదరుల నిద్దరను వెంటఁ గొనిపోయి స్వయముగఁ దాను జలములలోఁ బ్రవేశించెను. వారి వెంబడి నిత్యానందుఁడు, అద్వైతాచార్యుఁడు, శ్రీవా సుఁడు, గదాధరుఁడు మొదలగు భక్తులందఱును జలములోఁ బ్రవేశించిరి. జలములోఁ బ్రవేశించి ప్రభువు సోదరు లిద్దరతో

'జగన్నాథ మాధవులారా! మీరిద్దరు మీ మీ చేతులలోనికి నీరు తీసికొనుడు.' అనెను. ప్రభువాజ్ఞాపింపఁగానే యిద్దరును తమతమ చేతులలోనికి జలమును గైకొనిరి. అంత ప్రభువు గంభీరస్వరముతో నత్యంత స్నేహభావముతో దయార్ద్రుఁడై 'నేఁటివఱకు మీరిద్దరు సోదరులు ఈజన్మలో చేసిన పాపములను, వెనుకటి కోటిజన్మలలోని పాపములను నేఁడు నాకు దాన మిండు' అనెను.

చేతిలోని నీటిని వెంటనే విసరిపాఱవైచి యత్యంత దీనముగా కాతర స్వరముతో నా సోదరు లిద్దరును 'ప్రభో! మా హృదయములు బ్రద్దలగుఁగాక! భగవాన్! మేము మరణింతుము. మమ్ములనిట్టి ఘోర కార్యము చేయ నాజ్ఞాపింపకుఁ డు. ప్రభో! మేము మీయొక్క యింతటి కృపను సహింపలేము. దీన దయాళూ! ఏ చరణములందు భక్తబృందము ప్రతిదినము వివిధములగు సుగంధిత చందనము వివిధప్రకారములగు పత్రపుష్పముల నర్పింతురో అట్టి పాదములందు మా యొక్క యసంఖ్యాకములగు పాపముల నర్పించుట కాజ్ఞాపింపకుఁడు. ప్రభువువారి పావన పాదపద్మములం దీపాపులు, పామరులు తమ పాపపుంజము లర్పించిరని లోకమంతయు నిందింపఁగలదు. ప్రభో! మేమణగారిపోదుము. ఇట్టిపని మావలనఁగాజాలదు' అనెను.

ప్రభువు వీరికి ధైర్యము చెప్పుచు 'సోదరులారా! మీరు భయపడకుఁడు. మీ పాపములను గైకొని నేను పావ

నుఁడనగుదును. నేను జన్మించి నందులకు సార్థకమగును. మీరు సంకోచింపఁ బనిలేదు' అనెను. ప్రభువువారి యీ మాటను విని నిత్యానందుఁడా సోదరులిద్దరతో 'మీరింతగా సంకోచింపకుఁడు. ఈతఁడు జగత్పావనము చేయఁగలవాఁడు. ఈతఁడు త్రిభువనపాపహారి. మీరు మీ పాపములను సంకల్పింపుఁ' డనెను.

నిత్యానందుని మాటలను విని యేడ్చుచు నేడ్చుచు నీ సోదరులిద్దరు చేతులతో జలములను గైకొనిరి. నిత్యానందుఁడు సంకల్పమును జదివెను. ప్రభువు రెండు చేతులను జాచి యాసోదరులిద్దర పాపముల నన్నిటిని గ్రహించెను. ఆహా! ఎట్టి యపూర్వాదర్శము! ఇతరుల పాపములను గ్రహించుటచేతనే గౌరాంగుఁడు పతితపావనుఁడని పిలువఁబడెను. వారి పాపములను గ్రహించి ప్రభువు 'ఇప్పుడు మీరిద్దరు నిష్పాపులైతిరి. ఇప్పుడు మీరు నాకత్యంత ప్రియమైన పరమ భాగవత వైష్ణవులైతిరి. నేఁటినుండి యెవరైన మీపూర్వ పాపములను స్మరించి మిమ్ములను జూచి యసహ్యము చెందిరా వారు వైష్ణవ ద్రోహులుగ నెన్నఁబడుదురు. వారికి ఘోర వైష్ణవాపరాధపాపము సంభవించును' అనెను. ఇట్లు చెప్పుచుఁ జెప్పుచు ప్రభువు వారిద్దరిని కౌగిలించుకొనెను. వారు కూడ ప్రభువువారి ప్రేమాలింగనమును బొంది మూర్ఛితులై జలములో పడిపోయిరి. ఆ సమయమున తప్తసువర్ణమువలెఁ బ్రకాశించెడు ప్రభుని శరీరము కొంచెము నల్లగనైనట్లు వారి

యంతరంగ భక్తులకు దోఁచెను. పాపమును గ్రహించుటచే నీళ్లు నల్లనయ్యెను. తదనంతరము భక్తులందఱు నానందోల్లాస పూర్వకముగ స్నానమును గావించిరి. ప్రేమలో మగ్నులగుట వలన భక్తులందఱు నున్మత్తులవలెనైరి. స్నానము చేయుచుఁ జేయుచు వారొండొరులపై జలములను గొట్టుకొనిరి. ఈ విధముగ చాలసేపటి వఱకు అందఱును త్రిభువన పావనియగు గంగాజలములందు పరమానందపూర్వకముగఁ గ్రీడించిరి. అర్ధరాత్రి దాఁటిన తర్వాత నందఱు తమతమ గృహములకు వెడలిపోయిరి. కాని జగాయి-మధాయి సోదరు లిద్దరును వారు తమ యిండ్లకు పోలేదు. వారు శ్రీవాస పండితుని యింటిలోనే నివసింపసాగిరి.

# జగాయి-మధాయిల పశ్చాత్తాపము

శ్లో॥ న చారాధి రాధాధవో మాధవో వా
నవాపూజి పుష్పాదిభిశ్చంద్రచూడః ।
పరేషాం ధనే ధంధనే నీతకాలో
దయాళో! యమాలోకనే కః ప్రకారః ॥

సు. ర. భాం. ౩౯౧-౨౧౧.

(హా! నేను నా జీవితకాలములో రాధారమణుఁడైన మాధవుని చరణారవిందములను ఆరాధించలేదు. పోనీ చంద్రచూడుఁడగు పరమేశ్వరునైనను పుష్పాదులచేఁ బూజింపలేదు. నేనెల్లప్పుడును పఱుల విషయసామగ్రిని హరించుట యందే కాలయాపనము గావించితిని. ఓ దయాళో! నాకు పరలోకములో యమధర్మ రాజు దర్శనమైనచో అప్పుడు నేనేమి సమాధానము చెప్పుదును? అక్కడ నేను గడచుటెట్లు? అయ్యో! ఇంతవఱకు నేను కాలమును వృథాగా గడిపితిని గదా!)

ఏ హృదయము పాపము చేయుచుఁ జేయుచు మలిన మగునో దానియందు పశ్చాత్తాప జ్వాలా ప్రభావమేమియు కలుగదు. ఏలనన నల్లని వస్త్రము మీఁద సిరా మచ్చ కనఁబడదు. గదా! వస్త్రమెంత స్వచ్ఛముగా నుండునో దాని మీఁద ముఱికియు నంత యధికముగ ప్రత్యక్ష దృష్టిగోచర మగును. ఈవిధమగు పశ్చాత్తాపజ్వాల స్వచ్ఛము, సరళము నగు హృదయముల మీఁదనే యధికముగ బయలుదేరును. ఎవఁడెంత నిష్పాపి యగునో, ఎవఁడు తన పాపములను దెలిసికొని వానినుండి పూర్తిగ విముఖుఁడైనాఁడో, వానికి వాని పూర్వకృత పాపముల మీఁద యంత యధిక పశ్చాత్తాపము కలుగును. ఆ పశ్చాత్తాపమే వానిని ప్రభుపాద పద్మములందు జేర్చుటలో సహాయక మగును. పాపము చేసిన తర్వాత నెవఁడు దానిని స్మరించుకొని హృదయములో నొక విధమగు తాపము లేక దుఃఖమును బొందునో దానికే పశ్చాత్తాప మని పేరు. ఎవనికి తాను జేసిన దుష్కృత్యములందు దుఃఖము లేదో, ఎవనికి తన యసత్యపు అనర్థపు వాక్యములందు పశ్చాత్తాపము లేదో అట్టివాఁ డెల్లప్పుడును ఇంద్రియ లోలుపమగు సాంసారిక యోనులలో భ్రమణముచేయు నారకీయ జీవియే యగును. దాని నిష్కృతికి ఉపాయము ప్రభువు కృపజూచెనా బాగుగానే కలదు. పశ్చాత్తాపము హృదయములోని మలము లను కడిగి స్వచ్ఛముగ నొనర్చును. పశ్చాత్తాపము దుష్కర్ములకు సర్వోత్తమమగు నౌషధము. పశ్చాత్తాపము జీవులను

బరమ పావనుల చేయుటకు రసాయనము వంటిది. పశ్చాత్తా పము సంసార సాగరములో మునిఁగిపోవు వారల కేకమాత్ర మగు నాధారము. తమ పాపములను దుష్కర్మలను దలఁచు కొని పశ్చాత్తాపము చెందు మానవుఁడు ధన్యుఁడు.

జగాయి-మధాయీల సోదరద్వయము నెడల నితాయి-నిమాయీల సోదరద్వయమునకుఁగల యహైతుక కృపవలన నెంత తలక్రిందులై పోయిన దనఁగా వీరిద్దరికి కుటుంబ పరివార మనిన బొత్తుగా నిష్టము లేకుండెను. వీరు సమస్తమును వదలి పెట్టి యెల్లప్పుడు శ్రీవాస పండితుని యింటిలోనుండి శ్రీకృష్ణ కీర్తనము, భగవన్నామ జపము చేయ మొదలిడిరి. వీరు ప్రతి దినము నాలుగు గఁటలకే ఉషఃకాలమున నిద్రనుండిలేచి గంగాస్నానము చేయబోదురు. వీరు నియమముతో ప్రతి దినము రెండు లక్షలు హరినామము చేయుచుండెడువారు. వీరి కన్నులెల్లప్పుడును నీటితోనే నిండియుండును. పూర్వ విషయములను దలఁచుకొని తలఁచుకొని వీరిద్దరు సోదరులు అధీరులై పోదురు వీరికాహారపానీయములు, ఇంక నితర విషయము లన్నియు విష సమానములుగఁ దోఁచుచుండెను. వీరెవరితో మాటలాడరు. ఏమియును దినరు. రాత్రింబవళ్లు కండ్లవెంట నీరు కార్చుచునే యుందురు. శ్రీవాసుఁడు వీరిని తినుమని మిక్కిలిగ బ్రతిమలాడును కాని వీరికొక్క ముద్దైనను గొంతు దిగుటలేదు. నిత్యానందుఁడు చెప్పి చెప్పి విసిగిపోయెను. కాని వీరు కొంచెమైన నాహారము గొనుట

కంగీకరింపలేదు. అంత నిత్యానందుఁడు ప్రభువును బిలుచుకొని వచ్చెను. ప్రభువు తన కోమల కరములతో నీయిద్దరిని వీఁపు నిమురుచు 'సోదరులారా! మీ పాపముల నన్నిటిని నేను తీసికొంటిని. ఇప్పుడు మీరు నిష్పాపులైన తర్వాత కూడ భోజన మేల చేయరు? మీరు నిజముగా నాకు పాపముల నీయలేదా యేమి? లేక నాపైన మీకు విశ్వాసము లేదా?' అనెను.

చేతులు జోడించుచు నత్యంత దీనభావముతో నీ సోదరులు 'ప్రభో! మాకు మీమీఁద సంపూర్ణ విస్వాసమున్నది. మేము మా పాపములకొఱకై యేడ్చుటలేదు. మాకు పాపముల ననుభవింపవలసి వచ్చిన చాల యానందమే కలుగును. మాకు మీయొక్క యహైతుక కృప యెడల నేడ్పు వచ్చుచున్నది. మీరు మావంటి పతితులు, నీచుల యెడలఁ జూపిన యింతటి యపూర్వకృప జ్ఞాపకము వచ్చిన కొలఁది యుండి యుండి యెంత ఆపుకొన్నను నశ్రువులు ప్రవహించుట యాఁగుటలేదు' అనిరి. ప్రభువు వీరి కనేక విధముల నోదార్పు వచనములు పలికి యోదార్చిరి. జగాయి ప్రభువారి యోదార్పు వలనఁ గొంచెముగ శాంతించెను కాని మధాయి పశ్చాత్తాపము తగ్గలేదు. వానికి ఉండియుండి యాసంఘటనము అనఁగా నిరపరాధియైన నిత్యానందుని మస్తకము మీఁద నిర్దయతోఁగొట్టిన వృత్తాంతము జ్ఞాపకమునకు వచ్చుచుండెడిది. దీనిని స్మరించఁగానే వాని రోమములు నిక్కబొడిచెడివి. అంత నాతఁడు బిగ్గఱగ రోదనము చేయ ప్రారంభించెడు

వాఁడు. 'అయ్యో! నే నెంతటి నీచకార్యము నొనర్చితిని. ఒక మహాపురుషుని కకారణముగ నింతటి గొప్ప కష్టమును గలిగించితిని. ఆసమయమున భగవంతుని సుదర్శన చక్రము వచ్చి నా శిరస్సును తెగఁగొట్టినను, నిత్యానందుఁడు నన్ను వధించినను నేను కృతకృత్యుఁడ నయ్యెడు వాఁడను. వధించుటయు, కటు వాక్యములు పలుకుటయు నటుండనిండు. వాటినిచేయుట లేదుగదా పైగా నామేలుకొఱకు ప్రభువును ప్రార్థించుచునే యుండును. ప్రసన్న చిత్తముతో భగవన్నామ కీర్తనము చేయుచు మామేలునే కోరుచుండును' అని యీవిధముగ నెల్లప్పుడు విచారించుచుండెడు వాఁడు.

ఒకదినమున నేకాంతమందు మధాయి వెళ్ళి శ్రీపాద నిత్యానందుని చరణములను బట్టుకొని యేడ్చుచు నేడ్చుచు 'ప్రభో! నేనత్యంత నీచుఁడను, పామరుఁడను. నేను ఘోర పాపము చేసితిని. నేనా పాపముల నన్నిటిని మఱవఁగలను కాని మిమ్ములను నేను గొట్టిన విషయము నెంతగ మఱవవలె నన్నను మఱవఁజాలకున్నాను. దానిని మఱచుటకు నేనెంతగఁ బ్రయత్నము చేయుచుండిన నది యంతగ గ్రుచ్చుకొనుచున్నది. దాని నిష్కృతికి నాకేదైన నుపాయమును జెప్పుఁడు. మీరు దాని నాకేదైన నుపాయము చెప్పనంతవఱకు నాకాంతరిక శాంతి యెన్నటికిని ప్రాప్తింపఁజాల'దని ప్రార్థించెను.

మధాయి విషయమును విని నిత్యానందుఁడు 'సోదరా! నేను నీతో సత్యము చెప్పుచున్నాను. నా మనస్సులో నీ

యెడల లేశమాత్రము కూడ యేవిధమైన దుర్భావము లేదు. నేను నీమీఁద నా సమయమునఁ గోపమునైన చెందలేదు. ఒకవేళ నీహృదయములో దుఃఖమున్న యెడల దానికి తపమును గావింపుము. తపము వలననే సమస్త విధములగు సంతాపములు నశించిపోవును. తపము వలననే దుఃఖము, భయము, శోకము, మనః క్షోభము మొదలగు వికారము లన్నియు నశించిపోవును. తపస్వియగు భక్తుఁడే యథార్థముగ భగవన్నామమున కధికారియగును. స్త్రీ పురుషు లందఱు స్నానము చేసి నీకు శుభాశీర్వాదము లిచ్చునట్లు నీవు గంగకొక సుందర ఘట్టము నిర్మించుము. నీవక్కడే యుండి అమానియు, నమ్రుఁడవై తపము చేయుచు నివాసము చేయుచుండుము' అనెను.

నిత్యానంద ప్రభుని యాజ్ఞను శిరసావహించి మధాయి స్వయముగఁ దనచేతులతోఁ బరిశ్రమ కావించి గంగ కొక సుందరమగు ఘట్టమును కట్టెను. అక్కడే ఒక కుటీరమును నిర్మించి యాంతఁ డచ్చట నివసింప సాగెను. అచ్చట ఘట్టమునందు స్త్రీ పురుషులు, బాలకులు వృద్ధులు, మూర్ఖులు పండితులు, చండాలురు, పతితులు వీరిలో నెవరు స్నానమునకు వచ్చినను మధాయి వాని చరణములను బట్టుకొని తన యపరాధములను క్షమించుఁడని యాచించును. అతఁడు రోదనము చేయుచుఁ జేయుచు 'మేము తెలిసియు, తెలియకయు మీకే దైన నపరాధము చేసియుండవచ్చును. మావలన మీకెప్పుడైన నెట్టి కష్టము సంభవించినను వీటి యన్నిటికై మీ చర

ణములమీఁద వినమ్రములమై పడి క్షమా యాచన చేయు చున్నాము' అనుచుందురు. అందఱు వాని యీ నమ్రతను గాంచి యేడ్చుచుందురు. వానిని కౌగిలించుకొని వివిధములగు నాశీర్వాదముల నిచ్చుచుందురు.

ఎవనికి తనపాపముల విషయములో హృదయపూర్వకముగఁ బశ్చాత్తాపము చెందినచో దానిలో నాల్గవవంతు పాపము పశ్చాత్తాపమువలన నశించునని శాస్త్రములు చెప్పుచున్నవి. ఒకవేళ తనపాపకర్మలను లోకుల యెదుట బాగుగాఁ బ్రకటించినచో దానిలో సగము పాపము నశించి పోవును. పాపులయొక్క పాపములను తన మనఃప్రసన్నత కొఱకు చెప్పుచుండినచో ఆ చెప్పువానికి వాని పాపములో నాల్గవవంతు పాపము పోవును. ఈవిధముగా పాపమొనర్చువాఁడు పశ్చాత్తాపము చేతను, లోకులముందమానియై సత్యముగా తన పాపములను బ్రకటించుకొనుట వలనను మానవుఁడు నిష్పాపి యగును.

ఈ విధముగ మధాయిలో దీనత, మహాపురుషుల యొక్క యహైతుక కృప వలన భగవద్భక్తులయొక్క సమస్త గుణములు వానికబ్బెను. భగవద్భక్తులగువారు శీతోష్ణాది ద్వంద్వములను సహించువారలుగాను, సమస్త ప్రాణుల యందు కరుణా భావము నుంచువారుగాను, సమస్త జీవుల యెడల సౌహార్ద్రము చూపువారలుగాను, నెవరితోడను శత్రు

త్వమును బూననివారుగాను, శాంతులుగాను నెల్లప్పుడును సత్కర్మలను జేయువారుగా నుందురు. ♦ వారు విషయ భోగేచ్ఛ పొరపాటుననైనఁ గలిగియుండరు. వానికి సమస్త సద్గుణములు వాటికవియే వచ్చితీరును. ఎందుకు రావు ! భగవద్భక్తియొక్క ప్రభావమట్టిది. హృదయములో భగవద్భక్తి సంచారము కలుగుచుండఁగనే సమస్త సద్గుణములు వాటికవియే భగవద్భక్తుని దగ్గఱకు రాసాగును శ్రీమద్భాగవతములో నిట్లు చెప్పఁబడినది—

శ్లో॥ యస్యాస్తి భక్తిర్భగవత్యకించనా
సర్వైర్గుణైస్తత్ర సమాసతే సురాః ।
హరావభక్తస్య కుతో మహద్గుణా
మనోరథేనాసతి ధావతో బహిః ॥

శ్రీమద్భాగవతము ౫.౧౮-౧౨.

(అర్థము:- ఓ దేవతలారా ! ఏ భక్తునకు విష్ణు భగవానుని చరణకమలములందు అహైతుక భక్తి కలదో ఆభక్తుని హృదయమునందు సమస్త దివ్యములు వాటికవియే వచ్చి వాటికి నివాసమేర్పఱచుకొనును. ఎవఁడనిత్యమగు సాంసారిక విషయ సుఖములందే నిమగ్నుఁడై మనస్సను రథముపై నెక్కి విషయ

---

♦ శ్లో॥ తితిక్షవః కారుణికాః సుహృదః సర్వదేహినామ్ ।
అజాతశత్రవః శాంతాః సాధవః సాధుభూషణాః ॥

శ్రీమద్భాగవతము ౩,౨౫-౨౧.

మను మార్గమున విహరించునో యిట్టి యభక్తుని సమీపమున మహాత్మ్పురుషుల గుణము లెక్కడ నిలువఁగలవు ?)

ఈ విధముగ కొలఁది దినములలోనే మధాయియొక్క భగవద్భక్తియొక్క ఖ్యాతి దూరదూరముల వ్యాపించెను. లోకము వాని పూర్వపాపములను మఱచి పోవుటయే కాదు, ఆతని పూర్వపు మధాయి పేరుకూడ లోకమునకు స్మరణమునకు వచ్చుటలేదు. మధాయి యిప్పుడు 'బ్రహ్మచారి' యను పేర ప్రసిద్ధుఁడయ్యెను. ఆహా ! భగవద్భక్తిలో నెంతటి గొప్ప అమరత్వము కలదు ? భగవన్నామము పాపములను క్షయింపఁజేయుట కెట్టి యమోఘమగు నౌషధము ? ఈ రసాయన పానముచే పాపులలో ఘోరపాపియైనను బుణ్యాత్ముఁడు కాఁగలఁడు. నవద్వీపములో 'మధాయిఘాట్' అను పేరుతో నేఁటికిని యీ మహామహిముఁడు పరమ భాగవతుఁడగు మధాయి పేరు సమరము గావించుచు భగవంతుని యీ యాశ్వాసన వాక్యమును ఉచ్చస్వరముతో నిర్ఘోషించుచున్నది-

శ్లో॥ అపిచేత్సు దురాచారో భజతే మామనన్య భాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ।

శ్రీగీతా ౯-౩౦.

వాఁడెంత పాపియైనను గానిండు, వాని పాపముల నంతము చేయకున్నను సరియే, అట్టివాఁడైనను అనన్యుఁడై- సమస్తాశ్రయములను వదలి నన్నొక్కనినే మనఃపూర్వకముగ భజించుచు నాస్మరణధ్యానములను జేయునో, వానిని సర్వశ్రేష్ఠుఁడగు సాధువని తెలిసికొనవలయును. ఏలననఁగా వాఁడు బాగుగా నాలోనే యున్నాఁడు.

# సజ్జన భావము

శ్లో॥ తృష్ణాం ఛింధి భజ క్షమాం జహిమదం
పాపే రతిం మా కృథాః
సత్యం బ్రూహ్యనుయాహి సాధుపదవీం
సేవస్వ విద్వజ్జనమ్ ।
మాన్యాన్మానయ విద్విషోప్యనునయ
ప్రఖ్యాపయస్వాన్గుణాన్
కీర్తిం పాలయ దుఃఖితే కురు దయా
మేతత్సతాం లక్షణమ్ ॥

భర్తృహరి నీ. శ. ౭౫,

మహాప్రభు గౌరాంగదేవుని యందు భగవద్భావ భావన ఆయన యొక్క కొందఱంతరంగ భక్తులే యుంచుచుండెడువారు. కాని యాయనను పరమ భాగవత వైష్ణవ విద్వాంసుఁడనియు, గుణవంతుఁడగు సజ్జన పురుషుఁడనియు

భావావేశ సమయమును వదలిన నాతఁ డెన్నడును నెవని సమక్షముననైనను తన గొప్పదనమునుగూర్చిన విషయమును జెప్పెడువాఁడు కాదు. తనకంటె పెద్దలైనవారియెదుట నతఁడు సర్వదా వినమ్రుఁడై చరించుచుండును. శ్రీవాసుదేవానందనాచార్యుఁడు, చంద్రశేఖరాచార్యుఁడు, అద్వైతాచార్యుఁడు మొదలగు తన భక్తులకు ఆతఁడు వృద్ధులనిభావించి ముందుగనే ప్రణామ మాచరించును.

ఒకే వస్తువును చాలమంది కోరుచున్నప్పుడు వారు పరస్పరము విద్వేషించుకొనుచుండుట అదొక సాంసారిక నియమముగనుండును. మనకు ఒకానొక యిష్టవస్తువును బొందుటకు కొంచెమైన నాశయుండిన నైనను మనము దానినే యింకొకరు కోరిన వారి నకారణముగ ద్వేషింతుము. ఇది స్వాభావికము. ప్రపంచములో నింద్రియ భోగ్యపదార్థముల మీఁదను, కీర్తి మీఁదను అందఱకు కోరిక యుండును. ఎవని వద్ద యింద్రియ భోగ్యపదార్థము లెక్కువగ నుండునో, ఎవనికి ప్రపంచములోఁ గీర్తి వచ్చుచుండునో వానిని జూచిన లోకులు కొంచెము ద్వేషింప నారంభింతురు. సజ్జన పురుషులు సుఖుల యెడల మైత్రియు, దుఃఖులయెడలఁ గరుణయు, పుణ్యాత్ముల యెడలఁ బ్రసన్నతయు, పాపాత్ములయెడల నుపేక్షాభావము నుంతురు. సర్వసాధారణులు ధనికుల యెడలను, ప్రతిష్ఠితుల యెడలను నుదాసీనముగ నుందురు. అధికముగ నున్న దుష్ట ప్రకృతి గలవారు సర్వదా ధనికులను, గౌరవనీయులు నగు

సజ్జనులను నిందించుచునే యుందురు. ఎక్కడైన నలుగురు ఒకానొకనిని గూర్చి ప్రశంసించిరా, ఆ సమయముననే వారిలో దాగియున్న యీర్ష్యాజ్వాల ప్రజ్వలింపఁ బ్రారంభించి, కొన్ని నిజములు, అబద్ధములు వార్తలను వ్యాపింపఁజేసి జనములలో వారిని నిందించుట కారంభింతురు. ఇట్టి నిందకుల బారినుండి అవతార పురుషులుకూడ తప్పించుకొనలేక పోయిరి. గౌరాంగ ప్రభుని విషయములోఁగూడ దినదిన ప్రవర్ధమానముగఁ బెరుగుచున్న కీర్తిని, ఆతనిచుట్టు నాల్గువైపుల వ్యాపించిన యశస్సౌరభము చేత క్షుభితులై కొందఱు నిందకు లాయనను గూర్చి వివిధములగు నిందలువేయ మొదలిడిరి. ఒకఁడాతని వామమార్గావలంబుఁడనును, వేఱొకఁడాయనను మోసగాఁడని తన హృదయమాలిన్యమును బయట పెట్టుకొనును. కొందఱాతనిని ధూర్తుఁడందరు. కొందఱింద్ర జాలికుఁడనియు ననుచుండిరి. ప్రభు వన్నిటిని విని నవ్వును. ఆతఁ డెన్నడును తన నిందకులను నే విషయములోను విరోధించలేదు. ఇంకను నిందకులను పొగడుచుండెడువాఁడు. ఆతని సహనశీలత, విద్వేషించు వారి యెడలను గూడ కరుణాభావము జూపుట విషయములో నీ క్రింద నుదహరింపఁబడఁబోవు రెండు సంఘటనలవలన బాగుగా పాఠకులకుఁ దెలియఁగలదు.

శ్రీవాసపండితుని యింటిలో సంకీర్తనము సర్వదా తలుపులుమూసి చేయుచుండుట పాఠకులందఱకుఁ దెలిసిన విషయమే. సంవత్సరము పొడుగునను సర్వదా యిదే విధముగ

సంకీర్తన జరుగు చుండెడిది. చాలమంది విద్వేషులు, విలాస ప్రియులు చూచుటకు వచ్చెడువారు. ఇచ్చట తలుపులు మూయుటచూచి సంకీర్తనను నిందించుచు తిరిగిపోయెడువారు. ఆతనియం దీర్ష్యవహించు విద్వేషులలో గోపాలచాపాలుఁడను పేరుగల ఒక క్షుద్ర ప్రకృతిగల బ్రాహ్మణుఁ డుండెను. ఆతఁడు దినదిన ప్రవర్థమానముగఁ బెరుగుచున్న ప్రభుని కీర్తివలన క్షోభితుఁడై, యాతఁడు సంకీర్తన కపకీర్తి తేవలెనని మనస్సులో నిశ్చయము చేసికొనెను. ఒక దినమున రాత్రి కాలమున నతఁడు శ్రీవాస పండితుని ద్వారము దగ్గఱకు వచ్చెను. ఆ సమయమున ద్వారము బంధింపబడియుండెను. లోపల సంకీర్తన జరుగుచుండెను. చాపాలుఁడు ద్వారము ముందు కొంచెము గ నలికి అక్కడ చండీ పూజాసామగ్రి నుంచెను. ఒక చిన్న కుండకు నెఱ్ఱని, పచ్చని, నల్లని బొట్లు కట్టి ఆసామగ్రి దగ్గఱ నుంచెను. ఒక సారాయి పాత్ర, ఒక పాత్రలో మాంసముకూడ పెట్టి అక్కడుంచెను. ఇట్లన్నియుఁ బెట్టి వాని ్రలోవను వాఁకు వెళ్ళిపోయెను. మఱునాఁడు సంకీర్తన చేసి భక్తులందఱు బయటకు వచ్చునప్పటికి ద్వారములో వారు చండీ పూజయొక్క సమస్త సామగ్రిని గాంచిరి. దుర్మార్గుల గుంపుకూడ వచ్చి అక్కడకు చేరి, ఒకరొకరు చెప్పుకొనుచు 'మాకు మొదటనే తెలియును వీరు రాత్రులందు తలుపులు మూసికొని స్త్రీలను గూడ వెంట లోపలికి తీసికొనిపోయి హుషారుగా హరిధ్వని చేయుచుందురు. లోపల లోపల వామ మార్గ పద్ధతి ప్రకారముగా భైరవీ చక్రపూజ గూడ చేయు

చుందురు. చూడుఁడు, కాళీ పూజాసామగ్రి ప్రత్యక్షముగఁ గాంచుఁడు అనిరి. సజ్జనులైనవారు ఇదేదో ధూర్తులు చేసిన కార్యమని తెలిసికొనిరి. అందఱు నైక్యకంఠముతో నిట్లు చేసిన ధూర్తుని నిందింపసాగిరి. శ్రీవాసుఁడు చప్పట్లుకొట్టుచు నవ్వసాగెను. లోకులు 'చూడండయ్యా! మనము రాత్రులందిట్టి చండీపూజ చేయుచుందుము. భద్రపురుషులకు నేఁడు స్పష్టముగ తెలిసిపోయెను' అనుకొనిరి. భక్తులా సామానునంతయుఁ దీసి దూరముగ పాఱవేసి, యా స్థానమును గోమయముతో నలికి గంగాజలమును చల్లి శుద్ధికావించిరి.

మఱునాఁడే గోపాలచాపాలునికి శరీరమంతయు గలిత కుష్ఠురోగము సంభవించుట లోకులందఱు గమనించిరి. వాని శరీరమంతటినుండి చీము కారుచుండెను. ఇంతేకాక గాయములు దురదపుట్టెడివి. దురదవలన నాతఁడు కుయ్యో మొఱ్ఱో యని నిరంతర మఱచుచుండెడువాఁడు. నగరములోని వారది అంటురోగమని ఆపేటనుండి తఱిమివేసిరి. ఏలననఁగా కుష్ఠము తాఁకిననే వచ్చును. పాపము వాఁడు గంగానదియొడ్డున నొక వేప చెట్టుక్రింద పడియుండెడువాఁడు. ఒక దినమునఁ బ్రభువును గాంచి దీనభావముతో 'ప్రభో! నేను చాల యపరాధము గావించితిని. నా యీ యపరాధమును మీరు క్షమింపరాదా? మీరు జగత్తు నుద్ధరించుచున్నారు. ఈ పాపినిగూడ నుద్ధరింపుఁడు. నీవు వరుసకు నాకు మేనల్లుఁడ వగుదువు. నీ యీ దీనహీన మామపై నేల కృపఁజూపవు? నేను మిక్కిలి దుఃఖి

తుఁడను. 'ప్రభో! నాదుఃఖమును దూరము కావించుము' అని ప్రార్థించెను.

ప్రభువు 'ఏమైన కానిండు, నేను నా యపరాధినికూడ క్షమింతును కాని నీవు శ్రీవాస పండితున కపరాధము కావించితివి. అందువలన నిన్ను క్షమించుటకు నాకు సామర్థ్యము లేదు' అనెను. పాపము వాఁడు మెదలకుండెను. ఆతఁడు తన నీచతమను, దుష్టత్వమునకును ఫలముగ కుష్ఠరోగ దుఃఖముచే దుఃఖితుఁడగుచు వేదనా సహితముగ ననుభవించుచుండెను.

కొలఁది దినముల తర్వాత ప్రభువు సన్న్యాసము తీసికొని కులియాకు వచ్చినప్పుడు యీ కుష్ఠిరోగి మరల వీరిని శరణు జొచ్చెను. అప్పుడీతఁ డాతనిని శ్రీవాస పండితుని దగ్గఱకు పంపివేసెను. శ్రీవాస పండితుఁడు 'నాకీతనితో మొదటి నుండియు ద్వేషములేదు. ఇప్పుడును లేదు. ప్రభువీతనిని క్షమించెనా యీతఁడిప్పుడు దుఃఖములనుండి ముక్తి చెందినట్లే' ననెను. చూచుచుండగనే ఆతని శరీరమంతయు నిరోగమయ్యెను.

ఈ విధముగనే ఒకదినమున నింకొక బ్రాహ్మణుఁడు సంకీర్తనను జూచుటకు వచ్చెను. ఆతఁడు వచ్చునప్పటికి తలుపులు లోపల వేయఁబడి యుండెను. అంత నాతఁడు మండిపడి సంకీర్తన పరులను నా నామాటలని, దూషించి, తిట్టి యింటికి పోయెను. మఱునాఁ డతఁడు ప్రభువు భక్తులతో గంగాస్నానము చేయుటను ఆతఁడు గంగకు వచ్చినప్పుడు

కొంచి ప్రభువుతో 'నీవు నీ సంకీర్తనము నెడల మిక్కిలిగర్వము వహించి యుందువు. పది యిరువదిమంది అమాయకులను కొయ్యబొమ్మలను వలె చేతిలోఁబెట్టుకొని చేతిసైగచే నాడించుచున్నావు. లోకులందఱు నీకు పూజచేయుచుండు నప్పటికి నీకహంకారము హెచ్చినది. వెళ్లు, నేను నీకు శాపమిత్తును. ఏసాంసారిక సుఖమదమున నీవింతగ నోడలు తెలియకున్నావో ఆ నీ సంసార సుఖములు శీఘ్రముగ నశించుఁగాక!' యనెను. బ్రాహ్మణుఁ డిట్లు పలుకుచుండుటను విని భక్తులందఱును పరమాశ్చర్యముతో నా బ్రాహ్మణుని ముఖమును జూచుచుండిరి. కొందఱకు కొంచెముగఁ గోపముకూడ వచ్చెను. ప్రభువు వారినందఱను వారించుచు నవ్వి యా బ్రాహ్మణదేవతతో 'విప్రదేవా! మీ చరణములకు నేను ప్రణామము చేయుచున్నాను. మీశాపము నాకు పరమానందకరముగ సమ్మతమే' యనెను.

కొంచెము సేపటికి బ్రాహ్మణుని కోపము శాంతించెను. అంత నాతఁడు తన వాక్యములకుఁ బశ్చాత్తాపమును బ్రకటించుచు వినీత భావముతో 'ప్రభో! నేను క్రోధమునకు వశీభూతుఁడనై మిమ్ములను గూర్చి యిట్టి కువాక్యములను బలికితిని. మీరు నాయపరాధమును క్షమింపుఁడు' అనెను.

ప్రభువాతని నాశ్వాసించుచు 'విప్రోత్తమా! మీరు నాకేమియు నపకారము చేయలేదు, నన్ను మీరేవిధమైన కువాక్యములు పలుకలేదు. మీరిచ్చినది నాకు శాపముకాదు

వరదానమిచ్చితిరి. శ్రీకృష్ణప్రాప్తికి సాంసారిక సుఖములు బంధనమునకుఁ బ్రధాన కారణములు. మీరు వాటినుండి బయటపడవేయు వరప్రదానము కావించితిరి. అది నామేలునకే యగును. దీని విషయములో మీరేమాత్రము చింతింప వలదు' అనెను. ఇట్లని ప్రభువా బ్రాహ్మణుని ప్రేమ పూర్వకముగ నాలింగనము చేసికొనెను. అంత నాతఁడు భక్తులతోఁ గూడి తన స్థానమునకుఁ వచ్చెను. దీనిపేరే విద్వేషించు వారి యెడల కూడ శుద్ధభావము నుంచుట. ఇట్టివ్యవహారము మహాప్రభువు వంటి మహాపురుషుల ద్వారా యగును గాని యన్యుల వలనఁగాదు.

మహా ప్రభుని నమ్రత మిక్కిలి యలౌకికమైనది. ఆతఁడు దారిన వెళ్లుచుండిన స్త్రీ యెదురైన నెన్నడును జూడఁడు. పెద్దలతో నెల్లప్పుడును దీనతా సమ్మాన పూర్వకముగ సంభాషించెడువాఁడు. భావావేశ సమయములో మాత్ర మతఁడు తన స్వరూపమును పూర్తిగ మఱచిపోయెడు వాఁడు. భావావేశ సమయమునఁగాక యన్యసమయములందతని కెవఁడైనఁ బూజ గావించినను, చరణవందనము కావించినను మిక్కిలి యసంతుష్టి చెందెడు వాఁడు. భావావేశానంతరమున నెవఁడైన మేము నిన్ను దుర్గా రూపములోను, శ్రీకృష్ణ రూపములోను, రామ రూపములోను బలరామ, వామన, నృసింహాది రూపములలోను దర్శనము చేసినామని చెప్పినచో నాతఁడు 'మీరెల్లప్పుడును నారూపమునే చింతించుచున్నారు.

మీ యిష్టదేవునియందు సమస్త సామర్థ్యము లున్నవి. ఆయన యెవని శరీరమందైనను ప్రవేశించి మీకు దర్శన మీయఁగలఁడు. దీనికి మీ భావనయే ప్రధాన కారణము. మీకు మీయొక్క శుద్ధభావన వలననే యిట్టి రూప సందర్శన మగును' అనును.

ఒకసారి యీతఁడు భక్తులతోఁగూడపరుండి యుండెను. ఇంతలోనే ఒక బ్రాహ్మణ స్త్రీ వచ్చి యీతని చరణములందు తన మస్తకము నుంచి యీతనికి భక్తి భావముతోఁ బ్రణామము కావించెను. బ్రాహ్మణస్త్రీ తన చరణములందామె మస్తకము నుంచుటను గాంచ నీతనికి మిక్కిలి దుఃఖము కలిగెను. ఆ సమయముననే పరుగెత్తుకొనిపోయి గంగలో దుమికెను. భక్తులందఱును నీతడిట్లు గంగలో దుముకుటను గాంచి హాహాకారములు చేయసాగిరి. శచీమాత అొమ్మ్మ బాదుకొనుచు రోదనముచేయ ప్రారంభించెను. ఆసమయమున నిత్యానందుఁడు, హరిదాసు వీరిద్దరు కూడ వెంటనే ప్రభువుతోఁగూడ గంగలోనికి దుమికి బయటకుఁ దీసికొని వచ్చిరి.

ఈ విధముగ నీతఁడు తన జీవనమును రాగద్వేషాదులు రానీయకుండ క్షమను ధరించుచు, నభిమాన రహితుఁడై, పాపులతోడనైనను ప్రేమ వర్తనమునే కలిగియుండుచు, విద్వేషులతోఁగూడ సుందర వ్యవహారమును జేయుచు తన యొక్క సజ్జనతను, సహృదయతను, సహనశీలతను, సచ్చరిత్రత్వమును భక్తులకొక యుచ్చాదర్శపాఠమును బోధించుచు తన యాచరణముద్వారా అందఱను నానందితులఁజేయ మొదలిడెను.

# శ్రీకృష్ణలీలాభినయము

శ్లో॥ క్వచి ద్రుదతి వైకుంఠ చింతాశబలచేతనః ।
క్వచి ద్ధసతి తచ్చింతా హ్లాద ఉద్గాయతి క్వచిత్ ॥
నదతి క్వచిదుత్కంఠో విలజ్జో నృత్యతి క్వచిత్ ।
క్వచిత్ తద్భావనాయుక్త స్తన్మయోఽనుచకార హ ॥

శ్రీమద్భాగవతము ౭-౪-౪౧-౪౨

(భగవత్ప్రేమలో నున్మత్తులైన భక్తుల స్థితినిగూర్చి వర్ణించుచున్నారు— ఒకొక్కప్పుడు భగవచ్చింతన వలన వాని హృదయము క్షోభించును. భగవానుని యొక్క వియోగజన్య దుఃఖస్మరణముచే నతఁడేడ్వ మొదలిడును. ఒకొక్కప్పుడు భగవచ్చింతనము వలన ప్రసన్నుఁడై భగవానుని రూపసుధాపానము కావించుచుఁ గావించుచు నవ్వ ప్రారంభించును. ఒకొక్కప్పుడు బిగ్గఱగ భగవన్నామమును, గుణములను గానముచేయ మొదలిడును. ఒకొక్కప్పు డుత్కంఠతతో హుంకారముచేయును. ఒకొక్కప్పుడు నిర్లజ్జుఁడై నృత్యము

సేయ మొదలిడును. ఒక్కొక్కప్పు డతఁ డీశ్వర చింతనములో అత్యంత లవలీనమై తన్మయుఁడై తనంతటతానే భగవల్లీలాను కరణము చేయ మొదలిడును.)

ఒకవేళ నెవఁడైన నన్ను భక్త పరిభాషలో నొక్క శబ్దములో చెప్పవలసివచ్చిన వారికి 'లోకబాహ్యుఁడు' అను శబ్దమును జెప్పెదను. ఈ ఒక్క శబ్దములోనే భక్త జీవనము యొక్కయు, భక్తిమార్గము యొక్కయు పవిత్ర పథమున పథికునియొక్క పూర్ణ పరిభాష పరిలక్షిత మగును. భక్తుల యొక్క కార్యము లన్నియు విలక్షణములుగ నుండును. వారు లోకమును లక్ష్యపెట్టరు. బాలకులవలె వారు సర్వదా ఆనంద ములో మత్తులై యుందురు. వారి కేడ్పుటలోఁగూడ ఆనం దముకలదు. నవ్వులోఁగూడ ఆనందము కలుగును. వారు తమ ప్రియతముని స్మృతిలో సర్వదా స్పృహతప్పి యుందురు. ఏ సమయమున వారి ప్రియతముని వాక్యములు రెండుమూఁడు వినెనా ఆహా! అప్పుడు వారి యానందమును గూర్చి చెప్ప వలసినదేమి ? ఆ సమయమున వారి అంగ ప్రత్యంగములలో సమస్త సాత్త్విక భావము లుదయించును. యథార్థస్థితి యొక్క లక్షణము ఆ సమయమునఁ దెలియును. రండు ప్రేమావతారుఁడగు శ్రీచైతన్యుని శరీరమందు సమస్త భక్తుల లక్షణములను దర్శింపుఁడు.

ఒక దినమున శ్రీవాస పండితుని యింటిలో ప్రభువు భావావేశములోనికి వచ్చి 'వంశీ వంశీ' అనుచు నా పురాణ

మురళీని యాచింప మొదలిడెను. కొంచెము సవ్వుచు శ్రీవాస పండితుఁడు 'ఇక్కడ మురళీ యెక్కడిది? నీ మురళీని గోపికలు హరించిరి' అనెను. ఈ మాత్రము వినఁగానే ప్రభువు ప్రేమ విహ్వలుఁడయ్యెను. ఆతని సమస్తావయవములందు సాత్త్విక భావోద్దీపనము కలుగసాగెను. అతఁడు గద్గద కంఠముతో మాటిమాటికి శ్రీవాస పండితునితో 'అవును వినిపించుము కొంచెము వినిపించుము. వంశీ లీలలను వినిపించవేమి? పాపమా బోలు సారహీనమైన మురళీ ఆగోపికలకేమి హాని కావించినది. దానిని వారు హరించుటకు! పండితులవారూ! నీవు నాకా కథా ప్రసంగమును వినిపించుము' అనెను. ప్రభువీ విధముగ బలవంతము చేయుట చూచి శ్రీవాసుఁడు 'ఆశ్వీజ మాసము, శరదృతువు. భగవానుఁడగు నిశా నాథుఁడు తన సంపూర్ణ కళలతో నుదయించి ఆకాశ మండలమును ఆలోకమయము కావించుచుండెను. ప్రకృతి శాంతముగ నుండెను. విహగ బృందము తమతమ గూళ్ళలో పడి శయనించి యుండెను. బృందావన నికుంజములు స్తబ్ధగ నుండెను. రజనీ నీరవతను నాశము గావించుచు యమునానది తన నవలీల జలములతో హుంకారము చేయుచు మెల్లమెల్ల గాఁ బ్రవహించుచుండెను. ఆ సమయమున మోహన మనో హర మధుర స్వరముగల గానము గోపికల కర్ణములలోఁ బడెను' అనెను.

ఇది వినునప్పటికి ప్రభువు మూర్ఛపడి భూమిమీఁద పడి కన్నులనుండి అవిరళ ఆనందాశ్రువులను గార్చుచు శ్రీవాస

పండితునితో 'ఆఁ తర్వాత! తర్వాత యేమైనది? తర్వాత చెప్పుము! చెప్పవేమి? నా ప్రాణవల్లభుని మురళీ మధుర గానమును వినుటకు ఉత్కంఠత కలుగు చున్నది' అనెను.

శ్రీవాసుఁడు మరల 'ఆ మురళీధ్వని యెవరి కర్ణము లలోఁబడినదో, ఎవరా మన మోహన గానమును వినిరో వారు స్పృహలు తప్పిరి. అందఱు తికమకలై, మనస్సులో మనస్సులు లేక నిలిచిరి. వారికి శరీరస్పృహ అణుమాత్ర మైన లేకుండెను. ఆ సమయమున-

శ్లో॥ నిశమ్య గీతం తదనంగ వర్ధనం
వ్రజస్త్రియః కృష్ణ గృహీత మానసాః।
ఆజగ్మురన్యోఽన్య మలక్షితోద్యమాః
స యత్ర కాంతో జవలోలకుండలాః॥

శ్రీమద్భాగవతము ౧౦-౨౯-౪.

ఆ యనంగవర్ధనము గావించు మురళీ మనోహర గానమును విని, ఎవరి మనసులను శ్రీకృష్ణుఁడు తన వైపునకు లాగు కొనెనో అట్టి యాగోకులములోని గోపికలు సాపత్న్య భావముచే తాము వచ్చు సంగతి ఒకరొకరు తెలుపుకొనలేదు. వారు శ్రీకృష్ణుని యాజగన్మోహన గానమున కధీనలై, యాధ్వని యెక్కడినుండి వచ్చుచున్నదో దానిని లక్ష్యము చేసికొని కూర్చుండినవారు కూర్చుండినట్లుగ లేచి బయలుదేరిరి. ఆ సమయమునఁ బరువిడు శీఘ్రతా కారణమున వారి కర్ణములందు

కదలుచున్న కమనీయ కుండలములు మిక్కిలి సుందరములుగ దోఁచుచుండెను.

'అవును బాలు పితుకునది యాపితుకు చెంబు నక్కడనే విసరికొట్టినది. పాలుపితుకుటకు దూడను వదలిపెట్టినవారల్లే ఆదూడను కట్టకుండపోయి, దానిని కట్టివేయవలెనను స్పృహా కూడ లేకుండ నుండిరి. పాలను కాచువారు అవిపొంగి పోవు ననికూడ చూడకుండపోయిరి. తల్లి బిడ్డలను విసరి పాఱ వైచియు, పత్నులు భర్తల కౌగిండ్లలోనుండి దూసుకొనియు, తోఁబుట్టువులకు అన్నమును బెట్టుచునే వదలి యావైపునకుఁ బరువిడిరి.' శ్రీవాసుఁ డిట్లు చెప్పుచునే యుండెను, ప్రభువు భావావేశములో వినుచునే యుండెను. ఇద్దరును స్పృహాలు తప్పి యుండిరి. ఈవిధముగ శ్రీకృష్ణ కథను చెప్పుచుఁ జెప్పుచు రాత్రియంతయు గడచిపోయెను. భగవంతుఁడగు భువన భాస్కరుఁడుకూడ గృహామునకు మఱియొకవైపున దాగియుండి యాలీలలు నాస్వాదించుచుండెను. సూర్య ప్రకాశమును జూడఁగానే ప్రభువునకుఁ గొంచెము బాహ్యజ్ఞానము కలిగెను. ఆతఁడు ప్రేమపూర్వకముగ శ్రీవాసపండితుని గట్టిగ కౌగిలించుకొని 'పండితులవారూ! నేఁడు మీరు నాకు దేవ దుర్లభ రసము నాస్వాదింపఁ జేసితిరి. నేఁడు మీ శ్రీముఖము నుండి శ్రీకృష్ణ లీలాశ్రవణము కావించి కృతకృత్యుఁడనైతిని' అనెను. ఇట్లు పలికి ప్రభువు నిత్యకర్మ నివృత్తి కొఱకు వెడలి పోయెను.

మఱునాఁడు ప్రభువు సమస్త భక్తుల దగ్గఱకు వెళ్ళి యిప్పుడు మనము శ్రీకృష్ణలీలాభినయము చేయవలెనని పరామర్శించెను. స్థాన ప్రశ్నరాఁగా ప్రభువు తానే తన పెద తల్లి భర్త (పెత్తండ్రి) యగు పండిత చంద్రశేఖరాచార్యరత్నము యొక్క యింటిని జెప్పెను. భక్తులందఱకు నాస్థాన మనుకూలముగఁ దోఁచెను. ఆ యిల్లుకూడ చాలపెద్దది. అక్కడికి భక్తుల ఆడవాండ్రుకూడ సంకోచములేక వచ్చిపోవుచుందురు. భక్తులు ఏలీలలను అభినయించవలెనో ఏయే పాత్రల నెవరెవ రభినయించవలెనని విషయమునడుగఁగాఁ బ్రభువు ప్రత్యుత్తరముగ 'దీనికింకను నిశ్చయము కాలేదు. లీల జరుగుట నిశ్చయము. పాత్రల నెవరికి వారెన్నుకొనవలయును. పాత్రముల పాఠమునకేమియు నిశ్చయములేదు. ఆ సమయమున నెవరికే భావమువచ్చునో అతఁడా భావములోనే తన విచారములను బ్రకటించవలయును. ఇప్పుడు మనము నిశ్చయము చేసితిమా అది కృత్రిమలీలయే యగును. ఆ సమయమున నెవనికెట్టి స్వాభావిక స్ఫురణము కలుగునో వారికాపాత్ర. ఇది విని భక్తులందఱు మిక్కిలి ప్రసన్నులైరి. ప్రతి అంతరంగ భక్తునకు మఱునాఁడు ప్రత్యక్షముగ వారు బృందావన లీలను దర్శింతుమని తోఁచెను.

ప్రభువా సమయముననే పాత్ర నిర్ణయము కావించెను. పాత్రల నెన్నుకొనుటలో భక్తులలో మిక్కిలి యొగతాళి పరియాచకములు రేగెను. అన్నిటికంటె మొట్టమొదట నాటక

మును నడిపించు సూత్రధారుఁ డెవఁడా యను ప్రశ్న యుద్భ
వించెను. ఒక భక్తుఁడు 'సూత్రధారుఁ డవసరమైన బాగుగా
దెబ్బలు తినుటకైన సిద్ధమగునట్లు లావుగా నుండవలెను.
వీలననఁగా సూత్రధారుఁడే అందఱను గనిపెట్టి యుండవల
యును' అనెను. ఇది విని నిత్యానందుఁడు 'ఈపనిని హరిదాసు
నకు ఒప్పగించవలయును. ఈతఁడు దెబ్బలు తినుటలోఁగూడ
మొనగాఁడు' అనెను. అందఱును నవ్వసాగిరి. ప్రభువు కూడ
నిత్యానందుని వాక్యమును సమర్థించెను. ఆ సమయముననే
ఒక భక్తుఁడు మెల్లగా 'నారదో కలహ ప్రియః' 'నారదుఁడు
పోట్లాటలనిన మిక్కిలి ప్రీతిచెందువాఁడు' అనెను. అంత
నద్వైతాచార్యుఁడు నవ్వుచు 'ఈ నారద భగవానుఁ డింత
కంటె నధిక కలహమేమి కావింపఁగలఁడు ? నేఁడీ నవద్వీప
ములో నింత కోలాహలమునకు, నింత గోలకు ఆదికారణ మీ
నారదావతారమగు శ్రీవాస మహారాజే' అనెను. ఇంతలోనే
మురారి 'ఏమండోయ్, నారదున కొక శిష్యుఁడు కూడ నుండ
వలెనుగాదూ, నారదున కిష్టమైనచో నే నీయనకు శిష్యుఁడ
నయ్యెద' ననెను.

ఇది విని గదాధరుఁడు- 'నారదునకు కడుపులో నొప్పి
పుట్టలేదుగదా, అట్లైన హింగాష్టక చూర్ణము కొఱకొక
వైద్యునే యీతనికి శిష్యునిగా వేయుట మంచిది. ఆయన
కొక బ్రహ్మచారి శిష్యుఁడు కావలయును. నీవు గృహస్థు
వైతివి. నిన్ను శిష్యునిగాఁగైకొని నారదుఁడేమి చేయును ?

ఆయన శిష్యుఁడుగా నీలాంబర బ్రహ్మచారి కానే అయినాఁడు' అనెను.

ప్రభువు ముసిముసి నవ్వులు నవ్వుచు 'భువన మోహిని లక్ష్మీదేవి అభినయము నేను చేసెదను. కాని నాకు సఖియైన లలిత యెవరు కాఁగలరు?' అనెను. అంత పుండరీక విద్యానిధి 'ప్రభువునకు లలిత సర్వదా ప్రభువు వెంబడి ఛాయవలె నుండును. ఈ గదాధరుఁడే లలిత సఖి' అనెను. అంత భక్తులందఱును నైక్యకంఠముతో 'బాగున్నది. ఉంగర మొటు వంటిదో దానిలోని రత్నము అట్టిదే కూర్పఁబడినది' అనిరి. అంత ప్రభువు నవ్వి 'అంతయు బాగుగనే యున్నది. మనకొక ముసలి మహిమానుఁడొకఁడు కావలెను. దానికి శ్రీపాద నిత్యానందుఁడున్నాఁడుగదా !' అనెను. ఇంతలోనే అధీరుఁడై యద్వైతాచార్యుఁడు 'ప్రభో ! నన్నసలు మఱచియే పోయి నారే ? ముసలి వాండ్రభినయము చేయఁజాలరనియా?' అనెను.

ప్రభువు నవ్వుచు 'మిమ్ములను ముసలివారను వారి బుద్ధి ముసలిదై పోయిన దనవలెను. మీరు భక్త శిరోమణులు. దానమును గైకొను బృందావన విహారి శ్రీకృష్ణుఁడు మీరే కాఁగలరు' అనెను. ఇది విని భక్తులందఱు చాల సంతసించిరి. అందఱు తమతమ కార్యములను ప్రభువు నడిగిరి. బుద్ధిమంత ఖానకు సదాశివునకు రంగస్థలము నేర్పఱచు పని వప్పగింపఁ బడినది. బుద్ధిమంతఖానుఁడు జమీందారుఁడు, ధనవంతుఁడు, అతఁడు వివిధములగు సామాను ఆచార్యరత్నము యొక్క-

గృహమునకు దెచ్చెను. ఒక యెత్తైన తిన్నె మీఁద రంగస్థల మేర్పఱుపఁబడినది. కుడివైపున స్త్రీలు కూర్చుండుటకు స్థల మేర్పఱుపఁబడినది. ఎదురుగాఁ బురుషులకొఱకు కేర్పఱుపఁ బడినది. నియత సమయమునకు భక్తుల భార్యలందఱు ఆచార్య రత్నమింటికి వచ్చిరి. మాలినీదేవి, శ్రీవిష్ణుప్రియతోఁగూడి శచీమాతకూడ నాట్యాభినయము చూచుటకు వచ్చిరి. క్రమ ముగా భక్తులందఱు సమావేశమైరి. భక్తులందఱు వచ్చిన తర్వాత తలుపులు వేయఁబడినవి. అంత లీలాభినయమారంభ మైనది.

లోపల కూర్చుండి వాసుదేవాచార్యుఁడు పాత్రములను రంగస్థలమునకుఁ బంపుటకై అలంకరించుచుండెను. ఇచ్చట తెరపడినది. అన్నిటికంటె ముందు మంగళాచరణము జరిగి నది. అభినయములో గానము చేయుటకు అయిదుగురు మను ష్యులను నియమించిరి, పుండరీక విద్యానిధి, చంద్రశేఖరా చార్య రత్నము, శ్రీవాస పండితుని యొక్క సోదరులు రమాయి మొదలగువారు. విద్యానిధి కంఠము మిక్కిలి మధుర మైనది. అతఁడు మొదట పాడుటయు, నాతని స్వరములో మిగిలిన నలుగురి స్వరములు కలుపుచుండిరి. విద్యానిధి మొట్ట మొదట తన కోమల కంఠముతో నీశ్లోకమును గానముచేసెను-

శ్లో॥ జయతి జనని వాసో దేవకీ జన్మవాదో
యదువర పరిషత్స్వై ర్దోర్భిరస్య న్నధర్మమ్ ।
స్థిరచరవృజినఘ్నః సుస్మితః శ్రీముఖేన
వ్రజపుర వనితానాం వర్ధయన్ కామదేవమ్ ॥

శ్రీమద్భాగవతము ౧౦ ౯౦-౪౮.

(తా॥ సమస్త జీవుల కాశ్రయమైన వాఁడును, అడుగఁగానే దేవకీ గర్భమున జన్మించినవాఁడును, సేవకులవలె నాజ్ఞాకారులగు గొప్పగొప్ప యదుశ్రేష్ఠులతోఁగూడి తన బాహు బలముచే నధర్మ సంహారము కావించిన వాఁడును, చరాచర జగత్తుయొక్క దుఃఖములను దూరముచేసినవాఁడును, సుందర హాస్యశోభిత ముఖమును జూచి వ్రజబాలల హృదయములందు కామోద్దీపనము కలుగునట్లు చేయువాఁడును నగు నా శ్రీ కృష్ణునకు జయమగుఁగాక!)

దీని తర్వాత నింకొక శ్లోకము మంగళా చరణమునకు గానము చేయఁబడినది. అంత సూత్రధారుఁడు రంగస్థలమునకు విచ్చేసెను. నాటకమునకు పూర్వమున సూత్రధారుఁడు వచ్చి మొదట నాటక ప్రస్తావన గావించి, యాతఁడు తన సఖునితో మాటలలోఁ గలిపి తన యభిప్రాయమును బ్రకటించును. దేనికి యాతఁడు తన యభిప్రాయమును బ్రకటించునో వానిని పరిపార్శ్వకుఁడందురు. సూత్రధారుఁడు (హరిదాసు) తన పరిపార్శ్వకు (ముకుందు) నితోఁగూడి రంగస్థలమునఁ బ్రవేశించెను. ఆ సమయమున దర్శకులలో నెవరును హరిదాసును గుర్తుపట్టలేక పోయిరి. ఆతని చిన్న చిన్న దంతములు, పైన సుందరమగు తలపాగ చుట్టఁబడినది. ఆతఁడొక మిక్కిలి పొడవైన చొక్కాను తొడుగుకొనెను. భుజము మీఁద నొక పొడుగుపాటి సన్నని బెత్తము పట్టుకొన్నాఁడు. రాఁగానే యాతఁడు తన కాజీవికను బ్రసాదించు రంగభూమికి బ్రణామము

కావించి రెండు సుందర పుష్పములచే దానిని బూజించుచు 'ఓ రంగభూమీ! నీవు నేడు సాక్షాత్తు బృందావనముకమ్ము' అని ప్రార్థించెను. అనంతరము నలువైపులఁ జూచుచు దర్శకులవైపు చేతి జూపించుచు 'ఈనాటక మాడుట చాలకష్టము, అసహ్యమును. అందఱ మనస్సులను సంతోషపెట్టవలసి యున్నది. ఎవరేదికోరిన దానిని పూర్తి గావింపవలయును. నేఁడు బ్రహ్మగారి సభకు ఆయనకుఁ బ్రణామము గావింపఁ బోయితిని. దారిలో నారదుఁడు కనఁబడెను. ఆయన నాతో 'సోదరా, నీవు దొరకితివి. నాకు చాల దినములనుండి బృందావనములోని శ్రీకృష్ణలీలను గాంచవలెనని యున్నది. రేపు నీవు మాకు శ్రీకృష్ణలీలను జూపించుము' అనెను. నారదుఁడు విలక్షణుఁడు. నేను బృందావనములోని పరమగోప్య రహస్య లీలలను ప్రత్యక్షాభినయమెట్లు చేయఁగలను? పరిపార్శ్వకుఁడీ విషయమును విని (ఆశ్చర్యమును బ్రకటించుచు) 'మహాశయా! నేఁడు నీవు కొంచెము మత్తుమందు వేసికొని వచ్చుట లేదుకదా? కొంచెము మధుర పదార్థము తలకెక్కినట్లున్నది. అందుకనియేనా కొంచెము తికమక మాటలు మాటలాడుచున్నావు? బాగున్నది! నారదుని వంటి బ్రహ్మజ్ఞాని, జితేంద్రియుఁడు, ఆత్మారాముఁ డగు ముని శ్రీకృష్ణుని శృంగార లీలలను గాంచవలె నన్నాఁడనుట యిది బొత్తుగా నసంభవ కార్యము' అనెను.

సూత్రధారుఁడు (హరిదాసు) ఏమండీ! నీకు శాస్త్ర జ్ఞానము బొత్తుగా లేనట్లే తోఁచుచున్నదే. భాగవతములో

నేమి వ్రాయఁబడినదో తెలియునా ? మోక్షపదవిని బొందిన ఆత్మారాములగు మునులుకూడ శ్రీకృష్ణుని మీఁద భక్తి చేయుచుండుటే భగవల్లీలలలోఁగల యొక గొప్ప విశేషత. ♦

పరిపార్శ్వకుఁడు:- మంచి ఆత్మారాముఁడు. మాయారహితుఁ డయ్యు మాయిక లీలలును జూడఁగోరు చుండును.

సూ:- నీవు వట్టి మూర్ఖుఁడగు వసంతుఁడవు. బాగున్నది, భగవల్లీలలు మాయికము లెట్లగును ? అవి యప్రాకృతికములు. వారిలో మాయాలేశము లేనేలేదు.

పరి:- ఏమిటండీ, మాయలేకయే క్రియలు ఉండఁజాలవని నేను శాస్త్రజ్ఞుల నోట విని యున్నాను.

సూ:- నిజమే, విన్నావు. విచారించుటలేదు. విచారించినట్లైన నీవిధముగ పేడ బెల్లము కలిపి ఒక్కటిగఁ జేయరు. ఈ విషయము మాయాబద్ధ జీవులగు మానవకర్మలకు సంబంధించిన విషయము. భగవానుఁడు మాయాపతి. మాయ ఆయనకు దాసి. అది ఆయన ఆజ్ఞాబద్ధమై నాట్యము చేయును. ఆయన లీలలన్నియు నప్రాకృతములు. అవి ప్రయోజనము లేక కేవలము భక్తుల ఆనందము కొఱకు చేసినవి.

---

♦శ్లో॥ ఆత్మారామాశ్చమునయో నిర్గ్రంథా అప్యురుక్రమే ।
కుర్వన్త్యహైతుకీం భక్తి మిత్థం భూతగుణోహరిః ॥

శ్రీమద్భాగవతము.

పరి:- (కొంచెమాశ్చర్యముతో) ఆహాఁ! అట్లా? అట్లైన నారదుఁడు చూడవచ్చును. మిక్కిలి యానందముతోఁ జూపుము. నారదుఁడుకూడ సంతోషించునట్లు సంవత్సరము పొడుగునను సిద్ధపఱచుము. ఆయన బ్రహ్మలోకము నుండి వచ్చుటకు పది, యిరువది సంవత్సరములు పట్టును.

సూ:- నీవు ఇంకను బండ మొద్దువలెనే యున్నావే? ఆతఁడు దేవర్షి. సంకల్పమాత్రముననే యేలోకమునకైనను వెళ్ళఁ గలఁడు.

పరి:- ఈ సంగతి నాకేమి తెలియును. ఇదే నిజమైనట్లైన నిప్పుడే లీలలకు తయారు చేయుదును. అయితే చెప్పుడు ఏలీలల నభినయింతురో ?

సూ:- నాకు దానలీలయే సర్వోత్తమముగఁ దోఁచుచున్నది. నీయభిప్రాయమేమి ?

పరి - లీల చాల సుందరమైనది. నాకు దాని అభినయము చాల యిష్టము, కాని ఒక ద్వంద్వమున్నది. అభినయము చేయు బాలికలు లేరు.

సూ:- (కొంచెమాశ్చర్యముతో) 'వారెక్కడికి వెళ్ళిరి'

పరి:- వారు గోపేశ్వర శివుని బూజించి బృందావనమునకు వెళ్ళిపోయిరా ?

సూ:- నీవొక క్రొత్త ఆపత్తును గూర్చి చెప్పితివి. ఇప్పుడెట్లు మనపని యగును ?

పరి.- (త్వరగా) ఆపత్తు ఎందుకు? నేనిప్పుడే వెళ్లెదను. మాట లోనే వత్తును. వారిని వెంటతీసుకొని వత్తును.

సూ:- (అన్యమనస్క భావముతో) వారింకను పసిపిల్లలు, వారి వయస్సు చిన్నవయస్సు. అట్లే చెప్పకుండ వెడలి పోయిరి. ఎవరితోను చెప్పలేదు. వినను లేదు. అక్కడి మార్గమా మిక్కిలి దుర్గమమైనది. పాప మెక్కడ తిరుగు చున్నారో. వారి వెంట నెవరును పెద్దవారుకూడ లేరు.

పరి:- పెద్దవారేల లేరు ?

సూ:- (నవ్వి) ముసలివారికి ప్రయోజనమేమిటి? కన్నులు కనఁ బడవు. ఒక్కదెబ్బ కొట్టిన మూఁడుచోట్ల పడును. వారికి దారి నేమి తెలియును ?

ఇంతలోనే నేపథ్యములో నేదియో శబ్దము బయలు దేరెను. ఇంతలోనే పెద్ద స్వరముతో 'శ్రీకృష్ణ గోవింద హరే మురారే, హే నాథ నారాయణ వాసుదేవ' యీ పదము వినఁబడెను. సూత్రధారుఁడు నారదుఁడు వచ్చు చున్నాఁడను సంగతి తెలిసికొని, త్వరత్వరగా తన పరిపార్శ్వకు (ముందు) నితో కన్యకలను బిలుచుకొని వచ్చుటకు పరుగెత్తు కొని పోయెను. ఇంతలోనే చూచునప్పటికి రంగభూమి మీఁదను చేతిలో వీణను ధరించి, పసుపు పచ్చని వస్త్రమును ధరించి తెల్లని గడ్డముతో నారదుఁడు తన శిష్యునితో 'శ్రీకృష్ణగోవింద హరే మురారే హేనాథ నారాయణ వాసు దేవ' యీపదమును పాడుకొనుచువచ్చి మెల్లమెల్లగా దిరుగు

చుండెను. ఆ సమయమున శ్రీవాసుఁడు నారద వేషముతో నీతఁడు శ్రీవాస పండితుఁ డౌనా కాదా యని గుర్తుపట్టఁజాల సంతటి చక్కఁగ నుండెను. శుక్లాంబర బ్రహ్మచారి రామనామ ముద్రాంకిత వస్త్రమును గప్పుకొని కమండలువును జేత ధరించి నారదుని వెనుకఁ దిరుగు చుండెను.

స్త్రీలు శ్రీవాసుని యీరూపమును గాంచి విస్మితు లైరి. శచీమాత నవ్వి మాలతీదేవిని 'ఏమమ్మా! ఈతఁడే కాదూ నీభర్త?' అని అడిగెను. మాలతీదేవి కొంచెముగ ముసిముసి నవ్వులు నవ్వుచు 'ఏమో, నాకేమి తెలియును? మీరే తెలిసి కొనుఁడు' అనెను.

శ్రీవాసపండితుఁడు నారద వేషము వేయుటే కాదు నిజముగ వానికాసమయమున నారదమునియొక్క వాస్తవి కావేశము వచ్చెను. ఆ యావేశములో నాతఁడు తన వెంట నున్న శిష్యునితో 'బ్రహ్మచారీ! ఏమిటి సంగతి? ఇక్కడ నాటకపు వ్యవహారమేమియు లేనేలేదు' అనెను. ఆసమయము ననే సూత్రధారునితోఁగూడ సుప్రభసహితముగ గోపీవేష ముతో గదాధరుఁడు ప్రవేశించెను.

వీరిని గాంచి నారదుఁడు 'నీవెవరు?' అని యడిగెను.

సుప్రభ:- (బ్రహ్మానందుఁడు) 'భగవన్! మేము గొల్ల భామలము. బృందావనములో గోపేశ్వర భగవానుని కొఱకు వెళ్లుచున్నాము. మహారాజ! తమరు ఎవరు? ఎక్కడికి వెళ్లు చున్నారు?' అనెను.

నారదుఁడు 'నేను శ్రీకృష్ణుని యొక్క ఒక అత్యంత అకించన కింకరుఁడను. నన్ను నారదుఁ డందురు' అనెను.

నారదుఁడను మాట వినఁగానే సుప్రభా, అమోఘ మఱి యితరులందఱును దేవర్షి నారదునకు సాష్టాంగ దండ ప్రణామము నాచరించిరి. గోపి (గదాధరుఁడు)నారదుని చరణ ములను బట్టుకొని యేడ్చుచు నేడ్చుచు 'హే భక్త భయహారీ భగవాన్! ఏ కృష్ణుఁడు తన నవనీల వర్ణమును దాచి గౌర వర్ణమును ధరించెనో ఆ నా ప్రాణ ప్రియుఁడగు ప్రియతముని ప్రేమకు నేనెట్లధికారిణి నయ్యెదను?' అనెను, ఇట్లనుచునుచు గోపిక (గదాధరుఁడు) నారదుని పాదములను బట్టుకొ బిగ్గఱగ నేడ్వ మొదలిడెను. ఆ(యను)తని కోమల గుండ్రని కపోల ముల మీఁదనుండి యశ్రుధారలు ప్రవహించుట చూచి భక్తు లగు దర్శకులందఱును రోదనము చేయ మొదలిడిరి.

నారదుఁడు గోపిక నాశ్వాసించుచు 'నీవు శ్రీకృష్ణునకు ప్రాణములకంటె మిక్కిలి ప్రియమగు సహచరివి. నీవు వ్రజ మండలిలో ఘనశ్యాముని మనమోహినీ మయూరమవు. నీ నృత్యమును గాంచి యాతఁడు పైన నుండనే యుండలేఁడు. ఆ క్షణముననే క్రిందకు దిగివచ్చును. నీవు నీ మనోహర సుఖమయ నృత్యముచే నా సంతప్త హృదయమును శీతలతా ప్రదానము కావించుము' అనెను.

గోపిక యిది వినినప్పటికిని రోదనము చేయుచుండెను. ఇంకొకవైపు సుప్రభాదేవి తన నృత్య భావములచే నారదుని

మనస్సును ఆనందము చేయుచుండెను. అటు సూత్రధారుఁడు (హరిదాసు) కూడ సుప్రభయొక్క తాళస్వరములతో కలిపి భుజములమీఁద కఱ్ఱ పెట్టుకొని నృత్యము చేయసాగెను. ఆతఁడు అంగణము నంతట పిచ్చివాని వలె తిరుగుచుఁ దిరుగుచు 'కృష్ణభజ కృష్ణభజ కృష్ణభజ బావరే! కృష్ణకే భజన బినుఖాఉగే క్యా పామరే?' అను పదమును బాడుచు బాగుగా నృత్యము చేయ మొదలిడెను. పదమును బాడుచుఁ బాడుచు నాతఁడు మధ్యలో నాగి యీ దోహను పాడ నారంభించెను.

రైఁని గఁవాఈ సో ఇకే
దివస గఁవాయా ఖాయ్ ।
హీరా జన్మ అమోల్ థా
కౌడీ బదలే జాయ్ ॥
కృష్ణభజ కృష్ణభజ
కృష్ణభజ బావరే ।
కృష్ణకే భజన బిను
ఖా ఉగే క్యా పామరే ॥

రాత్రి నిద్రతో గడిపి పోఁగొట్టుకొంటిమి. పగలు తిండితో గడిపి పోఁగొట్టుకొంటిమి. రత్నము యొక్క జన్మము అమూల్యమైనది. కాని అది గవ్వకు బదులుగా పోయినది. అనఁగా విలువ గలిగిన దివారాత్రులను భగవత్సేవకు గడుపక వృథాగా చేయుటయు, అమూల్యకాలమును ఆహార నిద్రలకు

విని యోగించుటయు రత్నమును గవ్వకు బదులుగా నిచ్చిన ట్లుండును. ఓ పిచ్చివాఁడా ! ముమ్మాటికి కృష్ణుని భజింపుము. కృష్ణ భజనములేక ఓ పామరా! ఏమి తిందువు? ఏమి ప్రయోజనమని భావము'

గోపిక నారద చరణములను వదలలేదు. సుప్రభా (బ్రహ్మానందుఁడు) గోపిక (గదాధరుని) తో బలవంతముగ 'సఖి ! పూజనమునకు కాలమతిక్రమించినది. అందఱు మన కొఱకు నిరీక్షించు చుందురు. వెళ్లుదము పద' అనెను.

సుప్రభ యొక్క యిట్టి మాటలను విని సఖి నారద చరణములకు వందనము గావించి, ఆయనవద్ద వెళ్లుట కనుజ్ఞను గైకొని సుప్రభతోఁగూడ యింకొక వైపునకు వెడలిపోయెను. వారు వేఱొక దిక్కుగా వెళ్లిపోఁగానే నారదుఁడు తన బ్రహ్మచారితో 'బ్రహ్మచారీ ! పద, మనము గూడ బృందావనము వైపునకు వెళ్ళుదము. అక్కడికి వెళ్ళి శ్రీకృష్ణ భగవానుని మనోహరలీలలను దర్శించి మన జన్మలను సఫలము గావించుకొందము' అనెను.

'దేవరవారి యాజ్ఞ' యని బ్రహ్మచారి నారదుని వెనువెంట పోవుచుండును.

ఇంటిలోపల మహాప్రభువు భువన మోహినియగు లక్ష్మీదేవి వేషమును వేయుచుండెను. ఆయన తన సుందర కమలముల వంటి కోమలయుగళ చరణములకు పారాణిబెట్టిరి.

ఆ అరుణ రంగుగల తొలువులందు పారాణి మెఱుపు తేలి పోయి వెలవెల పోవుచుండెను. కాలి వ్రేళ్ళకు అతఁడు మెట్టెలు ధరించెను. కడియములు, అందెలు, కాలి సరములు, చిఱుగజ్జెలు సుందరమైనవి ధరించెను. నడుమునకు మొలనూలు ధరించెను. ఒక మిక్కిలి చక్కని విలువగల లంగాను ధరించెను, చేతి వ్రేళ్ళకు చిన్నచిన్న ఉంగరములు ధరించెను. బొటన వ్రేలికి ఒక అద్దము వంటి యుంగరమును ధరించెను. కంఠములో మోహనమాల, చంద్రహారము,ముత్యాలహారము, కట్టుడపు కాసులదండ, ఇంక ననేక రత్నహారములు, ఇంకను విలువగలిగిన మాలలను ధరించెను. చెవులలో కర్ణ పుష్పముల నమర్చెను. బాజువులలో బంగారు వంకీకడియములను ధరించెను.

వాసుదేవాచార్యులు మిక్కిలి యాందముగాఁ బ్రభువు వారి సుదీర్ఘములగు నుంగరములు తిరిగిన వెండ్రుకలందు సరిగా పాపట తీసి, వెనుక వెండ్రుకలు జడ వేసెను. వెండ్రుకల జడలో మాలతీ, చంపక, గన్నేరు పుష్పములు మొదలగు వాటితో చక్కగ నలంకారయుక్తముగ పూలను గూర్చెను. ఒక సుందరమగు మాలను జడలోఁ జొనిపెను. పాపిటలోఁ జక్కగ సిందూరమును దాచిరి. ముఖమున నొక మిక్కిలి చిన్న కుంకుమ బొట్టును బెట్టిరి. సుగంధితమగు తాంబూలము ప్రభు శ్రీముఖమున కందించిరి. ఒక మిక్కిలి సన్నని జిలుగు వలువ ప్రభువునకుఁ గప్పిరి. శృంగారము చేయుచుండగనే

ప్రభువునకు రుక్మిణీ యావేశము వచ్చెను. ఆతఁడు శ్రీకృష్ణ విరహమున రుక్మిణీ భావముతో నధీరురాలయ్యెను.

రుక్మిణి తండ్రికి తన ముద్దుల బిడ్డను శ్రీకృష్ణ చంద్రున కీయవలెనని యుండెను కాని యాతని జ్యేష్ఠ కుమారుఁడగు రుక్మి రుక్మిణిని శిశుపాలున కిచ్చుటకు నిశ్చయించెను. ఈ కారణమున రుక్మిణి యధీరురాలయ్యెను. ఆమె లోలోన శ్రీకృష్ణచంద్రుని తన పతిగాఁ జేసికొనెను. ఆమె మనఃపూర్వకముగ మనస్సులో తన సర్వస్వము భగవానుఁడగు వాసుదేవుని చరణములందు సమర్పించెను. ఆమె అయ్యో! ఆ నరాధముఁడగు శిశుపాలుఁడు రేపు తరలి పెండ్లికి నాతండ్రి రాజధానికి వచ్చును గదా! నేను నా ప్రాణేశ్వరుఁడగు పతి దేవుని పొందఁజాలనేమో? నేను నాసర్వస్వమును ఆయన శ్రీచరణములందు సమర్పించితిని. ఆతఁడు దీన వత్సలుఁడు, అశరణ శరణుఁడు. జీవులందఱ హృదయములలోని విషయములను నెఱిఁగినవాఁడు. ఆయనకు నా యుద్దేశ్యము తెలియదా? ఆయనకు తప్పక తెలియును. ఎట్లైనను ఆయనకు జ్ఞాపకము చేయు నొక వినయ పత్రికను వ్రాసి పంపెదను. తర్వాత వచ్చుట రాకపోవుట ఆయన ఆధీనములోఁగలదు. లేకపోయిన యీ ప్రాణహీన శరీరమును శిశుపాలుఁడు గొనిపోఁగలఁడు. లేదా పట్టి చేతులతోఁదిరిగి పోఁగలఁడు. ప్రాణములుండఁగా నా దుష్టునితో నేనెన్నటికినిపోను. ఈ శరీరముపై నధికారమా వాసుదేవ భగవానునికే కలదు. జీవిత శరీరము నాతఁ

డొక్కఁడే యుపభోగింప వలయును' అని యాలోచింపసాగెను. ఇట్లాలోచించి యామె తన ప్రాణనాథునికి ప్రేమ పత్రికను వ్రాయుటకుఁ గూర్చుండెను—

శ్లో॥ శ్రుత్వా గుణాన్భువనసుందర శృణ్వతాం తే
నిర్విశ్య కర్ణవివరైర్హరతోఽంగతాపమ్ ।
రూపం దృశాం దృశిమతా మఖిలార్థలాభం
త్వయ్యచ్యుతాఽఽవిశతి చిత్తమపత్రపం మే ॥

శ్రీమద్భాగవతము ౧౦-౫౨-౩౭.

(అర్థము:- ఓ యచ్యుతా! నీ త్రిభువన సుందర స్వరూపము యొక్క ఖ్యాతి నా కర్ణరంధ్రములద్వారా నా హృదయములోఁ బ్రవేశించినది. అక్కడికి చేరు నప్పటికి నా హృదయములోని సమస్త తాపములు శాంతించినవి. ఏలననఁగా నీ జగన్మోహనరూప మందును, నీ యచింత్య గుణములందును అట్టి ప్రభావమున్నది. అది చూచువారల యొక్కయు, వినువారలయొక్కయు సమస్త మనోరథములను బూర్తి కావించును. ఓ ప్రణతపాల! ఆ ఖ్యాతిని వినియే నా నిర్లజ్జ మనస్సు నీయం దాసక్తి చెందినది.)

(ఈ ఘట్టమున బోతనగారి పద్యములు)

సీ॥ నే నీ గుణములు కర్ణేంద్రియంబులు సోక
దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు లందఁగలుగు

నే నీ చరణసేవ లేప్రొద్దు చేసిన
భువనోన్నతత్త్వంబుఁ బొందఁగలుగు
నే నీ లసన్నామ మేప్రొద్దు భక్తితోఁ
దడవిన బంధ సంతతులు వాయు

తే॥ నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చి యున్నది నీయాన నానలేదు
కరుణఁజూడుము కంసారి ఖలవిదారి
శ్రీయుతాకార మానినీ చిత్తచోర ॥

శా॥ ధన్యున్ లోకమనోభిరాముఁ గులవి
ద్యారూపతారుణ్య సౌ
జన్య శ్రీబలదానశౌర్య కరుణా
సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు కోరదే ముసు రమా
కాంతాలలామంబు రా
జన్యానేకప సింహ నావలననే
జన్మించెనే మోహముల్ ॥

ఉ॥ శ్రీయుతమూర్తి యో పురుష
సింహమ సింహము పాలి సొమ్ము గో
మాయువు గోరు చందమున
మత్తుఁడు చైద్యుఁడు నీపదాంబుజ
ధ్యాయిని నైన నన్ను వడి
దాగొని పోయెదనంచు నున్నవాఁ
డాయధమాధముం డెఱుఁగ
డద్భుతమైన భవత్ప్రతాపముల్ ॥

మ॥ వ్రతముల్ దేవగురు ద్విజన్మబుధ సే
వల్ దాన ధర్మాదులున్
గత జన్మంబుల నీశ్వరున్ హరిజగ
త్కల్యాణుఁ గాంక్షించి చే
సితినేనిన్ వసుదేవనందనుఁడు నా
చిత్తేశుఁడౌ గాక ని
ర్జితులై పోదురుగాక సంగరములోఁ
జేదీశముఖ్యాధముల్ ॥

ఆంధ్ర మహాభాగవతము.

ఈ విధముగ నేను శ్లోకములు వ్రాసి ఒక బ్రాహ్మణుని చేతికి ఆమె తన యీ ప్రణయరస పూర్ణమైన పత్రికను ద్వారకకు భగవంతుని దగ్గఱకు పంపెను. మహాప్రభువు కూడ అదే విధముగ నఖములద్వారా రుక్మిణీ భావావేశమందు తన ప్రియుఁడగు శ్రీకృష్ణునకు ప్రేమ పత్రికను వ్రాయు చున్నట్లుండెను. అతఁ డదే భావముచే విలపించుచు విలపించుచు రోదనము చేయసాగెను. ఏడ్చిఏడ్చి ఆభావములనే ప్రకటించుచుండెను. కొంచెము సేపైన తర్వాత నా భావము శాంతించెను. బయట రంగభూమి మీఁద నద్వైతాచార్యుఁడు సుప్రభా, గోపికలతోఁగూడ మధురభావ సంభాషణ చేయుచుండెడిరి. హరిదాసు భుజముమీఁద బెత్తముపెట్టుకొని 'మేల్కొనండి మేల్కొనండి' అనుచు తిరుగుచుండెను. భక్తులందఱును ప్రేమలో మునిఁగి రోదనము చేయసాగిరి. ఇంతలోనే జగన్మో

హినీ రూపమును ధరించిన ప్రభువు రంగస్థలమునకుఁ బ్రవేశించెను. ప్రభువునకు ముందు హాస్యగాని వేషముతో నిత్యానందుఁడుండెను. నిత్యానందుని భుజముమీఁద చేయివేసి మెల్ల మెల్లగా ప్రభువు వచ్చుచుండెను. ప్రభువుయొక్క యీయద్భుత రూపలావణ్యయుక్త స్వరూపమును గాంచి భక్తులందఱును జకితులైరి. ఆ సమయమున ప్రభువుయొక్క రూపవర్ణనము చేయుట కవి ప్రతిభ కతీతమైన విషయము. ప్రభు విట్టి వేషము వేసినాఁడను సంగతి అందఱును మఱచిరి. భక్తులు వారివారి భావనానుసారముగా నారూపమందు పార్వతీ, సీతా, లక్ష్మి, మహాకాళీ, రాసవిహారిణీ, రసవిస్తారిణీ శ్రీరాధికాదర్శనము చేయుచుండిరి. సముద్రమంథనమైన తర్వాత భగవానునియొక్క భువనమోహినీ రూపమునుగాంచి దేవ, దానవ, యక్ష, రాక్షసాదు లందఱు యెట్లుదీనులై పోయిరో, దేవాధిదేవుఁడు కామ విధ్వంసియు నగు మహాదేవుఁడు కూడ కామాసక్తుఁడై యీ(తని)మె వెంట యెట్లు పడెనో అదే విధముగా నిక్కడ కూడ భక్తు లందఱును విముగ్ధులైరి కాని ప్రభువువారి యాశీర్వాదము వలన నెవరి హృదయములలోను కామ భావముత్పన్నము కాలేదు. అందఱు నా రూపమందు మాతృస్నేహమునే యనుభవించిరి. ప్రభువు లక్ష్మిభావములోనికి వచ్చి భావమయ సుందర పదమును బాడిపాడి మధుర నృత్యము చేయసాగెను. ఆ సమయమున ప్రభువుయొక్క ఆకృతి ప్రకృతులు, హావభావములు, చేష్టలు, వాక్కులు మొదలగునవన్నియు స్త్రీలకు వలెనే

సాగిరి. అందఱయొక్క రోదనధ్వనిచే చంద్రశేఖరుని యిల్లు ప్రతిధ్వనించుచుండెను. దిశలన్నియు నేడ్చుచున్నవా యనున ట్లుండెను. భక్తుల వ్యాకులతనుగాంచి ప్రభువు భక్తులపైన వాత్సల్య భావమును బ్రకటించుటకు భగవంతుని సింహాసన ముపైఁబోయి కూర్చుండెను. సింహాసనముపై కూర్చుండు నప్పటికి గృహమంతయుఁ బ్రకాశమయమయ్యెను. ఆ ప్రకాశము వేయిమంది సూర్యులు, చంద్రులు, నక్షత్రములు ఒక్కసారిగా నాకాశమున నుదయించినవా యనునట్లుండెను. భక్తుల కండ్లముందు నాదివ్యాలోక ప్రకాశము సహింపఁజాలక పోవుటచే మిఱుమిట్లు గొల్పుచున్నట్లుండెను.

ప్రభువు భగవానుని సింహాసనము పైనఁగూర్చుండియే హరిదాసుని బిలిచెను. హరిదాసు బెత్తమును బాఱవైచి త్వరత్వరగా జగన్మాత వడి కొఱకై వరువిడెను. ప్రభువాతనిని లేవఁదీసి వడిలోఁ గూర్చుండఁ బెట్టుకొనెను. హరిదాసు మహామాయ ఆదిశక్తి వడిలోఁ గూర్చుండి యపూర్వవాత్సల్య సుఖము ననుభవించుచుండెను. తదనంతరము క్రమముగ భక్తులందఱవంతు వచ్చెను. ప్రభువు భగవతీ భావములో నందఱకు వాత్సల్యసుఖ రసాస్వాదనము కావించెను. అందఱకు తన యొక్క యప్రాప్య స్తనపానము చేయించ చేయించఁగా నింతలోఁ బ్రాతఃకాల మయ్యెను. ఆ సమయమున భక్తులకు సూర్యుఁడుదయించుట అరుచికరముగఁ దోఁచెను. ప్రాతఃకాల మగుటతోడనే ప్రభువు భగవతీ భావము నుపసంహరించెను.

ఆతఁ డల్పకాలముననే ప్రకృతిస్థుఁడై, యా వేషమును మార్చి భక్తులతోఁగూడ నిత్యకర్మ నుండి నివృత్తుఁడగుటకు గంగాతీరము వైపునకు వెడలిపోయెను. చంద్రశేఖరుని గృహము ప్రభువు వెళ్ళిపోయిన తర్వాతగూడ తేజోమయము గానే యుండెను. ఆ తేజము క్రమక్రమముగా నేడు దినము లలోఁ బూర్ణముగ సమాప్త మయ్యెను.

ఈవిధముగా ప్రభువు భక్తులతో గూడ శ్రీమద్భాగ వతములోని సాధారణముగ సమస్త లీలల నభినయించిరి.



# భక్తులతో ప్రేమ రసాస్వాదనము

శ్లో॥ సర్వథైవ దురూహోఽయ మ భక్తైర్భగవద్రసః ।
తత్పాదాంబుజ సర్వస్వై ర్భక్తై రేవాను రస్య తే ॥

(సాంసారిక భోగములనే సర్వస్వమని తలంచువారును, విషయ భోగములలోనే యాబద్ధులైన వారునగు నిట్టి యభక్తుల భగవద్రసాస్వాదనము చేయుట దుర్లభము. తమ సర్వస్వమును నా శ్యామసుందర కోమలారుణ చరణములందు సమర్పించిన వారును, సర్వతోభావేన ఐనవారే యైనవారు నగు ఏకాంతిక భక్తులే యీరసాస్వాదనను చేయఁగలుగుదురు.)

ప్రేమ కుపమానము దేనితో నిచ్చుట? ప్రేమ మొక యనుపమేయ వస్తువు స్థావర, జంగమ, చరాచర, సజీవ నిర్జీవములు వేయేల యన్నిటియందును ప్రేమ సమానముగ వ్యాప్తమై యున్నది. ప్రపంచములోఁ బ్రేమయే ఓత ప్రోత భావముచే నిండియున్నది. ఆకాశము బోలు యనుకొనువారు పొరబడినారనుకొనవలెను. ఆకాశము లోహముఁకంటెఁ గూడ

దృఢమైనది. దానిలో నొక పరమాణువుకూడ నింకెక్కువగ నిముడఁజాలదు. అది సద్వృత్తి దుర్వృత్తి భావములతో క్రిక్కిక్కిరి నిండియున్నది. ప్రేమ వాటియన్నిటిలో సమాన రూపమున వ్యాప్తమై యున్నది. ప్రేమను సున్నపు అడుసు గానో లేక రెండు వస్తువుల నతుకు ద్రవిక పదార్థముగానో భావించవలెను. ప్రేమ కారణముననే యీ భావములన్నియు నిలిచియున్నవి. కాని ప్రేమోపలబ్ధి సర్వత్ర కాదు. అది భక్తుల శరీరములందే పూర్ణముగఁ బ్రకటమగును. భక్తులే పరస్పరము ప్రేమరూప రసాయనమును నిరంతరము పానము చేయుచుం దురు. వారి యొక్క ప్రతి చేష్టయందును ప్రేమకు ప్రేమయే యుండును. వారెల్లప్పుడును ప్రేమవారుణిని బానము గావించి లోకబాహ్యులై నున్మత్తులవలె నుందురు. వారు వారట్లు ప్రేమవారుణిని ద్రాగుటయే కాక తమను బ్రేమించు బంధువు లకును, భక్తులకును నావారుణిని గిన్నెలు గిన్నెలు త్రాగిం తురు. ఆయపూర్వ ఆసవపానమును గావించి వారుకూడ మత్త లగుదురు; సంతుష్టులగుదురు, ధన్యులగుదురు. లజ్జా, ఘృణ, భయ రహితులై వారుకూడ నున్మత్తులవలెఁ బ్రలాపము చేయుచుందురు. ఆ యున్మత్తుల చరిత్రలో నెంతటి యానం దముకలదు; ఎంతటి యపూర్వరసమున్నది. వారి కోట్ల తిట్ల లోను, దూషణ భూషణము లందును, భోజన శయనము లందును వేయేల సమస్త కర్మముల యందును ప్రేమ సంపుటిచే నీ కర్మలన్నియు దివ్యములు, నలౌకికములుగనే తోఁచుచుం డును. వాటిని వినుటచేతనే సహృదయ పురుషులకు సుఖము

కలుగును. వారుకూడ ఆ ప్రేమాసవము గ్రోలుటకు తహతహ లాడిపోవుదురు. ఆ తహతహ కారణమున వారు చివరకు ప్రభుప్రేమ కధికారులగుదురు.

మహాప్రభు విప్పుడు భక్తులను వెంటవేసికొని ప్రతి దినము మిక్కిలి మధురాతి మధురములగు లీలల నొనర్ప సాగెను. జగన్నాథ మాధవుల ఉద్ధారమైన తర్వాత, వారు తమ సర్వస్వమును త్యాగము కావించి శ్రీవాస పండితుని దగ్గఱ నివసించుచున్నది మొదలుకొని భక్తుల యుత్సాహ మధికాధికముగఁ బెరిగెను. అన్యులు కూడ సంకీర్తన మహాత్వ మును దెలిసికొన మొదలిడిరి. ఇప్పుడు సంకీర్తన చర్చ నవ ద్వీపములో మొదటికంటె నధికము కాసాగెను. నిందకు లిప్పుడు అనేక రకములుగ సంకీర్తనమున కపకీర్తి తేవలెనని ప్రయత్నించుచుండిరి. పాఠకులారా! ఆ నిందకులను నిందచేయ నిండు. మీరిప్పుడింక గౌరాంగుఁడు భక్తులతోఁ గావించిన యద్భుత లీలలనే రసాస్వాదనము కావింపుఁడు.

మురారిగుప్త ప్రభువునకు సహపాఠి. అతఁడు ప్రభువున కంటె వయస్సులోఁ బెద్దవాఁడు. ప్రభువాతని నత్యధికముగఁ బ్రేమించును. అతనిని తనయొక్క మిక్కిలి యంతరంగ భక్తు నిగ నెంచును. మురారిగుప్తకు కూడ ప్రభు చరణములందు పూర్ణానురాగము కలదు. అతఁడు రామోపాసకుఁడు. తనను హనుమానుఁడనుకొని ఒక్కొక్కప్పుడు భావావేశములోనికి వచ్చి హనుమానునివలె హుంకారముకూడ చేయుచుండును.

ఆతఁడు తన నెల్లప్పుడు ప్రభు సేవకునిగ భావించును. ఒక దినమున ప్రభువు విష్ణుభావమున 'గిరుడా', 'గరుడా' యని పిలిచెను. ఆ సమయముననే మురారిగుప్త తన వస్త్రమును రెండువైపుల ఱెక్కలవలె వ్యాపింపఁజేసి ప్రభువును శీఘ్రముగ తన భుజముల మీఁద నెక్కించుకొని యానందముతో నంగణ మున నటునిటు తిరుగ మొదలిడెను. ఇది చూచి భక్తుల యానందమునకు మేఱ లేకుండెను. వారికి ప్రభువు సాక్షాత్తుగఁ జతుర్భుజ నారాయణునివలె గరుడునిపై నెక్కి నాల్గు చేతు లలో శంఖ. చక్ర, గదా, పద్మములను నీ నాలుగు వస్తువులను బట్టుకొని యున్నట్లు కనఁబడెను. భక్తులానందముచే నృత్యము చేయసాగిరి. మాలతీదేవి, శచీమాత మొదలగు నన్యస్త్రీలు ప్రభువును మురారిగుప్త భుజస్కంధములపై నెక్కియుండుటను గాంచి భయభీతులైరి. అల్పకాలముననకే ప్రభువునకు బాహ్య జ్ఞానము కలిగి, యాతఁడు మురారిగుప్త భుజములనుండి దిగెను.

మురారి రామోపాసకుఁడు. ప్రభువాతని యేకాంత నిష్ఠను బాగుగా నెఱుఁగును. భక్తుల కాతని ప్రభావమును దెల్పుటకై ప్రభువొక దినమున నాతనితో నేకాంతముగ 'మురారీ! శ్రీరాముఁడు శ్రీకృష్ణుఁడు వీరిద్దరొక్కటే నను సంగతి యథార్థమే. ఆ భగవానుని యనంత రూపములలోనివి కూడ నున్నవి. భగవంతుని యొక్క యేనామమును గాని; యే రూపమును గాని యుపాసించునెడలఁ జివర కన్నిటియొక్క ఫలము ప్రభుప్రాప్తియే, కాని శ్రీరామచంద్రుని లీలలలో

కంటె శ్రీకృష్ణలీలలలో నధికముగ రసము నిండియున్నది. నీవు శ్రీరామరూప లీలల కంటె శ్రీకృష్ణలీలల నేల యాశ్ర యింపరాదు ? నీవు నిరంతరము శ్రీకృష్ణలీలా రసాస్వాదన మునే చేయవలెనని మాయొక్క హృదయ పూర్వకమగు కోరిక నేటి నుండి శ్రీకృష్ణునే నీ సర్వస్వమని యెంచుకొని, యాయనయొక్క యర్చా పూజలను, భజన ధ్యానములను గావించుచుండుము' అనెను.

ప్రభువుయొక్క ఆజ్ఞను మురారి శిరస్సున ధరించెను. కాని యాతని హృదయములో కలవరము బయలుదేరెను. ఆతఁడు జన్మముతో రామోపాసకుఁడు. ఆతని చిత్తము రామ రూపమందే రమించుచుండెను. ఇఁక ప్రభువా శ్రీకృష్ణోపాసన చేయ నాజ్ఞాపించెను. ఇట్టి యసమంజసములోఁబడి యాతఁడు రాత్రియంతయు కంటనీరు కార్చుచునే యుండెను. ఆతనికి ఒక్క క్షణమైనను నిద్ర పట్టలేదు, రాత్రియంతయు విలపించు చునే గడపెను. మఱునాఁ డాతఁడు ప్రభువు దగ్గఱకు వెళ్ళి దీనభావముతో, నమ్రతాపూర్వకముగ 'ప్రభో! ఈ మస్త కమును నేను రామున కమ్మివేసితిని. శ్రీరామ చరణముల కమ్మిన మూర్ధము వేఱొకని ముందెట్లు వంగును ? నాథా ! నేనాత్మఘాతమైన చేసికొందును గాని నావలన శ్రీరామో పాసన పరిత్యాగము కాఁజాలదు. మీయాజ్ఞను నుల్లంఘించు టకు గూడ నాలో సామర్థ్యములేదు' అని నివేదించెను. ఇట్లని మురారి గుప్త వెక్కివెక్కి రోదనము చేయసాగెను. ప్రభు

వీతని యిట్టి యిష్టనిష్ఠను గాంచి యత్యంత ప్రసన్నుఁడై త్వరగావచ్చి యాతని గాఢాలింగనము కావించుచు గద్గద కంఠముతో 'మురారీ ! నీవు ధన్యుఁడవు. నీకు నీయిష్టదైవ మం దింత యధిక నిష్ఠ యున్నది. మాకు కూడ శ్రీకృష్ణ పాదపద్మములందిట్టి యైకాంతిక దృఢనిష్ఠ కలుగునట్లు మమ్ము లను గూడ యాశీర్వదింపుఁ' డనెను.

ఒక దినమున ప్రభువు మురారినేదైన స్తోత్రపాఠము చేయవలసినదని కోరెను. మురారి గుప్త చక్కని లయ స్వర ములతో స్వరచిత రఘువీరాష్టకమును వినిపించెను. దానిలోని రెండు శ్లోకము లిచ్చుట వ్రాయఁబడుచున్నవి—

శ్లో॥ రాజత్కిరీట మణిదీధితి దీపితాశ
ముద్యద్బృహస్పతి కవిప్రతిమే వహంతమ్ ।
ద్వేకుండలేఽంకరహితేందు సమానవక్త్రం
రామం జగత్త్రియగురుం సతతం భజామి ॥

శ్లో॥ ఉద్యద్విభాకర మరీచి విరోధితాబ్జ
నేత్రం సుబింబ దశనచ్ఛద చారునాసమ్ ।
శుభ్రాంశు రశ్మి పరి నిర్జితచారుహాసం
రామం జగత్త్రియ గురుం సతతం భజామి ॥

మురారికృత - చైతన్యచరితావళి.

అర్థము

(దీప్తిమంతమగు తన మకుట మణులచే సమస్త దిశల నుద్భా సితము చేయుచున్నవాఁడును, కర్ణములలో బృహస్పతి

శఙ్క్రాచార్యులవలె కుండలద్వయముచే శోభించుచున్నవాఁడును, కలంకరహితమైన చంద్రబింబమువలె శీతలత్వమును, సుఖమును ప్రసాదించు ముఖమండలము గలవాఁడునగు నిట్టి త్రిలోకాధినాథుఁడగు శ్రీరామచంద్రుని నేను భక్తిభావముతో స్మరించుచున్నాను.

ఉదయించుచున్న సూర్యకిరణములచే వికసితములగు కమలములవలె మిక్కిలి యానందదాయకములగు సుందర నేత్రయుగళము కలవాఁడును, దొండపండ్లవలె మనోహరమగు నెఱ్ఱని రెండు పెదవులు కలవాఁడును, మనోహరమగు మొన తేలిన నాసిక కలవాఁడును, చంద్ర కిరణములు కూడ లజ్జితములై వెలుపడిపోవు నంతటి మనోహరమగు నవ్వు కలవాఁడును నగు నిట్టి త్రిభువనాధినాథుఁడగు శ్రీరామచంద్రుని నేను భక్తిభావముతో స్మరించుచున్నాను )

ప్రభు వీతని యీ స్తోత్ర పాఠముచే మిక్కిలి ప్రసన్నుఁడై యీతని మస్తకము మీఁద 'రామదాసు' అను శబ్దమును లిఖించెను. ఈ క్రింది శ్లోకములో నీ సంఘటనమును గూర్చి యెట్టి సుందరము, సజీవమగు వర్ణనము కలదో చూడుఁడు-

శ్లో॥ ఇత్థం నిశమ్య రఘునందన రాజసింహ
శ్లోకాష్టకం స భగవాన్ చరణం మురారేః ।
వైద్యస్య మూర్ధ్ని వినిధాయ లిలేఖ భాలే
త్వం 'రామదాస' ఇతి భో భవమత్ప్రసాదాత్ ॥

ఆ ప్రభువు రాజసింహుఁడగు శ్రీరామచంద్రుని యీ యెనిమిది శ్లోకములను విని మిక్కిలి ప్రసన్నుఁడై, వైద్య వరుఁడగు మురారిగుప్త మస్తకము మీఁద తన శ్రీచరణము లుంచి యాతనితో 'నీకు నాకృపచే నవిరళ భక్తి ప్రాప్తించుఁ గాక !' అని పలికి ప్రభువు ఆతని మస్తకముమీఁద 'రామ దాస' యని వ్రాసెను.

ఈ విధముగఁ బ్రభువుయొక్క యసీమ యనుగ్రహ మునుబొంది యానందమున మునిఁగి మురారి యింటికివచ్చెను. రాఁగానే యీతఁడు భావావేశములో తన భార్యను తినుటకు భోజన మడిగెను. పతివ్రతయు సాధ్వియునగు నాతని భార్య యాసమయమున నన్నము పప్పును వడ్డించి యీతని ముందు పెట్టెను. ఇప్పుడీతఁడు గ్రాసములలో నేతిని కలిపి యెదుట నున్న పిల్లలకుఁగాని యితరులకుఁగాని యెవరు కనఁబడిన వారికి ప్రేమ పూర్వకముగఁ బెట్టుచువాఁడు, తానును దినుచుండెడు వాఁడు. అన్నము చాలవఱకు భూమిమీఁదఁగూడ పడుచుండె డిది. ఈ విధముగ నీతఁ డా దినమున నెంత తినినాఁడో లెక్కయే లేదు. ఈతని భార్య యీతని యిట్టి స్థితిని గాంచి చాల యాశ్చర్యము చెందినది కాని యా ప్రాణప్రియ యగు సాధ్వి యీతని కార్యములోఁ గొంచెమైనను జోక్యము కలి గించుకొనలేదు. ఈ విధముగఁ దిని తిని నిద్రించెను. ప్రాతః కాలము నిద్రలేచునప్పటికి చూడఁగాఁ బ్రభువు వారెదురుగా నుండెను. ఈతఁడు త్వరగా లేచి ప్రభువునకు నమస్కరించి,

వారు కూర్చుండుటకొక సుందరమగు నాసనము నిచ్చెను. ప్రభువు కూర్చుండిన తర్వాత, మురారి వినీతభావముతో నీవిధముగ నసమయమున దయచేయుటకుఁ గారణము తెలిసికొనఁదలఁచెను. ప్రభువు కొంచెముగఁ జిఱునవ్వు నవ్వుచు 'నీవు వైద్యుఁడ వయ్యు సంకటము తెచ్చి పెట్టెదవు. తీసుకొనిరమ్ము కొంచెము ఔషధమిమ్ము' అనెను.

ఆశ్చర్యమును ప్రకటించుచు మురారి 'ప్రభో ! ఔషధమెట్టిది ? ఏరోగమునకు మందు కావలెను ? రాత్రి యంతయు నేమి వికారము కలిగినది?' అని యడిగెను.

ప్రభువు నవ్వుచు 'ఏ వికారము కలిగినదో నీకు తెలియనే తెలియదాయెను. మీభార్య నడుగుఁడు. రాత్రి నీవు నాకెంత నేయి కలిపిన పప్పన్నము పెట్టితివి? నీవు ప్రేమతోఁ బెట్టుచుంటివి. ఇంక నేనెట్లు నీప్రేమ నుపేక్షింపఁ గలుగుదును? నీవెంత పెట్టుచుండిన నంతయుఁ దినుచునే యుంటిని. ఇప్పుడజీర్ణము పుట్టినది. దాని యౌషధికూడ నీదగ్గఱనే యున్నది. ఇటు చూడుము. ఇదియే యీ యజీర్ణమునకు మందు' అనుచు ప్రభువు వైద్యుని మంచము దగ్గఱనుంచిన యాతని యుచ్ఛిష్టపాత్ర జలమును పానము గావించెను. మురారి యిది చూచి త్వరత్వరగా ప్రభువిట్లు చేయకుండ నివారణ కావింపసాగెను. కాని యప్పటికే ప్రభువు సగమునకుఁ బైగానే నీటిని త్రాగివేసెను. ఇది చూచి మురారి ప్రేమచే నేడ్చుచు నేడ్చుచు ప్రభువువారి పాదపద్మములకడ దొరలుచుండెను.

ఒక దినమున నత్యంత స్నేహ సహితముగ మురారి గుప్తతో 'మురారీ! నీవు నీయహైతుక భక్తిద్వారా శ్రీకృష్ణుని నీవశము చేసికొంటివి. నీవు నీప్రేమ పాశముచే శ్రీకృష్ణుని తాను దానినుండి తప్పించుకొనవలె ననుకొన్నను దప్పించు కొనఁ జాలనంతటి గట్టిగ బిగించి కట్టితివి' అనెను. ఇది విను నప్పటికి కవిహృదయముగల మురారిగుప్త తన ప్రత్యుత్పన్న మతితో నాసమయమున నీ శ్లోకమును బఠించి ప్రభువునకు వినిపించెను–

శ్లో॥ క్వాహం దరిద్రః పాపీయాన్
క్వ కృష్ణః శ్రీనికేతనః
బ్రహ్మబంధురితి స్మాహం
బాహుభ్యాం పరిరంభితః ॥

శ్రీమద్భాగవతము ౧౦-౮౧-౧౬.

ఇది సుదాముని వాక్యము. సుదాముఁడు భగవానుని దయాళుతను, అశీమకృపను వర్ణించుచు 'భగవంతుని దయాళుత్వమును గాంచుఁడు– సర్వదా పాపకర్మలందు రతి చెంది యుండు దరిద్రబ్రాహ్మణుఁడను నేనెక్కడ? సమస్తైశ్వర్యములకు మూలభూతమగు నిఖిల పుణ్యాశ్రయుఁడగు శ్రీకృష్ణ భగవానుఁడెక్కడ? అయినప్పటికిని కేవలము బ్రాహ్మణకులమందు బుట్టిన నన్ను జాతిమాత్రబ్రాహ్మణుని తన బాహువులతో నాలింగనము కావించెను. ఇందులో నా పురుషార్థమిసుమంతయు లేదు. కృపాళుఁడగు శ్రీకృష్ణుని యహైతు

కృపయొక్కటియే దీనికి కారణము' అనెను. ఈవిధముగ ప్రభువు వివిధ ప్రకారములచే మురారి దగ్గఱ తన ప్రేమను ప్రదర్శించుచుఁ దాను మనోవినోదము చేయుచుండెను. ఈ మూలకముగ మురారికి యనిర్వచనీయానంద ప్రదానము గావించుచుండెను. ఇఁక నిప్పు డద్వైతాచార్యుని విషయమును వినుఁడు.

అద్వైతాచార్యుఁడు ప్రభువు కంటె పెద్దవాఁడు కాఁడు, కాని ప్రభువు వారి తండ్రియగు పండిత శ్రీజగన్నాథ మిశ్ర కంటెను గొంచెము పెద్దవాఁడు. విద్యలో నీతఁడు సర్వ శ్రేష్ఠుఁడుగ నెన్నఁబడువాఁడు. ప్రభువువారు మంత్రదీక్షఁగొనిన యా యీశ్వరీపురీ ఆచార్యునకు సహాధ్యాయి. ఈ కారణమున వయోవృద్ధుఁడు, విద్యావృద్ధుఁడు, కులవృద్ధుఁడు. సంబంధ వృద్ధుఁడగుటచే ప్రభువీతనిని గురువువలె నాదర సత్కారములు చేయుచుండెడువాఁడు. ఇది యాచార్యున కసహ్యముగ నుండెడిది. ప్రభువు తన చరణముల మీఁదఁబడి ప్రణామము చేయుచున్నప్పు డాతఁడు మిక్కిలి లజ్జితుఁడై తనను దాను నిందించుకొనుచుండెడువాఁడు. ఆతఁడు ప్రభువునకు దాస్య భావమున నుండవలె ననుకొనువాఁడు. ప్రభువాయన యెడల దాస్యభావము నుంచక గురు భావమును ప్రదర్శించుచుండు టచే నాతఁడు దుఃఖితుఁడై హరిదాసుతోఁగూడ శాంతిపురము నకుఁబోయి, అక్కడ విద్యార్థులకు అద్వైత వేదాంతమును జెప్పుచు, భక్తి శాస్త్రాభ్యాసమును వదలిపెట్టి జ్ఞానచర్చ ప్రారంభించెను.

ప్రభువీతని మనోగత భావమును గనిపెట్టెను. ఒక దినమున నాతఁడు నిత్యానందునితో 'శ్రీపాదా! ఆచార్యుల వారు చాల దినములనుండి నవద్వీపమునకు రానేరాలేదు. పదండి, శాంతిపురమునకు వెళ్ళి వారి దర్శనము చేసి వచ్చెదము' అనెను. నిత్యానందునకు దీనివలన బాధయేమున్నది? ఇద్దరును శాంతి పురమునకు వెళ్ళిరి. ఇద్దరును నొకే ప్రేమ మత్తు కలవారలు. ఇద్దరకు శరీరస్పృహ లేదు. ఇంక వారికి దారిగుర్తు ఏమి కలదు? వెళ్లుచు వెళ్లుచు నిద్దరును దారి మఱచి పోయిరి. దారి తప్పి తిరిగి తిరిగి వారిద్దరు గంగానదీ తీరముననున్న లలిత పురమునకుఁ జేరిరి. లలిత పురము చేరు నప్పటికి గంగానది యొడ్డున వీరికొక గృహము కనఁబడెను. 'ఏమండీ, ఇది యెవరి యిల్లు' అని జనుల నడిగిరి. 'ఈ యిల్లు గృహస్థ సన్న్యాసి'దని ప్రజలు చెప్పిరి. ఈ ప్రత్యుత్తరమును విని ప్రభువు బిగ్గఱగ కిల కిల నవ్వి నిత్యానందునితో 'శ్రీపాదా! ఇదేమి యాశ్చర్యమైన విషయమే! గృహస్థుడట, సన్న్యాసియుఁ గూడ నఁట. గృహస్థ సన్న్యాసిని నేఁటి వఱకు మన మసలు చూడనేలేదు. చూచినఁ దెలియును పద గృహస్థ సన్న్యాసి యెట్లుండునో!' అనెను. నిత్యానందుఁ డిది విని యాయింటి వైపునకే బయలుదేరెను. ప్రభువు కూడ అతని వెను వెంట బయలుదేరెను. ఆ గృహద్వారము దగ్గఱకు వెళ్ళి యిద్దరును కాషాయవస్త్రమును ధరించిన సన్న్యాసివేషధారియగు పురుషుని గాంచెను. నిత్యానందుఁ డాతనికి నమస్కారము చేసెను.

ప్రభువు సన్న్యాసి యను నుద్దేశ్యముతో వారికి శ్రద్ధా సహితముగఁ బ్రణామము కావించెను. సన్న్యాసితోఁ గూడి యొక పరమ సుందర తేజస్వి యగు నిరువది మూఁడు సంవత్సరముల బ్రాహ్మణ కుమారుడు తన యింటికి వచ్చుటను గాంచి సన్న్యాసి యాతనికి యథా యోగ్యముగ నభ్యర్చించి, కూర్చుండుట కాసనమిచ్చెను. పరస్పరము చాల సంభాషణ జరిగెను. ప్రభువు సదా ప్రేమ పిపాసతో నుండును. అతఁడు నలువైపులను గాంచుచు సన్న్యాసితో 'సన్న్యాసిమహారాజా' మీ కుటీరములో నుండినఁ గొంచె మల్పహారము పెట్టుఁడు.! అనెను. సన్న్యాసి యింటిలో నిద్దరు స్త్రీలుండిరి. వారితో సన్న్యాసి అల్పాహారము తెమ్మని చెప్పెను. అంతలో నిత్యానందునితోఁగూడి ప్రభువు త్వరగా గంగా స్నానము కావించి వచ్చెను. అంత నిద్దరును తమ తమ యాసనములపైఁ గూర్చుండిరి. అది ఆషాఢ మాసము. సన్న్యాసి యొక్క స్త్రీలు మంచి మంచి మామిడి పండ్లు, వలిచిన పనసతొనలు రెండాకులలోఁ బెట్టుకొని తెచ్చిరి. రెండు గిన్నెలలో మంచి పాలుకూడ యుండెను. ప్రభువు త్వరత్వరగా పనసతొనలు, మామిడిపండ్లు తిన మొదలిడెను. ఆ సన్న్యాసి మహాశయుఁడు వామ మార్గియుఁడు. ఆ కాలమున బంగాళా దేశములో వామమార్గ పంథా అతిశయముగ నుండెడి దని మేమిదివఱకే చెప్పియున్నాము. స్త్రీ 'ఏమి 'ఆనందము' కూడ కొంచెము తెత్తునా?' అని అడిగెను. సన్న్యాసి సైగచేసి దాని నాపివేసెను. స్త్రీ లోపలికి

వెళ్ళిపోయెను. ఒక పెద్ద మామిడి పండును దినుచు ప్రభువు నిత్యానందునితో 'శ్రీపాదా! 'ఆనందము' అదేమి వస్తువో? సన్న్యాసుల భాషకూడ వేఱుగ నుండునా యేమి! లేక గృహస్థ సన్న్యాసులదా యీభాష? నీవు గృహస్థ సన్న్యాసివి కాదుగదా! లేకపోయిన నీకు తెలిసెడిదే' అనెను.

ప్రభువువారి యీ ప్రశ్నను విని నిత్యానందుఁడు నవ్వ ప్రారంభించెను. ప్రభువు మరల 'శ్రీపాదా! నవ్వెద వెందులకు? సరిగా చెప్పుము. ఆనంద మేమిటి? అదేదైన తీపి వస్తువైనచోఁ దెప్పింపుము. పాలు త్రాగిన తర్వాత తీపి వెగటగును' అనెను.

మామిడిపండు రసమును జుఱ్ఱుచు నిత్యానందుఁడు 'ప్రభో! వీరు వామమార్గీయులు, మదిర (సారాయము) ను 'ఆనందము' అని పిలుతురు' అనెను. ఇది వినునప్పటికి ప్రభువునకుఁ జాలదుఃఖము కలిగెను. ఆతఁడు నలువైపులను జుట్టుకొనఁబడిన సింహమువలెఁ జూచుచుండెను. ఇంతలోనే స్త్రీలు పిలువఁగా సన్న్యాసి మహాశయుఁడు లోనికిఁబోయెను. ఆ సమయమునే ప్రభువు అల్పాహారము తీసుకొను మధ్యలోనే లేచి పరువిడెను. నిత్యానందుఁడుకూడ వెనువెంటఁ బరువిడెను. వీరిద్దరు ఫలహారము చేయుచుండగనే మధ్యలో లేచి పాఱిపోవుటను గాంచి సన్న్యాసికూడ వీరినిఁ దీసికొని వచ్చుటకుఁ బోయెను. ప్రభువు వేగముగాఁబోయి గంగలో దుమికి, ఈదుకొనుచు శాంతిపురము వైపునకు వెళ్లెను. నిత్యానందుఁ

కూడ యాడుటలో నాచార్యుఁడే. ఆతఁడు కూడ ప్రభువు వెనువెంట నీద మొదలిడెను. గంగ మధ్యలోనే ప్రభువున కావేశము వచ్చెను. రెండుక్రోసుల దూరము దగ్గఱ దగ్గఱగ నీది యాతఁడు శాంతిపుర ఘట్టమునకుఁ జేరెను. ఘట్టము నుండి సరిగా నాచార్యుని యింటికిఁ జేరెను. దూరము నుండియే హరిదాసు ప్రభువును గాంచి ఆయనకు నమస్కరించెను, కాని ప్రభువునకుఁ గొంచెమైన స్పృహ లేదు. ఆతఁడు సరిగా నద్వైతాచార్యుని సమీపమునకుఁ జేరెను. వారిని జూచుటతోడనే ప్రభువు 'ఎందులకు, శుష్క జ్ఞానమును తిరుగ వేయుచుంటివి' అనెను. ఆచార్యుఁడు 'శుష్కజ్ఞాన మెట్లుండును? జ్ఞానము సర్వశ్రేష్ఠమైనది. భక్తి స్త్రీలకు తగినది' యనెను. ఇది వినునప్పటికి ప్రభువు గట్టిగా నద్వైతాచార్యుని బాద ప్రారంభించెను. అందఱును నాశ్చర్యముతో నీయద్భుత లీలను జూచుచుండిరి. ప్రభువును ఈ కార్యమునుండి నివారించుట కెవరికిని ధైర్యములేక పోయినది. ప్రభువుకూడ కొంచెమైన వెనుముందులాడకయే వృద్ధాచార్యుని వీఁపుమీఁద దెబ్బలు గుద్దులు వేయుచుండెను. దెబ్బలు పడిన కొలఁది యద్వైతుఁడింకను నానందము చెందుచుండెను. ఆ దెబ్బలు ప్రభువు తన ప్రేమ ప్రహారణములద్వారా అద్వైతాచార్యుని శరీరములోనికి ప్రేమ సంచారము కలిగించుచున్నాఁడా యను నట్లుండెను. అద్వైతాచార్యుని ముఖవైఖరిలో దుఃఖముగాని, శోకముగాని, విషణ్ణతగాని అణుమాత్రమైనను గనపరుచుట

లేదు. పైగా నాతఁడు అధికాధికముగ హర్షోన్మత్తుఁడగు చుండెను.

దెబ్బల చప్పుడు విని లోపలనుండి ఆచార్యుని ధర్మపత్ని సీతాదేవికూడ బయులుదేరి వచ్చెను. ప్రభువు ఆచార్యుని శరీరము మీఁద ప్రహారము కావించుచుండుటను గాఁచి యామె గాబరాపడిపోయి, యధీరురాలై 'అఁ, అఁ, ప్రభూ ! మీరు చేయునదేమిటి ? వృద్ధాచార్యుని మీఁద మీకు దయ కలుగుటలేదా?' అనెను. కాని ప్రభు వెవరి మాటలను వినుట లేదు. ఆచార్యుఁడు కూడ ప్రేమలో మునిఁగిపోయి దెబ్బలు తినుచు. నృత్యముచేయుచు నృత్యముచేయుచు గౌరగుణ గానము చేయుచుండెను. ఈవిధముగాఁ గొంచెము సేపటికి ప్రభువునకు మూర్ఛవచ్చి, స్పృహతప్పి క్రిందపడిపోయెను. బాహ్యజ్ఞానము కలుగునప్పటి కాతఁ డాచార్యుని సంతోష పూర్వకముగ నృత్యము చేయుటయు, తన చరణములందు దొరలుటయు గాంచెను. అప్పుడు త్వరగాలేచి 'శ్రీహరి, శ్రీహరి, నావలన నేమియు నపరాధము జరుగలేదు గదా ? నేనచేతనావస్థలో నేదైన చాంచల్య కార్యమును జేయలేదు కదా ? మీరు నాకు పితృతుల్యులు. నేను సోదరుఁడగు నచ్యుతుని వలె మీ పుత్రుఁడను. అచేతనావస్థలో నావలన నేదైన చాంచల్యకార్యము జరిగి యుండిన మీరు దానిని క్షమించవలయును' అనెను. ఇట్లని యాతఁడు నలువైపులఁ జూడ మొదలిడెను. ఎదుట సీతాదేవి నిలుచుండి యుండుటనుగాంచి

యాతఁ డామెతో 'తల్లీ! మిక్కిలి యాఁకలి యగు చున్నది. త్వరగా వంటచేయుము' అనెను. ఇట్లని యాతఁడు నిత్యానం దునితో 'శ్రీపాదా! పద, మన మెంత త్వరగా గంగా స్నానము చేసివత్తుమో అంతత్వరగా తల్లి వంటచేయును' అనెను. ఈతని యీ మాటలనువిని ఆచార్యుఁడు, హరిదాసు, నిత్యానందుఁడు, వీరితో గంగవైపునకు వెడలిపోయెను. నలుగురును గలిసి మిక్కిలి ప్రేమ పూర్వకముగ స్నానము చేసెను. స్నానము చేసిన తర్వాత నందఱును తిరిగి అద్వైతా చార్యుని యింటికి వచ్చిరి. ఆచార్యుని పూజా గృహమునకుఁ బోయి ప్రభువు భగవానునికి సాష్టాంగ నమస్కారము చేసెను. ఆ సమయమున నాచార్యుఁడు ప్రభు చరణములందు దొరల ప్రారంభించెను. ఆచార్యుని చరణములందు హరిదాసు దొర లెను. ఈవిధముగ నాచార్యుఁడు తన చరణములం దుండుటను గాంచి ప్రభువు వెంటనే చెవులు మూసుకొనిలేచి, తన దంత ములతో నాలుక కొఱకుకొనుచు 'శ్రీహరి శ్రీహరి, మీరు నాపై నెట్టి యపరాధమును ద్రోయుచున్నారు? నేను మీ పుత్ర సమానుఁడను' అనెను.

భోజనము తయారయ్యెను. అందఱు పంక్తిని గూర్చుండి మిక్కిలి ప్రేమతో భోజనమును జేసిరి. రాత్రి యంతయు నిత్యానందునితోఁగూడ ప్రభువు ఆచార్యుని యింటిలోనే నివాసము చేసెను. మఱునాఁ డాతఁడు గంగను దాఁటి యావలి యొడ్డుననున్న కాలనా యను స్థానమునకుఁ జేరెను.

అక్కడ పరమ వైష్ణవుఁడగు గౌరీదాసు ఇల్లు వాఁకిలి వదలి యేకాంతమున గంగానది యొడ్డున నుండి భజన భావము చేయుచుండెను. ప్రభువు విచిత్ర వేషముతో నాతని దగ్గఱకుఁ జేరెను. ప్రభువు భుజము మీఁద పడవ నడుపు గడ పెట్టుకొని యుండెను. ఆతఁడు పడవనడుపు పల్లెవానివలె నూగుచు గౌరీదాసు సమీపమునకు వచ్చెను. గౌరీదాసు ప్రభు ప్రశంసను చాల దినములనుండి విని యున్నాఁడు గాని యాతనికి ప్రభువు వారి దర్శనభాగ్య మింతవఱకు కలుగలేదు. ప్రభువు వారి పరిచయమునుబొంది యాతఁ డాతనిని బూజించి వన్యసామగ్రితో నాతనికి సత్కారము కావించెను. ప్రభువు వానికా దండమునిచ్చుచు 'మీరీ దండము ద్వారా సంసార సాగరములో మునిఁగి పోయిన వారినుద్ధరించి వారిని సంసార సాగరము నుండి యావలి యొడ్డున దింపుము' అనెను. అది ప్రభు ప్రసాదముగ గ్రహించి యాతఁడు దానిని సంతోష పూర్వకముగ స్వీకరించెను. ఆతఁడు పరలోకగతుఁడైన తర్వాత నాగడకు అధిపతి ఆతని పట్ట శిష్యుఁడు- శ్రీ హృదయ చైతన్య మహారాజయ్యెను. ఆతఁడా దండమునకు మిక్కిలి మహిమాన్వితము గావించెను. ఆయనకు ఉత్తరాధికారి మహాత్మా శ్రీ శ్యామానందులవారు. ఓఢ్ర దేశమందంతటను గౌరధర్మ ప్రచార మఁ[illegible] కముగఁ గావించెను. నేఁడు ఓఢ్ర దేశమందింత యధిక ప్రచా[illegible] మున్నదనిన యా శ్రేయస్సంతయు మహాత్మా శ్యామానందు[illegible] వారిదే. ఆయన లక్షలకొలఁది ఓఢ్ర దేశ నివాసులను గౌ[illegible]

భక్తులుగఁజేసి వారికి భగవన్నామోపదేశము కావించెను. నిజముగ ప్రభు ప్రదత్తమగు నా దండము లోకులను సంసార సాగరమునుండి యావలి యొడ్డున వేయుటకొక ప్రధాన కారణము కాఁగలిగెను. కాలనానుండి బయలుదేఱి ప్రభువు మరల నవద్వీపమునకువచ్చి నివసింప సాగెను. ఆచార్యుఁడు కూడ మధ్య మధ్య ప్రభు దర్శనము కొఱకు నవద్వీపమునకు వచ్చు చుండెడు వాఁడు.

ఈ విధముగ నొకదినమున శ్రీవాస పండితుఁడు తన యింటిలో పితృశ్రాద్ధము కావించి పితృ ప్రసన్నత కొఱకు విష్ణు సహస్రనామ పాఠమును జేయుచుండెను. ఆ సమయమునకుఁ బ్రభువచ్చుటకు వచ్చెను. పాఠము వినుచుండఁగనే ప్రభువునకు మరల నక్కడ నృసింహావేశము వచ్చి, యా నృసింహావేశములోనే హుంకారము చేయ మొదలిడెను. ఇట్లు హుంకారము చేయుచు నలుదిశల పరువిడ నారంభించెను. ప్రభువు వారి హుంకారమును, గర్జనను విని యందఱును భయభీతులై యిటునటు పాఱిపోసాగిరి. అందఱు భయభీతులగుటను గాంచి శ్రీవాస పండితుఁడు ప్రభువును భావోపసంహారము కావింపవలెనని ప్రార్థించెను. శ్రీవాసుని ప్రార్థనమీఁద ప్రభువు మూర్ఛితుఁడై క్రిందపడి, కొంచెము సేపటికి ప్రకృతిస్థుఁడయ్యెను.

ఒకసారి వనమాలి ఆచార్యుఁడను పేరుగల యొక్క కర్మిష్ఠుఁడగు బ్రాహ్మణుఁడు తన పుత్ర సహితముగ ప్రభువు

దగ్గఱకు వచ్చి, యాయన పదపద్మములకుఁ బ్రణామము గావించి యాతఁడు తన నిష్కృతికి ఉపాయము నడిగెను. ప్రభువా తనిమీఁద కృపను బ్రదర్శించుచు 'ఈ కలికాలములో కర్మకాండ క్రియలు సాంగోపాంగముగ నెఱవేఱుట దుర్లభము. అన్య యుగములలో వలె నీయుగమందు ద్రవ్యశుద్ధి, శరీర శుద్ధి, కాఁజాలదు. అందువలన నీయుగమం దొక్క భగవన్నామమే ఏకైకాధారము' అనెను. సమస్త శాస్త్రములలోఁ జెప్పఁబడినట్లు—

హరేర్నామ హరేర్నామ
హరేర్నామైవ కేవలమ్ ।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ
నాస్త్యేవ గతి రన్యథా ॥

ప్రభువు ఉపదేశాను సారముగా నాకర్మిష్ఠ బ్రాహ్మణుఁడు పరమ భాగవత వైష్ణవుఁ డయ్యెను.

ఒక దినమునఁ బ్రభువు విష్ణుమండపము మీఁదఁ గూర్చుండి బలరామా వేశములోనికి వచ్చి 'మధువును దీసికొనిరా', 'మధువును దీసికొనిరా' అని యనెను. ప్రభువునకు బలరామావేశము వచ్చిన దని నిత్యానందుఁడు గ్రహించెను. అందువలన నాతఁడొక కుండెడు గంగాజలమును తీసికొని వచ్చి ప్రభు సమ్ముఖమున నుంచెను. జలమును ద్రావి ప్రభువు అధికముగ నృత్యముచేయ మొదలిడెను. అట్లు నృత్యము

చేయుచు బలరాముఁడు యమునాకర్షణ లీల నెట్లు చేసెనో యట్టి యభినయమునే కావించెను. ఆ సమయమున వనమాలి ఆచార్యునకు ప్రభువు చేతిలో స్వర్ణమయమగు హలము, లాంగలము కనఁబడెను. చంద్రశేఖరాచార్యునకు ప్రభువు బలరామరూపములోఁ గనఁబడెను.

ఈ విధముగ ప్రభువు తన యంతరంగ భక్తులకు వివిధములగు నలౌకిక ప్రేమమయ లీలలను జూపుచుండెను.

# చైతన్యచరితావళి

ప్రథమ భాగము రు. 10-00

ద్వితీయ భాగము రు. 15-00

హిందీమూలము :

## శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు

ఆంధ్రానువాదము :

## బ్ర. శ్రీ. శ్రీ రామశరణ్ కుందుర్తి వెంకటనరసయ్యగారు

చైతన్యచరితావళి శ్రీకృష్ణచైతన్యులచరిత్ర. ఇది కథవలె కమనీయమైనది. నవలవలె సుందరమైనది. భక్తిదేవీ ప్రాంగణమువలె ప్రతి పాఠకుని హృదయమును పులకింపజేయునది. ఇది చదువుచుండగా, హృదయము సమార్ద్రమై కన్నులనుండి ఆనందాశ్రువులను, విడువనివారుండరు. ఇది సత్యమని నిరూపించెడి అద్భుత గ్రంథరాజము.

ప్రతి పాఠకుని హృదయమున భక్తిబీజములనాటి, ప్రతివానిని ఆధ్యాత్మిక మార్గమున పయనింపజేయగల గ్రంథములలో దీనికి సాటి వేరొకటి లేదు.

ఈ గ్రంథము 6 భాగములు. సుమారు 2400 పేజీలు. ముందుగా రు. 80/- లు ఇచ్చి సభ్యులుగా చేరినవారికి 6 భాగములు, పోష్టుఖర్చులు మేము భరించి రిజిష్టరుపోష్టులో పంపెదము. కొలది ప్రతులుమాత్రమే ప్రచురించుచుంటిమి. 3 వ భాగము తయారగుచున్నది.

---

**సాధన గ్రంథమండలి, తెనాలి.**